# శ్రీ ఆదిశైవపత్రిక.



శైవసంఘాభ్యుదయమునకై శ్రీ గురుకులాశ్రమమునుండి
ప్రతిమాసము ప్రకటింపబడును.

సర్వదేవాత్మకో రుద్రస్సర్వే దేవాశ్శివాత్మకాః ।
రుద్రస్య దక్షిణేపార్శ్వే రవిర్బ్రహ్మా త్రయోఽగ్నయః ॥
వామపార్శ్వే ఉమాదేవీ విష్ణుస్సోమేపి తేత్రయః ॥
(రుద్రహృదయోపనిషత్)

అధ్యక్షులు:—అవధూత శ్రీ బోధానంద సరస్వతీ మహర్షులవారు.

సంపాదకుడు:—చిలుమూరు పురుషోత్తమ గురుక్కళ్.

| | | |
|---|---|---|
| సంపుట ౯ | చిలుమూరు. శ్రీముఖనామ సం॥ చైత్ర వైశాఖ మాసములు. | సంచిక ౧-౨ |

( విలేఖకుల వ్యాసములకు సంపాదకులు ఉత్తరవాదులు కానేరరు. )

## —* విషయసూచిక. *—



భారతీ ముద్రాక్షరశాల, తెనాలి.

# మహారాజపోషకులు.

[సంవత్సరమునకు ఆరురూపాయిలు చెల్లించవలెను.]

౧ రాజవైద్య నాగలింగం నందయ్య అండుసన్సువారు ఆయుర్వేదభవనం, అప్పికట్లూరు.

౨ శ్రీమాన్ కొల్లిపర వీరయ్యగారు, చిప్పలూరు.
౩ ... కృతంరాజు వెంకటసుబ్బయ్యగారు, భట్లపల్లి అగ్రహారం.
౪ ... చావలి వాలయ్యగారు, పెదరావూరు.
౫ ... స్వర్ణ సుబ్బయ్యగారు, పాట్రపాక.
౬ ... గూడూరు లక్ష్మయ్యగారు, వెలుతురుమిల్లి,
౭ ... ఆగమిక నంజుండ దీక్షితులుగారు, రామసముద్రం.
౮ ... పసుమర్తి పార్వతమ్మగారు, కూచిపూడి.

## రాజపోషకులు. [సం॥ రు 5.0.0 లు.]

౧ ఆగమిక వాలేశ్వర దీక్షితులుగారు, పుంగనూరు.
౨ శ్రీమాన్ చావలి దుర్గాప్రసాద దీక్షితులుగారు, తెరిగొప్పుల.
౩ ... యలమంచిలి సుబ్రహ్మణ్యంగారు, ఇదురుపాక
౪ ... గూడలి రామయ్య గురుకులు, చినమాంభట్ల అగ్రహారం.
౫ శ్రీమతి ఇంకొల్లు అన్నపూర్ణమ్మగారు, (తాలూకాబోర్డు మెంబరు) ప్రత్తిపాడు.

## పోషకులు. [సం॥ రు 4.0.0 లు ]

౧ శ్రీమాన్ వడ్లమూడి కోటయ్యగారు, వడ్లమూడి.
౨ ... నూతలపాటి వెంకటనారాయణ గురుకులుగారు, వరకవిపూడి.
౩ ... చావలి పిచ్చయ్యశర్మగారు, చాటపర్రు.
౪ ... S. A. నంజుండయ్యగారు, శిరస్తాదారు, పుంగనూరు.
౫ ... ఉయ్యాలవాడ మునెయ్యగారు, భండ్యాత్మకూరు.
౬ ... ఆగమిక సుబ్రహ్మణ్యదీక్షితులుగారు, బెంగుళూరు.
౭ ... కొల్లిపర వెంకటసుబ్బయ్య శర్మగారు, అమ్మనబ్రోలు.
౮ ... నాగలింగం సత్యనారాయణగారు, డాక్టర్, మూలుపూరు.
౯ ... చుండి ఆనందరాయుడుగారు, రూపెనగుంట.
౧౦ ... ఆగమిక చంద్రశేఖర దీక్షితులుగారు, చాడేపల్లి.
౧౧ ... S. A. అగస్త్యప్పగారు, చారాల.
౧౨ ... మురికిపూడి వెంకటేశ్[illegible]
౧౩ ... చావలి చంద్రయ్యగారు, [illegible]
౧౪ ... కూర్మగిరి శేషమ్మగారు. పాలకవీడు.

# శ్రీ ఆదిశైవపత్రిక.



సవకోరుద్రస్స ఈశానస్సభగవాన్ సమహేశ్వరస్స మహాదేవః ॥
"అధర్వశిరసి"

| సంపుట | చిలుమూరు. | సంచిక |
| --- | --- | --- |
| ౯ | శ్రీముఖనామ సం॥ చైత్ర వైశాఖ మాసములు. | ౧-౨ |

## ప్రార్థన.

(శ్రీమాన్ చంద్రమౌళి సూర్యనారాయణగారు)

సీ॥ భూతేశ సర్వేశ ముక్తీశ గౌరీశ భద్రేశ ఈశమాం పాహిపాహి
గజహారిపురహారిక్రతుహారిభయహారిస్మరహారిహారిమాం పాహిపాహి
విషభక్షసురపక్ష విషమాక్ష బుధరక్షపరశిక్షఉగ్రాక్ష పాహిపాహి
గిరిపాలజాలోల గురుచేలశితశైల గృహకాలకామాం పాహిపాహి
గీ॥ వ్యాళభూషితగాత్రమాం పాహిపాహి
పార్వతీమనోనాయక పాహిపాహి
భానుశశివహ్నినేత్రమాం పాహిపాహి
భస్మదిగ్ధాంగమాం పాహిపాహి॥

---

## శ్రీ కాశీక్షేత్రము.

(శ్రీయుతులు మంగిపూడి వెంకటశర్మగారు)

। కలుషఘ్నమైమించు గంగాభవానికి కాపురంబల కాశికాపురంబు
విజితేంద్రియులుగోరు విజ్ఞానసేవధి దాపురంబల కాశికాపురంబు

భరతవర్షార్జిత భవ్యపుణ్యాబలంబు దాపురంబల కాశికాపురంబు
జీవర్ విముక్తులజేయు భూలోకంబు గోపురంబల కాశికాపురంబు
గీ॥ గగనచుంబిత దివ్యప్రాకారరమ్య గోపురంబల శ్రీకాశికాపురంబు
స్వప్రభావవినిర్జితావంతి కాంచికాపురంబల్ల శ్రీకాశికాపురంబు॥

---

# శ్రీబోధానంద మహర్షులవారికి సమర్పించిన స్వాగత పత్రము.

కం॥ శ్రీకర ఆనందస్వరూపాకర విజ్ఞానసుప్రభాకర పరమా
ర్థాకర విజితేంద్రియ శోభాకరబోధఋషిచంద్ర పరమమునీంద్రా॥
ఉ॥ అగ్రస్థానమునందియున్న యతిచంద్రా మిమ్ముర్లన్ జేరియున్
మాగ్రామంబున కేగుదెండనగ గ్రామంబేమి మీరే మదే
యగ్రంబందున నున్నదోయనక దోషాయత్తచిత్తాన మా
కు గ్రామంబున కేగుదెంచియును మాకున్ గూర్చితేమోదమున్॥
సీ॥ వేదాంతతత్వ వివేకాసారవిచార కరుణావతార స్వాగతముమీకు
లోకస్థితప్రాణిలోకదుఃఖ నివాసఘనచిద్విలాస స్వాగతముమీకు
ప్రవిమలానందపరబ్రహ్మగురుమూర్తిఘనమార్గవర్తిస్వాగతముమీకు
విదళితకామాది వీరశతృసమూహహర్షాత్మదేహ స్వాగతము మీకు
గీ॥ బోధనవిశేషమృదుభాషపుణ్యవేషకాలకర్మవిశోషస్వాగతముమీకు
పరమచారిత్రి నుతిపాత్రపాపజైత్రకలితవిజ్ఞాననేత్రస్వాగతముమీకు
గీ॥ బోధానందయతీంద్రునిగాథల్ వర్ణింపతరముగాదు సుమా శ్రీ
మేధానిధి విధికైనను శ్రీధరునికినైన యాదిశేషునికైనన్.
క॥ తెలిసియు తెలియకచేసిన పలువిధలోపములసైచి పాలింపుము మ
మ్ముల సత్కృపాసుధానిధి విలసద్విజ్ఞానచంద్ర విమలమునీంద్రా.

కుమార కవితాసమితి,
దొప్పలపూడి. గుంటూరు.
డి॥

ఇట్లు, దొప్పలపూడి పురవాసుల
తరపున - విన్నవించు
పొన్నూరు బాపయ్య.




(శ్రీయుతులు కర్లపాలెపు లక్ష్మీనరసింహారావుగారు)

సీ॥ పలయునను సస్యసంపదగలుగుసుతుల కీధనాభావకాటక బాధలేల
దయను శ్రీముఖనిత్యసందర్శనంబువదలజేయుము శ్రీముఖవత్సరంబ

## ముఖ్యగమనింపు.

సాంఘిక మహాశయులారా!

పత్రికను విరమించుట పలువురకు ఇష్టము లేనందున ఆర్థిక పరిస్థితులైనను గమనింపక మిమ్ములను నమ్మి మరల తొమ్మిదవ సంపుటము ఆరంభించితిమి, యీతరుణమున పత్రిక లేకుండుటవలన గలుగబోవు అనర్థకములు పెక్కులుండుటచే సంచిక ప్రకటింపకతప్పదయ్యెను. సాంఘికులు వాగ్దానముల జెల్లించుటకును పత్రికను సంరక్షించుటకును చందాలు బంపుటకును ప్రార్థించుచున్నాము.

శక్తిలేనివారిని నిర్భందించు వారముగామని విన్నవించుచున్నాము గావున "పత్రిక మళ్లీయెందుకు వేస్తున్నారురా భగవంతుడా" యని నిట్టూర్పువిడువ వలదని మనవి జేయుచున్నాము. ఋవ్వలేని వారిని, అభిమానములేని వారిని, బాధించుటకై పత్రికవేయుటలేదు. చాటున, మాటున, మమ్ములను, దూషించవలదని ప్రార్థించుచున్నాము.

పత్రికకు సహాయ మొనరింపదలచువారు దయవుంచి వెంటనే మనిఆర్డరుచేయుదురని నిరీక్షించుచూ అట్టి మహానుభావుల సంపూర్ణకటాక్షమును నమ్ముకొని సంఘసేవజేయుచున్నాము. శక్తిలేనివారు తమ యుద్దేశ్యములను దెలుపగోరెదము.

(సంపాదకుడు.)

# సంపాదకీయములు.

## రిజష్టర్డు బహిరంగలేఖలు.

మైసూరు ముజరాయి సంస్థాన ఆగమిక కమీషనర్ శైవా ద్యాగమపంచానన బిరుదాంకితులగు శ్రీమాన్ నందీశ్వరదీక్షిత గురు వర్యులుగారు. తెనాలి వాస్తవ్యులగు మహామహోపాధ్యాయ బ్రహ్మశ్రీ ముదికొండ నాగలింగశాస్త్రులవారికి బంపిన రిజష్టర్డులేఖ కార్తీక (ఆదిశైవ) సంచికలో ప్రకటించియుంటిమి. అందుకు ప్రత్యుత్తరలేఖ. "జ్ఞానవాహినీ" యనుద్విమాసపత్రిక మార్గశిర పుష్యసంచికలో శ్రీ నాగలింగశాస్త్రులవారు ప్రకటించియున్నారు. అది ప్రత్యుత్తరముగానుండక దౌర్జన్యపూరితమై అధికప్రసంగములతో తూలనాడినట్లు చదువరులకుదెలియుచున్నది. పండిత ప్రసంగములట్లుండుట యధర్మమని పలువురు నొచ్చుకొనుచున్నారు. శ్రీ శాస్త్రిర్లుగారు శైవులయ్యును ఆదిశైవసంఘమును పత్రికనుగూడ తిరస్కరించి నిందించుటచే శ్రీఆదిశైవ పత్రికాఆఫీసునుండి శాస్త్రిలవారికి మరలనొక రిజష్టర్డులేఖ పంపబడెను. సమాధానమేలనో యింత వరకు వచ్చియుండలేదు. యిట్టి తగవులవలన ఉభయవంశములకు తీరని హానిగల్లుటయేగాక హాస్యాస్పదులగుట సంభవించగలదు. ఎవ రెవరి మతాచార ధర్మములు వారివని గుర్తెరుంగుట పరమధర్మ మనియు, గురిగింజవలె ప్రవర్తించుట హానికరమనియు తమలోపములు గుర్తెరుంగజాలక ఇతరులను హేళనజేయుట అజ్ఞానమనియు పలువురుపెద్దలు బోధించుచున్నారు. యీ శైవమతముపై ఎవరును దండెత్తజాలరు. వాదసారాంశ మేమనగా, బ్రహ్మసూత్రమీమాంసా భాష్య కర్తయగు శ్రీశ్రీ కంఠశివాచార్యులవారు ఆదిశైవుడనిన్నీ, శ్రీకంఠభాష్యము శివబ్రాహ్మణులగు, ఆదిశైవమతోపయోగముగా సగుణారాధన నిమిత్తం శైవవిశిష్టాద్వైతపరమమున వ్రాయబడినదని శ్రీ దీక్షితులవారి యుద్దేశ్యము. ఆదిశైవులనగా శివబ్రాహ్మణులు

కారణమిన్నీ, శ్రీకంఠశివాచార్యుడు ఆదిశైవుడుగాదు, అరాధ్యుడని శాస్త్రిగారివాదము. శైవులలో శైవులుఇట్లు కలహించుట కాలమహిమ గాక మరేమనదగును. శాంతశమదమాదులతో ఎంతకాలము సంభాషించినను ప్రత్యవాయము లేదు. శాస్త్రములుగలవు. పరిశీలించవచ్చును. అంతియేగాని, సంఘబలము ననుసరించి "కస్సాంఋ బుస్సాంఋయని" నోటికి వచ్చినటుల తూలనాడుటవలన పరస్పర గౌరవహానికరమేగాక న్యాయస్థానములకుగూడ యీదుర్వాద మెగప్రాకి రసాభాసమొనరించ గలదని పలువురు నొక్కివక్కాణించుచున్నారు. దేశకాలపాత్రముల ననుసరించి మనుష్యులు, ఆచారములు, ధర్మములలో స్వల్పమార్పులు సంభవించినను శాస్త్రములు మాత్రము సత్యస్వరూపములతో ప్రకాశించుచున్నవనియు వాటిని మార్చరాదనియు పెద్దలు తెలుపుచున్నారు.

## కోటిఫలి ఆచార్యప్రతిష్ఠల మార్పులు.

శైవవిశిష్టాద్వైతమతకర్తయగు ఆదిశైవ శ్రీశ్రీశ్రీ జగద్గురు శ్రీకంఠ శివ దూర్వాసశివ కేదారేశ్వరశివాచార్యుల ప్రతిష్ఠలు శ్రీముఖ నామసంవత్సర జ్యేష్ఠశుద్ధ పాడ్యమిరోజున సంకల్పాదులు గావించి పంచమిరోజున ఉదయం స్థాపనక్రియా కలాపములు పూర్తి చేయబడును. గావున ఆంధ్రరాష్ట్రీయ ఆదిశైవ ప్రముఖులెల్లరు తప్పకదయచేసి ఆచార్య ప్రతిష్ఠామహోత్సవముల తిలకించి తరించుటకు హెచ్చరించుచున్నాము యిట్టి మహత్తర కార్యమునకు శక్త్యానుసారముగా ధర్మ మాచరించి సహాయపడుటకు ప్రార్థించుచున్నాము. ఆహ్వానపత్రిక గమనింప గోరుచున్నాము.

## శ్రీస్వాములవారి పర్యటనము.

మదరాసునుండి బెంగుళూరు వగైరాలకు విజయంచేసి గుంటూరుమండలములోని మునిపల్లెలో వారంరోజులు విశ్రాంతినొంది భద్రాచల శ్రీరామసందర్శన యాత్రముగించి మంథన కాళేశ్వరము

లోని విశేషముల నరయుటకై ఆప్రాంతములకేగి మరల మంగళగిరి భీమడోలు ప్రాంతములకు దయచేసిరి. శ్రీఆచార్యప్రతిష్ఠా మహూర్తమునకు ముందుగనే శ్రీవారచటికి విజయముచేయుదురని విన్నవించుచున్నాము.

---

## ౧. సేద్యపు విద్య.

స్వీకృతి.

కర్నూలుజిల్లా నంద్యాలనుండి శ్రీయుతులు యస్. నాగేంద్రప్ప. యస్. గోవిందప్ప. డి. సి. బాలయ్యగార్ల సంపాదకత్వమున వెలువడు మాసపత్రిక రెండవసంచికను వందనములతో యందుకొని యందుండు వ్యవసాయవిషయముల దిలకించి యానందించితిమి. యీకాలమున రైతుల కీపత్రిక కల్పవృక్షమువలె సహాయపడుట సత్యము యిందెన్నియో కర్షకునికిలాభించు విధులుగలవు. ప్రతిరైతునుభూస్వామియు ఈ పత్రికపఠించి వ్యవసాయ మొనరించుట గొప్పలాభకరమని హెచ్చరించుచున్నాము. పరమేశ్వరు డీపత్రికారాజమును చిరతరస్థాయిగా రక్షింపగలడని మావిశ్వాసము. సంవత్సరచందా రు3-0-0. వలయువారు సంపాదకులకు వ్రాయవలెను.

---

## ౨. సంవాహన చికిత్స.

యీ గ్రంథమును అవయమర్దన చికిత్సయనవచ్చును. గ్రంథకర్త దువ్వూరు రామకృష్ణారావుగారు. ఖరీదు 0-7-0 లు. వలయువారు 0-6-0 చీట్లు పంపినచో బడయగలరు. దీనియందు అనేకరహస్యవిషయములు చికిత్సలు వెలువరించి యున్నారు. శరీరమునకు బలము వచ్చు మార్గములు సూచింపబడెను. ఈ గ్రంథమునుపఠించి మాన

వులు దుర్బలత్వమునుండి విముక్తినొందగలందులకు హెచ్చరింపబడు చున్నారు.

వలయువారు:—
ప్రకృతి పత్రికా కార్యాలయము
బెజవాడ, అని వ్రాయవలెను.

అభినందనము.

శ్రీముఖనామ సంవత్సరమునకు చందాలు జేర్పించిన మహాను భావులను దిగుబాటుబాకీలు బంపించినవారిని మామనఃపూర్వకముగా అభినందించుచున్నారము. తక్కినవారుగూడ వెంటనే సహాయము గావించి పత్రికను సంరక్షింపబూనుటకు ప్రార్థించుచున్నాము.

యువజన సంఘప్రచారము.

గుంటూరుమండల యువజనసంఘ ప్రచారకులు అన్నితాలూకాలయందును సభ్యులను జేర్చుటకై ప్రచారము గావింపనున్నారు. స్త్రీ పురుషాదులు గూడ (40 సంవత్సరములలోపువారు) సభ్యులుగా జేరి యానందించుటకు హెచ్చరింపబడుచున్నారు.

---

# శాస్త్రిగారి కడుపుబ్బరం.

---

(శ్రీమాన్ P. V. S. రావుగారు)

ఆదిశైవులు కండ్లు తెరిచారు, నిజస్వరూపము గుర్తించుటచే నిద్రావస్థతొలగినది. విముక్తధర్మమున కుద్యమించారు, పూర్వోత్కృష్ట గౌరవసంపాదనా నిగుగ్నులైనారు, శైవధర్మసంస్థాపన గావించుచున్నారు. స్వమతరక్షణ దీక్షాబద్ధులైనారు. శైవస్వరూపం వెల్లడి చేయుటచే శైవరహస్యవిషయాలు ప్రజాహృద్గతమైనవి. ఆదిశైవతత్వం ఆదిశైవ ఔన్నత్యం, బుద్ధిమంతులగు నిర్మలహృదయులు, పండితులు

గ్రహింపగలిగారు. ఇదంతయు చూచుచున్న శాస్త్రిగారికి కన్నుగొట్టింది. గుండెదడ ఎక్కువైంది. ముందు వెనుకతోచుటలేదు. 'ఇంక మన కపటనాటకాలు సాగనేరవు. మనగుట్టు బయల్పడకమానదని' భయకంపితులై పోయారు. గగ్గోలుపడ్డారు. అసూయాహంకార పిశాచాలు వీరిహృదయస్థాన మాక్రమించాయి, ఆవేదన నెక్కువైంది, కల్మషం గుండెల కెగదట్టింది. ఆపుకోలేక పోయారు. ఆదిశైవపత్రికాదూషణపరాయణులై ఏతత్ పత్రికాధిపతులచే మన్ననలందారు రెండు మూడు దఫాలు. అవన్నియు వీరికొక లెక్కయా? అంతటినుండి లోలోన, పన్నసాగారు రహస్యకు తంత్రికపటోపాయాలు. ఆదిశైవ మత నిర్మూలనమునకై బ్రహ్మాండమైన కృషిసలుపజొచ్చారు. శాస్త్రిగారి పాండిత్య ఫలితము తుదకిట్లా పరిణమించింది ఆచార్యసందతో. ఆదిశైవశబ్దం క్రొత్తగా వచ్చిందంటూన్నారు తమ పత్రికల్లో. అయితే, నిజంగా, వీరికది తెలియకనా! వీరిపాండిత్యదృష్టికది గోచరింపకనా? కాదు కాదు, ఈర్ష్యాకషాయిత మనస్కులై పరోత్కృష్టతను జూచి, కడుపుబ్బరం పట్టజాలక, అన్నారు. 'క్రొత్తగా' తగిలించారు అని లేక వారి పాండిత్యమంతటిలోనిదేమోలే. ఇట్టి వీరి వ్రాతలు వీరి కుటిల స్వభావమును వ్యక్తపరచునేగాని ఇంకేమిచేయగలవు. ఎట్లైననేమి ఆదిశైవశబ్దస్వరూపమును, గాంచినతోడనే శాస్త్రిగారి కళ్లు భైర్లుకమ్మినాయి. కడుపులో గడబిడజాస్తయింది. నిప్పుత్రొక్కిన కోతిచందమైనది వీరిపని. వెర్రియెత్తింది. ఒళ్ళుపై తెలియక నోటికి వచ్చినట్లెల్ల కలంపోయినట్లెల్ల దూషింపసాగారు. యుద్ధానికి బయలుదేరారు ఆదిశైవులపైకి. కుతర్కవాదనాయుధములతోనునిజగర్భకుహరమునుండివెలువడు కల్మషవిషవాయవ్యాస్త్రములతోను, దుష్టవ్రాతలతో కృత్రిమకార్యాలతో, అహర్నిశంకృషి సలుపుచున్నారు. మతభాష్యాలు మార్పులుచేసి సంస్కరిస్తున్నారు. క్రొత్త క్రొత్త ధర్మశాస్త్రాలు నిర్మించుతున్నారు. కుయుక్తులతో, విశ్వామిత్రసృష్టికి పూనుకొన్నారు ఆదేమని ఎవరైన ప్రశ్నించినవారిని అధికప్రసంగములాడి అగౌరవపర

కుపక్రమించారు. ముందుగనే యొరులను తూలనాడి డాంబిక
వీరు తమ అసురకృత్యములను కప్పిపుచ్చజూచుచున్నారు. వీరి
జాడ్యజనితోన్మాదము శైవధర్మ వ్యతిరేకమనుట నిస్సందే
ు. ఇదివరకు సర్వమతదూషక శిఖామణులని ప్రసిద్ధిగాంచిన
యాజీలకు పట్టినగతినైనను వీరు కనకుండుట శోచనీయము.
ట్లు కుక్కతోకను బట్టి గోదావరీదినది లోక విదితమే ?
కస్వామిుల నిందతో వారిజన్మవెళ్ళబుచ్చారు ఒకప్పుడాదిశైవులపై
ారు. తంబళశబ్దాయుధముః బూని ఘోరసంగ్రామం జరిపారు.
గంతులేశారు. మహావస్థపడ్డారు. సాధ్యంకాలేదు. అపజయంగాం
ు. తమఖడ్గమే తమకెదురుతిరిగింది. తుదకాతంబళ శబ్దమాదిశైవు
సంబంధించకపోగా, తమకే తగిలివచ్చుటంగాంచి నోరుమూసు
, స్వచ్ఛమైన నంబితంబళులై వెలిశారు. అంతటితో వారిజాడ్యం
ింది. త్వరలో శివసాయుజ్య మలంకరించారు. ఆపాపయాజు లార్జిం
కీర్తినే, మనశాస్త్రిగారు గూడ పొందనున్నారు. అజ్ఞానవాహి
మునుంగుటచే ఆజాడ్యమే వీరికి అంకురించింది మళ్ళీ. వీరుకూడా
బళశబ్దమె నోటికితగిలించుకొన్నారు. ఆశబ్దమే వీరికి పుట్టినిల్లు.
్వరూపమే అది. వీరిజీవనాధారమే అది. దుర్గుణసంపదలో, పాక
జులకంటే శాస్త్రిగారేమాత్రము తీసిపోవువారుగారు. మాటి
ికి తంబళశబ్దప్రయోగము వలన వీరిగుట్టు బయటపడుచున్నది.
బ్దమును ఆదిశైవులపై ఆరోపించి తాము పరిశుద్ధులవలె నటింప
ుచున్నారు. ఆదిశైవులను నిందించుచున్నారు. దేవలకచారిత్రము
బదులు పాషండచారిత్రము రాకపోదు. వితండవాదమునందు
్రిగారికిగల నేర్పు, ప్రీతి, కుయుక్తివ్యక్తమగుచున్నది, తన్మూల
వీరికి వేంఱ జన్మలకైనను తంబళత్వం, నశించకుండుగాక. దేవ
ద్రోషము వృద్ధిజెందుగాక. అంతకంటె తమ వ్రాతకోతలు తమకే
ేము గిట్టింపు కానేరవని తెలిసికొని, శాస్త్రిగారికనైనను పరుల
పక, అనవసర ప్రసంగములకు దిగక సద్బుద్ధితో మెలఁగి,

సత్కీర్తి నార్జించుదురుగాక, లేనిచో పతితపాషండ పండిత శిఖామణు లనెడి బిరుదము పొందగలరని హెచ్చరింపబడుచున్నారు.

ఈ సందర్భమున ఆదిశైవులకొక హెచ్చరిక:—సోదరులారా! మీ సంఘముపై కెందరో రాక్షసకృత్యములతో దండెత్తుచున్నారు. గాన మానవనిద్రనుండి మేల్కొని ఆలసింపక కార్యశూరులై ఎదు ర్కొనుడు. ధైర్యోత్సాహపూరితులై స్వగౌరవమును నిల్పుకొనుడు. శాస్త్రిగారి నక్కజిత్తులకు భయపడి మోసపోకుడు. శైవమత నిర్మూలనమగునని చింతింపక, పరిశుద్ధమైన మీ మతమును అసహన పరులదూషణలకుగురిగానీక, మీ స్వధర్మమును ప్రకాశింపజేసి, మీ సంఘము నుద్ధరింపగలందులకు ప్రార్థించుచున్నాను.

ఓంశాంతిశ్శాంతిశ్శాంతిః.

## ముఖ్య గమనింపు.

గోదావరిజిల్లా కోటిఫలిలో జరుగనున్న ఆచార్యప్రతిష్ఠలు జేష్ఠశుద్ధ పాడ్యమీ రోజుననే సంకల్పించి పంచమినాడు ఉదయమున ప్రతిష్ఠించుదురు. గావున సర్వులు సంకల్పమురోజుకు దయచేసి ప్రతిష్ఠామహోత్సవములను తిలకించి పండితోపన్యాసములను విని ధన్యులగుటకు హెచ్చరించుచున్నాము.

పత్రిక విషయములో మదరాసునందు పోష్టుమాష్టర్ జనరలువారివద్ద ప్రతి డిశెంబరు నెలలోను రిజష్టరుచేసుకుంటూ వుండవలసినట్లును, ప్రతి ఇంగ్లీషు నెలలో 20 తేదీన పత్రిక రవాణా చేయవలసినట్లు గవర్నమెంటువారి ఆర్డర్లు వచ్చుటచేత చైత్ర వైశాఖ మాసములు కలిపి ఒకేసంచికగా బంపిన ఆలస్యమునకు చందాదార్లు క్షమింపగోరుచున్నాము ఇంతటనుంచి సక్రమముగా ప్రతిఇంగ్లీషు నెల 20 తేదీన బట్వాడాచేయుచుందుమని విన్నవించుచున్నాము.

పత్రికాధిపతి.

# తూర్పుగోదావరి మండల అర్చక మహాజనసభ.



ఈసంఘముయొక్క మహాజనసభ 1933సం॥రం మార్చి 4,5 తేదీలలో కోటిపల్లిలో ఆదిశైవ సత్రిమునందు శ్రీమాన్ చంద్రిమౌళి సూర్యనారాయణదీక్షితులుగారి అధ్యక్షతక్రింద జరిగినది. సభకు షుమారు 130 మంది సభ్యులు హాజరైరి. అర్చక సోదరులు భగవదారాధనయందెక్కువ శ్రద్ధా భక్తులతో నిర్వహించుటయే, యీ సంఘ ప్రధానకర్తవ్యముగా తీర్మానింపబడినది.

యీ సంవత్సరమునకు యీ క్రిందివారిని అధికారవర్గముగా నెన్నుకోవడమైనది.

1. శ్రీమాన్ అంబలూరి మృత్యుంజయగురుక్కళ్ గారు. అధ్యక్షులు. ముంగండగ్రహారము.
2. శ్రీమాన్ అంగర కాంతాచార్యులుగారు. ఉపాధ్యక్షులు. ముక్తేశ్వరము..
3. శ్రీమాన్ రాంపల్లి వెంకటేశ్వర్లుగారు, ప్రధానకార్యదర్శి రామవరము. రాంపల్లి వెంకటేశ్వర్లుగారు ప్రస్తుతం అస్వస్థతగానుండుటచేత, వారికి స్వస్థతకలిగి కార్యక్రిమమున పాల్గొను వరకు—
   శ్రీమాన్ పెదపూడి అనంతదీక్షితులుగారు. ప్రధాన కార్యదర్శి. యేడిద.
4. బ్రహ్మశ్రీ కొంతేటి అప్పారావుగారు. సహాయకార్యదర్శి- ద్రాక్షారామము.
5. శ్రీమాన్ వెలవలపల్లి సోమనాథశాస్త్రిగారు. సహాయకార్యదర్శి. అయినాపురము.
6. శ్రీమాన్ వింజరపు నృశింహాచార్యులుగారు. కోశాధ్యక్షులు పూలపల్లి.

అధికారవర్గముచకు, సంఘమునకు సహాయ్యముగ నుండ టకై 22 రు కార్యనిర్వాహక సభ్యులను ఎన్నుకొనడమైనది. అధికార కార్యనిర్వాహక వర్గమువారు మెక్కువశ్రద్ధతో జయప్రదముగా కార్యక్రమమును నిర్వహింపవేడుచున్నాను.

ఇట్లు.

వింజరపు వెంకటాచార్యులు.

---

## యీ నెలలో చందాలు చెల్లించినవారు.

(1) శ్రీమాన్ క్రొత్తపల్లి వెంకటరామయ్యగారు నగరి (చిత్తూరుజిల్లా)
(2) ,, మామిళ్లపల్లి వెంకటసుబ్బయ్యగారు మండూరు (గుం)
(3) ,, కొండవీటి వీరభద్రయ్యగారు వెలగపూడి (గుం)
(4) ,, చావలి చంద్రయ్యగారు (పోషకచందా) పెరవలి (గుం)
(5) ,, లంక వియ్యన్నగురుకులుగారు గుడివాడ. (కృ)
(6) ,, మానేపల్లి వెంకటరామతారకంగారు (శ్రీముఖ) (ఏలూరు. (గో)
(7) ,, వడ్లమూడి కోటయ్యగురుకులుగారు (పోషకచందా) వడ్లమూడి. (గుం)

---

## పత్రికాసన్మానములు.

1. గుంటూరు జిల్లా వడ్లమూడిగ్రామ వాస్తవ్యులు శ్రీమాన్ వడ్లమూడి కోటయ్యగారు తనకుమార్తె పాణిగ్రహణమహోత్సవ తరుణమున పత్రికాసన్మానం నిమిత్తం సమర్పించినది. రు౧-౦-౦
2. కృష్ణాజిల్లా ఇందుపల్లి గ్రామవాస్తవ్యులు శ్రీమాన్ పావులూరు అంబయ్యగారు తనకుమారుని వివాహమహోత్సవ తరుణమున పత్రికాసన్మానం నిమిత్తం సమర్పించినది. రు ౨-౦-౦

## సహాయము.

గుంటూరు జిల్లా మంగళగిరి వాస్తవ్యులును ప్రస్తుతమున దుగ్గిరాల నివాసులును సుప్రసిద్ధ సంఘాభిమానులునగు శ్రీమాన్ సంగాపు వీరయ్యగురుకులుగారు స్వయముగా కార్యాలయమున కరుదెంచి పత్రికా ప్రోత్సాహముగావించి శ్రీముఖసంవత్సరము పత్రిక నెరవేర్చుటకై భక్తిపురస్సరముగా రెండురూపాయిలు సమర్పించి మార్గదర్శకులై సహాయమొనరించిరి. శ్రీవారి యమూల్యసహాయమును వందన పురస్సరముగా స్వీకరించి మరల కార్యక్రమమున కుపక్రమించితిమి. పరమేశ్వరుడు శ్రీవారి కాయురారోగ్యములొసంగి సంరక్షించుటకును పత్రికనిర్విఘ్నముగా నెరవేరుటకును సర్వదాప్రార్థించుచున్నాము.

ఆదిశైవ సోదరులందరు తమ తమ శక్త్యానుసారముగా సహాయపడి పత్రికను రక్షింపగోరుచున్నాము. పలుకష్టములకు లోనై పత్రికను నడపుచున్నాము.యీతరుణమున పత్రిక చాలా అవసరమని పలువురు ప్రోత్సహించుటచే ఆపుదల చేయజాలక మామూలుగా ఆరంభించితిమి గావున దిగుబాటు గలవారు వెంటనే సహాయపడ గోరుచున్నాము.

## సంఘపత్రి కోపయోగము.

ఆదిశైవమతావలంబులగు సోదరసోదరీమణులారా! అనాదిగా యేర్పడిన యీ ఆదిశైవ మతము, యెంతోవన్నెకెక్కి పవిత్రతగాంచినది. మనమతము కొంతకాలమునుండిటీవల యెంతోక్షీణదశకు రాబడి వన్నెతగ్గియుండుట కెన్నియో నిదర్శనములున్నవి. అవియేల

బేరొక్కనవలయు. మన మతాచార్యులగు శ్రీ శ్రీ కంఠశివాచార్యుల
కలియుగాదినుండి సుమారు కొన్నిసంవత్సరముల వరకు జగద్గుర
పీఠావలంబులై మతోత్కృష్టత, దాని పారిశుధ్యతను వెలువరించుచు
వచ్చి, వారు నిర్యాణమును పొంద, అంతటివారెవరును మన మతమున
యోగ్యతగొనక, వారితో మన ఆచార్యపీఠము, గిరిగుహాలతో నణగ
యుండెనని, తెలియవచ్చుచున్నది. శ్రీశ్రీకంఠ శివాచార్యులువారు
బ్రహ్మమీమాంసాద్యనేక భాష్యకర్తలుగానుండిన, వారి నామమునే
యితర మతస్తులు కొందరు స్వకపోల కల్పితముగా తమగ్రంథములతో
భిన్ననామములకు మార్చి, వారి మతోత్కృష్టతను తద్వారా వెల్లడి
పరచుకొన్నట్లు ఘనతజెందిన మైసూర్ సంస్థానం, ముజరాయి యిలాఖా
శైవాద్యాగమ పంచానన, మహావిద్వాన్, ఆగమిక పండితులుగా
నుండు మనశ్రీమాన్ నందీశ్వర దీక్షితులవారు యీవిషయము
యింతకుముందు పత్రికలలో ప్రకటించియేయున్నారు.

అట్టి శ్రీకంఠ శివాచార్యులు నిర్యాణమొందిన దాదిగామనలో
విద్యావివేకములరుదై మన మతోత్కృష్టత గాఢాంధకారమున మునింగి
యుండె, "పరిత్రాణాయ సాధూనాం, వినాశాయచదుష్కృతాం, ధర్మ
సంస్థాపనార్థాయసంభవామి యుగేయుగే"

అనురీతి, అన్యాయ అసత్యఅకృత్యము లెప్పుడెప్పుడు యేర్ప
డునో, అపుడంతయు తదనుగుణ్యమైన అవతారమునెత్తి, ధర్మస్థాపన
లెట్లుచేయదొడగెనో యనునట్లుగా మన మతశ్రేష్టత్వమును లోకమున
వెల్లడి పరుచుటకై శ్రీ శ్రీ మన్నిగమాగమ పారావారపారీణేత్యాది
బిరుదాంకితులును శ్రీమత్పరమహంస పరివ్రాజకాచార్య శ్రీమద
వధూత బోధానందసరస్వతీ మహర్షులవారు అవతరించి వారిసమాధి
యోగమునకు కొంత విశ్రాంతియిచ్చి విద్యావివేక జ్ఞానశూన్యతచే
క్రుగ్గియుండిన మనలను, బాగుపరచి అంధకారముచే గప్పియుండెడి
యీ మతమును తన్మాలిన్య రహితముగావించి ప్రకాశంబునకు తేగలగి
నందుకుగదా శ్రీవారు కొంతవరకు ఆంధ్రకర్నాటక దేశముల పర్య

టనముగావించి ఉపన్యాసములనిచ్చి సాంఘికులకు యిందలి ఉత్కృష్టత విశదపరచిరి. గాని యిదివీరితో సమాప్తినొందగూడదని గదా యీ ఆదిశైవ పత్రికారత్నమును వెల్లడిపరచి తద్వారాశాశ్వతంబుగ సంకల్ప సాఫల్యతగాంచ ప్రయత్నములు గావించియున్నారు. శ్రీవారు గృహస్థా శ్రమమునువదలి యత్యాశ్రమమును స్వీకరించి జీవబ్రహ్మైక్యసంధానము గావింపదలచిన వారికీ గొడవయేల? మనమెటుబోయిననేమి? యీమత మేమూలననణగిననేమి? వారికేమి కావలయును. "పరోపకారార్థంమిదం శరీరం"అను వాక్యానుసరణి నామావశిష్టమైనయున్న శ్రీకంఠశివా చార్యవిగ్రహ ప్రతిష్టాదికార్యములు శ్రీకోటిఫలిక్షేత్రమున నెలకొల్ప పూని దీనికి విరాళములనొసగిన, మహాశయులకు, యంత హితోపదేశ మొనరించిరో ఎంతశ్రమపడుచున్నారో తెలుసుకోవలెను. లేకున్న విరాళములెట్లు సేకరింపనగు. యీమహాత్కార్యము యెట్లు నెరవేర్ప నగు. శ్రీఆచార్యవిగ్రహనిర్మాణమునకై శ్రీవారు జయపూరు నకు స్వయముగ విజయముచేసి అచ్చటి సీతవాతాతపాది కష్టముల కోర్చి,శ్రీఆచార్యవిగ్రహమును, తెచ్చిరో, శ్రీవారు జయపూరునందు పడిన శరీరప్రయాసలు వారిలేఖలవలన తెలియవచ్చినవి. యిచ్చట మన వారి మనస్సులు శ్రీవారి శ్రమనుగురించి చింతాసముద్రమునమునిం గె.

ప్రపంచముతో సంబంధములేక, మోక్షపదవికై తత్ప్రియత్న ముతోనున్న శ్రీవారికే యీమతాభిమానమిట్లు పీడించుచుండ కర్మ దేహులగు మనకు మనమతోద్ధరణయందును పత్రికను శాశ్వతముగా నడపుకొనుటకును మనకు శక్తిలేకయున్నది గదా! యిదేమి చిత్రము, ఏమివింత ! ఈపత్రికకు మనమిచ్చునది సంవత్సరమునకు 3 (మూడు) రూప్యములే గదా. యింతటితో మనకేమితగ్గునో, మన సంసారముల కెంత నష్టముగల్గునో, మనలనెంత బీదదశకుదెచ్చునో, తెలియకున్నది. మన చందాలు, ప్రతివర్షము పూర్తిగా చెల్లించి పత్రికాధిపతులకు, ఉత్సాహము గల్పించుటమాని, సంపాదకుని గోడాడించి వారిని ఋణ గ్రస్తునిగావించి వారికష్టములు అలకింపక అరణ్యరోదన గాపించు

చున్నామే? యిదిన్యాయమా ? ధర్మమా ? మన సర్వోత్కృష్టతలను పత్రికా మూలమున వెల్లడిపరచి, మతమునకెంతో మహోపకార మొనరింప కంకణబద్ధులై యున్నారే ? వారికేమి పనిలేకనా ? లేక వారి పొట్టసాకికొనుటకా ! శ్రీగురుకులవారు తమ స్వకార్యములను వదలికదా మనకై పాటుబడుచున్నారు. అది మనము కొంచెమైనను గ్రహించలేకపోతిమే ? యెంత మౌఢ్యము! ఎంతకఠినత! ఎంతనిర్దయ! యెంతనిరసన.

యిట్టి ఘనకార్యావలంబులను మనమిట్లు హింసించుట మహాపాతకమని నేను ఘంటాఘోషముగ చెప్పుచున్నాను. అయ్యో ! సాంఘిక మహాశయులారా? వీరినిట్లు హింసకు, లోజేసి ఆనందించుచూ నవనవోల్లసిత కళాప్రపూర్ణతతో, వెలువడు పత్రికారత్నమును దిక్కులేని బీదరాలినిగాజేసి నవవర్షారంభమున అస్తమింపజేయుట కుద్యమించితిమే యింతకన్న దుఃఖకరమేమున్నది.

మహాశయులారా ? మనఅదిశైవ వంశజనితులగు ఒక్కొక్క ప్రాణియు, తప్పక ఒక్కొక్క పత్రిక తెప్పించుకొనుచు 'ఉడుతభక్తిని' మన మన శక్త్యానుసారము పత్రికా ప్రచారమునకు వలయు, సహాయము చేయలేకపోతిమా, మనజన్మము నిరర్థకమని నొక్కి చెప్పుచున్నాను.

పత్రికా సంపాదకులున్ను, తదితరులును, పత్రికతో ప్రచుర పరచుచుండెడి జిగుప్సావాక్యములుగల ఒక్కొకవ్యాసమునూ, సావధానముగ చదివి, అర్థగ్రాహ్యులమైతిమా మనమనంబులెట్లు దుఃఖ సాగరంబున మునుంగక యుండును.

ఇకనైన మనము నిర్వంచనతో, చందాలనిచ్చి, శక్తికిమించిన సహాయముచేసి, సారోద్ధారముగ, పత్రికారత్నమును నడిపించుటకును యిందులకైన ఋణబాధలనుండి సంపాదకులను విముక్తులు గావించుటకును, తమయావన్మందిని అనేక శతసహస్రసాష్టాంగములతో,

ప్రార్థించుచున్నవాడగాక శ్రీస్వాముల వారి శ్రీముఖమురీతి మనసంసారి కాది సాకులుగైకొనక ఈశ్రీముఖసంవత్సర జేష్టశుద్ధపంచమీ గోదావరిజిల్లా కోటిఫలిక్షేత్రమున శ్రీవారి యాజమాన్యము క్రింద జరుపు ప్రతిష్టాదికార్యములకు మనమందరున్ను చేరి నేత్రోత్సవమొంది శ్రీవారిచే ఆశీర్వాదఫలమాత్రతలుగైకొని, వారి యనుగ్రహామునకు పాత్రిలు కావలయుననిన్నీ, ఇకముందు ప్రతిసంవత్సరమునను శ్రీ శ్రీ కంఠశివాచార్యజయంత్యుత్సవము యథాశక్తి జరుపగలందులకు ప్రార్థించుచున్నాను.

ఇదే మనజన్మసాఫల్యతకు ముఖ్యము, ఆర్యులారా! ఇందలి నాలోపములను మన్నించి గుణగ్రహణులగుదురని వేడుచున్నవాడ.

ఇట్లు తమ శేవకుడు,

చారాల చిత్తూరిజిల్లా. } కె. అగస్త్యప్ప, స్కూల్ మాష్టరు.

# శ్రీశైవ మతాచార్య ప్రతిష్ఠ మహోత్సవాహ్వాన పత్రిక.

అఖిలభారత శ్రీఆదిశైవ స్వాములసన్నిధి.

శ్రీ గోదావరీమండలాంతర్గత, కోటిఫలీ మహాక్షేత్రమున, స్వస్తిశ్రీ శ్రీముఖనామసంవత్సర జ్యేష్ఠ శుద్ధ పాడ్యమీ ప్రభృతిపంచమీల పర్యంతం, జరుగనున్న శ్రీ శ్రీకంఠశివదూర్వాసశివ కేదారేశ్వర శివాచార ప్రతిష్ఠా మహోత్సవమునకు తాము సకలపరివారసమేతముగా విజయముచేసి, ఆచార్య ప్రతిష్ఠా వైభవముల దిలకించి పండితవర్యుల దర్శించి శ్రీబోధానంద మహర్షుల సేవించి మాచే యొనరింపబడు సత్కారముల స్వీకరించి మమ్ముల నానందింపజేయ నిరంతరము ప్రార్థించుచున్నాము.

శ్రీ కోటిఫలి }

ఇట్లు విధేయులు,
ఆహ్వాన సంఘము.

☞ ప్రతిదినము ఉదయము సాయంత్రము పండితోపన్యాసములు మత సభలు మున్నగు సద్విషయములు జరుగగలవు. మైసూరు, బెంగుళూరు, చిదంబరం, కాంచీపురం, చిత్తూరు మున్నగు ప్రాంతములనుండి గొప్పగొప్ప పండితవర్యులు దయచేసి, మతశాస్త్రములనెన్నిటినో బోధింపగలరు. గావున సర్వులు దయచేయ ప్రార్థితులు.

శ్రీ ఆచార్యప్రతిష్ఠా సంచిక.
Regd No. M. 2073. సం॥ర చందా రు 3-0 0 లు.

# శ్రీ ఆదిశైవపత్రిక.



శ్రీ శ్రీకంఠ మఠాధిపతుల యాజ్ఞానుసారముగా, శైవసంఘాభ్యుదయమునకై శ్రీ గురుకులాశ్రమమునుండి ప్రతిమాసము ప్రకటింపబడును.

సర్వదేవాత్మకో రుద్రస్సర్వే దేవాశ్శివాత్మకాః ।
రుద్రస్య దక్షిణేపార్శ్వే రవిర్బ్రహ్మా త్రయోగ్నయః ।
వామపార్శ్వే ఉమాదేవి విష్ణుస్సోమోపి తేత్రయః ॥
(రుద్రహృదయోపనిషత్)

సంపాదకుడు:—చిలుమూరు పురుషోత్తమ గురుక్కళ్.

| | | |
|---|---|---|
| సంపుటం ౯ | చిలుమూరు. శ్రీముఖనామ సం॥ర జ్యేష్ఠమాసము. | సంచిక 3 |

(విలేఖకుల వ్యాసములకు సంపాదకులు ఉత్తరవాదులు కానేరరు.)

## —♦ విషయసూచిక ♦—



భారతీ ముద్రాక్షరశాల, తెనాలి.

# మహారాజపోషకులు.

[సంవత్సరమునకు ఆరురూపాయలు చెల్లించవలెను.]

౧ రాజవైద్య నాగలింగం నందయ్య అండుసన్సువారు ఆయుర్వేదభవనం అమృతలూ

౨ శ్రీమాన్ కొల్లిపర వీరయ్యగారు, చివ్వలూరు.
3 ... కంఠంరాజు వెంకటసుబ్బయ్యగారు, భట్లపల్లి అగ్రహారం.
౪ ... చావలి వాలయ్యగారు, పెదరావూరు.
౫ ... స్వర్ణ సుబ్బయ్యగారు, పాన్డ్రాక.
౬ ... గూడూరు లక్ష్మయ్యగారు, వెణుతురుమిల్లి.
౭ ... ఆగమిక నంజుండ దీక్షితులుగారు, రామసముద్రము.
౮ ... పసుమర్తి పార్వతమ్మగారు, కూచిపూడి.
౯ ... వెలవలపల్లి వెంకటేశ్వరదీక్షితులుగారు.

# రాజపోషకులు. [సం॥రం 1కి 5-0-0లు

౧ ఆగమిక వాలేశ్వరదీక్షితులుగారు, పుంగనూరు.
౨ శ్రీమాన్ చావలి దుర్గాప్రసాద దీక్షితులుగారు, తరిగొప్పుల.
3 ... యలమంచిలి సుబ్రహ్మణ్యంగారు, వెదురుపాక.
౪ ... గూడలి రామయ్యగురుకులు, చినమాంభట్ల అగ్రహారం.
౫ శ్రీమతి ఇంకొల్లు అన్నపూర్ణమ్మగారు, [తాలూకాబోర్డు మెంబరు ]ప్రత్తిపాడు.
౬ శ్రీమాన్ S. రామప్పగారు, [కరణం] ఉప్పగపాలెం.

# పోషకులు. (సం॥రం 1కి 4-0-0

౧ శ్రీమాన్ వడ్లమూడి కోటయ్యగారు, వడ్లమూడి.
౨ ... నూతలపాటి వెంకటనారాయణ గురుకులుగారు, వరకవిపూడి.
3 ... చావలి పిచ్చయ్యశర్మగారు, చాటపర్రు.
౪ ... S. A. నంజుండయ్యగారు, శిరస్తాదారు, పుంగనూరు.
౫ ... ఉయ్యాలవాడ మునెయ్యగారు, భండ్యాత్మకూరు.
౬ ... ఆగమిక సుబ్రహ్మణ్యదీక్షితులుగారు, బెంగుళూరు.
౭ ... కొల్లిపర వెంకటసుబ్బయ్యశర్మగారు, అమ్మనబ్రోలు.
౮ ... నాగలింగం సత్యనారాయణగారు, డాక్టర్, మూలుపూరు.
౯ ... చుండి ఆనందరాయుడుగారు, రూపెనగుంట.
౧౦ ... ఆగమిక చంద్రశేఖరదీక్షితులుగారు, చౌడేపల్లి.
౧౧ ... S. A. అగస్త్యప్పగారు, చారాల.
౧౨ ... మురికిపూడి వెంకటేశ్వర్లుగారు, వల్లభాపురం.
౧3 ... చావలి చంద్రయ్యగారు, పెరవలి.
౧౪ ... కూర్మగిరి శేషమ్మగారు, పాకవీడు.

# శ్రీ ఆదిశైవపత్రిక



ఏకోరుద్రస్స ఈశానస్సభగవాన్ సమహేశ్వరస్స మహాదేవః ॥
"అథర్వశిరసి"

| సంపుట | చిలుమూరు | సంచిక |
| --- | --- | --- |
| ౯ | శ్రీముఖనామ సం॥ జ్యేష్ఠమాసము. | 3 |

## శ్రీ కాశీ క్షేత్రము.

(శ్రీయుతులు మంగిపూడి వెంకటశర్మగారు)

సీ॥ వేదవేదాంగాది విద్యాలతల కాల
వాలమై యలరారు వారణాసి
వేలకొలందులై విలసిల్లు నిత్యాన్న
సత్రాల కిరవై యెసంగు కాశి
రమ్యదుకూలాంబర పరిశ్రమలకు నాక
రంబు విశ్వేశ్వర రాజధాని
జనమిత్ర భూజాని చంద్రపరంపరా
పరిపాలితము శైవపట్టణంబు

గీ॥ నవ్యభాగీరథీ నదీతీరమగుచు
ధనదనిభులగు ధనికులధామమగుచు
భూరి వాణిజ్యరమకు నాధారమగుచు
చిరసుఖంబులుగూర్చు కాశీపురంబు.

గీ॥ ఎందుఁగన్న నందె యీశ్వరాలయములు
నెచటగన్న నచట నీశభక్తు

లందు నెల్లయెడల నమృతలింగంబులే
గణుతిసేయఁదరమ కాశిగరిమ.
( శ్రీయుతులు తలుపూరు సుబ్బన్నగారు )

కం॥ కొఱనెలసిగపూసామిని
వెఱవోఁ బూజించినగతి వే ధరఁగలుగున్
మెఱుఁగులు దీఱిన వజ్రఁపు
దఱపుంబలె నిశ్చలాత్మ తత్వజ్ఞులకున్.

---

# సంపాదకీయములు

## శ్రీ శ్రీకంఠ శివాచార్య ప్రతిష్ఠ

బ్రహ్మసూత్ర మీమాంసాభాష్య కర్తయు, ఆదిశైవ వంశా లంకారచూడామణియు, సకలాగమ పారావార పారీణధురీణ ఈశ్వ రాంశ సంభూతుండునగు జగద్గురు శ్రీ శ్రీకంఠశివాచార్య గురుప్రతి గోదావరీమండలస్థ కోటీఫలీ మహాక్షేత్రమునందు నిర్మించిన శ్రీకం మఠమునందు గాపింపఁబడియున్నది- శివకుల సృష్టియగు శ్రీదూర్వా శివాచార్యులవారి మూర్తిప్రతిష్ఠయు, ఆదిశైవమత సంరక్షకుడును, స లాగమవేదులునగు శ్రీ కేదారేశ్వరుని మూర్తిప్రతిష్ఠయు, జయప్ర ముగా నిర్విఘ్నముగా నేత్రోత్సవముగా నెరవేరుటచే ఆదిశైవ సాంఘి కులు ధన్యులైరి. కాలపరివర్తనచే గలిగిన మహామార్పులన్నియు యీ ఆచార్యప్రతిష్ఠలతో నూతనవికాసమునకు గడంగుచు దుర్వా ములకు తావులేకుండా చేయబడుచున్నవి. ప్రతిష్ఠావైభవ విశేషమ లన్నియు, స్థలాంతరమున ముద్రించితిమి. గమనించి యానందించుటకు హెచ్చరించుచున్నాము. ఇట్టి మహత్కార్యమునకు సహాయపడి మహామహులందరిని మా హృదయపూర్వకముగా నభినందించ చున్నాము. ప్రతిమండలమునందును కనీస మొక యాచార్యపీఠమున నెలకొల్పి మతగౌరవముల సంరక్షించుటకు యత్నించెదరని నమ్ము చున్నాము.

అభినందనము.

పత్రికయందభిమానించి మమ్ముల ప్రోత్సాహపరచి ఉత్సాహమును గలుగజేయుటకై వాక్సహాయమొనరించిన సోదరులను ధనసహాయమొనరించిన సాంఘికులను నూతనముగా చేరిన చందాదారులను దిగుబాటుల విషయములో స్వల్పముగానైనను సహాయపడిన సత్యవాక్యశీలురను పోషకులుగా చేరిన ధీశాలురను మా హృదయపూర్వకముగా గొనియాడుచున్నాము. శ్రీముఖ సంవత్సరమునందే పత్రిక యస్తమించుననెడి భీతిని పోగొట్టి నూతనవికాసమును గలుగజేసిన మహానుభావులను పరమేశ్వరుడు ఆయురారోగ్యైశ్వర్యాదులొసంగి సంరక్షించుటకు ప్రార్థించుచున్నాము.

విశేషము.

తెనాలి వాస్తవ్యులగు బ్రహ్మశ్రీ ముదిగొండ నాగలింగశాస్త్రులు మహోపాధ్యాయగారికిగూడ శ్రీకోటిఫలినుంచి యాహ్వానపత్రిక బంపినట్లు చేరినట్లు తెలియుచున్నది. శ్రీ ఆచార్య పత్తిష్ఠజరుగు తరుణముననైనను వారచటికి దయచేసి తమకుగల భాష్యసందర్భమున సందియములు నివారణచేసికొన్న యడల చాలా బాగుండెడిదేమో యని మా తలంపు. అట్టి అవకాశమును వదలుకొని వీ రెంతకాలము పత్రికలలో దూషించినను నిష్ప్రయోజనమని ఇకనైనగుర్తెరుంగగలరని నమ్ముచున్నాము. ద్రవిడ కర్ణాటకదేశములనుండి శైవ పండితవర్యు లరుదెంచినప్పుడైనను, వివాదములు పరిష్కరించుకొన జాలక, యున్నకుండుట కడుంగడు శోచనీయము. శ్రీకంఠుడు ఆదిశైవుడనియు, శ్రీకంఠభాష్యము వేరు, నీలకంఠభాష్యము వేరనియు, శ్రీకంఠభాష్యము ఆదిశైవులదేగాని లింగధారులగు ఆరాధ్యశైవులకు సంబంధించినది కాదనియు, తీర్మానింపబడినది. శ్రీమాన్ నందీశ్వరదీక్షితులవారికి మన మహోపాధ్యాయగారు ఇంతవరకు లేఖగాని తమ జ్ఞానవాహినీ సంచికగాని, పంపక ప్రత్యుత్తరలేఖగా ప్రకటించుట హాస్యాస్పదముగా

నున్నది. తమ కుయుక్తిని వెల్లడించుచున్నది. లోకులను భ్రమింపజేసి మేమే శైవులమనియు, మేమేజగద్గురువులమని బయలుదేరి, ఆదిశైవుల నెంతదూషించుచున్నను దేవాలయములలో అధికారములేని దూష్యపు కృత్యములెన్నిగావించుచున్నను మేము సహించియున్నప్పటికి ఆదిశైవ మత నిర్మూలన దీక్షాబద్ధులై మతధ్వంసము జేయ నుద్యమించి మాపై దాడివెడలిన భాష్యవివాదదండమును తుత్తునియలుజేసి నిరాయుధు లుగానొనర్చి వాగ్బంధనము గావించుటకు సిద్ధమైయున్నారనియు, తమ వ్రాతలు ప్రపంచమంతయు వ్యాపించుటచే తమ పాండిత్యమునకు ప్రజలు ఎక్కువగా సంతసించుచున్నారనియు, దెలుసుకొనుట శ్రేయ స్కరము. ది 30-3-33 తేదీన మే మొసంగిన రిజష్టరు నోటీసున కింతటి వరకు జవాబు యివ్వని కారణమున ఆలేఖగూడ ప్రకటింపక తీరదని తోచుచున్నది- దీక్షితులవారి ఖండనగూడ త్వరలో ప్రకటింపబడును. నిష్కారణవైరమునకు గడంగి ఆదిశైవ సంఘమున కాగ్రహము గలి గించిన శాస్త్రిగారి నేమని వర్ణించనలెనో దెలియకున్నది. ఒక్క మెడలోనే గాక చెవులకు చేతులకు కాళ్లకు ఎన్నిలింగములు ధరించి నను మాకేమియు ఆక్షేపణలేదు. ఇతరమతములను నిందించుట మహా పాతకము. అధికప్రసంగము అహంకారమని దెలుసుకొనుట శ్రేయ స్కరము. మేము వీరి మతప్రశంసను విమర్శించియుండలేదు. మా కన వసర విషయములలో మేము జోక్యము గలుగచేసుకొన నేరము.

సవరణ.

గత మాసపత్రిక నట్పయిటు ముద్రపడుటచే (0-0-6 పైసలు) మీకు తగిలినవి. త్రిప్పివేయుటచే సదరు 0-0-6 మావద్ద వసూలు చేసినారు. గవర్నమెంటువారిఆర్డరు సరిగా చేరకపోవుటవలన పోస్టల్ డిపార్టుమెంటువారు అట్లునట్పయిటు ముద్రలువేసి పంపినారు. పత్రిక ఆరంభమునుండి సహాయపడనివారుగూడ అర్ధణా చెల్లించుటకు ఇష్టము లేక అక్కరలేదని త్రిప్పివేసినారు. ఒక అర్ధణా చెల్లించలేనివారు ఎంత

కాలము పత్రిక ఉచితముగా గ్రహింపగలరో తెలియకున్నది. మేమెంత నష్టపడుచుంటిమో ఎరుగనేరరు. అర్ధణా చెల్లించి పత్రిక గైకొనుటకు మనస్సొప్పనివారు పత్రికను ఆదరింతురనెడి నమ్మకము గలుగగలదా? ఎట్లయిన మాకు పరమ సంతోషమే.

ఒక నెపము

పత్రికయందు ఏమీ రుచిగల వ్యాసములు లేవట. అందువలన చందాదారుగా నిలుచుటకు ఇష్టములేదట. ఉచితముగా పంపుచున్నారుగనుక గైకొనుచుంటిమేగాని, డబ్బు అడుగుతారని తెలిస్తే ఏ నాలుగు సంవత్సరాలనాడో అక్కరలేదని వ్రాసేవారమే అని అనేక రసికాగ్రేసర చక్రవర్తులు చాటుమాటున చిలుకపలుకులు పలికినప్పటికి మేమామాటలు లక్ష్యముసేయక పరమేశ్వరునిపై భారముంచి మతక్షేమముగోరి మతపత్రికను నడుపుచున్నాము. మతమే తెలియనివారికి మతపత్రికయొక్క స్వారస్యము తెలియనేరదు. మతపత్రికయందు మతసంబంధమైన వ్యాసములుండునేగాని "కాకీకోయిల" పిట్టకధలు మున్నగునవి ప్రచురించుటకు అవకాశముండనేరదని ఇకనైనను అట్టిమహానుభావులు దెలుసుకొని మాకు చేయూతనొసంగ ప్రార్థించుచున్నాము. అట్టికధలువగైరాలు వుండవలెననికోరువారు ఆవ్యాసములు వ్రాసి కొంతద్రవ్యము సహాయమొనరించినచో నిజమైన అభిమానులని సంతసింపుచూ ప్రకటింపగలము. శుష్కప్రియాలవల్ల పత్రిక నడచునా?

స్వీకృతి, దేవాంగసేవ.

మదరాసునుండి వెలువడు మాసపత్రిక కొంతకాలము క్రిందట నిలచిపోయి మరల సాంఘికుల సహాయమున ఉద్ధరింపబడినది. సంపాదకులు పొన్నేరి రామకృష్ణయ్యగారు. నె 6 రు రామానుజకూటం వీధి చాకలపేట, మదరాసు, అని వ్రాయవలెను.

చందా రు 1—0—0 మాత్రమే.

అగ్నికులప్రబోధినీ.

ఇదియు కొంతకాల మాగిపోయినపిమ్మట మరల నుద్ధరింపబడిన మాసపత్రిక. సంపాదకుడు పెదసింగు వెంకటనారాయణగారు రామా నాయుడుపేట బందరు, అని వ్రాయవలెను.

చందా రు 2—0—0

చందాదారులు.

వెంటనే తమ బాకీలననుసరించి సహాయము చేయవలసినవారు మమ్ములను చిక్కుపెట్టక తక్షణమే మనియార్డరు చేయగోరుచు న్నాము. పత్రిక అక్కరలేనివారుగూడ తక్షణమే తెలియపరచినచో మాకు శ్రమ తప్పిపోగలదు. మోసముచేయదలంచినచో పరమేశ్వరుడే పరిశీలింపగలడు గావున శ్రీముఖసంవత్సరాంతములోపల బాకీలన్నియు పూర్తిగా తేల్చవలెనని పరమేశ్వరుని ప్రార్థించుచున్నాము.

---

కోటిఫలి.

## శ్రీ శ్రీకంఠశివాచార్య ప్రతిష్ఠా మహోత్సవ తరుణమున వసూలైన పత్రికా చందాలు.

| | | | |
|---|---|---|---|
| ౧ | శ్రీమాన్ | శ్యానభోగరామప్పగారు (శ్రీముఖపోషకచం॥) | ౪-౦-౦ |
| ౨ | ,, | వెలపలపల్లిసత్యనారాయణశాస్త్రిగారు(శ్రీముఖ) | 3-౦-౦ |
| ౩ | ,, | పూజ్యం గంగాధరంగారు (శ్రీముఖ) | ౨-౦-౦ |
| ౪ | ,, | చంద్రమౌళి శేషయ్యగారు (లోగడ బాకీ) | ౪-౦-౦ |
| ౫ | ,, | చంద్రమౌళి సత్యనారాయణగారు (లోగడబాకీ) | ౨-౦-౦ |
| ౬ | ,, | పూజ్యం కామశాస్త్రిగారు (లోగడబాకీ) | ౨-౦-౦ |
| ౭ | ,, | బాదంపూడి కామయ్యగారు (లోగడబాకీ) | ౨-౦-౦ |
| ౮ | ,, | అయలూరు వెంకటసుబ్బారావుగారు (లో॥బా) | ౨-౦-౦ |

| | | | |
|---|---|---|---|
| ౯ | ,, | రామేశ్వరపు చలమయ్యగారు (లో॥ బాకీ) | ౫-౦-౦ |
| ౧౦ | ,, | కొమ్మాళ్లపల్లి లింగమూర్తిగారు (లో॥ బాకీ) | ౨-౦-౦ |
| ౧౧ | ,, | చంద్రమౌళి సోమశేఖరంగారు (శ్రీముఖ బా॥) | ౧-౦-౦ |
| ౧౨ | ,, | కొత్తలంక అప్పన్నగారు (శ్రీముఖ బాపతు) | ౧-౦-౦ |
| ౧౩ | ,, | మాచరి సత్యనారాయణమూర్తిగారు(శ్రీముఖ) | ౨-౦-౦ |
| ౧౪ | ,, | అయలూరు మల్లయ్యగారు (శ్రీముఖ చందా) | ౩-౦-౦ |
| ౧౫ | ,, | సత్తెనపల్లి హనుమంతరావుగారు( శ్రీముఖ చం) | ౩-౦-౦ |

(పత్రికా సన్మానం)

గోదావరి జిల్లా కోరుమిల్లి అగ్రహారం వాస్తవ్యులు శ్రీ బాదంపూడి కామయ్యగారు తనభార్యా కుమారుల జ్ఞాపకార్థం పత్రికా సన్మానం నిమిత్తం సమర్పించినది. రు- ౧-౦-౦

గుంటూరుజిల్లా చావలివాస్తవ్యురాలు శ్రీమతి నూతలపాటిలక్ష్మమ్మగారు తన కుమారుని ఉపనయనమహోత్సవ తరుణమున పత్రికా సన్మానము నిమిత్తం(స్వర్ణ వెంకటశివావుధానులుగారి ద్వారా) సమర్పించినది, ౨-౦-౦

డిటో జంపని గ్రామవాస్తవ్యులు శ్రీమాన్ మామిళ్లపల్లి వెంకట సుబ్బయ్యగారు తన మనుమని ఔపోసనకార్య మహోత్సవ తరుణమున పత్రికా సన్మానం నిమిత్తం సమర్పించినది. ౧-౮-౦

శ్రీ స్వాములవారి పర్యటనము.

ఆచార్య ప్రతిష్ఠానంతరం శ్రీ శ్రీకంఠమఠాధిపతులగు శ్రీ శ్రీబోధానంద మహర్షులవారు సపరివారముగా కాశీక్షేత్రమున కరుదెంచినటుల దెలియుచున్నది. శ్రీవారు త్వరలో గుంటూరు మండలమునకు దయచేసి శ్రీ గురుకులాశ్రమమునందు కొంతకాలము విశ్రాంతిని గైకొందురని దెలుపుచున్నారము.

# ఆచార్య ప్రతిష్ఠా మహోత్సవము.

( శ్రీమాన్ చంద్రమౌళి సత్యనారాయణగారు )

స్వస్తిశ్రీ శ్రీముఖనామ సంవత్సర జ్యేష్ఠ శుద్ధ పాడ్యమీ గురువారం ఉదయము ప్రతిష్ఠా సంకల్పము ప్రారంభమైనది. బెంగుళూరు, మైసూరు, శివగంగ, పుంగనూరు, చిత్తూరు, శివకంచి, నెల్లూరు గుంటూరు మున్నగు వివిధ మండలప్రదేశములనుండి ఆదిశైవ పండితోత్తములు సకుటుంబముగా విచ్చేసి, యీ క్రియాకలాపములందు జోక్యము గలిగించుకొనిరి. ఆంధ్రమండలములనుండి ముఖ్యనాయకులును, సంస్కర్తలుమున్నగు పలువురు ప్రముఖులరుదెంచిరి. షుమారు వేయి (1000) మంది మహాజనులు శ్రమయనక దూరమని తలంపక వ్యయ ప్రయాసలకోర్చి దయచేసి, యీ ప్రతిష్ఠా మహోత్సవమును దిలకించి, పూర్తిగావించి ధన్యులైరి. అయిదుదినములు ప్రతిష్ఠాకలాప మంతయు శాస్త్రోక్తముగా ఆచరించిరి. శివదీక్షలుగూడ విరివిగా శ్రీమాన్ నందీశ్వరదీక్షితులవారి వలన యొనరింపబడెను. పలువురు, స్త్రీలు నందికేశ్వర వ్రతోద్యాపనలు గావించుకొని క్షీరాన్న గుడపిష్ఠ అపూప, మాషభక్ష్యాదుల నొసంగి ధన్యులైరి.

పవిత్ర గౌతమీనదియందు స్నానమాచరించి, ఆపాదమస్తకాంతం భస్మమలంది, వ్యాఘ్రచర్మము ధరించి, వింతగొలిపెడి జటాజూటము శిరోభాగమున ప్రకాశింప, షుమారు (400) శిష్యజనముతో వేదస్వస్తివాచకములతో, సమస్త వాయిద్యములతో, స్తోత్రములతో ప్రతినిత్యము ప్రత్యూషకాలంబున నేత్రోత్సవమొనరించుచూ, మఠమునకు విజయముచేయు శ్రీ బోధానంద మహర్షులవారి యనుగ్రహ సంకల్పము వర్ణనాతీతముగదా! ఆదిశైవ సంరక్షణార్థై యవతరించిన శ్రీ కైలాసనివాసుడగు శంకరునిబోలె అనుక్షణమీ మహనీయుని దివ్యసుందరవిగ్రహ దర్శనమును గావించి యానందించుచుండిరి. శిష్య

బృందముయొక్క దండప్రణామముల స్వీకరించి, యాశీర్వదించి జ్ఞాన ప్రసాదముల నొసంగి తరింపజేయ సమర్థులగు నీమూర్తి నెంతని వర్ణింపగలము.

యీ మహోత్సవమునందు ప్రతినిత్యము కార్యక్రమముననుసరించి మహోపన్యాసములు, గానసభలు విరివిగా జరిగియున్నవి. ఛాయాపటముగూడ దీయబడెను. శ్రీ స్వాములవారి ఉపన్యాసములోని సారాంశమును గ్రహించి, పలువురు ఆశ్చర్యమునొంది జ్ఞానప్రవాహములో నోలలాడగల్గిరి. ఇంకను అనేక యతీశ్వరులుగూడ సభల కరుదెంచి ఉపన్యసించిరి. శ్రీకంఠ భాష్యములోని వివిధవిషయములు బోధించి సంతోషింపజేసిరి. దుర్వాదములతో క్రుళ్ళి కృశించెడి వారికీ మహోపన్యాసములు దివ్యౌషధప్రాయములై అజ్ఞానమను మహావ్యాధులను పటాపంచలు గావింపదగియున్నవని పండితులు దెలుపుచున్నారు.

నిర్విఘ్నముగా ప్రతిష్ఠలు జరిగినవి. కార్యక్రమమంతయు పూర్తిగావింపబడినది. నిత్యపూజకు ప్రతి ఆదిశైవ కుటుంబీకుడును సంవత్సరమునకు రు 1—4—0 లు ఆచార్యసన్నిధిని సమర్పించవలెననియు, వేదశాస్త్ర పాఠశాలకు రోజునకు రు 6—0—0 లు అంచనా వేయబడినందున అభిమానశక్తులుగలవారు ఉభయములు అంగీకరించిరి. సుమారు 50 మంది వాగ్దానము చేసిరి. అట్టి ఉభయమిచ్చువారు పాదకానుక ప్రత్యేకముగానివ్వనక్కరలేదు. సంవత్సరమునకు (6-0-0) యిచ్చినట్లయితే ఒక్కరోజు ఆచార్యపూజయు, వేదబ్రాహ్మణ సమారాధనయు మఠములో అతని గోత్రనామములతో ఉభయము జరుగగలదు.

ఇట్టి మహాత్కార్యమందు ధర్మరాజుంబోలు బాదంపూడి బుచ్చయ్యగారును, భీమునిబోలు యలమంచిలి సుబ్రహ్మణ్యంగారును, కృష్ణార్జునులవలె అయలూరు రామశాస్త్రి కామేశ్వరి గురుకులు

గార్లును, యింకను పలువురు ప్రముఖులు యీ ఆచార్యప్రతిష్ఠాకలాప మును వ్యయప్రయాసనక, దూషణ భూషణల లెక్కగొనక చతుర్వి ధోపాయములతో అహోరాత్రములు కష్టించి, శ్రీ మహర్షులవారి తేజోమహిమచేతను, నందీశ్వరప్రముఖ గురువర్యుల సహాయముతో యీ మహత్కార్యము జయప్రదముగా నెరవేర్చి సంఘ గౌరవముల ఆచంద్రార్కస్థాయిగా సంరక్షించబడెనని యానందమున నోలలాడెడి శ్రీ ఆదిశైవ సంఘమును శ్రీ పరమేశ్వరుడు సర్వదా బ్రోచు చుండుగాత !

ఇట్లు సంఘశ్రేయోభిలాషి,
చంద్రిమౌళి సత్యనారాయణ,
కాట్రావులపల్లి,

---

# శివకులక్రమము.

[ శ్రీమాన్, ఆ. కైలాససుందరశర్మగారు ]

సదాశివునిచే అనంతాద్యష్టవిద్యేశ్వరులును, అనంతేశుని వలన కైలాసపతియగు శ్రీకంఠపరమేశ్వరుండును, వారిచే గ్రిమముగ విష్ణుబ్రహ్మేంద్రాదులును, దూర్వాసమహాముని యు, జనితులైరి. అందు దూర్వాసులు శివకుల సృష్టికర్తయగుచు కౌశిక, కాశ్యప, భరద్వాజ, గౌతమ, అగస్త్యులను, బడసి శివదీక్షాభిషిక్తులంజేసి యాకాలమున గోదావరీ తీరమునందు మంథనకాళేశ్వరమును సమీపించి యామర్దక సంజ్ఞచే మఠంబొండు ప్రతిష్టించిరి. కౌశికాదులా మఠము నందు శ్రీదక్షిణామూర్తి స్వరూపుండగు శ్రీకంఠపరమేశ్వరుని యుపాసించి, ఆగమ తత్త్వజ్ఞకోవిదులైరి. కౌశికాదులకు అంతేవాసులగుచూ, సనకాదులు నలువురు మరి మూడు మఠములు. ( రణభద్ర గోళకి పుష్పగిరి ) స్థాపించి కదంబార్జున, జంబూ, వటవృక్షములతో నొప్పెడు నాలుగు మఠములను సనకాదులు నలువురు పాలించుచుండిరి. ఇట్లే

పరంపర చతుష్టయములతో, గోత్రపంచకములతో, క్రమముగవచ్చుచు వర్తమాన కలియుగారంభకాలమున వ్యాపక శంభువను శివాచార్యులోకరు ఉద్దీప్తవ్యాపకులై యుండిరి. మంథనకాళేశ్వరము చుట్టుకొని ఆమర్థకము, పుష్పగిరి, గోళకీ, రణభద్రము, అనునాలుగు మఠసాంప్రదాయములతో ఆదిశైవులు నివసించుచుండి లోకులకు పరార్థపూజావిశేషములను బోధించుచూ దేశప్రభువులచే యాహ్వానింపబడుచూ సమస్తదేశములందును వ్యాపించుచూ ఆలయనిర్మాణములు గావింపజేయుచూ, ప్రతిష్ఠాదిక్రియల నెరవేర్చుచూ, నేటిదనుక, దేశక్షేమమునకై పాటుబడుచున్నవారు. ఇందువలన ఆదిశైవ భూసురోత్తములకు గోదావరీతీరమే ముఖ్యస్థానమని తేలినది. మన పూర్వాచార్యులలో అఘోరశివాచార్యులవారి ఆగమ పద్ధతియే విశేషముగా ఆచరణలోనికి వచ్చియున్నది. శ్రీ శ్రీకంఠశివాచార్యులవారు ప్రస్థానత్రయ భాష్యకర్తలైవెలసిరి. త్రిలోచన శివాచార్యులవారు సిద్ధాంతసారావళీ యను పేర సిద్ధాంతసారములను పూసగ్రుచ్చినట్లు నాల్గుపాదములతో సంస్కృత శ్లోకములతో బహుసుందరముగ గ్రంథము రచియించి పతి, పసుపాశ, లక్షణములను, ముప్పదియారు తత్వవివరములను, ప్రళయకాళ పరిణామములను, సృష్టిస్తితి తిరోభావానుగ్రహాఖ్యపంచకృత్యవిశేషములను, శక్తిపాత వివరములను, దీక్షావిషయములను, కుండమండలాదుల, లక్షణము, యోగనిష్ఠామార్గము, అంతర్యాగము, చతుస్సంధ్యాకాలములయందు, శివస్మరణచేయు విధానము, ఆగమవివరణము, శివభేదము. రుద్రభేదము, న్యాసక్రమము, మున్నగు సమస్తవిశేషములను, 167 శ్లోకములతో బోధపరచియున్నారు. శైవసమయాచార్యుల నలుగురిలో యిద్దరు ఆదిశైవులు. సుందరమూర్తిస్వామి మాణిక్యవాచకస్వామి, వీరి మహిమ చెప్పనలవిగాదు. సుందరమూర్తిస్వాములవారు శివచిద్విలాసము లెన్నియో బయల్పరచి తనసఖుండగు చేరదేశ ప్రభువుతో సశరీరుండై కైలాసమునకు వెళ్లియుండిరి. మాణిక్యవాచకస్వాములవారు అరిమర్థనపాండ్య ప్రభువువద్ద ప్రధానామా

త్యులైయుండి శివకైంకర్యము లెన్నియోజేసి చిదంబరక్షేత్రమున నివసించు శైవాచార్యులను (త్రిసాహస్రదీక్షితులు) కర్మవాదులగు నాస్తికులు కుతర్కములచే పీడింపుచుండ వారలచే ఆహ్వానింపబడి యానిరీశ్వర వాదులను ఖండించి, శైవమతమును స్థాపించి యాచితంబర క్షేత్రమునందే శివానందలహరీ నిమగ్న చిత్తముతో జీవన్ముక్తులైయున్నారు. ఇంకను మనపూర్వులెందరో సకలశాస్త్రవేత్తలై, ఆగమరహస్యప్రబోధకులై యుండిరి. విస్తరభీతితో విరమించుచుంటి.

ప్రస్తుతకాలమున మునుపటి నాస్తికులకన్న మిక్కిలి కఠోర హృదయులై, శాస్త్రముల గమనింపక ఆలయసంస్థల నాశనమొనరించుటకై లోకులను భ్రమింపజేయుచున్నారు. ఇట్టి మహత్తరుణమున శ్రీ శ్రీకంఠ మఠమును స్థాపించుట మిగుల శ్రేయోదాయకము. ఆది శైవ సంఘములు ప్రతి మండలమునందును స్థాపించి, ఆగమాచార సాంప్రదాయముల వ్యాపింపజేసి శైవమతగౌరవముల గాపాడుట శుభావహము. షడధ్వప్రక్రియలచే పరమేశ్వరుని ప్రతిష్ఠించి, పరార్థపూజా స్వతంత్రాధికారులై సర్వలోకములకు సర్వేశ్వరసాన్నిధ్యము నెలకొల్పుచూ, పరమసాధుపుంగవులై, భోగమోక్షప్రదులై, ఆసేతుహిమాచలాంతర్ధరణీతల మందెల్లెడను ప్రవర్ధమానులై వెలయుచుండు ఆది శైవ మహాజనుల మహామహిమలు వర్ణింప నేరికిని శక్యముగానేరదు. కలిపశాత్తు వితండవాదపండిత శిఖామణులు ఆదిశైవ ప్రాముఖ్యమును గాంచి సహింపలేక కుతర్కములతో దూషణ మొనరించినంత మాత్రమున ఆదిశైవస్వరూపమున కేమియు లోటు వాటిల్లనేరదు. దుర్మత దుర్వాదముల నా శ్రీకంఠపరమేశ్వరుడే ఉపశమింపజేసి లోకకల్యాణ మొనరింప గలడు. శివకుల శేఖరులీ తరుణమును వ్యర్థముచేయక గురుస్థాన గౌరవముల గాపాడుచూ, లోకోత్తర పురుషులనెడి ఖ్యాతిని

వ్యాపింపజేసి మహోన్నత్య పదవి నలంకరించునటుల ప్రార్థించు చున్నాను.

పల్లిపట్టు
చిత్తూరుజిల్లా
26—5—33.

ఇట్లు విబుధవిధేయుఁడు,
కైలాస సుందరశర్మ

---

# ప్రత్యుత్తర లేఖకు జవాబు.

## మ. రా. శ్రీ
## ముదిగొండ నాగలింగశాస్త్రిగారికి.

జ్ఞానవాహినీయందు ప్రకటించిన ప్రత్యుత్తరలేఖను పఠించి సంసించితిని. ఇట్టి యసందర్భపు లేఖను ప్రకటించుటచే నీకును నీజాతి వారికినిగాక "వృద్ధునికి రత్యభిలాషవోలె" నే రెండుమాసములకో వెలువడు "జ్ఞానవాహిని"కిఁగూడ నొకింత యగౌరవము సంభవించు నేమోయని కడుంగడు దురపిల్లుచున్నాఁడ.

దీక్షితులవారు ప్రకటించిన లేఖలోని విషయమటుండనిమ్ము. భాష సహజముగా బ్రాహ్మణ ముఖద్వారా నిర్గతము. నీపత్రికలోని భాష శూద్రసాంప్రదాయమును వేనోళ్ళ చాటుచున్నయది. నీచశబ్ద ములతో ప్రేలుట పండితలక్షణమా? "భక్ష్యాశయాహి మంజూషాం దష్ట్వాఖుస్తేనభక్షితః" యనునది విమర్శనాదృష్టితో పరిశీలింప, సరస సమంచితోపమానములతో నీకనువర్తించునేగాని మాకెంతమాత్ర మును వర్తింపదే. మేమెట్టియాశతోను శ్రీకంఠభాష్యమును పరిశీలిం చుటలేదే? మాకెట్టి యాశాభంగమును గలుగలేదే? ఇక మీరన్ననో ఏమూలనైనా లింగధారణ చెప్పియున్నదేమో యను యాశాపాశ

బద్ధులై నెమకుచూ, తుదకు ఆదిశైవప్రాశస్త్యనాగదష్టులై స్మృతితప్పి యవకతవక వ్రాతలతో "గెలవలేక నాచుట్టూ బలాదూరన్నట్లు" గా వర్ణించుచున్నారు. శ్రీకంఠభాష్యకర్తయగు శ్రీకంఠ శివాచార్యుల వారు ఆదిశైవుడని నీవంగీకరించియుంటివిగదా? స్వమతమును వీడి యన్యమతమునకు భాష్యము వ్రాయునని లోకజ్ఞానముగలవా డెవ్వ డైనా అంగీకరించునా? పోనీ, ద్వైతాద్వైతమునకు సంబంధించిన భాష్యమని రుజువుచేయగలవా? బ్రాహ్మణునకు యజ్ఞోపవీతమెంతటి యవశ్యమో, వీరశైవమతమునకు లింగధారణ యంత యవసరమని తెలియుచుండగా, శైవ విశిష్టాద్వైతభాష్యమునుగాంచి, వీరశైవుల భాష్యమని పెనగులాడుట యవివేకమని నీసాంఘికులే నీకు గావించిన హితవులు మరచిపోయి వుంటివిగాబోలు. "లింగధారణ విషయము మీ కెట్లు గోచరించును" అని వ్రాసితివే. ఉన్నచో దాగుకొనునా. లేనిది నీకుమాత్రము గోచరించునా? చిత్త విభ్రమము. శాస్త్రిగారూ! ఎందుకీవెర్రితలంపులు? పురుషవేషముతో నున్న స్త్రీని పురుషుడేమో యని తలంచి అజ్ఞానముతో మరియొక స్త్రీ ప్రేమించిన యెంత సుఖ మనుభవింపగలదో, శ్రీకంఠభాష్యవిషయములో నీవును అంతేసుఖ మనుభవింపగలవు. దేవలకులెవ్వరో, దేవలకత్వ దోషమెట్టిదియో, నిరూపింపలేని నీవు మమ్ములను దేవలకులని నిందించుట నీపాండిత్యము, నీమహోపాధ్యాయబిరుదము నేటితో నేతిబీరకాయయని లోకులకు స్పష్టముగా గోచరించుచున్నది. నీలకంఠభాష్యమన్నను, శ్రీకంఠ భాష్యమన్నను ఒక్కటేయని శైవరహస్యబోధినిలో వ్రాసితినంటివే. నావ్రాతయే వేదశాసనము, నేనే వ్యాసుడనని నీవు దలంచినట్లున్నది. "తాబట్టిన కుందేటికి మూడే కాళ్ళన్నసామెత" సరసముగా నీకువర్తించినది. మాభాష్యమును మీరు పఠించినచో మాకు లోపము సంఘటిల్లుటయేగాక, పవిత్రమైన భాష్యము అపవిత్రత నొందగలదనియే, మేము భుజాస్ఫాలనము చేయవలసివచ్చినది. ఆదిశైవ, శివద్విజపదములకు వ్యత్యాసము లేదనియు, బర్యాయనామములని వేలకొలది

ఆగమప్రమాణములు గలవు. అట్టివి నీయెడ బూడెదలోబోసిన పన్నీరు కాగలదు.

మీ యారాధ్యపండితులే శ్రీకంఠభాష్యము మనది గాదనియు, శ్రీకర నీలకంఠభాష్యములే లింగధారుల భాష్యములనియు యనేక పర్యాయములు నిన్ను మందలించి గౌరవించుట మరచితివిగాబోలు. ఇకనైనను పెద్దల యాజ్ఞలను శిరసావహించి అనవసర కలహముల మానుట మంచిదని మాతలంపు. మతవిషయములలో నీకు బొత్తిగా ప్రవేశము లేదని తెలియుచున్నది. నీతోబాటు స్మార్తులనుగూడ కలుపుకొని దూషించితిమని పాషండయుక్తితో కలహమును పురికొల్పుచు మాపై దండెత్తుచుంటివి. నీసాంఘికులే నిన్ను ఛీ ఛీ ప్రయోగములతో గౌరవించుచుండ అన్యశాఖీయులెట్లు సహాయపడగలరని నమ్మితివో, నీ లోకజ్ఞానశూన్యతకు విచారించుచున్నాము. "మగడు ముండా యనిన ముష్టికివచ్చినవాడు రండాయనను ననెడి సామెతమరచితివిగాబోలు! యే సంస్కృత వాఙ్మయమునకోకృషి సలిపి ప్రస్తుతమున గలమహోపాధ్యాయ బిరుదమునకు యింకొకమహా బిరుదమునుదగిలించుకొని, "గూడ్సుబండివలె"వర్తించవలసిననీవు మత విషయక ప్రచారమున మునింగి దారి డొంక గానక పై " మహో ' బిరుదము రాకపోగా వున్న మహాబిరుదమునకు గూడ నుద్వాసన జెప్పుదువేమో యని జాలిగల్గుచున్నయది. ఇంతటనైనను భావి కష్టపరంపరను దలంచి దురాశా పిశాచ గ్రస్తుడవు గాకుందువని మా యాశయము.

దేవలకు లెవ్వరో తెలియని నీవు దేవలక చారిత్రవ్రాయుట హాస్యాస్పదముకాదా. వ్రాసిన మాకేమిలోపము వాటిల్లునని దలంచితిరి. ఆ దేవలక శబ్దము గొనివచ్చి ఆదిశైవులకు ముడిపెట్టదలచుట ' జల్లెడతో నీరు చేదినట్లే ' నీ శ్రమయంతయు నిరర్థకము కాగలదని దృఢముగా తలంచుము. ఒకవేళ శ్రమపడి ఆ దేవలక చరిత్రము మాకే సమన్వయము చేయ యత్నించితివేని ఉత్తరక్షణమునందే

పాషండ చరిత్రము బయలుదేరి నిన్ను బ్రాహ్మణసంఘమునుండి వెడల గొట్టించి శూద్రులకంటే నికృష్టపు జాతిలో చేర్చబడునని గుర్తెరుంగుట మంచిది.

నక్కయెక్కడ దేవలోకమెక్కడ యని పిచ్చివాగుడు, వ్రాసితివే. పరిశీలించినచో నీ వెక్కడ శ్రీకంఠభాష్యమెక్కడ జాతాశౌచముల జారవిడిచి మృతాశౌచముల మంటగలిపి ముట్టంటలుమూల ద్రోసి దహనసంస్కారాది బ్రాహ్మణోచిత వేదోక్తకర్మల విడనాడి భ్రష్టులై ఖననాదులచే శూద్రులలో జేరకయు కర్మభ్రష్టతచే ఇట్లు బ్రాహ్మణులలో జేరకయు త్రిశంకునివలె వ్రేలాడుచున్న మీకు భాష్యమా. ఎంతటిహాస్యాస్పదము. తద్విషయములో వాద ప్రతివాదములా అహా! తీరుసొరులు గల తెలుగు సామెత కీ సందర్భమెంత రాణించినదో చూడుము- నక్కయెక్కడ దేవలోకమెక్కడ. ఆంధ్ర భాషకు నూతన వికాసము గల్గించినది గదా యీ సామెత.

ఇంతదనుక కొన్ని స్మార్తశాఖలు మీతో సంబంధబాంధవ్యములు తెలిసియో తెలియకయో గావించియున్నవి. నీ పాషండ చరిత్రము గాంచినచో ఏస్మార్తుడును మీతో సంబంధములు చేయక పోగా తుట్టతుదకు పంక్తిభోజనమునకు గూడ నియ్యకొన వెనుకంజ వేయగలడని తలంపవలెను. ఇంతదనుక మీ ప్రవర్తన 'వ్యాఘ్రచర్మమును ధరించిన గార్ధభము లనుటలో నావంతయు దోషములేదని మా తలంపు. అనవసర కలహములకుదిగి స్వసంఘగౌరవము గోల్పోవుట శ్రేయస్కరము గాదనియు, గ్రంథవిచారము గావించుట యుత్తమమనియు మతములనాదియనియు ఎవరెవరి మతాచారధర్మములు వారికి గొప్పతనము జేకూర్చుచున్న వనియు దెలిసికొని ప్రవర్తించుట శుభదాయకము, మోదావహము, శ్రేయస్కరము.

యతోధర్మ స్తతోజయః. ఓం శాంతి శ్శాంతి శ్శాంతిః.

M. రాఘవశర్మ.
ఆంధ్రరాష్ట్రీయ ఆదిశైవ యువజనసంఘము.

---

# ఆంధ్రద్రావిడ కర్ణాటక ఆదిశైవ సంయుక్త సమావేశము.

స్వస్తిశ్రీ శ్రీముఖనామసంవత్సర జ్యేష్ఠశుద్ధ చవితి ఆదివారం (ది28—5—33) తేదీన గోదావరి జిల్లా కోటిఫలీ మహాక్షేత్రమున శ్రీ శ్రీకంఠ శివాచార్యప్రతిష్ఠా మహోత్సవ తరుణమున శ్రీమహర్షి బోధానందుని యాజ్ఞానుసారముగా శ్రీ శైవాద్యాగమ పంచానన నేత్ర్యాది బిరుదాంకితులును మైసూరు ముజరాయి కమీషనర్ ఆఫీసుస్టేట్ ఆగమిక నందీశ్వర దీక్షితులవారి యాధిపత్యమున తర్క వేదాంత న్యాయశాస్త్ర మహావిద్వాన్ శ్రీ పాలూరు శివసుబ్రహ్మణ్య శివాచార్యులు (కాంచీపురం), పండితకవి విద్వాన్ శ్రీ సుబ్రహ్మణ్య దీక్షితులవారు (పుంగనూరుసంస్థానం) మున్నగు ఆదిశైవ సోదరసోదరీమణులతో పైసమావేశము జయప్రదముగా గావింపబడి యీక్రింది తీర్మానములు సర్వజనాంగీకృతముగా నొనరింపబడినవి.

## తీ ర్మా న ము లు

౧. (అ) శ్రీమన్నిగమాగమ పారావార పారీణులును; నిత్యానందమయులగు మహర్షి బోధానందుని సత్యసంకల్పమునకు యీసభవారు కృతజ్ఞతాపూర్వక వందన సహస్రంబు లర్పించుచున్నారు.

(ఆ) శ్రీ వేదవేదాంగ కలానంద రసికులును, శైవాద్యాగమ పంచాననేత్ర్యాది బిరుదాంకితులగు శ్రీమాన్ నందీశ్వర సుబ్రహ్మణ్య, సుందర, శివసుబ్రహ్మణ్య, గంగాధర, ప్రముఖ గురుకులాచార్యు లరుదెంచి శ్రీఆచార్యప్రతిష్ఠలను నిర్విఘ్నముగా నెఱవేర్చినందుల కీ సభవారు అనంతవందనశతంబు లర్పించుచున్నారు.

ఉ॥ అయలూరు రామశాస్త్రిలుగారు

ఆ॥ చిలుమూరు పురుషోత్తమగురుకులుగారు

౨. చిరస్థాయియగు శ్రీకంఠ మఠమునందు విద్యాపీఠమును నెలకొల్పుట కీ సభవారు నిశ్చయించుచున్నారు.

ఉ॥ చిలుమూరు పురుషోత్తమగురుకులుగారు

ఆ॥ యలమంచిలి సుబ్రహ్మణ్యంగారు

3. ప్రతిసంవత్సరం యీ శ్రీకంఠమఠమునందే శ్రీకంఠ జయంతిని జరుపుటయేగాక ప్రతి ఆదిశైవుడును యీజయంతిని ఒక వ్రతముగా ఆచరించవలెనని యీసభవారు శాసించుచున్నారు.

ఉ॥ పండితవిద్వాన్. సుబ్రహ్మణ్యదీక్షితులుగారు

ఆ॥ చంద్రమౌళి సూర్యనారాయణదీక్షితులుగారు.

౪. శ్రీకంఠమఠమునందు జరుగవలసిన విధానములకు ధనమును సేకరించుటకు దగినసలహాల నొసంగుటకీ క్రిందివారిని సలహాసంఘముగా నిర్ణయించడమైనది.

ఉ॥ అయలూరు కామేశ్వరిగురుకులుగారు

ఆ॥ బాదంపూడి బుచ్చయ్యగారు.

[ సభ్యులు. ]

విశాఖపట్నం జిల్లా.

౧ వెలవలపల్లి సత్యనారాయశాస్త్రిగారు

౨ వెలవలపల్లి వెంకటేశ్వరదీక్షితులుగారు

3 వెలవలపల్లి వెంకటేశ్వర్లుగారు

గోదావరి జిల్లా

౪ కొత్తలంక విస్సన్నగారు

౫ చొంతుకుర్తి పాపయ్యగారు

౬ బాదంపూడి బుచ్చయ్యగారు

౭ యలమంచిలి సుబ్రహ్మణ్యంగారు

౮ చంద్రమౌళి సూర్యనారాయణదీక్షితులుగారు

౯ అయలూరు రామశాస్త్రులుగారు

౧౦ మొవ్వ వెంకటరామశాస్త్రిగారు
౧౧ ఉండి రాజన్నగారు

గుంటూరు జిల్లా

౧౨ కొల్లిపర వీరయ్యగారు
౧౩ పోగుల రుద్రయ్యగారు
౧౪ సోమరాజుపల్లి మూలయ్యశాస్త్రిగారు
౧౫ నాగలింగం సుబ్బయ్యగారు
౧౬ స్వర్ణ వెంకటశివావధానులుగారు
౧౭ చావలి శివరామపాకయాజిగారు
౧౮ చిలుమూరు పురుషోత్తమ గురుకులుగారు
౧౯ పావులూరు నాగేశ్వరశర్మగారు

మైసూరు జిల్లా.

౨౦ ఆ. నందీశ్వరదీక్షితులుగారు
౨౧ ఆ. సుందరదీక్షితులుగారు
౨౨ ఆ, నంజుండదీక్షితులుగారు
౨౩ ఆ. వాలేశ్వరదీక్షితులుగారు
౨౪ ఆ. కాళప్పదీక్షితులుగారు
౨౫ ఆ. సుబ్రహ్మణ్యదీక్షితులుగారు

చిత్తూరు జిల్లా.

౨౬ సుబ్రహ్మణ్యదీక్షితులుగారు
౨౭ ఆ. గంగాధరదీక్షితులుగారు

చెంగల్పట్టు జిల్లా.

౨౮ పాలూరు శివసుబ్రహ్మణ్యగురుకులుగారు
౨౯ పుణ్యకోటి సోమసుందరగురుకులుగారు

నెల్లూరు జిల్లా.

౩౦ నూతలపాటి వెంకటనారాయణగురుకులుగారు
౩౧ మామిళ్లపల్లి శివరామదీక్షితులుగారు

3౨ పెనుమూడి హనుమంతరావుగారు
33 పొన్నూరు రామయ్యగురుకులుగారు

౫. శ్రీకంఠభాష్యాది మతగ్రంథములలోనినికి విషయములను సర్వులు గ్రహించులాగున ఆయా దేశభాషలలో తర్జుమాచేసి ప్రకటించుటకీ సభవారు నిశ్చయిుచుచున్నారు.

ఉ॥ చిలుమూరు పురుషోత్తమగురుకులుగారు
ఆ॥ అయలూరు కామేశ్వరిగురుకులుగారు

౬. స్వసూత్రమగు బోధాయనమును అధికసంఖ్యాకులభ్యసించుటకీ సభవారు శాసించుచున్నారు.

ఉ॥ పాలూరు శివసుబ్రహ్మణ్యగురుకులుగారు
ఆ॥ చంద్రమౌళి సూర్యనారాయణదీక్షితులుగారు

౭. మతపోషణకు మూలకందమై నడచుచున్న శ్రీఆదిశైవ పత్రికారాజమును సర్వులు ఆదరించి శాశ్వతముగా నిలుపుటకు ప్రతి సోదరుడును చేయూత లొసంగుటకీ సభవారు హెచ్చరించుచున్నారు.

ఉ॥ పండిత విద్వాన్. సుబ్రహ్మణ్యదీక్షితులుగారు
ఆ॥ కొల్లిపర వీరయ్యగారు
అయలూరు రామశాస్త్రులుగారు
బ్రహ్మశ్రీ రామనాథశాస్త్రిగారు (స్మార్తులు)

౮. ఆంధ్రరాష్ట్రీయాదిశైవ యువజన సంఘమును అఖిల భారత యువజనసంఘముగా నొనరించుటకై శీఘ్రకాలమున ప్రతిజిల్లా యందును ఆదిశైవ యువజన సంఘమును స్థాపించి స్వసంఘాభ్యున్నతిని గావించుట కీ సభవారు హెచ్చరించుచున్నారు.

ఉ॥ చిలుమూరు పురుషోత్తమగురుకులుగారు
ఆ॥ మురికిపూడి రాఘవశర్మ, భద్రయ్యగార్లు

౯. శైవధర్మ వ్యతిరేకముగా ఆదిశైవు లెవ్వరును వర్తింపరా దని యీ సభవారు శాసించుచున్నారు.

ఉ॥ పండిత సుబ్రహ్మణ్యదీక్షితులుగారు
ఆ॥ చిలుమూరు పురుషోత్తమగురుకులుగారు

౧౦. శ్రీకంఠమఠాధిపత్యము వహించి మతసంరక్షణ గావింపుచూ లోక పర్యటన మొనరించుటకు శ్రీబోధానంద మహర్షులవారిని యీ సభవారు ప్రార్థింపుచున్నారు.

ఉ॥ దొంతుకుర్తి పాపయ్యగారు
ఆ॥ అయలూరు కామేశ్వరిగురుకులుగారు
ఆ॥ కొల్లిపర వీరయ్యగారు
ఆ॥ గంగాధరదీక్షితులుగారు
ఆ॥ సుందరదీక్షితులుగారు
చిలుమూరు పురుషోత్తమగురుకులుగారు

౧౧. యీ క్రింది మహాశయులను ప్రథమ సంవత్సర పంచాయతీదార్లుగా (శ్రీ స్వాములవారి యాజ్ఞానుసారముగా వర్తించి) కార్యక్రమము జరుపుటకు యీ సభవారు నిశ్చయించుచున్నారు.

౧ శ్రీకంఠం విశ్వనాథం కామేశ్వరిగార్లు
౨ యలమంచిలి సుబ్రహ్మణ్యంగారు
౩ కొత్తలంక విస్సన్నగారు
౪ విలపర్తి అమ్మిరాజుగారు
౫ ఉండి రాజన్నగారు
౬ కాళ్లకూరు అచ్చన్నశాస్త్రిగారు
౭ పూజ్యం విశ్వనాధశాస్త్రిగారు
౮ బాదంపూడి బుచ్చయ్యగారు
౯ పూజ్యం శంభయ్యగారు

వివిధోపన్యాసములతోడను అధ్యక్షుని అంత్యోపన్యాసముల తోడను వందనములతో సభ జయప్రదముగా ముగింపబడెను.

శ్రీకంఠమఠం,
కోటిఫలి.
గోదావరి జిల్లా

ఇట్లు,
బాదంపూడి బుచ్చయ్య
మానేజర్లు.

శ్రీ ఆచార్యాపి ప్రతిష్ఠావిజయం. శ్రీకంఠమఠం. కోటిఫలి
( ఆదిశైవ సత్రమునందు )

శ్లో॥ యదాయదాహి ధర్మస్యగ్లానిర్భవతి భారత । అభ్యుత్థానమ ధర్మస్యతదాZత్మానం సృజామ్యహం॥ ఈశానస్సర్వ విద్యానా మీశ్వరస్సర్వభూతానాం బ్రహ్మాధిపతిర్బ్రహ్మణోధిపతిర్బ్రహ్మ శివోమేఅస్తుసదాశివోం"

"సదాశివసమారంభాం శ్రీకంఠాచార్యమధ్యమాం । అస్మదా చార్య పర్యంతాంవందే గురుపరంపరాం"
ప్రతిష్ఠలు.

శ్రీమన్నిగమాగమ పారావారపారీణ పరమహంస పరివ్రాజకా చార్య సర్వతంత్రి స్వతంత్రివైదిక శైవసిద్ధాంత స్థాపనాచార్య వామ దేవఋషి సంప్రదాయప్రవర్తక ఆమర్దికగిరిశాఖా శ్రీవారాణాసీక్షేత్ర మణికర్ణికామఠాధీశ్వర, జగద్గురు, శ్రీశ్రీకంఠశివదేశికేంద్రి పరంపరా ప్రాప్తప్రసిద్ధ నైష్ఠికవర్య విశ్వేశ్వరశివాచార్య ప్రధానశిష్య శైవ సన్యాసనిష్ఠానిష్ణాత సదాశివశివాచార్య గురుశిష్యప్రశిష్య శివానందసర స్వతీస్వామిశిష్య సిద్ధాంతభాష్య రాద్ధాంతనిర్ధారణసార్వభౌమ శ్రీమద వధూతబోదానంద సరస్వతీయతీంద్రుల వారి సమక్షమున శైవా ద్యాగమ పంచాననేత్యాది బిరుదాంకితమైసూరు ముజరాయిఖిలాఖా ఆగమపండిత బ్రహ్మశ్రీ నందీశ్వరదీక్షితుల వారి యాధ్వరమున శ్రీముఖనామసంవత్సర జ్యేష్ఠ శు ౧ గురువారం సంకల్పముగా శు ౫

సోమవారం స్థాపనగా శ్రీదూర్వాస శ్రీకంఠశివాచార్య కేదార శివాచార్య శ్రీచక్రి చంద్రిమౌళీశ్వర ప్రతిష్ఠలు. శ్రీవుండి రాజన్న గారిచే నిర్మింపబడిన శ్రీకంఠమఠమునందు జయప్రదముగా జరిగినది.

ప్రతిష్ఠకు దయచేసిన యితర మండల వాసులు.

శ్రీమాన్ న్యాయ్య వేదాంత ప్రవర్తక పాలూరి శివసుబ్రహ్మణ్య గురుక్కళ్ వారు, కాంచీపురం, చెంగల్పట్టు జిల్లా ద్రవిడదేశము.

,, ఆగమిక నందీశ్వరదీక్షితులవారు మైసూరు ముజరాయి యిలాకా ఆగమపండితులు. బెంగుళూరు కన్నడదేశము.

,, ,, సుందర దీక్షితులవారు (సకుటుంబముగ) ,, ,,

,, ,, సుబ్రహ్మణ్యదీక్షితులవారు (సకుటుంబముగ)హలసూరు ,,

,, ,, సుబ్రహ్మణ్యదీక్షితులవారు హలసూరుపేట ,,

,, ,, నంజుండదీక్షితుల వారు (సకుటుంబముగ) రామసముద్రం.

,, ,, రామయ్యగారు (సకుటుంబముగ) ఉప్పరపల్లి, శ్రీనివాస పురం తాలూకా, కోలారుజిల్లా.

,, ,, విద్వాన్ స్థానికం సుబ్రహ్మణ్యదీక్షితులవారు (సకుటుంబ ముగ) పుంగనూరు చిత్తూరుజిల్లా ,, ,,

,, ,, వాలేశ్వర దీక్షితులవారు (సకుంబముగ) ,, ,,

,, ,, గంగాధర దీక్షితులువారు శివగంగ, బెంగుళూరు జిల్లా

,, ,, కాళప్పదీక్షితులువారు గూళూరు. ,, ,,

,, కొత్తలంక సూర్యనారాయణమూర్తిగారు విశాఖపట్టణం.

,, తులగాపు నరసింహంగారు విజయనగరం.

,, వెలవలపల్లి సత్యనారాయణ శాస్త్రిలవారు అనకాపల్లి.

,, ఈవెంకటేశ్వరదీక్షితులవారు, సాలూరు.

,, కొల్లిపర వీరయ్యగారు, చివలూరు, గుంటూరుజిల్లా.

,, చిలుమూరు పురుషోత్తమ గురుక్కళ్ వారు ,, (ఆదిశైవక్షత్రికాధిపతులు, చిలుమూరు.

శ్రీమాన్ నాగలింగం సుబ్బయ్యగారు, పొన్నూరు
,, పెనుమూడి హనుమంతరావుగారు, తెనాలి
,, సోమరాజుపల్లి మూలయ్య శాస్త్రిలవారు, నందివెలుగు
,, పొన్నూరు రామయ్యగురుకులుగారు, బ్రాహ్మణకోడూరు.
,, పోగుల రుద్రయ్యగారు.
,, మామిళ్లపల్లి శివరామదీక్షితులుగారు, చుండూరు
,, స్వర్ణ వెంకటశివావధానులుగారు, బూతుమల్లి.
,, చావలి శివరామపాకయాజిగారు (సకుటుంబముగ) చావలి.

యింకా విశాఖపట్టణం గుంటూరు మండలములోని మరికొంత మందియు కలరు.

యాజ్ఞికులు జపితలు.

శ్రీమాన్ ఆగమిక నందీశ్వరదీక్షితులవారు, అధ్వర్యులు, బెంగుళూరు.
అయిలూరి రామశాస్త్రిలు, ఉపాధ్వర్యులు, అర్ధవరం
,, చంద్రమౌళి సూర్యనారాయణదీక్షితులవారు బ్రహ్మ పేరూరు.
,, అయిలూరి కామేశ్వరిగురుక్కల్, సాధకాచార్య మంజవరపుకొట్టు.
,, పూజ్యం గంగాధరదీక్షితులవారు మూర్తిపులు వల్లూరుపల్లి అగ్రహారం.
,, యీ రామశాస్త్రిలవారు ,, గన్నవరం
,, నారాయణావధానులుగారు ,, జువ్వలపాలెం
,, వెలవలపల్లి సత్యనారాయణశాస్త్రిలవారు ,, అనకాపల్లి
,, కొత్తలంక కామశాస్త్రిలవారు ,, గుమ్మలూరు
,, చంద్రమౌళి పంతులుగారు ,, వేడంగి
,, అయినవిల్లి నాగేశ్వరదీక్షితులవారు ,, మండపేట

శ్రీమాన్ న్యాయవేదాంతప్రవర్తక, పాలూరి శివసుబ్రహ్మణ్య గురు
కక్కళ్ వారు, భాష్యపారాయణ
„ ఆగమిక గంగాధరదీక్షితులవారు, సప్తశతి
„ మానేపల్లి లక్ష్మీనారాయణావధానులుగారు, వేదపారాయణ
„ రాజోలు సత్యనారాయణావధానులుగారు, వేదపారాయణ

మరికొందరు ఇతర పారాయణులు.

కార్యక్రమము:-

జ్యేష్ఠశు౧ సోమవారం ఉదయం దీక్షాప్రవేశము. ఆ మధ్యాహ్నము శ్రీమాన్ శివసుబ్రహ్మణ్య గురుకక్కళ్ వారు శైవవిశిష్టాద్వైత మతమునుగుఱించియు, తన్మతప్రవర్తకమగు శ్రీ శ్రీకంఠభాష్యమునుగురించియు విపులముగా మృదుమధురశైలితో సంస్కృత భాషలో ఉపన్యసించిరి. ఆంధ్రానువాదకులు విద్వాన్ స్థానికం సుబ్రహ్మణ్యదీక్షితులవారు, పుంగనూరు శు౨ జయవారం ఉదయం మొదలు మధ్యాహ్నం రెండుగంటలవరకు వాస్తుపూజాది బింబశుద్ధ్యంతక్రియా కలాపము. తదుపరి, విద్వాన్ స్థానికం సుబ్రహ్మణ్య దీక్షితులవారు పీఠము, పీఠాధిపతులు. సూత్రము, భాష్యము, విద్యాపీఠము, మున్నగు విషయములనుగురించి, స్ఫుటాక్షరములతో సంస్కృత భాషలో చక్కగా ఉపన్యసించిరి.

అనువాదకులు, చంద్రమౌళి సూర్యనారాయణశాస్త్రిలు
గారు, సాకురు

శు౩బుధవారం ధాన్యాధివాసము. శు౪గురువారం అహోరాత్రప్రయోగము, ఈరెండురోజులును శ్రీమాన్ ఆగమిక నందీశ్వర దీక్షితులవారి యాజమాన్యమున ఆంధ్ర ద్రవిడ కర్ణాటక సంయుక్త ఆదిశైవ సమావేశమునందు శ్రీమాన్ చిలుమూరు పురుషోత్తమ గురుకక్కళ్ గారు, కొల్లిపర వీరయ్యగారు మొదలగు సాంఘికుల యభి

ప్రియానుసారముగా మఠము, గురుపీఠము, విద్యాపీఠము మున్నగు
సంస్థలయొక్క చిరస్థాయిత్వమునకు కొన్నితీర్మానములు సర్వజనా
మోదములతో గావింపబడినవి.

శుగి శుక్రవారం మూర్తిస్థాపనలు, కళాన్యాసములు, పూర్ణా
హుత్యంతక్రియాకలాపము, దూరభారమని యూహించక ప్రయప్రయా
సలకోర్చి, ద్రవిడ, కన్నడ, ఆంధ్రదేశములనుంచి దయచేసి కార్య
ప్రణాళికను నిర్విఘ్నముగ నెఱవేర్చి, యికముందు నెఱవేరుటకుఁదగిన
యభిప్రాయములనిచ్చిన యాదిశైవపండితులకు అభివందనములతో
ఆరాత్రి సభముగింపబడెను.

ప్రత్యేకాభిప్రాయములు:-

శ్రీమాన్ ఆగమిక సందీశ్వరదీక్షితులవారు వారివద్దనున్న
ముద్రితాఽముద్రిత గ్రంథరాజి, నీపీఠమునకు చేర్పించెదమని వాగ్దాన
మొసగుట.

శ్రీమాన్ న్యాయవేదాంతప్రవర్తక, పాలూరు శివసుబ్రహ్మణ్య
గురుక్కళ్ వారు శ్రీనాటకోటిశెట్లయొక్క సహాయముపంయిన యీ
సంస్థలయొక్క చిరస్థాయిత్వమునకుఁ గడంగుదమని యభయమొసగుట.

శ్రీమాన్ గంగాధర దీక్షితులవారు "యీసంస్థలనుగుఱించి
మావలన యేసహాయము కావలసినను ఉత్తర ప్రత్యుత్తరముల
మీదనే ఆసహాయమునకు సంసిద్ధులమై యున్నాము"అని వాగ్దాన
మొసగుట.

శ్రీమాన్ చిలుమూరు పురుషోత్తమ గురుక్కళ్ వారు తాము
చేయుచున్న పత్రికారూపమగు సంఘసహాయము కాకుండా యీ
సంస్థనిమిత్తమైన పర్యటనమునకుఁగూడ మిగుల సాయపడెదనని సదభి
ప్రాయమిచ్చుచూ శ్రీ శ్రీకంఠభాష్యమును ఆచార్యసన్నిధిలో
సమర్పించి ధన్యులైరి.

విరాళములు:-

శ్రీమాన్ కొల్లిపర వీరయ్యగారు మఠమునకుచుట్టును, గజ మున్నర వెడల్పుగల డాబాను వెంటనేతాము నిర్మించుటకు వాగ్దాన మొసగినారు.

పూజ్యం బుచ్చమ్మగారు ఈదరాడ. రు 100—0—0 విద్యానిధికింద శాశ్వతవిరాళ మొసంగెదనని వాగ్దానముచేసి, ఏతత్ప్రతిష్ఠా సమయమున రు50—0—0లు దయచేసినారు.

తులగాపు నరసింహంగారు, యేపనికైనను సరేయని రు50-0-0లు విరాళ మొసగినారు.

పెదపూడి రత్నమ్మగారు, కొమ్ముచిక్కాల, విద్యానిధికై రు100—0—0 శాశ్వతవిరాళము వాగ్దానముచేసి ప్రస్తుతం అందుపై రాగలవడ్డీని సాలు 1కి రు12—0—0లుగా ఇచ్చెదనని వాగ్దానము చేసినారు.

అచ్చటికిదయచేసిన సాంఘికులలో రోజు 1కి రు6—0—0లు చొప్పున ఇప్పించెదమనినవారు 60మంది కలరు.

వేదశాస్త్రపాఠశాల.

ఆంధ్రదేశమంతయు పర్యటనముచేసి తత్ఫలానుసారముగా, వేదశాస్త్రపాఠశాలగాని, వేదపాఠశాలగాని నాలుగుమాసములలో శ్రీకంఠ మఠమునందు ప్రారంభింపబడగలదు.

సమయాది దీక్షలు.

ఈసమయముననే శ్రీమాన్ ఆగమిక నందీశ్వర దీక్షితుల వారి యాధ్వర్యమున ఆచార్యాభిషేకదీక్షను పొందినవారి పవిత్ర నామముల నిటఁ బొందుపఱచుచున్నాము.

1 వెలవలపల్లి వెంకటేశ్వరదీక్షితులవారు, సాలూరు
2 యీా సత్యనారాయణశాస్త్రిలవారు, అనకాపల్లి

3 మానేపల్లి లక్ష్మీనారాయణావధానులుగారు, రాజోలు
4 శ్రీకంఠం రామమూర్తిగారు, ముక్తేశ్వరం
5 పూజ్యం విశ్వనాథశాస్త్రిలుగారు, ఆదుర్రు
6 యీ జగన్నాథంగారు, ఉదరాడ
7 మంచిలి జగన్నాథంగారు, ఆగర్రు
8 మొవ్వ వెంకటాద్రిమశాస్త్రిలుగారు, ఆకువీడు
9 అయిలూరి నీలకంఠ శాస్త్రిలు, అర్థవరం
10 పుల్లేటికుర్తి సుబ్బరాయశర్మ, కాళ్లకూరు
11 చంద్రమౌళీ శేషయ్యగారు అల్లవరం
12 బాదంపూడి వీరభద్రయ్యగారు, పరిమెళ్ల
13 అయిలూరి వెంకటశాస్త్రిలుగారు, ముంగండఅగ్రహారం
14 కొత్తలంక మృత్యుంజయుడుగారు, కొమరగిరిపట్నం
15 దొంతుకుర్తి నారాయణమూర్తిగారు, అప్పనపల్లి
16 స్వర్ణ వెంకటశివావధానులుగారు, బూతుమిల్లి
17 సోమరాజుపల్లి మూలయ్యశాస్త్రిలుగారు నందివెలుగు
18 పోగుల రుద్రయ్యగారు ,,
19 మురికిపూడి భద్రయ్యగారు ,,
20 యీ నాగభూషణంగారు ,,
21 నాగలింగం సుబ్బయ్యగారు, పొన్నూరు
22 పొన్నూరు రామయ్యగారు, బ్రాహ్మణకోడూరు
23 పావులూరి నాగేశ్వరశర్మగారు, అనంతవరం
24 యలమంచిలి వీరయ్యగారు, కొత్తపేట
25 కాళ్లకూరి సత్యనారాయణమూర్తిగారు, పూలపల్లి
26 అయిలూరి సూర్యనారాయణమూర్తిగారు, అంతర్వేది
27 కాళ్లకూరి మల్లన్నగారు, కుండలేశ్వరం
28 మానేపల్లి శివన్నారాయణగారు, మోడేకుర్రు
29 వెలవలపల్లి సూర్యనారాయణమూర్తిగారు

30 చంద్రమౌళి శివోత్తమ శివాచార్యులుగారు, పేరూరు
31 చావలి శివరామయ్యగారు, చావలి

విశేషదీక్షకు 20మంది. సమయదీక్షకు పురుషులు 40, స్త్రీలు 30.

జయంతి:-

బ్రహ్మశ్రీ మహామహోపాధ్యాయ దండపాణి దీక్షితులవారు యీప్రతిష్ఠకు దయచేసెదమని వాగ్దానమిచ్చి "శరీరాస్వస్థతచే ప్రస్తుతము రాజాలకపోతిమి" అని వ్రాయించిన పుత్తరములకు విచారము కలిగినను ముందు శ్రీకంఠజయంతికి దయచేయగలర నే ప్రత్యుత్తరమున కానందము వెంటనే సాంఘికహృదయపీఠికల నలంకరించినది.

ఆదిశైవపత్రిక:-

ఈమతపత్రిక బయలువెడలిన నాటగోలె ఆంధ్ర, ద్రవిడ కన్నడదేశములలో ప్రచార మొనర్చి యీ ఆచార్యప్రతిష్ఠా సంయుక్త సమావేశములకు కారణమై విలసిల్లినది. ఈసమయమున, మనమీ పత్రికారాజమును శయనింపజేసినచో మనమును శయనించవలసిన వారమేయగుదుము. ఇంతదనుక సహాయమొనర్చినట్టియు ఇప్పుడు చేయూత నొసగుచున్నట్టియు, ఇకముందున కాధారము కాగలిగినట్టియు, యావతాదిశైవసంఘము నేకముఖముఁ జేయగలిగిన యీ పత్రికామతల్లియొక్క పోషణ మనచేతులలోనే యిమిడి యున్నది. గాన పత్రికాధిపతులయొక్క లేఖనికి వ్యాసరచనా కుతూహలమునకే తావొసంగవలయును, గాని పత్రికాపోషణ భారప్రకటనలకు మొలబోవునట్లుజేయు తక్కువపని యాదెస కనుపించకుండునట్లు జేయుటకు సాంఘికులనుగుఱించి యమ్మాటికిని మాప్రార్థన.

సాంఘికులు:-

ఈప్రతిష్ఠకు, ఆంధ్ర, ద్రవిడ, కన్నడ దేశములనుండి దయచేసిన యాదిశైవులయొక్క మొత్తముసంఖ్య షుమారు 1000.

ఆహ్వానసంఘము:-

ఈప్రతిష్ఠకుదయచేసిన మహాశయులనందరిని, యతిమెలకువతో యాదరించిన యీయాహ్వానసంఘము వారెంతయు యభినందనీయులు.

మా అభిప్రాయము:-

జగద్గురు శ్రీమదవధూత బోధానందమహర్షులవారి యను గ్రహలేశమున పునరుద్ధరించబడిన ప్రాచీన, వేదవిహిత, శైవవిశిష్టా ద్వైత భాష్యకర్తయగు శ్రీ శ్రీకంఠశివాచార్యులవారియొక్క పీఠ మును, పీఠాధిపతులగు శ్రీమన్నిగమాగమపారావార పారీణేత్యాది బిరుదాంకిత, జగద్గురు పరమహంస పరివ్రాజకాచార్య శ్రీమదవధూత బోధానంద మహర్షులవారిని సేవించి, శ్రీవారివలన శివజ్ఞానామృత మునుగోరి ప్రతిశైవవ్యక్తియు తరించగల సుదినములు చేకూరినవని మాయానందమును వెల్లడించుచున్నాము.

ఇట్లు విధేయులు,

అయిలూరి రామశాస్త్రిలు.

యీ కామేశ్వరగురుక్కళ్.

---

# ప్ర బో ధ ము.

ఆదిశైవ మహాశయులారా!

సృష్టియంతయు పరిణామము జెందుచున్నది. ప్రతిజాతియందును ప్రతి వ్యక్తియందును నూతన జాతీయవికాసము పరిస్ఫుటమగు చున్నది. కాని మన మాదిశైవ సంఘమునందింకను చైతన్యముదయింప లేదు. ఆగమ విజ్ఞానసంపన్నుల చేతను, సద్వైద్య శిఖామణులచేతను, కవీశానులచేతను, శివార్చనా తత్పరులచేతను పవిత్రము గావింపబడిన మన సంఘ మధోగతి పాలగుచున్నది. కాలానుసరణి కట్టుబాట్లు సడలినవి. సంఘము దుర్బలమై నీరసించుచున్నవి. విపరీతము మార్పులుగూడ కలుగుచున్నవి. ఆదిశైవుల హక్కులు హతమొనర్పబడుచున్నవి అర్చక సర్వీసు ఇనాములు శాసనాల

మున కాహుతిగా బడుచున్నది. ఈయిక్కట్టుల నెదుర్కొనుటకు మన వారు విశ్వప్రయత్నములు గావించుచున్నారు. కాని ఫలిత మిసుమంతయు గాన్పించుటలేదు. మున్ముందు మన సాంఘికులకు రానున్న కష్టముల తలపోసిన గుండెలు బ్రద్దలగుచున్నవి. ఈసమయమున మనము ఐకమత్యమును బలపరచుకొని సంఘ రక్షణ జేసికొనని యెడల మన సంఘ మధోగతి పాలగుట నిశ్చయము.

విద్య:—ఐహికా ముష్మిక సాధనమగు విద్య నార్జించుట మానవుని విద్యుక్తధర్మము. అట్టివిద్య నార్జించుటకు మనబాలురకు తగిన సౌకర్యములు లేవు. పట్టణములలో భోజనవసతులు లేవు. ధనాభావముగూడ మన విద్యావిహీనతకు కారణమని చెప్పవచ్చును. ఈసౌకర్యములు ఏ కొలదిమందికో గలవు. అట్టివారు విద్యయొక్క విలువ తెలియమి అజ్ఞానాంధకారమున మునింగి తమ గౌరవము గోల్పోవుచున్నారు. సంఘౌన్నత్యము గోరు సాంఘికులెల్లరు విద్యా ప్రబోధముజేసి తమశక్తికొలది బాలుర విద్యాభివృద్ధికి తోడ్పడవలెను.

పత్రిక:—ప్రపంచమునం దే సంఘముగాని పత్రికాప్రచారము లేక ఔన్నత్యమును బడయజాలదు. ప్రస్తుతము మన సంఘమునగూడ నొక పత్రిక ప్రారంభింపబడి ప్రచారమందున్నను సాంఘికుల యనాదరణచే పత్రికా నిర్వహణము కడుంగడు దుర్భరముగనున్నది. పత్రికా నిర్వహణమునకై సర్వస్వమును ధారవోసి సంఘమున కమూల్యమగు సేవజేయుచున్న శ్రీమాన్ చిలుమూరు పురుషోత్తమ గురుక్కల్ గారెంతయు వందనీయులు. ఆదిశైవులెల్లరు నీ పత్రికాభివృద్ధికి తోడ్పడి సంఘసేవ యొనర్ప ప్రార్థితులు.

సంఘము:—మానవుడు సాంఘీకజీవి. ప్రపంచమునందు సంఘ బలమే బలము. ఘనతర మతకర్తలందరు నిట్టి బోధలనే జేసి యుండిరి. గాంధిమహాత్ముడు హిందూ దేశములోనున్న ప్రజలనందరను నొక సంఘముగ నేర్పరచుటకే ప్రయత్నించుచున్నాడు. సంఘమునకు మూలాధారము సానుభూతి. మనము పూనిన కార్యమును మాత్రమే

గమనించి మనయందు గల భేదముల మరువవలెను. దీనికి స్వార్థత్యాగ మత్యవసరము. దీనినెల్లరు సాధించిరేని సంఘము సుస్థితి నుండగలదు. ఇట్టి సంఘబలము మనకు లేదు. గాన దానిని సాధించుటకు మనము పాటుపడవలెను. లేనియెడల మనసంఘమధోగతి పాలగుట సులభము.

బాలుర మతవిద్యాభి వృద్ధులకు తోడ్పడుటకును, సంఘమునం దైకమత్యము నెలకొల్పుటకును, భావికష్టముల నెదుర్కొనుటకును 'ఆంధ్రరాష్ట్రీయ ఆదిశైవ యువజనసంఘము నెలకొల్పబడినది. ఆంధ్ర రాష్ట్రమునంగల ఆదిశైవ యువతీయువకు లెల్లరు నీసంఘ సభ్యులుగ పరిగణింపబడెదరు. ఆదిశైవులెల్లరు నీసంఘాభివృద్ధికి తోడ్పడ ప్రార్థితులు.

యువక సోదరులారా!!

మనమింతవరకు దుర్బల హృదయులమై నిరాశాప్రవృత్తులతో కాలము వ్యర్థపుచ్చుచుంటిమేగాని, ధైర్యోత్సాహముల బ్రకటించి సంఘాభివృద్ధికి పాటుబడుట లేదు. సంఘమాత నిరుత్సాహులును నిస్సహాయులును నగు సాంఘికులగాంచి విచారించుచున్నది. మాతృ ఘోష నాలించి మిన్నకుండుట శ్రేయస్కరముగాదు. భావికాలపు సంఘౌన్నత్యము మన నాస్తములందిమిడియున్నది. యువజన సహ జోద్రేకముతో మనము సంఘరక్షణకు గడంగుటకు సమయమాసన్న మైనది. కష్టములకోర్చి శరీరముల నర్పించియైన సంఘమాతను సేవింప సమయమువచ్చినది. ఇది అభిప్రాయ భేదములకుగాని పట్టుదలలకుగాని యదనుగాదు. అవకాశమునువ్యర్థపుచ్చి జీవన్మృతులగుటహాస్యాస్పదము.

ఇంతవరకును అభిమానముతో "యువజన సంఘా" భి వృద్ధికై పాటుపడుచున్న యువకులు కొలదిమంది మాత్రమే గలరు. ఆ కొలదిమందికిగూడ హృదయపూర్వకమగు తోడ్పాటులేదు. అస హనమునకును, నిందారోపణకును వారు గురియగు చున్నారు. కొందరు ప్రముఖులు "త్రోయనేర్చు కుక్క దొంతలు బెట్టునా" అను వేమన వాక్యమును సార్థకముజేయుచు, తాము సంఘాభివృద్ధికి పాటు బడకు

న్నను పరిపాలనా వర్గమును విమర్శించుచున్నారు. కొందరిది సంఘ స్థాపన కదను గాదను చున్నారు. మరికొందరు దూరదూరముగ తొలగి చనుచున్నారు. ఇట్టుల యువకుల నిరుత్సాహ పరచుట ఆత్మ వినాశమునకు హేతువులుకాగలవు. ఐకమత్యమును బలపరచుకొని యేకోన్ముఖులమై వర్తింపవలసిన సమయమున వ్యర్థ విభేదములు గల్పించుకొని తొలగిచనుట సంఘహాని యని యెఱుంగుడు. ప్రమత్తతనొందిన అధోగతిపాలగుట నిశ్చయము. దృఢసంకల్పముతో కార్య రంగమున ప్రవేశించుడు. లెండు సంఘమాత నోదార్పుడు. యువజన సంఘాభివృద్ధికై పాటుబడుడు-మేల్కొనుడు.

కొ ప్పో లు
10—6—33.

ఇట్లుమీసోదరుడు,
పి. విశ్వనాథరావు.

---

# వార్తలు.

లోకోత్తర పురుషుండగు శ్రీగాంధిమహాత్ముడు మే 8 తేదీ మొదలు 29 తేదీ వరకు అనగా యిరువదియొక్క రోజులు ఉపవాస మొనరించి దైవానుగ్రహమువలన నిరసనవ్రతము పూర్తి చేయగలిగిరి. ఎందులకీ వ్రతమాచరించినది తెలియకున్నది. తత్ఫలితార్థముగా దేశ మునందు అస్పృశ్యతా నిర్మూలన ప్రచార మతితీవ్రముగా జరుగు చున్నది. కాలస్వరూపుండగు భగవానుని యాజ్ఞాప్రకారం లోకపరి వర్తనము జరిగి నూతన ఆచార సాంప్రదాయములు స్థాపింపబడు చున్నవి. పరమేశ్వరుని యాజ్ఞల తిరస్కరించుట కెవరు సాహసింప గలరు.

సి. రాజగోపాలాచారిగారి కుమార్తెను గాంధిగారి కనిష్ఠ పుత్రునికిచ్చి వివాహముజేయ నిశ్చయించిరి. బహుశ జరిగివుండ వచ్చును. వధువునకు 20 సంవత్సరములు. వరునకు 33 సంవత్సరములు.

వర్ణాశ్రమ ధర్మపరాయణులగు సనాతన మహాశయులు పండిత సభలు విశేషముగా జరిపి అస్పృశ్యతా నిర్మూలనమునకు ప్రతిఘటించి పూర్వాచారముల సంరక్షించుటకు పాటుబడుచున్నారు. భగవదనుగ్రహ మెట్లుండునో తెలియగలదు. ఇది విషపరీక్షా తరుణము. ధర్మవ్యవస్థ నూతనాకారములతో విశ్వరూప సందర్శనము జేయుచున్నది.

ధర్మశాస్త్రిలు అహోరాత్రములందును, పరిశీలింపబడుచున్నవి. ప్రతిగ్రామమునందును, కలవరము బయలుదేరి, ఐకమత్యమునకు శాంతికి భంగకరము గావింపబడుచున్నది.

---

శ్రీ కృష్ణా పుష్కర సంచిక.

Regd. No. M. 2073.        సం॥ర చందా రు 3-0-0 లు.

# శ్రీ ఆదిశైవ పత్రిక.



శ్రీ శ్రీకంఠ మఠాధిపతుల యాజ్ఞానుసారముగా, శైవసంఘాభ్యుదయమునకై శ్రీ గురుకులాశ్రమమునుండి ప్రతిమాసము ప్రకటింపబడును.

సర్వదేవాత్మకో రుద్రస్సర్వే దేవాశ్శివాత్మకాః ।
రుద్రస్య దక్షిణే పార్శ్వే రవిర్బ్రహ్మా త్రయోఽగ్నయః ।
వామపార్శ్వే ఉమాదేవీ విష్ణుస్సోమోఽపి తేత్రయః ॥
(రుద్రహృదయోపనిషత్)

సంపాదకుడు:— చిలుమూరు పురుషోత్తమ గురుక్కళ్.

| సంపుట | చిలుమూరు. | సంచిక |
|---|---|---|
| ౯ | శ్రీముఖనామ సం॥ ఆషాఢ, శ్రావణ మాసములు | ౪-౫ |

(విలేఖకుల వ్యాసములకు సంపాదకులు ఉత్తరవాదులు కానేరరు.)



## విషయసూచిక



భారతీ ముద్రాక్షరశాల, తెనాలి.

# మహారాజపోషకులు.

[సంవత్సరమునకు ఆరురూపాయలు చెల్లించవలెను.]

౧ రాజవైద్య నాగలింగం నందయ్య అండుసన్సువారు ఆయుర్వేదభవనం అమృతలూరు

౨ శ్రీమాన్ కొల్లిపర వీరయ్యగారు, చివ్వలూరు.

౩ ... కంఠంరాజు వెంకటసుబ్బయ్యగారు, భట్లపల్లి అగ్రహారం.

౪ ... చావలి వాలయ్యగారు, పెదరావూరు.

౫ ... స్వర్ణ సుబ్బయ్యగారు, పాండ్రాక.

౬ ... గూడూరు లక్ష్మయ్యగారు, వెణుతురుమిల్లి.

౭ ... ఆగమిక నంజుండ దీక్షితులుగారు, రామసముద్రము.

౮ ... పసుమర్తి పార్వతమ్మగారు, కూచిపూడి.

౯ ... వెలవలపల్లి వెంకటేశ్వరదీక్షితులుగారు.

# రాజపోషకులు.

[సం॥రం 1కి రు 5 0 0లు.]

౧ ఆగమిక వాలేశ్వరదీక్షితులుగారు, పుంగనూరు.

౨ శ్రీమాన్ చావలి దుర్గాప్రసాద దీక్షితులుగారు, తరిగొప్పుల.

౩ ... యలమంచిలి సుబ్రహ్మణ్యంగారు, వెదురుపాక.

౪ ... గూడలి రామయ్యగురుకులు, చినమాంభట్ల అగ్రహారం.

౫ శ్రీమతి ఇంకొల్లు అన్నపూర్ణమ్మగారు, (తాలూకాబోర్డు మెంబరు) ప్రత్తిపాడు.

౬ శ్రీమాన్ S. రామప్పగారు, (కరణం) ఉప్పరపాలెం.

# పోషకులు.

(సం॥రం 1కి రు 4-0 0)

౧ శ్రీమాన్ వడ్లమూడి కోటయ్యగారు, వడ్లమూడి.

౨ ... నూతలపాటి వెంకటనారాయణ గురుకులుగారు, వరకవిపూడి.

౩ ... చావలి పిచ్చయ్యశర్మగారు, చాటపర్రు.

౪ ... S. A. నంజుండయ్యగారు, శిరస్తాదారు, పుంగనూరు,

౫ ... ఉయ్యాలవాడ మునెయ్యగారు, భండ్యాత్మకూరు.

౬ ... ఆగమిక సుబ్రహ్మణ్యదీక్షితులుగారు, బెంగుళూరు.

౭ ... కొల్లిపర వెంకటసుబ్బయ్యశర్మగారు, అమ్మనబ్రోలు.

౮ ... నాగలింగం సత్యనారాయణగారు, డాక్టర్, మూలుపూరు.

౯ ... చుండి ఆనందరాయుడుగారు, రూపెనగుంట.

౧౦ ... ఆగమిక చంద్రశేఖరదీక్షితులుగారు, చౌడేపల్లి.

౧౧ ... S. A. అగస్త్యప్పగారు, చారాల.

౧౨ ... మురికిపూడి వెంకటేశ్వర్లుగారు, వల్లభాపురం.

౧౩ ... చావలి చంద్రయ్యగారు, పెరవలి.

౧౪ ... కూర్మగిరి శేషమ్మగారు, పాకవీడు.

# శ్రీ ఆదిశైవపత్రిక.



ఏకోరుద్రస్స ఈశానస్సభగవాన్ సమహేశ్వరస్స మహాదేవః ॥
"అధర్వశిరసి"


| సంపుట | చిలుమూరు | సంచిక |
| --- | --- | --- |
| ౯ | శ్రీముఖనామ సం॥ ఆషాఢ-శ్రావణ మాసములు. | ౪-౫ |


## ప్రార్థన.

(శ్రీయుతులు చిట్టాప్రగడ సీతారామాంజనేయులుగారు)

ఉ॥ ఎదివచ్చునా, ఎదిపోవు నెయ్యదిట రానేరాదో పోఁబోరా, అ
యెద్ది కన్గొన్నమహామహులు౦డె భవదుద్యత్పాద పంకేరుహా
భ్యుదయాస్తోకరసైక పానజనితామోదైక్య చిద్భావనా
స్పదసింహాసనమెక్క నర్హుడగు దేవాభక్తమూర్తీ శివా.

శ్లో॥ నమస్తే నమస్తే మహాదేవశంభో నమస్తే నమస్తే ప్రసన్నైకబంధో
నమస్తే నమస్తే దయాసారసింధో నమస్తే నమస్తే నమస్తేమహేశ.

---

## సంపాదకీయములు.

గమనింపు.

---

శ్రీగవర్నమెంటువారి ఆర్డరు రానందువలనను, పోష్టల్ డిపార్టుమెంటువారు మన పత్రికను రిజష్టరుచేసుకొనజాల నందునను, శ్రీవారి డిక్లరేషను మున్నగు చిక్కులలో దగుల్గొనియుండుటచే

ఆషాఢ శ్రావణమాసములు కలిపి ప్రకటించినందులకు పాఠకుల
క్షమింప ప్రార్థితులు. అన్నిచిక్కులు ఒక్క తరుణముననే సంభవించుట
వలన మాశ్రమను గురించి వ్రాయజాలనంతటి స్తితిలోయున్నాము

ఆర్థికస్థితి.

మామూలునకు భంగములేకుండగనే జరుగుచున్నదని విన్న
వించుచున్నాము. ఎక్కువగావ్రాసినచో చదువరుల కాగ్రహముగల్గ
నేమోయని భీతితో విరమించితిమి. పరమేశ్వరుని యనుగ్రహమే
మాకు శరణ్యము. పత్రికావిషయము గమనించువారే అరుదైనప్పుడు
ఆర్థికస్థితి విషయము విచారించలేదనుట హాస్యాస్పదముగాదా.

మనవి.

వ్యాసములలో సవరణచేయవలదనియు అట్లొనరించుట వి
ఖరులకు గౌరవముగాదని కొందరు తలచుచున్నట్లు తెలియుచున్నది.
సంఘాభిమానమున నట్లుగావించియుండినచో అట్టి స్వల్పవిషయమును
మనస్సులో నుంచుకోరాదని ప్రార్థించుచు మామూలుగా వ్యాసము
లను బంపగోరుచున్నాము. మావలన గలిగెడిలోపములు దెలిపినచో
సవరించుకొనుటకు సిద్ధముగా యున్నాము. కార్యభారము వహించు
వారికి లోపములు పొరపాట్లు సంభవించుట సహజమేయని మనవి
చేయుచున్నాము. దూషణభూషణ తిరస్కారములే ప్రధానముగా
నెంచువారు సంఘసేవ చేయగలరా!

శ్రీ శ్రీకంఠ శివాచార్యస్వాములవారు.

మహర్షి బోధానంద సరస్వతీయతీంద్రులవారిని ఇంతటనుం
శ్రీ శ్రీకంఠమఠాధిపతులనియు జగద్గురు శ్రీ శ్రీకంఠ శివాచార
స్వాములనియు వ్యవహరింపబడును. గావున సర్వులు ఈ విషయ
మును జ్ఞాపకముంచుకొని శ్రీవారి నాహ్వానించుచు సేవించగలం
లకు హెచ్చరించుచున్నాము.

శ్రీవారు ప్రస్తుతము కాశీమహాక్షేత్రమునందే యున్నారు. భాద్రపదమాసమునందీ ప్రాంతములకు విజయముచేసి మైసూరు బెంగుళూరునకు దయచేయుదురని విన్నవించుచున్నాము.

సానుభూతి.

మన పత్రికోద్ధారకులలో నొకరైన గుంటూరుజిల్లా మంగళగిరి వాస్తవ్యులును ప్రస్తుతమున నవులూరునందు నివసించు సుప్రసిద్ధ సంగీతాయుర్వేద పండితులును విశేషించి సంఘాభిమానులునగు శ్రీమాన్ సంగాపు పానకాలయ్యగారు యీ ఆషాఢ శుద్ధ విదియా భానువారమునందు శివసాయుజ్యపదవి నలంకరించిరని మాకుదెలియ గనే మిక్కిలి విచారించితిమి. శ్రీవారు సత్యధర్మమార్గ ప్రవర్తకులై నిష్కల్మషమూర్తులై నిర్వ్యిచార పరాయణులై నిత్యానంద నిమగ్నులై తన జీవితమును వెళ్లబుచ్చుకొని సిరిసంపదల భార్యాపుత్రాదుల బంధుమిత్రులనెల్లర విడనాడి భగవదనుగ్రహప్రాప్తులై దివమలంకరిం చుటచే విఖ్యాత పురుషులని దలంచవలెను. ఇట్టి సత్పురుషుల గోల్పోవుటచే మన సంఘమునకు కొంతకొరతగలిగినదనుట సత్యము. పరమేశ్వరుడుడీ మహామహుని యాత్మకు శాంతి ప్రసాదించుగాత. శ్రీవారి కుటుంబమునకు మాసానుభూతి నందజేయుచున్నాము.

(ఆ॥ శై॥సం)

దేవీయజ్ఞ పత్రిక.

సదరు యాగపత్రికను స్థలాంతరమున ముద్రించితిమి. పరిశీలించి సర్వులు అభిమానించి సహాయమొనరించి యజ్ఞమును పూర్తిచేయించ హెచ్చరించుచున్నాము.

ఆంధ్రభూమి.

మదరాసునుండి శ్రీయుతులు ఆంధ్ర శేషగిరిరావు పంతులు గారి సంపాదకత్వమున నూతన మార్గముతో ప్రచురించుచున్న పై

మాసపత్రిక రెండవసంచికను వందన పురస్సరముగా సందుకొని యందలి సద్విషయముల పఠించి యానందించితిమి. ప్రతి ఆంధ్రుడును పరిశీలింపదగిన పత్రిక. అనేక పండితులచే చక్కని వ్యాసరాజములు వ్రాయబడుచున్నవి. సంవత్సరచందా మూడురూపాయిలు. వలయు వారు సంపాదకులకు వ్రాయవలెను.

---

## యీ నెలలో ద్రవ్యసహాయ మొనరించిన వారు.

౧ శ్రీమాన్ ఆగమిక కోటీశ్వర గురుకులుగారు (నిజాంపట్నం) పత్రికాభివృద్ధికై దయచేయించిన మనిఆర్డరు రూ౧౦-౦-౦

౨ శ్రీమాన్ సంగాపు వెంకటప్పయ్య గురుకులుగారు (లోగడచందాలు) (మంగళగిరి) ౬-౦-౦

3 శ్రీమాన్ చావలి పిచ్చయ్యశర్మగారు (శ్రీముఖ) చాటపర్రు ౫-౦-౦

౪ శ్రీమాన్ నూతలపాటి వెంకటనారాయణయ్య (శ్రీముఖ) వరకవిపూడి ౪-౦-౦

౫ శ్రీమాన్ నాగేశ్వరం సుందరశర్మగారు (శ్రీముఖ) శృంగారపురం 3-౦-౦

౬ శ్రీమాన్ పాలపర్తి శంకరయ్యగారు (శ్రీముఖ) ఎరుకపాడు 3-౦-౦

౭ శ్రీమాన్ అయలూరు కామేశ్వర గురుకులుగారు (శ్రీముఖ) ముంజవరపుకొట్టు ౨-౦-౦

౮ శ్రీమాన్ సంగాపు విశ్వనాథంగారు (ఆంగీరస, శ్రీముఖ) ఈమని ౬-౦-౦

### శ్రీకృష్ణాపుష్కరములు.

స్వస్తిశ్రీ శ్రావణ బహుళ విదియ సోమవార ప్రభృతి పుష్కరములు జరుగగలవు. ప్రతివారును తమ తమ శక్త్యానుసారముగా తీర్థశ్రాద్ధాదులు, స్నానదానాదులు గావింపుచూ పితృదేవతలను

ఆనందింపజేయగలరు. ఇట్టి మహత్తరుణమున సంఘాభివృద్ధికై పాటు పడుచున్న పత్రికారాజమునకు సహాయమొనరింప ప్రార్థించుచున్నాము.

శివభక్తప్రతిష్ఠలు.

మంగళాద్రిక్షేత్రమున గావించిన ఆళ్వారుల ప్రతిష్ఠలు కొన్ని మాత్రమే జరిగియున్నవి. నవులూరు అను గ్రామమున య 0-77 ట్ల భూమిని రు 80-0-0 లకు నాయనార్ల పేర విక్రయము పొందబడినది. ఇంకను వేయిరూప్యములవరకు చందాల బాకీలు గలవు. వెంటనే సదరు భక్తమహాజనులు తమ తమ ద్రవ్యములను బంపి ప్రతిష్ఠలు పూర్తిచేయించుటకును, భూమిని సంపాదించుటకును, మరమ్మతు వగైరా కార్యములు పూర్తిగావించుటకును భక్తాగ్రేసర సోదరులను ప్రార్థించుచున్నాను. (కె. వి. డాక్టర్)

---

"ఓంనమః శివాభ్యామ్"

# ఆగమప్రామాణ్యము.

శ్రీమదహీనమహీమండల మండనాయమానంబగు, నీ భరత ఖండంబు వేదవేదాంగాది చతుర్దశ విద్యలకు నాకరంబై సకలకలాకలాప భాసురంబై విశేషించి హృద్యానవద్యాధ్యాత్మికవిద్యా ధర్మశలాకకు, శాణంబై తొల్లి యన్నిదేశములకన్న మిన్నయై చెన్నలరారుచుండు. కాలస్థితినిబట్టి యప్పటి తేజోమహిమ మంతగా లేకున్నను నిప్పటినికి నీ భారతభూమిని శమీవృక్షంబున నగ్నియుంబలె నంతర్లీనమై విరాజిల్లు చున్నదని నొక్కివక్కాణింపవచ్చును. కాలదేశవ్యవహారంబులు లోక పరివర్తనంబునకుఁ గారణంబులయ్యుఁ బ్రాచీన హైందవాచార పరా యణులగు ధీరులు స్వానుష్ఠేయ కృత్యజాతంబుల కెన్నెన్నియంతరా యంబులు వాటిలుచున్నను వానిని సరకుసేయక "ప్రారబ్ధముత్తమ గుణానపరిత్యజంతి" యను భర్తృహరి సుభాషితంబును, మానస

వీధుల నిడుకొని ప్రాచీన ధర్మాచారశాస్త్రపురాణాదులయందు, విశ్వాసముంచినవారై నిగమనిగదితకర్మకలాపంబుల నాదరమేదుర హృదయులై వెలయుచున్నారనుట,మన భరతమాతయని తరసాధారణ మగునను భావాతిశయంబును దెలుపుచున్నది. దేశీయ విద్యలను నుజ్జగించి యవిచారిత రమణీయంబులగు పాశ్చాత్యవిద్యల నారితేరిన వారయ్యును గొందరు భారతీయ మనీషావంతులు తద్విద్యామూలము ననే మన వేదాగమములందలి రహస్యముల నెరింగినవారై తదవలోక నజనితానందతుందిల హృదయారవిందులై యబ్బురపాటు నొందుచూ స్వాచరితాకృత్యసంజనిత ఖేదపూరిత స్వాంతులై విచారపారావారమున మునుకలువేయుచుంటయు ఖండాంతర వాసులచే నకుంఠితోత్కంఠాతి శయంబున నస్మదీయ వేదాగమ విద్యలు పరిగ్రహింపఁబడుచుంటయు వీని ప్రాశస్త్యమును వేనోళ్లఁ గొని యాడుచున్నవి. గావున గాల చక్రంబెన్ని విధంబుల మార్పునొందుచున్నను మన భారతీయులకు సర్వకర్మసాధనములై యైహికాముష్మిక సుఖహేతువులై యొప్పుచున్న వేదాగమాది విద్యలకు నాచంద్రగ్రహతారకంబు న్యూనత వాటిల్లదని చేయెత్తి చెప్పవచ్చును.

మహాశయులారా!

మన భారతీయ విద్యలనన్నింటను వేదాగమ విద్య లివి రెం డును సనాతనములు. భగవత్స్వరూపములు. భగవదాజ్ఞారూపములు ఇహపరలోకసాధనములు పరస్పరసహాయములు అపౌరుషేయములు రెండియు నిరతిశయానంద సంధాయకములు. సకల చరాచరగురువై యొప్పుచున్న యప్పరమేశ్వరుని ముఖారవిందములనుండి జనించినవి. ఏకస్థానాగతంబులైన కారణముననే యివి రెండును పరస్పరా విరుద్ధం బులైయున్నవనియు, సమస్తధర్మజ్ఞానమునకు "వేదోఽఖిలో ధర్మ మూల"మని వేదమెట్లు ధర్మమున కాధారమైనదో యట్లే యాలయ ధర్మజ్ఞానమునకు నాగమములు మూలాధారములైనవని యెరుంగ

వలెను. వెండియు నీయాగమములు కామికాది వాతులాంతములు వేదసారములు. ఎట్లన ఈశ కేనోపనిషదాది సకలోపనిషత్సారభూత తత్వ మసీత్యాది. మహావాక్యార్థసంబంధజ్ఞానము ప్రతిపాదింపఁబడుట వలనను జాబాలకాలాగ్నిరుద్రోపనిషదాది ప్రతిపాద్యమాన పాశుపతశాంభవాది సంజ్ఞాపురస్సరముగా భస్మధారణవ్రతము నెరిగించుట వలనను, "తస్మాద్రుద్రః పశూనామధిపతిరసావితిజ్ఞాత్వా-దేవం సర్వపాశాపహానిః" "జ్ఞాననిర్మథనాభ్యాసాత్పాశందహతి పండితః" అందు వలన రుద్రుఁడు పశువులకధిపతి. అట్టి దేవు నెఱింగినచోఁ బాశవిచ్ఛేదమగును. పండితుఁడు జ్ఞాననిర్మథనాభ్యాసమువలనఁ బాశమును గాల్చును. అని శ్వేతాశ్వతర కైవల్యోపనిషదాదులందుఁ జెప్పంబడిన పశుపాశ పతి సంజ్ఞలు గలిగిన జీవప్రపంచ పరమేశ్వరులను నాయా సంకేతసంజ్ఞలచేతనే వ్యక్తీకరించుటవలనను అథర్వశిరోఽథర్వశిఖా కైవల్యోపనిషద్బృహజ్జాబాలోపనిషద్గర్భోప నిషదాదుల సిద్ధించిన త్రిలోచనత్వ నీలకంఠత్వాది విశిష్టమూర్త్యుపాసన నాశివుఁడే స్పష్టముగా బోధించుటవలనను హంస, పరమహంసాద్యుపనిషత్తులఁ జెప్పఁబడిన షట్చక్రవాసాదికమును స్ఫుటీకరించుటవలనను, యజురారణ్యాసిదపంచబ్రహ్మత్ర్యంబకాఘోర, జాతవేదసాదులను ప్రతిపాదించుటవలనను, "అధ్వనామధ్వపతి" యనియెడు షడధ్వవిధానంబులను విధించుటవలనను నమకాదులచే సిదములగు పంచాక్షర గాయత్రీమంత్రములను జక్కఁగా నుపదేశించుటవలనను మాండూక్యమునఁ జెప్పఁబడిన విశ్వతైజసప్రాజ్ఞాది శబ్దసంకేతిత జీవస్వరూపమును నాయాసంకేతములచేతనే సవిమర్శముగా వ్యక్తీకరించుటవలనను బృహదారణ్యాదులఁ దెల్పఁబడిన సచ్చిదానంద పరబ్రహ్మ మాయావిద్యాహంకారాది సంకేతములచేతనే బ్రహ్మస్వరూపమును జీవప్రపంచరూపములను నిరూపించుటవలనను వేయేల, నాయాకర్మకాండలం దెలుపఁబడిన యాయాకర్మల వివరించుటవలనను నాగమములు శృతిసారములగుచున్నవి. మరియును సక్రమోపసంహారములచే వైదికత్వము సిద్ధించుచుం

డఁగా నడుమనడుమఁ బ్రతిపాదింపఁబడు లింగార్చనాదికమును వైదిక మనుట నిర్వివాదము.

మరియు నిగమాగమ పారావారమును మథించి శైవవిశిష్టాద్వైతామృతముం బడసి లోకమునకు నుపకరించిన నీ శ్రీ శ్రీకంఠ శివాచార్యుండు వ్యాససూత్రములకు స్వోపజ్ఞమగు భాష్యమును రచించుచోఁ బాశుపతాధికరణమున "అంతవత్వమ సర్వజ్ఞతావా" అను సూత్రముం దనకు భాష్యమును వ్రాయుచుఁ బరమేశ్వరుం డుపాదానకారణమా? నిమిత్తకారణమా? యను విషయమును విచారించు సందర్భమున నిట్లు వచించినాఁడు. "వయంతు వేదశివాగమ యోర్భేదం నపశ్యామః. వేదోఽపి శివాగమఇతి వ్యవహారోయుక్తః. తస్యతత్కర్తృకత్వాత్. ఇత్యారభ్య "అస్యమహతోభూతస్య నిశ్వసిత మిత్యాదిశృత్యా" "అష్టాదశానామేతాసాం విద్యానాం భిన్నవర్త్మనాం ఆదికర్తా కవిస్సాక్షా చ్ఛూలపాణిరితిశ్రుతిః" ఇతిస్మృత్యాచ వేదేతస్య కర్తృత్వ మవగతం అన్యత్రాపితస్యైవ పరమేశ్వరస్య అతః కర్తృ సామాన్యాదుభయమప్యేకార్థ పరంప్రమాణమేవ, యద్వా, పంచ బ్రహ్మప్రణవపంచాక్షరీప్రాసాదాదిమంత్రాణాం పశుపతిపాశాదివస్తు వ్యవహారాణాం భస్మోద్ధూళన త్రిపుండ్రధారణ లింగార్చన రుద్రాక్షధారణాది పరమధర్మాణామన్యేషాంచ. సర్వేషాం వ్యవహరణాముభయత్రాపి సమమేవదర్శనాదుభావపిప్రమాణభూతౌ వేదాగమౌ" అనఁగా మేము వేదశివాగమములకు భేదముం గానము. వేదమును శివాగమ మను వ్యవహారము యుక్తమైనది. దానిని సైతమతఁడే చేయుటవలన నట్లు తలంచుచున్నాము. ఈ మహద్భూతమగు పరమేశ్వరుని నిశ్వాస మను మొదలగు శృతిచేతను భిన్నమార్గములు గలిగిన యీ పదు నెనిమిది విద్యలకును నాదికర్తయగు కవి సాక్షాత్తుగా శూలపాణి యను శృతిచేతను వేదమున నీశ్వరకర్తృత్వ మెఱుంగఁబడుచున్నది. ఇతరముననను నా పరమేశ్వర కర్తృత్వమే యగును. కర్త యొకఁ డగుటవలన నేకార్థములగు వేదాగమములు రెంటును బ్రమాణములే.

లేక పంచబ్రహ్మ ప్రణవపంచాక్షరీప్రాసాదాది మంత్రములును బశు పతిపాశాది వస్తువ్యవహారములను భస్మోద్ధూళనము, త్రిపుండ్రధార ణము, రుద్రాక్షధారణము, లోనగు పరమధర్మములును, మరి యిత రములగు సర్వవ్యవహారములును నీ రెంటను సమానముగా నుండుటచే నివి రెండును బ్రమాణభూతములని యర్థము. యీ విషయము ముందే విశదీకరింపబడినది. కావున వేదమునకుఁ బ్రామాణ్యమున్నచో నాగమములకును బ్రామాణ్య మున్నదని శ్రీ శ్రీకంఠాచార్యుని యభి ప్రాయము. మరియు వ్యాససూత్రములకు నగ్రిమభాష్యకర్తయగు శ్రీకంఠాచార్యుఁడే కాక ఇతరులగు శ్రీ శంకర రామానుజాచార్యు లును నాగమప్రామాణ్యము నంగీకరించినారు. శంకరులు దూషించినది లకులీశ పాశుపతమునే కాని యాగమప్రామాణ్యమును భూషించియే యున్నారు. రామానుజాచార్యులును నీ యధికరణమునఁ గాపాలక ధర్మమును దూషించిరి కాని మన శైవాగమోక్తములగు పాంచకాలిక ధర్మముల నుపాదేయములనుగాఁ జెప్పినాడు. ఇంకను నిగమాగమ సర్వస్వమగు క్రియాసారమున "అథవా శివనిశ్వాసశ్శ్రుతిభ్యస్తే శివా గమాః, అధికాశ్శివవక్త్రేభ్య స్సాక్షాదేవవినిర్గతాః. పరస్పరావిరుద్ధార్థా శ్శివోక్తా నిగమాగమాః, అల్పబుద్ధి భిరన్యోన్య విరోధః పరికల్ప్యతే॥ నిగమానామాగమానాం పరమాప్తోపదేశతః, ప్రామాణ్యమవిశేషేణ జ్ఞాతవ్యం తత్వదర్శిభిః" అనఁగా శివనిశ్వాసరూపములగు శృతులకంటె సాక్షాత్తుగా శివముఖోద్భవములైన యాగమము లధికములు. అవి పరస్పరావిరుద్ధార్థములయ్యును నల్పబుద్ధులచే వానియందు విరోధము కల్పింపఁబడుచున్నది. తత్వము నెఱింగినవారు పరమాప్తుఁడగు పర శివుని యుపదేశమువలన వానియందు సమానమైన ప్రామాణ్య మును దెలుసుకొనవలెను. మరియు స్కాందపురాణమున హాలాస్య మహాత్మ్యమున '22, వ అధ్యాయమున "ఏకఏవహి వేదశ్చ వేదార్థస్త్వేకపవహి" ఇత్యారభ్య. "పునర్బహురభేదేన వేదా విస్తారితాద్విజాః ప్రణవాద్యామహామంత్రా అకారాద్యక్షరాణిచ।

శివజ్ఞానాని దివ్యాని కామికాదీని భూసురాః। శ్రీమద్ధాలాస్యనాధస్య సంభవంతూర్ధ్వవక్త్రితః, పునస్సదేవదేవస్య పురుషాఖ్యేనవక్త్రితః ఏకవింశతిభేదేనయుక్త మృగ్వేదమబ్రవీత్। యజుర్వేదంత్వేక శతభేద యుక్త మఘోరతః। సహస్ర శాఖాసంయుక్తం సామవేదంతు వామతః, అధర్వం నవధాభిన్నం సద్యోజాతేనచాబ్రవీత్॥ అనఁగా వేద మొక్కటియే వేదార్థమును నొకటియే అని మొదలిడుకొని మరల బహువిధములైన వైభేదము లేకుండునట్లు వేదములు విస్తరింపఁబడినవి. ప్రణవాది మహామంత్రములును నకారాద్యక్షరములును శివజ్ఞాన స్వరూపములగు కామికాద్యష్టావింశత్యాగమములును పరమేశ్వరుడు తన యూర్ధ్వముఖమగు నీశానమునుండియు యిరువదియొక భేదములతోఁ గూడిన ఋగ్వేదమును తత్పురుషముఖమునుండియు నూటయొక్క భేదములతోఁ గూడిన యజుర్వేదంబును నఘోరవక్త్రమునుండియు సహస్రశాఖాసంయుక్తమగు సామవేదమును వామదేవ ముఖమునుండియు తొమ్మిది భేదములతోఁ గూడిన యధర్వవేదమును సద్యోజాతముఖమునుండియుఁ బలికెనని యర్థము. ఇటఁగామికాద్యాగమములు పరశివుని యూర్ధ్వముఖమునుండి వెలువడినకారణమున ప్రామాణ్యమున వేదములకన్నఁ దీసిపోవునవిగాక యించుకప్రాశస్త్యమునే వహించుచున్నవని వచింపవచ్చును. మరియు సకలవేద వేదాంతార్థోప బృంహణంబై యొప్పి పంచమవేదమని పేరెన్నికఁ గాంచిన శ్రీ మహాభారతమున నిట్లు దెలుపబడినది. అనుశాసనిక పర్వమున "సాంఖ్యం యోగః పాంచరాత్రం వేదః పాశుపతం తథా, జ్ఞేయాన్యేతానిరాజర్షే విద్ధినానామతానివై" "కించతత్రైవ" ఆత్మప్రమాణా న్యేతానినోన హన్యానిహేతుభిః॥ అనఁగా సాంఖ్యము యోగము పాంచరాత్రము వేదము పాశుపతమునననునివి నానామతములుగా నుండునవియై తమకుఁ దామే ప్రమాణములగుచున్నవి. కుయుక్తులంబన్ని కువాదములచే వీనిని హింసింపఁగూడదు. పశుపతి వలన జనించిన నీయాగమములు స్వతఃప్రమాణములని సిద్ధించుచున్నది.

విశ్వవ్యాపకుఁడైన భగవంతుఁడు భక్తుల ననుగ్రహించుటకై గుణాది విశిష్టరూపమును బరిగ్రహించి వారిపురుషార్థచతుష్టయ సాధనము నకుఁ గర్మజ్ఞానములు బోధించునట్టిదియు వేదసారమైనదియుఁ గ్రియా చర్యా యోగజ్ఞానపాదములతోఁ గూడిన శైవాగమములను సృజిం చెను. వానియందు భగవంతుని నిష్కళత్వమును నుపాసకులయను గ్రహించుపొంటె రూపకల్పనము నాలయ నిర్మాణాదికమును శిలా మృద్దారులోహాదులచే నిర్మింపఁబడిన విగ్రహాదుల నారాధించు విధియు "దధ్యానార్చనాదులచే జనించు జ్ఞానమును సువ్యక్తముగా జెప్పఁబడినవి. పూర్వోక్తములగు వేదాన్విత శైవాగమములు బ్రాహ్మ ణులందరచే ననుష్ఠింపఁబడఁ దగినవనియు వచింపఁబడినది. యెట్లన- స్కాందమున హిమవత్ఖండమున మార్కండేయుఁడు "వేదాగమ సమాదిష్టమాచారం సమ్యగాచరేత్'' తత్రైవప్రభాసఖండే "వేదాశ్చ సకలాయజ్ఞాజ్యోతిష్టోమాదయశ్చ భాః। శాస్త్రాణిచపురాణానిచేతిహాసా నిసర్వతః। అష్టావింశత్యాగమాశ్చవేదాంగాని మహామతే" అనియు సనత్కుమారసంహితయందు "ఋగాదివేదసారాణి కామికాదీని భూసురాః। నిర్మితాని మయాపూర్వం విప్రాదీనాం హితాయచ॥ అనియు శివరహస్యమునఁ బదునేడవ యధ్యాయమున "శివాగమ మిదంపుణ్యం శ్రుతిసారం విముక్తిదం। తస్మాత్సదాసేవనీయం భక్త్యా విప్రాదిభిర్ద్విజైః" అనియు ధర్మసంహితయందుస్కందుఁడు.'' శివాగ మేతిహాసాభ్యాం వేదం సముపబృంహయేత్॥ పాద్మమహాపురాణమున పాతాళఖండమున హనుమంతునిఁ గూర్చి శివుఁడనిచెప్పుట "మద్వాక్యా ద్ధర్మ విజ్ఞానం మద్వంశ్యాన్మోక్ష ఉచ్యతే పురాణాద్యాగమాశ్చై వస్మృతిమోమమవాక్యతః॥ అనఁగా వేదాగమములందు నుపదేశిం పఁబడిన యాచారమును జక్కఁగా నాచరింపవలయునని స్కాంద పురాణముునను సమస్త వేదపురాణేతిహాసములన్నియు కామికా ద్యష్టావింశత్యాగమములును శిక్షావ్యాకరణములోనగు వేదాంగము లును జ్యోతిష్టోమాదిక్రతువులును లోనగునవి పరిహరింపఁ గూడదని

ముందటి శ్లోకముతో నన్వయించి యీ విధముననే ప్రభాసఖండము నందును జెప్పఁబడును. బ్రాహ్మణుల కపవర్గసాధనమునకై కామికా ద్యాగమములు తనచేతనే పూర్వము నిర్మింపఁబడినవి. పరమేశ్వరుఁడు బ్రహ్మాది దేవతలకును మార్కండేయాది మహాఋషులకుఁ జెప్పెనని సనత్కుమారసంహిత దెలుపుచున్నది. ముక్తినొసంగునట్టి శృతిసార శివాగమములు బ్రాహ్మణులచే సదా సేవింపఁదగినవని శివరహస్యమునను శివాగమేతిహాసాదులు వేదోపబృంహణములని ధర్మసంహితయు బోధించుచున్నది. నావాక్యమువలననే సకలధర్మ విజ్ఞానమును నిరతిశయానంద స్వరూపమగు మోక్షమును సమస్త పురాణములును, నిఖిలాగమములును, నఖిలస్మృతులును జెప్పఁబడినవని పాద్మపురాణమున హనుమంతుంగూర్చి శివుఁడుపదేశించెను. "యేద్విషంతి శివందేవాన్వేదాన్ యజ్ఞాంస్తథాగమాన్ అధోముఖోర్ధ్వ పాదాస్తేపచ్యంతే నరకాదిషు" అనఁగా నెవ్వారు పరమేశ్వరుని దేవతలను యజ్ఞములను నాగమములను ద్వేషింతురో వారు నరకాదులం దధోముఖోర్ధ్వపాదులై బాధల నొందుదురని శైవ పురాణములోని ధర్మసంహితబోధించుటవలనఁ బైవానినాచరింపని వారికిఁ బ్రత్యవాయము నిర్ణయింపఁ బడినది. "వేదాన్స్మృతీ పురాణాని. త్వాగమానపిశాంకరాన్. వినిందయతిమూఢాత్మాసోంధేతమసిమజ్జతి" అనగా బైవచనమువలెనే వేదస్మృతి పురాణాదులను శాంభవములగు నాగమములను నిందించు మూఢచిత్తుఁ డంధకారమునఁ బడునని శంకరసంహిత యుపదేశకాండమున నిట్లు పూర్వ విధముననే బ్రత్యవాయము సూచింపఁ బడినది. కావున పూరోక్తములగు ప్రమాణములవలన సవికల్పనిర్వికల్ప బ్రహ్మోపాసనకు నాగమములే యాధారములనియు, శిలామృద్దారు లోహాదులచే నిర్మింపబడిన విగ్రహముల యారాధనమునకు శివాగమములే ముఖ్యాధారములనియు విస్పష్టముగాఁ దేలుచున్నది.

ఇట్లు పెక్కు గ్రంథముల నవలోకించినను వేదములకును నాగమములకుఁ బరస్పరనాపేక్షత్వమును బ్రమాణత్వమును వ్యక్తమగుచున్నవి. విస్తరభీతిని వానినన్నింటిని నుదాహరింపనైతిని. తుద కొక్క విషయముగూర్చి ఇంచుకవిచారించి తరువాత విషయాంతరమును బరామర్శించుచున్నాఁడను. ఆగమ శబ్దార్థము నీవిధముగా నిర్వచించుచున్నారు. "ఆఙ్" పూర్వక "గమ్‌ధాతువునుండి యీశబ్దముత్పన్నమైనది. వచ్చినదని యర్థము. ఆగమములకున్న ఈ పేరొక్కటియే ప్రమాణత్వమును సూచించుచు వేదములవలె నపౌరుషేయత్వమును సహితము సిద్ధాంతీకరించుచున్నది. ఆగమశాస్త్రము లీవిధముగా నీశబ్దమును నిర్వచించుచున్నవి. ఆగతంపంచవక్త్రేభ్యోగతంచ గిరిజాననే మతంచవాసుదేవస్యతస్మాదాగమముచ్యతే॥ పరమేశ్వరుని యైదుమోములనుండి జనించి పార్వతీదేవి ముఖముం బొంది వాసుదేవునికి సమ్మతములైన కారణమున నాగమములకీ పేరుజనించెను. ఆగమశాస్త్రములఁ బెక్కు సందర్భములందు బరమేశ్వరుఁడు పార్వతీదేవింగూర్చి రహస్యములను బోధించునవి యన్నియును విష్ణువునకు సమ్మతములనియు విష్ణుదూషకులు మద్దూషకులనియును నుపదేశించినాఁడు. కావుననే వాసుదేవస్య సమ్మతమ్మని చెప్పబడినది. మరియును వీనికిఁ దంత్రములను నామాంతరముగలదు. ఈ శబ్దమునకు వ్యుత్పత్తి యిట్లుచెప్పఁబడినది. "తనోతి తన్వతయితివా తంత్రం. తంత్రం స్వరాష్ట్రచింతాయాం శాస్త్రేషధిముఖేష్వితి, వైజయంతీ "తంత్రం కుటుంబకృత్యేస్యాత్ సిద్ధాంతే చౌషధోత్తమే। ప్రధానేతంతు వాయేచ శాస్త్రభేదే పరిచ్ఛదే, శృతిశాఖాంతరే హేతౌవుభయార్థప్రయోజనే ఇతికర్తవ్యతా యాంచేతిమేదినీకోశే॥ తనోతివిపులానర్థాన్ తత్వమంత్ర సమన్వితాన్ త్రాణంచకురుతే యస్మాత్తంత్ర మిత్యభిధీయతే॥ ఇతికామికే" అనఁగా విస్తరించునది లేక విస్తరింపఁబడునది తంత్రము. తంత్రశబ్దమునకుఁ గోశములందు ననేకార్థములు వ్రాయఁబడినవి. వానిలో శాస్త్రమను నర్థమును

శృతిశాఖాంతరమను నర్థమును బ్రకృతమున నాశ్రయింపఁదగినవి "శాసనాచ్ఛాస్త్ర మిత్యాహుః" అనుటవలనఁ దంత్రములను నామాంతరములుగల యాగమములు శిక్షాస్వరూపములనియు శృతిశాఖలనియునను విషయము సువ్యక్తము. మఱియును గామికాగమమున "తనోతి విపులానర్థాన్ తత్వమంత్రసమాశ్రితాన్ త్రాణంచ కురుతే యస్మాత్తంత్ర మిత్యభిధీయతే" తత్వమంత్రములతోఁజేరిన విపులార్థములను విస్తరింపఁజేయుచూ రక్షణము నొనరించు కారణమునఁ దంత్రమను పేరువచ్చెనని యాగమశాస్త్రార్థము కావున ననేక స్మృతి పురాణేతిహాసాగమములందలి పెక్కు ప్రమాణవచనములను బరిశీలించి చూచినచో నాగమప్రామాణ్యము సువ్యక్తమగుచున్నది. ఈ యాగమములు శైవములనియు వైఖానసములనియు బాంచరాత్రములనియును ద్రివిధములుగాఁ గలవి. ఇవి దేవాలయసంబంధములగు కర్షణాది ప్రతిష్టాంతము జరుగు క్రియాకలాపముల నుపదేశించుచున్నవి. దేవాలయనిర్మాణము యుత్సవాదులు ప్రాయశ్చిత్తాదులు నుపకరణాది లక్షణములు లోనగువానిని బరిశీలించుచున్నది. శివాలయములందు శైవులును విష్ణ్వాలయములందు వైఖానస - పాంచరాత్రులు భగవదర్చనమును గావించుచున్నారు. శైవులలో భేదములు పెక్కులు గలవని యాగమశాస్త్రములు ఘోషించుచున్నవి. ఆ యాభేదములన్నియు నిట విచారించుట యసందర్భమనియు నయ్యది విషయాంతరమనియు నెంచి వదలినాఁడను. ఆదిశైవులు సప్తగోత్రములవారు ప్రసిద్ధిని గాంచినవారు. ఉత్తరవాతులమున చర్యాపాదమునందు "భగవద్వంశజా స్తస్మాద్దీక్షితాశ్చేతికీర్తితాః। కౌశికఃకాశ్యపశ్చైవ భరద్వాజోఽథగౌతమః (పాఠాంతరము. భరద్వాజోఽత్రిరేవచ) అగస్త్యశ్చైవ పంచైతే శివవంశోద్భవాస్మృతాః! మచ్ఛాస్త్రోక్త ప్రకారేణమంత్రసిద్ధాంత వర్త్మనా దీక్షాయిత్వాయథాన్యాయం లింగతో భద్రమండలే" భగవద్వంశజులగు వీరు దీక్షితులని చెప్పఁబడుచున్నారు. కౌశికుఁడు కాశ్యపుఁడు భరద్వాజుఁడు గౌతముఁడు (భరద్వాజుఁడు అత్రి) అగస్త్యుఁడు

అను నీమైనుగుకు భగవద్వంశమున జనించి వంశకర్తలైనారు. మాత్ర సిద్ధాంతమార్గమున భగవచ్ఛాస్త్రాను సారముగాఁ దద్వంశీయులను లింగతో భద్రిమండలమున దీక్షితులనుగాఁ గావింపవలెను. శివదీక్షా సమన్వితులగుటంజేసి వీరికి దీక్షితులను నామమువచ్చినది. వీరికి గురు వంశము వారనియు నామాంతరముగలదు. (గురూత్పత్తి) శ్రీస్కాంద పురాణ శంకరసంహితాంతర్గత శివరహస్యఖండమునందలి యుపదేశ కాండయందు గురూత్పత్తి చక్కఁగా వివరింపఁబడినది. విస్తరభయ ముచేనందలి సంగ్రహరూపమగు తాత్పర్యము నిందుఁ బొందుపరచు చున్నాడను. దేవతలగు గంధర్వోరగయక్షరక్షో విద్యాధరాదులకును మహాత్ములగు గణేంద్రాదులకును వీరులకును యోగులకును ఋషుల కును విశేషించి మనుష్యులు బ్రహ్మక్షత్రవైశ్యశూద్రాది చతుర్వర్ణముల వారికిని గురువులుగలరు. వారి యానతిని శిరమునఁదాల్చియే యెల్ల రును శివపూజను గావింపవలెనని తెల్పఁబడినది. పూర్వము రజతగిరి పీఠమునఁ బరమేశ్వరుఁడు గూర్చుండియుండఁగా బార్వతి బ్రహ్మ విష్ణు వులు నంది మున్నగు ప్రమథగణములు సత్యవ్రతపరాయణులు ఋషులు లోనగువారు దేవదేవుని నమస్కరించి యిట్లు ప్రార్థించిరి. ఓస్వామీ! ప్రతిసర్గమునను జనించు బ్రహ్మలవిస్తరమును గురువుల యుత్పత్తి ప్రకారమును, నాగమార్థములను గురువులకు గురువగునో యీశ్వరా! నీవొకఁడవే యుపదేశింపఁదగినవాఁడవు. మేము కృతార్థులమగుదుము. అనియు, మానందీశముఖ్యులు ప్రార్థింపఁగా నీశ్వరుడందుండిలేచి పుష్ప గిరియను శృంగమునకుం బోయి యచట నాచార్యరూపమును దాల్చి యుమాస్కందగణపతులకు భైరవవీరభద్రాదిగణాధిపతులకు వేదాగమ శిరస్సుల నుపదేశించెను. ఆమర్దనగిరియను శృంగాంతరము నకువచ్చి యచట నాచార్యరూపమును ధరించి సోమ మహాకాళాదు లకు నిగమాగమార్థములను బోధించెను. తరువాత నతఁడు గోళగిరి యని ప్రసిద్ధమగు వేరొక శృంగమునకు గురురూపము నాశ్రయించి యచ్చట హరిబ్రహ్మేంద్రాదిసురులకు శ్రుత్యాగమరహస్యములను గఱి

పెను. కడపట నా యీశ్వరుఁడు భిక్షాచర్యాఖ్యమని ప్రసిద్ధంగాంచిన యింకొక శిఖరముంజేరి యచ్చోగురూత్తమ తనువునంగీకరించి యందు సనకాదిమునీంద్రులను వేదాగమముల నభ్యసింపజేసెను. యీప్రకార ముగా నాలుగు శృంగములందును శివమూర్త్యంతరములను నా చార్యుల మఠములు విశ్రుతములైనవి. ఆ యామఠములందు వర్తించు చున్న శిష్యులు గురుపరంపరలోఁ జేరినవారై యాచార్యశబ్దవాచ్యులై యీలోకమున కరుదెంచి వేదాగమార్థరహస్యముల బోధింపసాగిరని స్కాందపురాణము దెలుపుచున్నందునఁ దద్వంశీయులగు నాదిశైవు లకుఁ గ్రమముగా గురుసమాఖ్యవచ్చినదని యెరుంగవలెను. భూలోక మునఁ బ్రవర్తించినమఠముల నామములు భిన్నభిన్నములుగా నాగమ ములఁ జెప్పఁబడినను వాని చాతుర్విధ్యవిషయమున నన్నియు నైక కంఠ్యమును వహించినవి. ఎట్లన "మధ్యేమంధనకాళేశం పూర్వే చామర్దకంతథా యామ్యేపుష్పగిరించేవ గోళకంసౌమ్యదేశకే రణ భద్రింపశ్చిమేచోప్యధి పాంశ్చత తశ్శృణు, దూర్వాసాశ్చ రురుశ్చైవ దధీచి శ్వేతపవచ. ఉపమన్యురితిఖ్యాతా మఠానామధి పాస్స్మృతాః ! ఏతత్పరంపరా జాతాస్తే(ప్రోక్తాకా శివద్విజాః" అని కామికాగమమున నున్నది. నడుమ మంధనకాళేశమును పూర్వమున నామర్దకమును దక్షిణమునఁ బుష్పగిరియును నుత్తరమున గోళకమును పశ్చిమ మున రణభద్రమును బ్రసిదములు. వాని కధిపతులు దూర్వాసో, రురు, దధిచి, శ్వేతో, పమన్యులు వీరి పరంపరచే జనించిన యాదిశైవులు గురు సంజ్ఞ నొందుదురని యిట్లే యాగమాంతరము లను వక్కాణింపఁబడినది. కావున నాదిశైవులకు శివద్విజ గురు దీక్షితాది శబ్దములు పర్యాయములుగా వాడఁబడుచున్నవి. వీరే యాగమాధికారులనియు స్వార్థపరార్థయజనమునకు నర్హులనియు శివాలయ పూజాదికమును వీరుగాక యన్యులొనరింపఁ గూడదనియు నాగమశాస్త్రము లనేక స్థలముల ఘంటాఘోషముగా నుడువుచున్నవి. అవ్విషయములను సప్రమాణముగా నిరూపించుట యనవసరమనియు

నస్పష్ట లేఖనమని యుఁ దలంచి యింత మాత్రముతో సూచించితిని. ఇఁక నీ యాది శైవు లనుసరింపఁ దగిన సూత్రవిషయమును విచారింపఁ దొరఁ కొనుచున్నాను.

మైసూరు సంస్థానం
ముజరాయి కమీషనర్
ఆఫీసు—బెంగుళూరు

ఇట్లు,
శైవాద్యాగమ పంచానన, మహావిద్వాన్
ఆగమిక నందీశ్వరదీక్షితులు

☞ శ్రీవారి వ్యాసములు ప్రతి మాసం పత్రికయందు ప్రచురణ కాగలవు. సాంఘికు లీ సద్విషయములను శ్రద్ధతో పరిశీలించి స్వమతాభివృద్ధికై పాటుబడగలరని నమ్ముచున్నాను.

రాబోవు వ్యాసములు

౧ బోధాయన సూత్ర నిర్ణయము.
౨ శంకర నీలకంఠసంవాద విషయములు.
3 సాంఘిక కర్తవ్య ప్రబోధములు.
౪ ధర్మశాస్త్ర వచనములు. (ఆ॥ శై॥ సం)

---

# యోగాచార్య శ్వేతమహర్షి.

ప్రాచీనకాలమందు శ్వేతవరాహకల్పమున వైవస్వత మన్వంతరములో శ్వేతమహర్షి యను నొక గొప్ప తపశ్శాలియుండెను. వారి యాయువంతయు తపస్సులోనె పూర్తియైయుండగా మరణ మాసన్నమైనందున విచారపడి చిరాయుర్దాయమును పొందుటకు కుతూహలము గలిగి భగవానుడైన మృత్యుంజయుని యారాధన వినా మృత్యువును జయించలేమని నిశ్చయించుకొని యొక పర్వతగుహలో ఆగమోక్త విధిచే శివలింగస్థాపన జేసి అందు నిరాహారుడై శంకరుని పూజించుచు పవిత్రమైన వేదమందలి రుద్రాధ్యాయముతో నభిషేక పారాయణలు

గావించుచు యనేకముగా స్తోత్రమును జేయుచుండెను. ఇట్లుండగా మహార్షికి దినములు పూర్తికాగానే మహాతేజస్వియయిన కాల యముడు వచ్చి నిలచియుండగా శ్వేతమహార్షియొక్క విశ్వాస మిట లుండెను. నేను కాలునికి కాలుడైన శంకరుని యుపాసన జేయుచుంటిని యీకాలుడు నన్నేమిచెయ్యగలడని అనన్యమనస్కుతో మహామృత్యుం జయ మంత్రమును పఠించుచు త్ర్యంబకుని యారాధన సలుపుచుండెను. అంతట కాలుడిట్లు పలికె. హే శ్వేత! నిన్ను నాతోటి యమలోకము నకు గొనిపోయెదను. యీ పూజాపాఠములు ప్రయోజనము గలిగిం జాలవు. నా పాశములో జిక్కియున్న నిన్ను బ్రహ్మ విష్ణు రుద్రాదు లయిన బ్రతికింపజాలరు. హే మునే! నీ యాయువు పూర్తియయినది నీవు నాతో యమలోకమునకు రావలసియుండును. ఈ ప్రకారముగా యముని భయంకరవాక్యములను విని భగవానుడైన రుద్రుని స్మరిస్తూ శ్వేతమహర్షి యమునితో నిట్లనియె. హే కాల! నీవు నన్నేమి చెయ్య గలవు. నన్ను రక్షించువాడు భగవానుడైన రుద్రుడు. ఈ శివలింగ మందున్నాడు. నావంటి భక్తుల రక్షించుటయందు తత్పరుడు అతని భక్తులకు యెప్పుడును, హాని గలుగజాలదు. అందువలన హే కాల! నీవు నాదగ్గరనుండి వెడలిపో, ఇట్లు పలికిన శ్వేతమహర్షి యొక్క వాక్యములు విన్నంతలో యమునికి క్రోధమతిశయించి భయంకర రూపమును ధరించి, సింహనాదమును చేస్తూ మహర్షి యొక్క సమీపమునకు వచ్చి, కంఠమందు పాశమును తగిలించి, హేమహర్షె! ఇప్పుడు నీవు నావలలో జిక్కియున్నావు. నిన్ను బ్రతికించువా డెక్కడనున్నాడు. ఆ రుద్రుడెక్కడ, ఆతని భక్తి వలన నీకేమి ఫలము లభించె. రుద్రుడు యీ శివలింగమందున్నాడని చెప్పుచుంటివి. ఆ రుద్రు డిపుడేల మాట్లాడకుండెను. నిన్నెందుకు రక్షింపడు, యీ ప్రకారము కాలుడు ప్రేలుచున్నంతలోనే భగవాన్ శంకరుడు ఆ శివలింగమునుండియే ఉమాసమేతుడై యావిర్భవించెను శ్వేతమహర్షి యా యుమాకాంతుని జూచి, స్తుతించుచుండెను. అప్పుడు

కాలుడు అంతకాంతకుని జూచి, యెక్కడకు పారిపోయెనో తెలియదు. శంకరుడు స్వేతమహర్షి కిట్లు వరము నొసంగెను. హేస్వేత మహార్షె! నీవు చిరకాలము జీవింతువుగాక. మరణము నీ ఇచ్ఛాధీనమై యుండును. కాలుడు యెప్పుడునూ నీదగ్గరకే రాజాలడు. నీవు నాయంశ వలన నుద్భవించితివి. నీకు ఆగమశాస్త్రముల నిచ్చుచున్నాను. నీవు ప్రపంచమునకు ఉద్ధారకుడవై శివమతస్థాపకుడవై యుందువుగాక. యోగులందరూ నిన్ను యోగాచార్యుడందురు. నీ మతానుసారముగా నందరున్నూ శివలింగస్థాపన పూజనాదులొనరర్చునట్లుజేసి, శివజ్ఞానమును బోధించి, నీయిచ్ఛవచ్చినప్పుడు మరణమునొంది నా సాయుజ్యము నొందుదువుగాక యని వరము లొసంగినంతలో, యాకాశము నుండి సుందరసుగంధి పుష్పవృష్టిగురిసె. దేవదుందుభులు మ్రోగుచుండెను. మృత్యుంజయుడు కైలాసమలంకరించెను. తర్వాత స్వేతాచార్యుడు అభీష్టసిద్ధినొంది వేదాగమములను శివమతోత్కర్షను శివారాధన మహిమను వెల్లడి చేయుచు శివజ్ఞానమును బోధించుచు, కొన్ని యుపాగమముల సృష్టించి యాదిశైవులకు వేదాగమములను యన్యులకు తాంత్రికాగమములను బోధించి, శివునియోగావతారమై యాదిశైవ కులముదుద్భవించిన స్వేతమహర్షి స్వాయంభువ మన్వంతరములో శివావతార దూర్వాసులచే మంథన కాళేశ్వరమునందు స్థాపించబడిన యామర్దక గోళకీ పుష్పగిరి, రణభద్రములను నాల్గు యాదిశైవమతములను పాలించుచు శ్వేత, శ్వేతశిఖ, శ్వేతాశ్వ, శ్వేతలోహిత, యనువార్లను శిష్యులగా జేసుకుని వైవస్వత మన్వంతరారంభమున కృతయుగములో (అనగా నిప్పటికి ౨౮ కృతయుగములైనవి) నలుగురు శిష్యులతో నాల్గు మతములపాలించుచు శివుని యోగావతారమని ప్రసిద్ధినొందె.

ఓం శాంతి శ్శాంతి శ్శాంతిః॥

శ్రీ శ్రీకంఠాధిపతులగు బోధానందమహర్షి.
మకాం—వారణాశి.

# శ్రీ త్రిశతీ సువాసినీ పూజారూపయాగ పత్రిక.

శ్లో॥ లక్ష్మీర్మాయాచ గాయత్రీ యాసావిత్రీ సరస్వతీ ।
యా సర్వ మంగళాదుర్గా యాఽన్నపూర్ణా ధృతి స్మృతిః ।
యాజగజ్జననీదేవీ యాప్రోక్తా ప్రకృతిః పరా ।
అంబాసా లలితానిత్యం తనోతు శుభ సంతతిమ్ ॥
జయదేవి జగన్మాతర్జయదేవి పరాత్పరే ।
జయ శ్రీకాంచినిలయే జయ కామకలాత్మకే ॥

ఆస్తిక శిఖామణులారా !

శ్రీమత్పరమహంస పరివ్రాజకాచార్యులును, శ్రీ శృంగగిరి శారదా పీఠాధిపతులును, జగద్గురువులును నగు, శ్రీశ్రీశ్రీ సచ్చిదానంద శివాభినవ నృసింహభారతీ స్వాములవారు, కొన్ని సంవత్సరములకు ముందు, శ్రీ కాలటీక్షేత్రమునకు విజయముచేసి, యచ్చటినుండి మఱలి దయచేయునపుడు, దేవనపల్లితాలూకా గంగవారమను గ్రామమునకు వేంచేసి, ఆయూరిలో సాక్షాత్కరించి, ప్రసిద్ధిజెందియుండు శ్రీ నీలకంఠేశ్వరస్వామివారి దివ్యమంగళమూర్తిని, తమ పవిత్రహస్తములతో, యథావిధిగా పూజించి, తద్గ్రామనివాసుడును ప్రకృతయాగమునకు యజమానుడును నగు నన్ననుగ్రహించి "నీవు త్రిశతీ సువాసిన్యర్చనపూర్వకముగా శ్రీ దేవీయాగము చేయుము. అందువలన నీవు కృతార్థుడ వగుటయేగాక, లోకమునకుగూడ క్షేమముకలుగును" అని ఆశీర్వాదపూర్వకముగా నాజ్ఞాపించిరి. శ్రీ జగద్గురువుల దివ్యాజ్ఞను శిరసావహించి, లఘుకల్పమైన శ్రీ దేవీయాగమును బెంగుళూరు పట్టణమునందలి శ్రీ శంకరమఠమున, శ్రీ శృంగేరీమఠమునకు యేజెంటైన, వేదమూర్తులు బ్రహ్మశ్రీ శ్రీకంఠశాస్త్రుర్లు, శ్రీ మైసూరు దివానుగా నుండిన శ్రీమాన్ సర్. విశ్వేశ్వరయ్యగారు, శ్రీమంతులు హెచ్. రామయ్యగారు, జమీందారైన మ-రా-రా-శ్రీ గుండు

రావుగారు మొదలైన మహానుభావుల సాహాయ్యమువలన, గడచిన ఆనందసంవత్సరమున పూర్తిచేసినాను.

ఆ తర్వాతను బెంగుళూరిలో వేంచేసియున్న శ్రీమల్లేశ్వరస్వామి వారి సన్నిధానమందు గొప్పగా ఘనతకెక్కి ప్రఖ్యాతులైన శ్రీశ్రీ మైసూరు మహారాజులుంగారైన శ్రీకృష్ణరాజేంద్రవొడయార్ బహద్దూర్, జి. సి. ఎస్. ఐ. వారి మహోపకారమువలనను, రిటైర్డు హెడ్మాష్టరైన మ-రా-రా-శ్రీ పి. ఆర్. సుబ్రహ్మణ్యశాస్త్రి, బి. ఏ., మైసూరు కోర్టునందు న్యాయమూర్తులైన మ-రా-రా-శ్రీ కే. శంకరనారాయణరావు, ఎమ్. ఏ., బి. ఎల్., మైసూరు రైల్వే ఆడిటరైన మ-రా-రా-శ్రీ లక్ష్మీనరసింహారావు, బి. ఎ., బి. ఎల్., మొదలగు గొప్పవారు, సాదరముగా జేసిన ధనసాహాయ్యమువలన, 1922-వ సంవత్సరము మే నెల 31-వ తేదీనాడు మహాకల్ప దేవీయాగమును సాంగోపాంగముగా పూర్తిచేయుగలిగినాను.

ఇంకను మీాదను విధించిన ప్రకారము, త్రిశతీసువాసినీ పూజతో ఈయాగము సంపూర్తినొందవలసి యున్నది. దీనిని ప్రారంభించునది మొదలు అనేక ఆస్తికశిఖామణుల శ్రద్ధాభక్తుల ననుసరించి శ్రీ జగజ్జనని మహాత్రిపురసుందరీ దేవిని యథావిధిగా పూర్తిచేయింప ప్రార్థించుచున్నాను. "ఆస్తికులును, ధనవంతులును, పరోపకార పరాయణులును, ఉదారహృదయులును నగు మహానుభావులు పలువిధములుగా సాయపడి, ముందునిలిచి, యీ యుపక్రమింపబోవు యాగమును, సువాసినీపూజను కొనసాగించి, శ్రీ దేవీ కటాక్షమునకు పాత్రులగుటయేగాక, నన్నును కృతార్థునిగా జేయుదురుగాక" యని మహాశయులందరు ప్రార్థింపబడుచున్నారు.

ఈ యాగము సువాసినీపూజ శ్రీ కాంచీ దివ్యక్షేత్రమునందే చేయునట్లు శ్రీ దేవీయాజ్ఞచే నిశ్చయింపఁబడినది. ఈ మహాకార్యమును పూర్తిచేయుచునిమిత్తము ప్రీతిపూర్వకమగు తమ దాతృత్వమును, తమ గొప్ప సహాయమును నే నపేక్షించి యెదురు చూచుచున్నాను.

"కర్తాకారయితాచైవ సమాన ఫలభాజినౌ" అను న్యాయము నెఱింగిన తమకిఁతో౽ధికము తెలుప బనిలేదని విరమించెద.

ఇట్లు విన్నవించు,

సంజుండ దీక్షితులు, యాగకర్త.

బూదిగెరె పోస్టు-బెంగుళూరుజిల్లా

---

# చితంబరంనుంచి జాబు.

చిదంబరపురాత్. కుశలమ్

శ్రీమన్నిగమాగమ పారావారపారీణ పరమహంస పరివ్రాజకాచార్య శ్రీబోధానందమహర్షి పాదానాం సవిధే సప్రణామ సప్రశ్రయంచ విరచితా విజ్ఞప్తిః.

చిదంబర పురనివాసినా శివదండపాణిస్వామి దీక్షితేన అనుగృహీతోస్మి శ్రీమతాం శ్రీముఖ దర్శనేన శ్రీ శ్రీకంఠ శివాచార్య ప్రతిష్ఠామహోత్సవ శ్రావణేనచ. పారితోషిక స్వీకరణాదేశ నేనచ. అధమర్ణోహం కాలాంతరే తత్ర భవత్సందర్శనానందమనుభవితుం.

శ్రీకంఠాచార్య చరిత్రా జయంత్యుత్సవాది నిర్ణయె. అచిరాదేవయావద్విదితం నివేదయిష్యామి తత్ర భవత్సకాశం సర్వథా౽నుగ్రాహ్యోయం అవ్యాజ కరుణాపారావార పారీణైః. బోధానంద మహర్షిపాదైరితి అభ్యర్థయేతమాం.

శివదండపాణిస్వామిదీక్షితః.

## ముఖ్యగమనింపు.

సోదరులారా!

సంఘాభివృద్ధికై పాటుపడుచూ నాదరించువారు లేక కడు నిడుముల గుడుచుచున్న మన "ఆది శైవ" పత్రికకు పుష్కరతీర్థోత్సవ తరుణమున మీ మీ శక్త్యానుసారముగా ద్రవ్యసహాయము గావించి శాశ్వతముగా పత్రికను సంరక్షింపగోరుచున్నాము. మేము ప్రచారము జేయుటకు అవకాశము గలుగనేరదు. గావున మా విన్నపము గమనించి తమ తమ ద్రవ్యములను స్వయముగాగాని నమ్మకముగల వారి ద్వారాగాని మా ఆఫీసునకు జేర్పించగలందులకు ప్రార్థించుచున్నాము.

పత్రికాధిపతి.

# కృష్ణా పుష్కర మహాత్మ్యము.

పూర్వకాలంబున తుందిలుడను బ్రాహ్మణుడు గల డాతండు పరమధార్మికుండును, సదాచారముగలవాడును, శివారాధనపరుండును ఆగమాది శాస్త్రవేత్తయునై, శివనామసంకీర్తనంబు లొనర్చుచుండ పరమశివుండు ప్రసన్నుండై ఓ విప్రోత్తమా! నీ భక్తి కానందించితిని. నీకే మే వరంబులు గావలయునో గోరుకొను మిచ్చెదను. అన తుందిలుండు సాష్టాంగదండప్రణామంబొనర్చి, ఓ దేవాదిదేవా, జగద్రక్షకా, నీ యష్టమూర్తులలో నొకటగు జలరూపంబున నైక్యంబుజేసికొనుమని వేడెను. అందుల కా శివుండట్లొనర్చెను. నాటినుండియు, నాతండు శివునియందైక్యమైయుండెను. అందువలన వానికి పుష్క

రుండను నామంబుగలిగెను. అంత బ్రహ్మదేవుండు పరమశివుని గూర్చి, యధిక తపస్సు జేయ నుమాపతి ప్రసన్నుండై, బ్రహ్మను సృష్టించుట, కాజ్ఞ యొసంగ, నాతండు ఓ శంకరా, నీయందుగల జలరూప పుష్కరుని, నాకొసంగితివేని నేను లోకమును సృజించ గల ననిన జగత్పాలకుండొల్లెయని వాని నొసంగెను. అంత బ్రహ్మ తీర్థస్వరూపుండగు పుష్కరుని కమండలమున నిడుకొని, దన లోకము నకుంబోయి, సృష్టిం జేయుచుండ కొంతకాలమునకు ఆంగీరస మహఋషి పుత్రుండగు, బృహస్పతి, చతురాననుని దర్శించి వరంబులం గోరి కొనిన, యా నలువగోరినదాని నిచ్చెదనని దన కమండలమునం గల తీర్థ పుష్కరునిజూచి, నేను నిన్ను బృహస్పతికి యిచ్చియున్నాను. నీవు పొమ్మనగా నీపున్నా వచ్చిన యెడ నీతోగూడ వచ్చెదనని చెప్పెను. అంతట వారందరు పయనమైపోయిరి. బృహస్పతి మేషాది రాసులయందుండునపుడు, ప్రథమమునను చివరయందును, పండ్రెండు దినములుగా రెండు తడవలును, ఇరువదినాలుగు రోజులు తక్కినవి మధ్యకాలముగాను నిర్ణయించిరి. అట్టి సమయమున బృహస్పతి, త్రిమూర్తులం బ్రార్థించిన సమయమనిన్నీ సర్వదేవతలు కలసి బృహస్పతీ సమేతంబుగా పుష్కరుండును, ఏనదింజేరి స్నానమాచరించి యుందురో, అట్టి సమయమునకు ఆదిపుష్కరమనియును, అంత్య పుష్కరమనియును పేర్లిడిరి. ఇట్టి దానికే బ్రహ్మాండమనియు, మహా పుష్కర మనియు, మహాపుణ్యకాలమనియు సర్వదేవతలు వారి ననుస రించి పితృదేవతలును మాతృదేవతలుకూడా స్నానార్థం నదికి వచ్చి యుందురు గావున సర్వులున్నూ దేవ, గురు, పితృ, మాతృ, యజ్ఞం బులు పిండాది స్నానదానంబులును, జరుపు వారలకు పుష్కర స్నాన తీర్థ శ్రార్థఫలితంబులు గల్గి సమీపంబునంగల శివదర్శనంబుచే యాత్రా ఫలితంబు గలుగును. అంత్యంబున కైవల్యంబు గలుగుననిన్నీ బ్రహ్మ

దేవుండునారద ఋషికిం జెప్పెను. అని స్కాందమహాపురాణమున గలదని దెలియుచున్నది. ఇట్లు విధేయుడు,

సంగాపు కోటేశ్వరగురుకులు

---

# ఆయుర్వేద వైద్యుల రిజిస్ట్రేషన్.

ఆయుర్వేద వైద్యమునొనర్చు వారెల్లరు ప్రభుత్వమువారి రిజిస్ట్రేషన్ పొందియుండవలెనను నె 231 రు G. O. ను పురస్కరించుకొని తమభావికర్తవ్యమును గూర్చి యోచించుటకై వంశపారంపర్యముగ వైద్య వృత్తియందున్న ఆయుర్వేదవైద్యులసభ ది 12-6-33 తేదీని గుంటూరునందు శ్రీకృష్ణదివ్యజ్ఞాన సమాజమందిరమున, శ్రీమాన్ ప్రొఫెసర్ డి. రంగాచార్యులుగారి ఆధిపత్యమున జరిగెను. అన్ని ప్రాంతములనుండియు షుమారు 200 మంది ఆయుర్వేదవైద్యు లరుదెంచిరి. శ్రీయుత డాక్టర్, వి. శ్రీనివాసాచార్యాగారు ఆహ్వాన సంఘాధ్యక్షులుగ నుండిరి. అనుక్రమతముగ వైద్యవృత్తిగల కుటుంబములకుచెంది 10 సంవత్సరముల కాలము ఆయుర్వేదవైద్యము నొనర్చిన అనుభవముగలవారిని యితర నిబంధనలతో నిమిత్తములేకుండ రిజిష్ట్రేషనందు చేర్చుకొనవలయుననియు అసామాన్యమైన రోగ నిదానచికిత్సా సామర్థ్యములుగల యిట్టి వైద్యుల దగురీతి ప్రోత్సహింపవలెననియును ఇందులకు అనుగుణ్యముగ ప్రభుత్వమువారు G. O. సవరింపవలెననియు కోరుచు తీర్మానము గావింపబడెను. ఇందుకు సంబంధించిన పనులను నిర్వహించుటకై "ది హెడిటరీ ఆయుర్వేదిక్ డాక్టర్సులీగ్" అనుపేర నొక సంఘముస్థాపింపబడెను. ఈ సంఘమునకు యీ సభాధ్యక్షులే అధ్యక్షులుగను ఆయుర్వేద వైద్యావతంసులగు శ్రీయుతులు నాగలింగమ్ రాఘవశర్మ, శ్రీనివాసుల వెంకటాచార్యులుగారు ఉపాధ్యక్షులుగను, వేదాంతం

రంగాచార్యులుగారు కోశాధ్యక్షులుగాను, బెజవాడ శ్రీరామమోహన
ఆయుర్వేద కళాశాల అధ్యాపకులును, ధర్మవైద్యశాలా ప్రధాన
చికిత్సకులునగు శ్రీమాన్ ఆయుర్వేద విశారద, వైద్యవిద్వాన్
చక్రవర్తుల నరసింహాచార్యులుగారు ప్రధాన కార్యదర్శిగను, శ్రీయు
తులు సంగాపు విశ్వనాథం, వేదాంతం చెన్నకృష్ణమాచార్యులు,
యల్. ఐ. యం. గార్లు సహాయకార్యదర్శులు గను ఎన్నుకోబడిరి.

వైద్యవిద్వాన్, పోగుల శివశంకరరావు

ఎ. ఆర్. ఏ.

---

Regd. No. M. 2073. సం॥ర చందా రు 3-0-0 లు.



# శ్రీ ఆదిశైవపత్రిక.

శ్రీ శ్రీకంఠమఠాధిపతుల యాజ్ఞానుసారముగా, శైవసంఘాభ్యుదయమునకై శ్రీ గురుకులాశ్రమమునుండి ప్రతిమాసము ప్రకటింపబడును.

సర్వదేవాత్మకో రుద్రస్సర్వే దేవాశ్శివాత్మకాః ।
రుద్రస్య దక్షిణేపార్శ్వే రవిర్బ్రహ్మ త్రయోగ్నయః ।
వామపార్శ్వే ఉమాదేవి విష్ణుస్సోమోపి తేత్రయః ॥
(రుద్రహృదయోపనిషత్)

సంపాదకుడు:—చిలుమూరు పురుషోత్తమ గురుక్కళ్.

| సంపుట ౯ | చిలుమూరు. శ్రీముఖనామ సం॥ భాద్రపదమాసము. | సంచిక ౬ |
|---|---|---|

(విలేఖకుల వ్యాసములకు సంపాదకులు ఉత్తరవాదులు కానేరరు)

## —♦ విషయసూచిక ♦—



భారతీ ముద్రాక్షరశాల, తెనాలి.

# మహారాజపోషకులు.

[సంవత్సరమునకు ఆరురూపాయలు చెల్లించవలెను.]

౧ రాజవైద్య నాగలింగం నందయ్య అండుసన్సువారు ఆయుర్వేదభవనం అమృతలూరు

౨ శ్రీమాన్ కొల్లిపర వీరయ్యగారు, చివ్వలూరు.
3 ... కంఠంరాజు వెంకటసుబ్బయ్యగారు, భట్లపల్లి అగ్రహారం.
౪ ... చావలి వాలయ్యగారు, పెదరావూరు.
౫ ... స్వర్ణ సుబ్బయ్యగారు, పాక్ర్డాక.
౬ ... గూడూరు లక్ష్మయ్యగారు, వెణుతురుమిల్లి.
౭ ... ఆగమిక నంజుండ దీక్షితులుగారు, రామసముద్రము.
౮ ... పసుమర్తి పార్వతమ్మగారు, కూచిపూడి.
౯ ... వెలవలపల్లి వెంకటేశ్వరదీక్షితులుగారు.

## రాజపోషకులు. [సం॥రం 1కి రు 5 0 0లు.]

౧ ఆగమిక వాలేశ్వరదీక్షితులుగారు, పుంగనూరు.
౨ శ్రీమాన్ చావలి దుర్గాప్రసాద దీక్షితులుగారు, తరిగొప్పుల.
౩ ... యలమంచిలి సుబ్రహ్మణ్యంగారు, వెదురుపాక.
౪ ... గూడలి రామయ్యగురుకులు, చినమాంభట్ల అగ్రహారం.
౫ శ్రీమతి ఇంకొల్లు అన్నపూర్ణమ్మగారు, (తాలూకాబోర్డు మెంబరు) ప్రత్తిపాడు.
౬ శ్రీమాన్ S. రామప్పగారు, (కరణం) ఉప్పరపాలెం.

## పోషకులు. (సం॥రం 1కి రు 4-0 0)

౧ శ్రీమాన్ వడ్లమూడి కోటయ్యగారు, వడ్లమూడి.
౨ ... నూతలపాటి వెంకటనారాయణ గురుకులుగారు, వరకవిపూడి.
3 ... చావలి పిచ్చయ్యశర్మగారు, చాటపర్రు.
౪ ... S. A. నంజుండయ్యగారు, శిరస్తాదారు, పుంగనూరు,
౫ ... ఉయ్యాలవాడ మునెయ్యగారు, భండ్యాత్మకూరు.
౬ ... ఆగమిక సుబ్రహ్మణ్యదీక్షితులుగారు, బెంగుళూరు.
౭ ... కొల్లిపర వెంకటసుబ్బయ్యశర్మగారు, అమ్మనబ్రోలు.
౮ ... నాగలింగం సత్యనారాయణగారు, డాక్టర్, మూలుపూరు.
౯ ... చండి ఆనందరాయుడుగారు, రూపెనగుంట.
౧౦ ... ఆగమిక చంద్రశేఖరదీక్షితులుగారు, చౌడేపల్లి.
౧౧ ... S. A. అగస్త్యప్పగారు, చారాల.
౧౨ ... మురికిపూడి వెంకటేశ్వర్లుగారు, వల్లభాపురం.
౧3 ... చావలి చంద్రయ్యగారు, పెరవలి.
౧౪ ... కూర్మగిరి శేషమ్మగారు, పాకవీడు.

# శ్రీ ఆదిశైవపత్రిక.



స ఏకోరుద్రస్స ఈశానస్స భగవాన్ సమహేశ్వరస్స మహాదేవః ॥
"అధర్వశిరసి"

| సంపుట | చిలుమూరు. | సంచిక |
| --- | --- | --- |
| ౯ | శ్రీముఖనామ సం॥ర భాద్రపదమాసము. | ౬ |

## ప్రార్థన



శ్లో॥ గజాననం భూతగణాదిసేవితం కపిత్థ జంబూఫలసారభక్షితమ్ ।
ఉమాసుతం శోకవినాశకారణం నమామి విఘ్నేశ్వర పాదపంకజం॥

శృ॥ తత్పురుషాయ విద్మహే వక్రతుండాయ ధీమహి తన్నోదంతిః
ప్రచోదయాత్ ॥.........

(శ్రీ గురుకులాశ్రమము.)

---

## సంపాదకీయములు.

స్వవిషయము.

పత్రికాపరిస్థితులలో నూతన మార్పేమియు గన్పట్టుటలేదు. సాంఘికుల యభిమానాదరణములే మేము నిరంతరము గోరుచున్నాము. పరమేశ్వరానుగ్రహమువలన ఎట్లెట్లో సంచికలు వెలువడుచున్నను గ్రాహకులు ఉత్సాహపూరితులైనట్లు గాన్పించనందున మాశ్రమ వ్యర్థ

మగునేమోయని శంకించుచున్నాము. ఉదారమూర్తుల యనుగ్రహ
మమ్ము ప్రోత్సాహపరచుచున్నది. దిగుబాటు గావించిన చంద
దారులు మామనవి చిత్తగించి పత్రికకు సహాయమొనరింప ప్రార్థిం
చున్నాము.

## శ్రీ శ్రీకంఠ శివాచార్యస్వాములు.

కాశీనుండి కురుక్షేత్రాది పుణ్యస్థలముల సేవించి శ్రీ గురు
లాశ్రమమునకు విజయంచేసి మూడుదినములుమాత్రమే నివసి
గుంటూరుమండలమున ముఖ్యస్థలములకేగి త్వరలో మదరాసు, బెం
ళూరు, చితంబరం మున్నగు పట్టణములకేగ సంకల్పించినారని వి
వించుచున్నాము. శ్రీవారు శైవవిశిష్టాద్వైతమత ప్రస్థానత్రయ శ్రీకం
భాష్యములు ఆంధ్రాక్షరములలో ప్రచురింపయత్నించుట మహాభాగ
మని మనవిచేయుచున్నాము. మహాత్ముల సంకల్పములు నిర్విఘ్నముగ
నెఱవేరగలవని మావిశ్వాసము.

## రంగయ్యరుగారి దేవాలయప్రవేశబిల్లు.

సర్వజనులు దేవాలయములో ప్రవేశించుటకు హక్కుగల్గిం
టకు భారతశాసనసభలో రంగయ్యరుగారు ప్రవేశబెట్టినబిల్లు ౧౯౩
సంవత్సరము జూన్ నెలాఖరువరకు వాయిదావేసిరి. యీలోగా వి
హారాధనలయందు నమ్మికగలవారి స్టేటుమెంట్లను గైకొనగలరట
ముందెట్లు పరిణమించునో దెలియగలదు.

## శారదా బిల్లు.

బాల్యవివాహములు జరుపరాదని శాసించినందున సనాతన
లకు మిక్కిలి చిక్కులు సంభవించుచున్నవి. తిరస్కరించిన వారి
వధూవరుల తండ్రులకు పురోహితులకు గూడ జరిమానా శిక్షల
ప్రసాదించుటచే వర్ణాశ్రమ ధర్మనిరతులు గత్యంతరము దొరకక ప

మేశ్వరుని ధ్యానించుచున్నారు. భగవానుడెట్లు గావింపగలడో నిరీ
క్షింప వలెను.

అర్చక దావాలు.

అన్ని జిల్లాలయందును ఒకేమాదిరి తీర్మానములు పుట్టినవి. గుంటూరు జిల్లాయందు మాత్రము భిన్నమార్గమగు రాజీపద్ధతి యొకటి వెలసినది. గాని అది గూడ పూర్తి ఫలవంతముగా లేదు. కొందరు హైకోర్టున కప్పీలుగావించియు, మరికొందరు మునసబు కోర్టులందు డిక్లరేషన్ దావాలు వేసియు, ఇంకాకొందరు తటస్థులుగా నుండియు, మిక్కినవారు రాజీపద్ధతికి సుముఖులుగాను యున్నారు. అసలు ఈనా ముల పట్టాలవిషయము తేలలేదు. అర్చకత్వమునకుగాను ఇవ్వబడిన దని అర్చకులును దేవునిదే గనుక ట్రిస్టీలస్వాధీనము చేయవలెనని బోర్డువారును, ఏమో మేము తేల్చుట కష్టముగా నున్నదని గవర్న మెంటువారును, ఇదేమీ తేలలేదేయని ప్రజలును పెట్టిన బాకీలు మునిగి పోవునేమో యని ఋణమిచ్చిన వారును మాన్యములెప్పుడు రాకుంటారాయని అసూయాగ్రస్తులును పరితపించుచున్నారు. దిన గండము మాదిరిగా అర్చకులు తమ జీవితమును గడుపుకొనుచున్నారు. దీర్ఘవ్యాధివలె పరిణమించిన యీ సమస్య ఎట్లు పరిణమించునది తెలి యుటలేదు. ఎందులకింతటి యాలశ్యము జరుగుచున్నది పరమేశ్వరు నకే దెలియవలెను. తీర్పులుగలవు. లా. గ్రంథములు చట్టములు శాస్త్రములు ఆచారములు భుక్తములు ధర్మములు గలవు. విచారించు టకు న్యాయమూర్తులు వాదించుటకు న్యాయవాదులు గలరు. గనుక తీర్పులు గావించి ధర్మసంస్థాపన గావించుట శ్రేయోదాయకము. బోర్డు వారు గావించుచున్న విపరీతచర్యలు గ్రామములో గల్గుచున్న అల జడులు అర్చకు లనుభవించుచున్న ఇక్కట్లు దాతలు పడుచున్న పరి తాపములు వ్రాయశక్యము గానేరదు. ఫలాఫలితము లనుభవింపక తప్పించుకొను వారెవరు?

## శ్రీకంఠమఠం-కోటిఫలి.

ఆదిశైవ విద్యార్థుల కుచితముగా అన్నవస్త్రములొసంగి వేద శాస్త్రాదుల బోధించు ప్రయత్నములు గావింపబడుచున్నవి. త్వరలో అట్టి ప్రకటనలు రాగలవు. సర్వులు అభిమానించి, మత సంరక్షణకై గావింపబడిన నిబంధనలగమనించి, మత పరిపాలన యొనరింప జేయ గలరని హెచ్చరించుచున్నాము. పాదపూజా ద్రవ్యములు అనగా కుటుంబమునకు రు౧-౪-౦లకు తక్కువలేకుండా ప్రతిసంవత్సరము పంపుచుండవలెను.

## ఉద్ధారక సహాయము.

బాపట్ల వాస్తవ్యులగు శ్రీమాన్ చావలి లక్ష్మీకాంతయ్య గారు తాముగావించిన వాగ్దానప్రకారం ఉద్ధారకద్రవ్యము ఇరువది యైదు రూపాయలు తమ సోదరులగు శ్రీమాన్ శివరామదీక్షిత హావిర్యాజిగారిచే మాకు జేర్పించినందున వందనపురస్సరముగా గైకొని మా కృతజ్ఞతను వెలువరించుచున్నాము. పరమేశ్వరుడు శ్రీ వారల కాయురారోగ్యైశ్వర్యాదు లొసంగి రక్షించుటకు ప్రార్థించు చున్నాము.

## చందాదారులు.

చిరకాలమునుంచి దిగుబాటుగావించి, అనేక పర్యాయ ములు వాగ్దానములొనరించిన, సోదర మహాశయులందరు వెంటనే తమ తమ శక్త్యానుసారముగా ద్రవ్యసహాయమొనరించి, పత్రికారాజ మును నిర్విఘ్నముగా నడచునటుల గావింప ప్రార్థించుచున్నాము. మీ సహాయములు త్వరలోరానియెడల పత్రిక నిలచిపోగలదని విన్నవించుచున్నాము.

## యీ నెలలో చందాలుచెల్లించినవారు.

౧ శ్రీమాన్ ఆగమిగ కైలాస సుందరశర్మగారు పల్లిపట్టు (చిత్తూరు)
౨ ,, గుడ్లూరు వెంకయ్యగారు కరేడు (నెల్లూరు)
౩ ,, దొంతుకుర్తి గంగాధరంగారు ఏడిద (గోదావరి)
౪ ,, నూతలపాటి వెంకటసుబ్బయ్యగారు సర్వేపల్లి (నెల్లూరు)
౫ ,, వెలవలపల్లి చినకామన్నగారు పామఱ్ఱు (గోదావరి)
౬ ,, ఇంకొల్లు సాంబయ్యగారు మాదరాజుగూడూరు (నెల్లూరు)
౭ ,, అర్చకం కాళప్పదీక్షితులుగూళూరు(ఆంగీరస)(బెంగుళూరు)
౮ ,, అయలూరు నీలకంఠంగారు ఖండివరం (విశాఖపట్టం)
౯ ,, పోగుల వీరభద్రయ్యగారు తుర్లపాడు (గుంటూరు)
౧౦ ,, గూడూరు కుటుంబయ్యగురుకులుగారు మండవల్లి (కృష్ణా)

### పుష్కర సన్మానములు.

౧ శ్రీమాన్ స్వర్ణ వెంకటశివావధానులుగారు బూతుమల్లి ౧౦౦
౨ పావులూరు నాగేశ్వరశర్మగారు అనంతవరం ౧౦౦

## స్వాగతమ్.

శ్రీ బోధానన్దయతీన్ద్రాణాం పాదకమల సవిధే:-

౧

సాధనైకాగ్ర చిత్తాబ్జ!
బోధానంద విశిష్టధీః!
సంమైకకర్మ మర్మజ్ఞ!
బోధానందాస్తు స్వాగతమ్ !!

౨

పురాస్మిన్ సంఘేఽభూత్ ప్రథిత యశసాం జన్మ విమలమ్;
సుధా ధారాకారా కలిత కవితా నైపుణజుషామ్;
మహాధర్మాధ్యానాం; మహిత నిఖిలామ్నాయ విదుషామ్;
పరావృత్తేకాలే, శ్రితనిజపురావృత్తి మహతామ్.

3

చక్రే శ్రీ కంఠ గురుః
పారంతత్త్వార్థ రూప దివ్యాబ్ధేః;
భాష్యంసంఘీయానాం
ఆస్తే పరమార్గ నిహిత సుజ్యోతిః.

౪

పూజ్యాభవన్మనీషా
తత్త్వం సర్వైశ్చజ్ఞేయ మిత్యేషా;
శ్రీ కంఠ కృతి సుపోషా;
భవ్యాంధ్రార్థ విహిత సద్భూషా.

౫

జాగర్తు భావ కుసుమమ్
సాంఘిక చిత్తాఖ్య సల్లతావితతౌ,
శమయతు గాఢాజ్ఞానం
యుష్మత్సంచార సూర్యకర నికరః.

వినీతస్య, వేంకటేశ్వరస్య } 10—9—1933 అమృతపురీ.

## పర్యటనము.

శ్రీ శ్రీ శ్రీ బోధానంద మహర్షులవారు శ్రావణబహుళ అమా వాస్యకు గ్రహణము నిమిత్తము కురుక్షేత్రమునకు విజయముచేసి, అక్కడ మూడుదినములు గడపి, ఈశ్వరాదేశము ననుసరించి, శ్రీకంఠ భాష్యోద్ధరణ దీక్షాబద్ధులయి ఆంధ్రలిపిని వానిని వెలయించు సంకల్ప మున సంచారముచేయుచు నంది వెలుఁగు గ్రామమున నొకదినముండి వారి సత్కారముల నందికొని తరువాత చిలుమూరు శ్రీ గురుకులా శ్రమమున దినత్రయము గడిపి వారి పరిచార్యావిశేషముల స్వీకరించి అనంతరము చావలికి విచ్చేసి-అక్కడ పదునొకండు దినములుండి వారి

సేవాస్వరూపసత్కారముల పరిగ్రహించి అనంతరము అమృతలూరు నందు మూడు దినములుండి వారి స్వాగత వరివస్యల స్వీకరించి, ఇటూరు యాజలి పొన్నూరు మునిపల్లె దండమూడి గ్రామముల సందర్శించి-నవరాత్రారంభమునకు శ్రీవారి శిష్యబృంద సమాహ్వానము నంగీకరించి మదరాసునకు వెడల నున్నారు.

శ్రీశివాయపరస్మై బ్రహ్మణేనమః.

# ప్రస్థానత్రయ శ్రీకంఠభాష్యప్రకటన పత్రికా.

ఆర్యా ! అభిజ్ఞామణాయః; అర్పయతకించిదిహాచక్షుషీశ్రీవ సీవా ఇహాకిల మోక్షఏవ పరమపురుషార్థస్సచ బ్రహ్మజ్ఞానైకసాధ్య ఇతిచ సమస్తాస్తికకుల సంప్రతిపన్నోయం సిద్ధాంతః తచ్చ బ్రహ్మ ప్రస్తానత్రియ (బ్రిహ్మసూత్రిభాష్య గీతాభాష్య ఉపనిషద్భాష్య) తత్వార్థసమధి గమ్యామితి తస్యప్రిస్థానత్రియస్య శ్రీమాన్ భగవదవ తార సంభూతః మహామహిమా శ్రీకంఠ నామాయోగాచార్యః విర చయ్య విశద తరమాదిశైవానాం విశిష్టాద్వైతభాష్యం పరశివ తత్వ మేవ పరమార్థ ఇతివివృణుతెస్మ యథావత్తాత్వికం తత్తాత్పర్యం ఇద్ధ నుత్యావశ్యకమప్యాది శైవానామాదిమమపి నిఖిలభాష్యాణామిదం శ్రీ కంఠభాష్యం శ్రీకంఠభగవత్పాదాచార్యాణాం జన్మభూమావాంధ్రి దేశే ప్రసిద్ధతరాంధ్రిలిపిషున కేనాపి ప్రకటితమాసీత్ తదిదమధ్య ప్రసి ద్ధతరాంధ్రిలిపిషు సమీచీన పత్రేషుముద్రిణాదినా ప్రాచుర్యమవస్య నుపాదనీయ మితివిచారాత్ ప్రియతమానం శ్రీకంఠమఠాధిపం శ్రీకంఠ శివాచార్యాపరాభిధానం బోధానందమహర్షిణం సముచిత పాదపూజాదిసాహాయ్యదానేన సంతోషయంతు సర్వేపిసహృదయాస్స ఫలయంతు చాముం వ్యవసాయమితిశివం॥ ఓం. శాంతి. శ్శాంతి. శ్శాంతిః.

శ్రీ శ్రీకంఠశివాచార్యాపరాభిదాన

బోధానంద మహర్షిః శ్రీకంఠమఠం.

మకాం. శ్రీగురుకులాశ్రమము.

' ఓం నమశ్శివాభ్యామ్ '

# బోధాయన సూత్ర నిర్ణయము.

ఆస్తికజనశిఖామణులారా !

గత సంచికలయందు నాగమప్రామాణ్యముం గూర్చి యథామతి పరిశీలించి, విషయము గోష్పదయ్యును విస్తరభీతిని బహుప్రమాణ వచనములను విడచి కొంతముచ్చటించితిని. దానంజేసి వేదములకును, నాగమములకును, నున్న సంబంధము నాతివిశేషముగాఁ బరిశోధింపఁబడిమె. ఇక బోధాయనోక్త గృహ్యసూత్రములం గూర్చి నా శక్తి కొలందిని విమర్శింపఁ బూనుకొన్న నా సాహసమును బండితప్రకాండులు మన్నింతురు గాక.

అస్మదీయమగు భరతభూమి తొల్లి యొకప్పు డాధ్యాత్మిక విద్యయందు ముందంజ వేసియుండెడిదని మున్నే మనవిజేసికొని యున్నాఁడను. భారతీయాధ్యాత్మిక తత్వముంగని పాశ్చాత్య పండిత ప్రకాండులు (మ్యాక్సిమ్యల్లరు స్కోపన్హ్వార్ లోనగు) అచ్చెరువంది మన తెలివితేటలం దిలకించి, చిరీర్యమాణగాత్రులంబురని పెక్కు పాశ్చాత్య గ్రంథములుగ్గడించు చున్నవి. బ్రహ్మస్వరూపము నెఱుంగుటకు ముందు కర్మ బ్రహ్మస్వరూపము నెఱుంగుట సముంజసమని మన యార్యులమతము. 'అథాతో బ్రహ్మజిజ్ఞాసా ' అను సూత్రమునందలి "యథ" యను శబ్దమునకు ధర్మవిచారానంతరము బ్రహ్మవిచారమని శ్రీ శ్రీ కంఠ శివాచార్యులవారు స్వభాష్యమునఁ జెప్పినారు. మఱియునందే "తథా చాభియుక్తస్మృతిః" 'యస్యైతే చత్వారింశత్సంస్కారా" ఇత్యాదినా. సబ్రహ్మణస్సాయుజ్యం సాలోక్యంచ గచ్ఛతీ" త్యంతేన గర్భాధానాది సకల కర్మణాం పాపమలాప కర్ష సంస్కార హేతుతాం ప్రకాశయతి" ఎవ్వాడు నలువది నాలుగు సంస్కారముల నాచరించునో వాఁడు బ్రహ్మముయొక్క సాయుజ్యమును సాలోక్యమును బొందుచున్నాఁడనుటచేత గర్భాధానాది సకలకర్మములు పాపసంబంధమగు మలను, శుద్ధిచేయు సంస్కారమునకుఁ గారణములని ప్రకాశింపఁజేయుచున్నాడు.

ఇందువలన ధర్మస్వరూపములగు కర్మలాచరించుట ముఖ్యమని యెఱుంగవలెను. కావుననే మీమాంసకులు కర్మమునకే బ్రహ్మత్వము నంగీకరించి సిద్ధాంతీకరించు చున్నారు. కర్మసాక్షాత్తుగా మోక్షహేతువు కాకపోయినను జ్ఞానమునకు హేతువనుట యందరు నంగీకరింప వలసిన విషయమే. కామ్యములగు కర్మలకు నిందగలదే కాని, నిత్యకర్మలకుఁ బరిత్యాగము యుక్తమయినదిగాదు. కావుననే "నియతస్యతు సంన్యాసః కర్మణోనోప పద్యతే" అని భగవంతుఁడు నియతకర్మ పరిత్యాగమనర్హమని నిస్సందేహముగఁ బలికినాఁడు. నిత్యకర్మలను విసర్జించుటవలనఁ బ్రత్యవాయము గలదని శాస్త్రములం జెప్పఁబడినది. ఇయ్యది విషయాంతరమను భీతిచే నింతమాత్రమ సూచించితిని ఇందువలన కర్మలు, బ్రహ్మజిజ్ఞాసకు సాధనము లనుట నిర్వివాదము.

గర్భాధానాదాది సకలకర్మములను బ్రాహ్మణులయ్యె శాఖవారు స్వస్వగృహ్య సూత్రానుసారముగా నెరవేర్పవలెను. ఈగృహ్యసూత్రములను రచించినవారిలో బోధాయనుఁ డొందును బ్రథముఁడుగా బరిగణింపఁ బడుచున్నాఁడు. అగ్నివైశ్య సూత్రమున "అథాతస్సూత్రగణాన్ వ్యాఖ్యాస్యామః బోధాయనమాపస్తంబం సత్యాషాఢంద్రాహ్యాయణ మాగస్త్యంశాండిల్య మాశ్వలాయనం శాంభవంకాత్యాయన మితిపూర్వ సూత్రాణి వైఖానసం శౌనకీయం భారద్వాజ మాగ్నివేశ్యం జైమినీయం వాధూలం మాధ్యందినం కౌండిన్యంకౌషీత కమితి నవాన్య పరసూత్రాణి అష్టాదశసంఖ్యాతాశ్శరీర సంస్కారాః ఇతి" సూత్రములను పరిగణించునపుడు బోధాయనములోనగునవి పూర్వసూత్రములనియు, వైఖానసము మొదలగునవి యపరసూత్రములనియు, నన్నియును జేరి పదునెనిమిది యనియు లెక్కింపఁబడినవి. వానిలో నన్నింటను బోధాయన సూత్రమే యాదిమసూత్రముగా నెన్నఁబడినది. ఇంకను దీని ప్రాశస్త్య మీ విధముగా నుగ్గడింపఁబడినది. ఎట్లన « స్వసూత్రే విద్యమానేతు పరసూత్రేణ వర్తతే బోధాయన మతం కృత్వా స్వసూత్ర ఫలవాగ్భవేత్. తన సూత్రమున్నను బర

సూత్రమునఁ బ్రవర్తించువాఁడు బోధాయనానుసార మాచరించినచో స్వసూత్ర ఫలమునందఁగలఁడని దెల్పుటచేత బోధాయన సూత్రము నకుఁ బ్రాశస్త్యమును బ్రాముఖ్యమును జెప్పఁబడినవి. మఱియు నిట్లే "భూతిశాసన గ్రంథే" అన్యేషాంశాఖినాం భస్మశ్రీబోధాయన శాసనాత్. యజ్ఞోపవీత వద్గ్రాహ్యమన్యథావిపరీతానహి, అనుక్తమస్య తోగ్రాహ్య సర్వేషామపి సూత్రిణామ్ బోధాయనమతం కృత్వా సర్వ మేవకృతంభవేత్." ఇతర సూత్రములవారికి బోధాయనానుజ్ఞ వలన యజ్ఞోపవీతమువలె భస్మముగ్రాహ్యమైనది. సమస్త సూత్రావలం బులును స్వస్వసూత్రమునఁ జెప్పనిదానిని సూత్రాంతరమునుండి గ్రహించుకొనవలెను. బోధాయనసూత్రప్రకారమాచరించినచో సర్వము చేయఁబడిన దగునని యనుటవలనను నీసూత్రప్రాశస్త్యమే విదితమగును. కావున బోధాయనసూత్రము సర్వోత్తమ మనుటవ్యక్తము.

ఆదిశైవులందఱును నీ సూత్రమునే యనువర్తింపవలెననియు బోధాయనుఁడాదిశైవుఁడనియు నాగమశాస్త్రములు నుడువుచున్నవి. సూత్రకారుఁ డాదిశైవుఁడైన కారముననే యాదిశైవుల కందఱకును స్వసూత్రమనుల్లంఘనీయ మనుట వేఱుగఁ జెప్పనవసర ముండదుకదా! కావున నా ప్రమాణవచనములం గొన్నింటిని సంగ్రహించిన వానిని మనవిచేసుకొనుచున్నాఁడను.

ఏతద్విషయమున నాగమప్రామాణ్యమేకదా మనకత్యం తావశ్యకము. శివాగమములందిట్లు చెప్పఁబడినది. "ఉత్తరవాతులే చర్యాపాదే భగవద్వంశజాస్తస్మాత్ ఇత్యారభ్య మంత్రసిద్ధాంత వర్త్మనా దీక్షయిత్వాయథాన్యాయం లింగతో భద్రమండలే ఆహూతాః దీక్షితాః దేవి కర్తవ్యమిదమాదిశమ్. యజుశ్శాఖామధీ త్యంహి సూత్రం బోధాయనాహ్వయమ్, సంస్కృతీశ్చ నిషేకాదీస్సోమ యాగాది కర్మచ కౌశికాది పంచఋషులు భగవద్వంశమున నుత్పన్ను లగుటవలన వీరు దీక్షితులు. తద్వంశమున జనించినవారికి నాగ మోక్త మార్గముగా లింగతోభద్ర మండలమున దీక్షయొసంగి

"యజుశ్శాఖాధ్యయనము సేయుఁడనియు, బోధాయన గృహ్య సూత్రోక్త మార్గమున నిషేకాది సంస్కారములను సోమయాగాది కర్మలను నాచరింపుఁడనియు శివుఁడు పార్వతింగూర్చి పల్కెను.
(2) "ఆగమ సారసంగ్రహే—ద్వితీయపటలే—శైవోత్పత్తింకథందేవ బ్రూహిమే పరమేశ్వర, సాధుసాధు మహాసేన యత్త్వయాపరిచోదితమ్. ఇత్యారభ్య కులమాచార వేదంచ పదంసూత్రప్రమాణకమ్ గోత్రగోచరసంతానమఠం సిద్ధాంతమేవచ, ఏవంక్రమాత్సురశ్రేష్ఠ విస్తరేణాథకథ్యతే, సృష్ట్వాదౌ సర్వమర్త్యానాం తేషాంసృష్టి రుదీరితా మర్త్యానాం మలనాశాయ తేషాంసృష్ట్యర్థ ముద్భవః, పరార్థపూజ నార్థాయ పరేషాంబోధనాయచ, స్థాపనప్రోక్షణే దీక్షావిధివా కృత్యకారిణామ్, ఉత్పత్తిమాది శైవానాం తత్స్వరూపం నిరూప్యతే వింధ్యాద్రే రుత్తరేభాగే శైవానా ముద్భవస్మృతః, త్రిపుండ్రాంకిత సర్వాంగా రుద్రాక్షవలయాన్వితాః, ఆర్యావర్తసముద్భూతా ద్రవిడస్యకులోద్భవాః, రుద్రాక్షముపవీతంచ సోష్ణీషాస్సోత్తరీయ్యకాః, భస్మచైవాది శైవానాం పంచముద్రాః ప్రకీర్తితాః... ... ... ... ... సర్వవేదాధికారిత్వం సర్వశాస్త్రాధికారతా, సర్వాగమాధికారిత్వం శివవిప్రస్య విద్యతే, సూత్రంబోధాయనం ప్రోక్తంతేన కర్మాణికారయేత్, అన్యసూత్రావలంబీ చేత్పతత్యేవనసంశయః,... ... వేదానాం ఋగ్యజుస్సామ్నాంతేషా మధ్యయనంస్మృతం, అధ్యాపనాది కంచాపి శివేనాదావ్రకీర్తితం, అధ్యాపనాది కర్తవ్యం సూత్రంబోధాయనం స్మృతం, శబ్దతర్కసమాయుక్త మీమాంసాపఠనంతథా, తచ్చబోధాయనీయంచ దృష్ట్వాకర్మ సమాచరేత్ తస్మాద్బోధాయనీయం హి తేషాం శాస్త్రముదీరితమ్॥

షణ్ముఖుఁడు పరమేశ్వరుని ప్రశ్నించెను. ఓ పరమేశ్వరుడా, శైవుల యుత్పత్తిమెట్లో నాకెఱింగింపుమన, ఓ మహాసేనా, నీవడిగిన ప్రశ్నమంచిది. ఆదిశైవుల కులాచార వేదనములను గోత్రసూత్ర సంతాన మఠసిద్ధాంతాదికమును క్రమముగా సవిస్తరముగఁ జెప్పు

చున్నాను. సృష్ట్యాదియందు వీరు సర్వమర్త్యులకన్న మున్ను సృజింపఁ బడిరి. మర్త్యుల మలనాశనమునకును యజనాది కర్మమూలమున వారి సృష్టికిని పరార్థస్వార్థయజనములకును, బోధనమునకును వీరు జనించిరి. శైవదీక్షా విధానముచే స్థాపన ప్రోక్షణాదికార్యముల నొనరించు వీరి యుత్పత్తియు స్వరూపమును, జెప్పఁబడుచున్నవి. వింధ్య పర్వతమున కుత్తరమున శైవులయుత్పత్తియని దెలియవలెను. వీరు త్రిపుండ్రాంకిత సర్వాంగులు. రుద్రాక్షమాలికాధరులు. ఆర్యావర్తమున ద్రవిడ వంశమున బుట్టినవారు. రుద్రాక్షలు, ఉపవీతము, ఉష్ణీషము, ఉత్తరీయము, భస్మము అను అయిదుముద్రలు వీరికిఁగలవు. సర్వవేదములకును, సర్వశాస్త్రములకును, సర్వాగమములకును వీరికి నధికారముగలదు. సూత్రము బోధాయన మగుటవలన నద్దానిచేఁ గర్మలనాచరింపవలెను. అన్యసూత్రము నవలంబించినవాడు నిస్సందేహముగాఁ బతితుఁడగును. అందే ఋగ్యజుస్సామముల యధ్యయనాధ్యాపనములు శివునిచే ముందుఁజెప్పఁబడినవి. కావున నధ్యాపనాదులును జేయదగినవి. శబ్ద తర్క-మీమాంసాది శాస్త్రములు పఠింపవలెను. సూత్రము బోధాయనమగుటవలన నద్దానిచేతనే కర్మల నాచరింపవలెను. (3) కామికాగమే—ఆచార్యలక్షణ పటలే. ఆచార్యాది సమారభ్య పరిచారసమావధి. సూత్రంబోధాయనం ప్రోక్తమన్య సూత్రం నకారయేత్, అన్యసూత్రోద్భవేనాపి శివదీక్షా ద్విజన్మనా కృతాచేత్పూర్వసూత్రం సత్యక్త్వాబోధాయనంచరేత్ బోధాయనంచ గృహ్ణీయాచ్ఛివదీక్షాం సమాచరేత్" ఆలయమున నాచార్యుఁడాదిగాఁ బరిచారకుని వరకును గలవారందరును బోధాయన సూత్రావలంబులై యుండవలెను. అన్యసూత్రస్థుఁడు యోగ్యుఁడు గాఁడు. అన్యసూత్రస్థుఁడైనను శివదీక్షనుబొంది స్వసూత్రమును విడిచి బోధాయనము నాచరింపవచ్చును. (4) పావనతంత్రేఆచార నియమాః సర్వాః బోధయేదగ్నిసన్నిధౌ, మంత్రైః పరస్యా నాఖ్యేయో నాన్యసూత్రం ప్రదర్శయేత్ ఇత్యుపక్రమ్య॥ శ్రౌతస్మా

ర్తాని కర్మాణి సదా శేవేత నేతరత్, బోధాయనోక్తవిధినా నిషేకాది క్రియాభవేత్ కుర్యాత్సర్వాణి కర్మాణి ఈశ్వరధ్యానతత్పరః॥ సమస్తములైన యాచార నియమముల నగ్నిసన్నిధియందు బోధింపవలెను. ఇతరులకు మంత్రమును జెప్పఁగూడదు. అక్షసూత్రము నితరులకుఁ జూపఁగూడదు. అని మొదలగునవి శ్రౌతస్మార్తకర్మల నన్నింటిని సేవింపవలెను. బోధాయనోక్తమార్గమున నిషేకాదిక్రియల నాచరింపవలెను. సమస్తకర్మముల నీశ్వరధ్యాన తత్పరుండై యాచరింపవలెను.

"(5) పద్మసంహితాయామ్... దేవాలయస్య నిర్మాణే ప్రధమం వరయేద్గురుం। మమక్త గోత్రసంభూతం పారంపర్యేణ దీక్షితం। తథావిధంగురుం। పంచగోత్రే ష్వన్యతమోద్భవం। శ్రీకృష్ణయజుర్వేదస్థం బోధాయనమతేస్థితమ్। శివాగమార్థతత్వజ్ఞం కుశలంకర్షణాదిషు." దేవాలయనిర్మాణమునఁ బ్రధమమున శివగోత్రమున జనించినవాఁడును, బరంపరగా దీక్షనొందినవాఁడును, పంచగోత్రములలో నొక గోత్రమునకుఁ జేరినవాఁడును, శ్రీకృష్ణయజుశ్శాఖకుఁ జేరినవాఁడును, బోధాయన సూత్రస్థుఁడును, నాగమరహస్యముల నెఱింగినవాఁడును, కర్షణాదుల నేర్పరియగువాఁడును, నగు వానిని గురువులుగా వరింపవలెను.

"(6) భీమసంహితాయాం ఆదిశైవ సమయకధనే- సంహితాధ్యయనంచైవ వ్యాఖ్యానం శ్రవణంతథా। యజనాధ్యాపనంచైవ జపహోమం సమారభేత్। బోధాయనోక్తమార్గేణ గర్భాధానాది సర్వశః। దేశికస్సతతంకుర్యా చ్ఛాంభవానాంచభాషణమ్" దేశికుఁడగువాఁడు సంహితాధ్యయనాధ్యాపనాదులును జపహోమాదులు నారంభింపవలెను. బోధాయనోక్తమార్గముగా గర్భాధానాది సంస్కారములను గావించుకొనుచు శైవులతోడ సంభాషణము జేయవలెను.

"(7) బోధాయన గృహ్యసూత్రశేషే-ద్వితీయప్రశ్నే-వింశోధ్యాయే-పంచగవ్యవిధా=అథాభ్యుక్ష. శకలంనిరస్య అపఉపస్పృశ్య-భూర్భువస్సువరోం- బ్రహ్మణేనమః- ఇతిమధ్యపదేభ్యర్చ్య. ఈశానాయనమః ఇత్యాద్యభ్య-వ్యోమవ్యాపినాసంపూజ్య. పంచగవ్యంభవతి- ఇత్యంతమ్" ఇటుఁ

బంచగవ్య విధియందు బోధాయన గృహ్యసూత్రమాగమ శాస్త్రమను కరించుచు నాగమశాస్త్రములందలి పంచబ్రహ్మ, షడంగవ్యోమవ్యాపి మంత్రములనే యుపయోగించుచూ, నాగమములతోడ సామరస్యము బొందెడిని. సూత్రకారుడాగమ సంప్రదాయ మనుకరించుటంజేసి పూర్వముజెప్పిన యాగమ ప్రామాణ్యమునకు నిదియుఁ గారణమగుచు నాగమవిదులగు నాదిశైవులకు నీసూత్రమే యవలంబనీయమని వచియింపవలసిన యవసరముండదని వ్రాక్కుచ్చువాఁడను....

"(8) బోధాయనుఁ డాదిశైవుఁడని యనేకాగమశాస్త్రములు ఘోషించుచున్నవి. ఇవ్విషయము నఘోరశివాచార్యుఁడు తనక్రియాక్రమద్యోతికయందు మిక్కిలి చక్కఁగాఁ బ్రతిపాదించినాఁడు. మఱియుఁ బూర్వకారణాగమమున షడ్వింశతి పటలమున-"కౌశికోనం దకోదక్షో-ఇత్యుపక్రమ్య బోధాయన సనాతనా, అనియు నందే "కులేష్వేతేషు సంజాతాస్త్వాదిశైవాఇతిస్మృతాః" పైవారికులమునబుట్టినవా రాదిశైవులని తలంపవలెననుటచే బోధాయనుఁడాదిశైవుఁడేయని స్థిరపడుచున్నది. ఆదిశైవాచారములను దెలుపుస్థలములందు ఆదిశైవులకు బోధాయన సూత్రమే ముఖ్యమని విధించు నాగమములు. ఈతఁడాదిశైవుఁడు గాడను సందేహమును దూరీకరించుచున్నవి. (9) మఱియు బోధాయనుఁడు చెప్పిన మహాన్యాసమునందు "షట్త్రింశతత్వాత్మకం" అని యాగమములలోదెల్పఁబడిన షట్త్రింశత్తత్వములనుబరామర్శించుటయు, నితఁడాదిశైవుఁడనుటకు సాధకమగును. (10) వరుణశివపద్ధత్యాం. ఆగమసారే=ఏవంభూతానామేతేషాం పంచగోత్రిణామన్యగోత్రిణాంచ యజుశ్శాఖామధీతవతాం. తైత్తిరీయాభ్యావతాం వైదికత్వే నాద్యాపి పరిదృశ్యమానత్వాత్, పూర్వోక్తప్రమాణేషు యత్పరశ్రుతి నామక సిద్ధాంతశాస్త్రమపిశ్రుతమితిదృష్టం, తద్రీత్యా గర్భాధానాది సంస్కారాణామనుష్ఠీయ మానత్వాదేతైరే వాలయార్థమేతత్సర్వం శ్రుతం నస్వానుష్ఠానాయేతిచ విజ్ఞాయతే. ఏతద్విషయమధికృత్య, నిగమాగమ. సర్వస్వే పంచదశాధికారే శ్రీకంఠాచార్య భగవత్పాదైః "యఏతే వంశ

పరంపరయాకృష్ణయజుశ్శాఖామధియానాః బోధాయనగృహ్యోక్త మార్గేణ గర్భాధానాది సంస్కారాన్ కుర్వతే" ఇతి సమ్యగుక్తమ్" ఇట్టివారును, పంచగోత్రస్థులును, నన్యగోత్రస్థులును, యజుశ్శాఖను జదివినవారును, తైత్తిరీయాఖ్య గలవారును నగు వీరికి వైదికత్వము చూడఁబడుచున్నందువలన ముందటి ప్రమాణములందుఁ బరశృతియను పేరుగల సిద్ధాంతశాస్త్రిముగూడ శ్రుతమని విదితమగును. ఎందువలన ననఁగా, నాదిశైవులాగమోక్త విధానమున గర్భాధానాది సంస్కారముల నాచరింపక పోవుటవలన నట్లు చెప్పఁబడినది. అదియంతయు నాలయార్థమే చెప్పఁబడినది కాని స్వానుష్ఠానార్థముగాదు. అని తెలియఁబడును. యీవిషయము నధికరించి శ్రీకంఠాచార్య భగవత్పాదులవారు ఆదిశైవు లెవరుకలరో వారు కృష్ణయజుర్వేదమును జదువువారై బోధాయనగృహ్యోక్తమార్గమున గర్భాధానాది సంస్కారములను జేయుచున్నారని చెప్పినారు.

ఆదిశైవ మహాశయులారా! పూర్వోక్త ప్రమాణవచనముల వలన నాదిశైవులైన మనకు బోధాయనగృహ్యసూత్రమే గర్భాధానాది కర్మకలాపముల నాచరించుటకుఁ బ్రబలాధారమైనదని విస్పష్టముగా సిద్ధాంతీకరింపఁబడుచున్నది. కావున నేమూలనోడాఁగి స్వానుష్ఠేయత్వమునకు దూరమైయున్న యీసూత్రమును మన మాచరించి ధన్యులమగుదుముగాక యని ప్రార్థించుచున్నాడను.

ఇందుఁ బర్చనీయములగు నాశముల దోషములున్నచో వానిని సమీకరించుకొనఁ గలవాఁడను. గుణలేశమున్నఁ బరమాదరబుద్ధిని బాడితాఖాడులు దానింబరిగ్రహించి యానందించి నన్నుఁ జరితార్థుని గావింతురుగాక. ఓం. శాంతి. శ్శాంతి. శ్శాంతిః.

ఇట్లు,

మైసూరు సంస్థానం ముజరాయి కమీషనర్ ఆఫీసు } శైవాద్యాగమ పంచానన మహావిద్వాన్, ఆగమిక నందీశ్వరదీక్షితులు.

---

## ప్రకటన.

ఆదిశైవ మహాజనసంఘము వారికి—

గోదావరీ మండలాంతర్గత శ్రీకోటిఫలీ మహాక్షేత్రమున స్థాపించిన శైవవిశిష్టాద్వైత మఠాధిపతులగు శ్రీశ్రీకంఠశివాచార్యులవారి పూజాకైంకర్యాదు లొనరించుటకును వేదశాస్త్రపాఠశాలను పోషించుటకును మఠ సంరక్షణగావించుటకును ప్రతికుటుంబ మేనేజరు సంవత్సరమునకు రు॥ ౧-౪-౦ లు గాని అంతకు ఎక్కువగాని పాదకానుకను మా యాజ్ఞానుసారము శ్రీ ఆదిశైవ పత్రికా ఆఫీసునకు లేక శ్రీకంఠమఠమునకు జేర్పించగలందులకు హెచ్చరింపబడుచున్నారు. ఓం ఓం ఓం

కోటిఫలి. }<br>
గోదావరి జిల్లా, } శ్రీకంఠమఠాధిపతి.

## మనస్థితి—మన కర్తవ్యము.

(శ్రీమాన్ వింజరపు వెంకటాచార్యులుగారు)

"ఆయము తెలసి వ్యయముచేయుము" అనునది చాల ననుభవసిద్ధమగు వచనము. వచ్చిన సొమ్మంతయు వెచ్చించుట మంచి పద్ధతి కానేరదు. అందుకొంత నిల్వచేసుకొనవలెను. అటుల చేయనియెడల రోగముచే పీడింపబడునపుడు, శుభకార్యముల నిర్వర్తింపవలసి వచ్చినపుడును, చేత గాసునైనలేక పలుబాధలకు లోనుగావలసి వచ్చును. కుబేరునంతటి సంపన్నునికైనను తనకు వచ్చు నాయముకంటె వ్యయమధికముచేసినయెడల దుర్దశ సంభవించును. కాబట్టి తనకునెంత యాదాయము వచ్చునో, దానిని గుర్తెరిగి ప్రతిపురుషుడును, వ్యయ మొనర్చ

వలెను. సంఘసభ్యులలో మితవ్యయము, పరస్పరసహాయమును, ఐక
మత్యమును, మొదలగు వానిని వృద్ధినొందించుట మాఆశయము.

పంటలు సమృద్ధిగాయుండి మంచి ధరలు వచ్చిన కాలములో
బంగారు నగలు నాణెములు మేడలు మిద్దెలు బంగారు వెండి బిందెలు
చెంబులు చేటలు పీటలు వీనితో క్రిందు మీదుగానక వచ్చినదానికి
మూడంతలు ఖర్చుపెట్టి యెగిరి యిప్పుడు చతికిలబడినాము. యిపుడు
చేతులవి మెడలవిగాక మూలమూలలగల పాతులుకూడ కదలిపోయి
నవి. యింటిలోని సారము, వంటిలోని సారము, భూమిలోని సారము
కూడ తగ్గిపోయినది. కనుక మనము మార్గమేదియో విచారించుకొన
వలెను.

యిపుడుండు పరిస్థితిలో మనము నిలువబడి జీవించవలెనంటే
పరస్పరసహకారము సంఘీభావము మిక్కిలి అవసరమై యున్నది.
"ఎవరికివారే యమునాతీరే" అను భావములో యుండి, పొరుగింటి
వాకి మనయింటిమీద వాలకూడదని, కక్షలతో నున్నంతకాలము,
మోక్షము లేదు. మనలోయుండే కక్షలు నాశనము కానిచో, మనము
నాశనము కాక తప్పదు. యే నలుగురో, ముగ్గురో బోర్డును నిందించిన
ప్రయోజనము లేదు. పంటలుతగ్గి, శిస్తులుతగ్గి, ఖర్చులు హెచ్చిపోయి
నప్పటికీ, మనకుజ్ఞానోదయము కానప్పుడు, మరియొకప్పుడు తెలివిరాగ
లదా ? మన మొట్టమొదటి కర్తవ్యము, కక్షలను వదలిపెట్టి సమిష్టి
సౌఖ్యమునకు పాలుపడ నేర్చుకొనవలెను. ఇది సంఘముల మూలమున
గాని నెరవేరదు. కావున సంఘనాయకులనువారు మెలకువతో సంఘ
ముల నుద్ధరింతురుగాక!

అర్చకుండు నిరక్షరుడు, నిర్ధనుడు, సంఘీభావము! పలుకు
బడిలేనివాడగుటచే, నిర్లక్ష్యము చేయబడి నులిమివేయబడుచున్నాడు.
ధనికులైన అర్చకులు కొందఱు, సంఘమును నిరసింపవచ్చును. కాని
వారెంతకాలము యేకాకిగా నుండగలరు? అర్చకులు జాగ్రత్తగా జీవిం
చుటకును, దుర్వ్యయము చేయకుండుటకును, నేర్చుకొనవలసి

యుండును. సొమ్ము దుర్వ్యయముచేసి, చదువునకు స్వస్తిచెప్పి సోమరియై మిత్రబృందముతో వీధులవెంట తిరుగుట తగునా? ధనముతగ్గిన కొలది, మిత్రబృందము తగ్గుచుండును. కాసు చేతలేకున్నచో మిత్రులే కాక బంధువులు సహితము విడనాడుదురు. కనుక విద్యాధనములు రెండును సంపాదించవలెను.

మనము భగవదారాధన చాలయశ్రద్ధగా చేయుచున్నామేమో యని అసూయాపరులు అనెదరు. ఈ సందర్భములలో మనయువకులు అనేక శాస్త్రీయపద్ధతులను నేర్చుకొనవలసియున్నది. ఏపనియైనను మనము తెలివితోను, సంఘీభావముతోను మెలగినగాని నెరవేరదు. మనయందు పట్టుదల, సంఘీభావములేనిచో మనమాటను యెవరును వినిపించుకొనరు. అర్చకుల స్థితి మిక్కిలి దుర్భరముగానుండుటచేవారిని యుద్దేశించి ప్రధానముగా యీహెచ్చరిక చేయబడుచున్నది. తగాదాలలో చూపు తెలివితేటలలో, పదియవ వంతైనను ఆత్మలాభము కొఱకు చూపుదురుగాక! పాండవులు ఐకమత్యముచే జయము నొందిరి. అట్టి అయిక మత్యమునే, మనము విడనాడకుండవలెనని, ప్రార్థింపుచున్నాను. మనబాలురందఱును దురాచారములను విడచి, మన శాస్త్రీయాచారములం దభిరుచికలవారై యుండవలెను. మనము దేవుని చూడలేముగాని, ఆయనప్రతిక్షణమందును మనలను చూచుచుండును. మనము భగవంతుని దృష్టినుండి తప్పించుకొని పోలేము. తన్ను తలంచువారిని ఆమహాత్ముడు కాపాడును. ఆదయాళుడు తన భక్తులయొక్క తప్పులనుమన్నించి, వారికిబుద్ధిని ప్రసాదించును. మనము యెప్పుడును దేవుని ధ్యానించుచుండవలెను. మనతప్పులను క్షమించునట్లు ప్రతిదినమును సర్వశక్తుడగు పరమేశ్వరుని వేడుకొనవలయును. దేవునికి భక్తియనిన చాలయిష్టము. దేవుడు యెల్లపుడు దుష్టులను శిక్షించి సజ్జనులను రక్షించును. ఆభగవంతుని మహిమను వర్ణింప శక్యముకాదు. కావున ఆతడు మనలను సర్వదా కాపాడుగాకయని, ఆయనకు వందనములు చేయుదము. మనబాలుర నడవడిని బాగుపఱచి,

వారి సుగుణసంపదను వృద్ధిచేసి వారికి మంచియలవాటులను నేర్పుట మనవిధి.

"నూరుదున్న పోతులను గడిగెదరుగాని యొక సాలగ్రామమును కడుగలేరన్నట్లు" రాత్రి పగలు విసుకులేక యిరుగింటి పొరుగింటి పురాణములు, లోకవార్తలు ప్రొద్దుపోని ముచ్చట లెన్నియైనను మాట్లాడుదురుగాని, భగవత్ కైంకర్యము చేయుటలో శ్రద్ధచూపువా రరుదని అసూయాపరుల నిందావాక్యములను సహించి యూరకొనక మన యువకులను శాస్త్రీయాచారములందు, అలవాటుపరచి శ్రద్ధా భక్తులు కలిగి ప్రవర్తించునట్లు చేయవలెను. సహస్రనామాది స్తోత్ర పాఠ శ్రవణమందాసక్తి కలవాడున్నూ, బ్రహ్మాండమునకు రాజుగా నుండు శ్రీ భగవంతునకు భక్తితో సాష్టాంగముగా నవవిధ భక్తియుప చారములతో మ్రొక్కుచు సదా ప్రవర్తిల్లు చుండవలెను.

భగవానునికి దయవచ్చునో రాదో మన శ్రమ వృధయగు నేమోయని శంకింపవలదు. భగవంతుడు మనలను తప్పక రక్షించునని దృఢవిశ్వాసముంచవలెను. మన కృషి పరిపక్వమైన యెడల కరుణా సాగరుడైన మన తండ్రి యొక్కనిముషమైనను తడవుచేయడు. భగవం తునకెవరు దాసులో వారికాయన దాసుడైయుండును. కనుక ప్రతి వాడును భగద్భక్తులై ప్రవర్తిల్లుచు వినయసంపన్నులై పెద్దలయడ భక్తితాత్పర్యములు చూపుచుండవలెను.

సోమరులను గష్టపడువారిగ జేయుటకు యెవరికిని శక్యముకాదు. "ఏపనివారు చేసుకొనుటకు ప్రయత్నింపక యితరుల సహాయమపే క్షించుటవలన లాభములేదు." అనుభక్తి తాత్పర్యములతో మిమ్ములను ప్రార్థింపుచున్నాను.

భగవదారాధన విధానము గూర్చియు, భక్తిమార్గమును గూర్చియు ముందు సంచికలో ప్రమాణములతో సవిమర్శనతో, విపులముగా వ్రాయుదును. ఓం శాంతి శ్శాంతి శ్శాంతిః

 ఆచార్యులవారి ప్రబోధమును గమనించి ఎక్కువశ్రద్ధాభక్తులతో భగవదారాధన గావింప ప్రార్థించుచున్నాము. భగవానుని యనుగ్రహమునకు పాత్రులగువారు శ్రేయస్కాములగుదురని యనేక ప్రమాణములు గలవు. మున్ముందు వివరింపబడును. (సంపాదకుడు.)

# ప్రశ్నోత్తరి.

| | |
|---|---|
| ప్రశ్న॥ అపారసంసారసముద్రమధ్య యందు మునుగుచున్న వానికి శరణమేది ? | ఉత్తరం. విశ్వేశపాదాంబుజ దీర్ఘనౌకా. |
| ప్ర॥ బద్ధుడనగా నెట్టివాడు? | ఉ॥ విషయాను రక్తుడు. |
| ప్ర॥ ముక్తుడెట్టివాడు ? | ఉ॥ విషయ విరక్తుడు. |
| ప్ర॥ ఘోరనరకమెద్ది ? | ఉ॥ స్వదేహమె. |
| ప్ర॥ స్వర్గమెట్టిది ? | ఉ॥ తృష్ణాక్షయమె. |
| ప్ర॥ సంసార నాశకమేది? | ఉ॥ ఆత్మబోధ (తన్నుదా తెలియుట) |
| ప్ర॥ మోక్షహేతువేది ? | ఉ॥ ఆత్మబోధమె. |
| ప్ర॥ నరకద్వారమేది ? | ఉ॥ నారీ. |
| ప్ర॥ స్వర్గద్వారమేది ? | ఉ॥ అహింసా. |
| ప్ర॥ సుఖముగానిద్రించువాడెవడు? | ఉ॥ సమాధినిష్ఠుడు. |
| ప్ర॥ మేలుకొన్నవాడెవడు ? | ఉ॥ సదసద్వివేకి. |
| ప్ర॥ శత్రులెవ్వరు? | ఉ॥ తన ఇంద్రియములు. |
| ప్ర॥ మిత్రులెవరు ? | ఉ॥ జితేంద్రియములు. |
| ప్ర॥ దరిద్రుడెవడు ? | ఉ॥ అత్యాసగలవాడు. |
| ప్ర॥ శ్రీమంతుడెవడు ? | ఉ॥ సంతుష్టిగలవాడు. |
| ప్ర॥ జీవన్మృతుడెవడు ? | ఉ॥ నిరుద్యోగి. |
| ప్ర॥ మృతజీవుడెవడు ? | ఉ॥ నిరాశ గలవాడు. |

ప్ర॥ పాశమేది ? ఉ॥ మమతాభిమానము.

ప్ర॥ మోహమునుగలిగించునదేది? ఉ॥ స్త్రీ.

ప్ర॥ అంధుడెవడు ? ఉ॥ మదనాతురుడు.

ప్ర॥ మృత్యువేది ? ఉ॥ అపకీర్తి.

ప్ర॥ గురువెవడు ? ఉ॥ హితోపదేశకుడు.

ప్ర॥ శిష్యుడెవడు? ఉ॥ గురుభక్తుడు.

ప్ర॥ దీర్ఘరోగమేది? ఉ॥ సంసారము.

ప్ర॥ భవరోగమునకు ఔషధమేది? ఉ॥ విచారణ.

ప్ర॥ భూషణములకెల్లభూషణమేది? ఉ॥ శీలము.

ప్ర॥ తీర్థములకెల్ల నుత్తమమేది? ఉ॥ మనశ్శుద్ధి.

ప్ర॥ హేయములెవ్వి? ఉ॥ కాంతా కనకములు.

ప్ర॥ ఉపాదేయములెవ్వి? ఉ॥ గురు, వేదవాక్యములు.

ప్ర॥ బ్రహ్మప్రాప్తి హేతువులెవ్వి? ఉ॥ సత్సంగతి, దాంతి, విచారము, సంతోషము.

ప్ర॥ సత్పురుషులెవరు? ఉ॥ విరాగులైన బ్రహ్మనిష్ఠులు.

ప్ర॥ జ్వరమేది? ఉ॥ చింతా.

ప్ర॥ మూర్ఖుడెవడు? ఉ॥ వివేకహీనుడు.

ప్ర॥ ప్రియమైన కార్యమేది? ఉ॥ శివభక్తి.

ప్ర॥ జీవనమేది? ఉ॥ దోషరాహిత్యము.

ప్ర॥ బ్రహ్మమార్గమునిచ్చునదేది? ఉ॥ విద్యా.

ప్ర॥ ముక్తిహేతువేది? ఉ॥ బోధ.

ప్ర॥ లాభమనగా నేది? ఉ॥ ఆత్మలాభము.

ప్ర॥ జగత్తునుజయించినవాడెవడు? ఉ॥ మనస్సును జయించినవాడు.

ప్ర॥ శూరులలో మహాశూరుడెవడు? ఉ॥ మన్మథ బాణములచే పీడింపబడనివాడు.

ప్ర॥ ప్రాజ్ఞుడు ధీరుడు సముడు, యెట్టివాడు? ఉ॥ లలనా కటాక్షములచే మోహమును జెందనివాడు.

ప్ర॥ విషముకంటె విషమైనదేది? ఉ॥ విషయము

ప్ర॥ సర్వదా దుఃఖియెవడు? ఉ॥ విషయానురాగి.

ప్ర॥ ధన్యుడెవడు? ఉ॥ పరోపకారి.

ప్ర॥ పూజనీయుడెవడు? ఉ॥ శివతత్వ నిష్ఠగలవాడు.

ప్ర॥ చేయరాని పనులెవ్వి ? ఉ॥ స్నేహము, పాపము.

ప్ర॥ చేయదగిన పనులెవ్వి ? ఉ॥ పఠనము, ధర్మము.

ప్ర॥ సంసారమునకు మూలమేది ? ఉ॥ చింత్తా

ప్ర॥ తెలివిగలవారిలో మహాతెలివి గలవాడెవడు ? ఉ॥ పిశాచియైన స్త్రీచేత వంచింపబడనివాడు.

ప్ర॥ సంకిలియేది ? ఉ॥ నారీ.

ప్ర॥ దివ్యమైన వ్రతమేది ? ఉ॥ దీనత్వమును వదలుట.

ప్ర॥ తెలియరాని సంగతియేది ? ఉ॥ స్త్రీమనసు.

ప్ర॥ వదలుటకు శక్యముగానిదెద్ది? ఉ॥ దురాశ.

ప్ర॥ పశువెవడు? ఉ॥ విద్యావిహీనుడు.

ప్ర॥ యెట్టివారితో సహవాస సంబంధము చేయరాదు? ఉ॥ మూర్ఖులతో, పాపులతో ఖలులతో, నీచులతో.

ప్ర॥ ముముక్షులు త్వరలో చేయవలసిన వెవ్వి ? ఉ॥ సత్సంగతి, నిర్మమత, ఈశభక్తి.

ప్ర॥ లఘుత్వమూలమేమి ? ఉ॥ యాచన.

ప్ర॥ గురుత్వమూలమేది ? ఉ॥ అయాచన.

ప్ర॥ పుట్టినవాడెవడు ? ఉ॥ పునర్జన్మ లేనివాడు.

ప్ర॥ చచ్చినవాడెవడు ? ఉ॥ మరి చావనివాడు.

ప్ర॥ మూగివాడెవడు ? ఉ॥ సమయమందు మాట చెప్పలేనివాడు.

ప్ర॥ చెవిటివాడెవడు ? ఉ॥ హితవాక్యమును విననివాడు.

ప్ర॥ యెవరియందు విశ్వాసముంచ కూడదు? ఉ॥ స్త్రీలయందు.

ప్ర॥ ఆసన్నకాలమందేమి చేయ వలెను? ఉ॥ మనోవాక్కాయములచే యమాంతకుని ధ్యానించవలెను.

ప్ర॥ చోరులెవరు? ఉ॥ దుర్వాసనలు.

ప్ర॥ దేనికి భయపడవలెను? ఉ॥ సంసారారణ్యమునకు లోకాప వాదుకు.

ప్ర॥ లోకమందు దుర్లభమైనదేది? ఉ॥ సత్సంగతి, బ్రహ్మవిచారణయు.

ప్ర॥ జగత్తంతను తెలిపెడివస్తువేది? ఉ॥ బ్రహ్మము.

ప్ర॥ అమృతమువలె గనుపించు విషమేది ? ఉ॥ స్త్రీ.

ప్ర॥ మిత్రులవలెదోచుశత్రులెవరు? ఉ॥ పుత్రులు

ప్ర॥ అహర్నిశము యే చింతన చేయ వలెను? ఉ॥ శివోహం.

మకాం శ్రీగురుకులాశ్రమము.

బోధానందమహర్షి, శ్రీ శ్రీకంఠమఠాధిపతి.

Regd. No. M. 2073. సం॥ర చందా రు 3-0-0 లు.

# శ్రీ ఆదిశైవపత్రిక.



శ్రీ శ్రీకంఠ మఠాధిపతుల యాజ్ఞానుసారముగా, శైవసంఘాభ్యుదయమునకై శ్రీ గురుకులాశ్రమమునుండి ప్రతిమాసము ప్రకటింపబడును.

సర్వదేవాత్మకో రుద్రస్సర్వే దేవాశ్శివాత్మకాః ।
రుద్రస్య దక్షిణే పార్శ్వే రవిర్బ్రహ్మా త్రయోఽగ్నయః ।
వామపార్శ్వే ఉమాదేవీ విష్ణుస్సోమోపి తేత్రయః ॥
(రుద్రహృదయోపనిషత్)

సంపాదకుడు:— చిలుమూరు పురుషోత్తమ గురుక్కల్.

సంపుట ౯ — చిలుమూరు. శ్రీ శుభనామ సం॥ర ఆశ్వయుజమాసము. — సంచిక ౨

(విలేఖకుల వ్యాసములకు సంపాదకులు ఉత్తరవాదులు కానేరరు.)



## — విషయసూచిక —



భారతీ ప్రెస్, తెనాలి.

# మహారాజపోషకులు

[సంవత్సరమునకు ఆరురూపాయలు చెల్లించవలెను.]

౧ రాజవైద్య నాగలింగం నందయ్య అండు సన్సువారు ఆయుర్వేదభవనం అమృతలూరు

౨ శ్రీమాన్ కొల్లిపర వీరయ్యగారు, చివ్వలూరు.
౩ ... కంఠంరాజు వెంకటసుబ్బయ్యగారు, భట్లపల్లి అగ్రహారం.
౪ ... చావలి వాలయ్యగారు, పెదరావూరు.
౫ ... స్వర్ణ సుబ్బయ్యగారు, పార్ గ్రాక.
౬ ... గూడూరు లక్ష్మయ్యగారు. వేమవరుమిల్లి.
౭ ... అగమిక నంజుండ దీక్షితులుగారు, రామసముద్రము.
౮ ... పసుమర్తి పార్వతమ్మగారు, కూచిపూడి.
౯ ... వెలవలపల్లి వెంకటేశ్వరదీక్షితులుగారు.

## రాజపోషకులు.

[సం॥రం 1కి రు 5-0-0లు.]

౧ ఆగమిక వాలేశ్వరదీక్షితులుగారు, పుంగనూరు.
౨ శ్రీమాన్ చావలి దుర్గాప్రసాద దీక్షితులుగారు, తరిగొప్పులు.
౩ ... యలమంచిలి సుబ్రహ్మణ్యంగారు, వెదురుపాక.
౪ ... గూడలి రామయ్యగురుకులు, చినమాంభట్ల అగ్రహారం.
౫ శ్రీమతి ఇంకొల్లు అన్నపూర్ణమ్మగారు, (తాలూకాబోర్డు మెంబరు) ప్రత్తిపాడు.
౬ శ్రీమాన్ S. రామప్పగారు, (కరణం) ఉప్పరపాలెం.

## పోషకులు.

[సం॥రం 1కి రు 4-0-0లు]

౧ శ్రీమాన్ వడ్లమూడి కోటయ్యగారు, వడ్లమూడి
౨ ... నూతలపాటి వెంకటనారాయణ గురుకులుగారు, వరకవిపూడి.
౩ ... చావలి పిచ్చయ్యశర్మగారు, చాటపర్రు.
౪ ... S. A. నంజుండయ్యగారు, శిరస్తాదారు, పుంగనూరు.
౫ ... ఉయ్యాలవాడ మునెయ్యగారు, భండ్యాత్మకూరు.
౬ ... ఆగమిక సుబ్రహ్మణ్యదీక్షితులుగారు, బెంగుళూరు.
౭ ... కొల్లిపర వెంకటసుబ్బయ్యశర్మగారు, అమ్మనబ్రోలు.
౮ ... నాగలింగం సత్యనారాయణగారు, డాక్టరు, మాలుపూరు.
౯ ... చుండి ఆనందరాయుడుగారు, రూపెనగుంట.
౧౦ ... ఆగమిక చంద్రశేఖరదీక్షితులుగారు, చాదేపల్లి.
౧౧ ... S. A. అగస్త్యప్పగారు, చారాల.
౧౨ ... మునికిపూడి వెంకటేశ్వర్లుగారు, వల్లభాపురం.
౧౩ ... చావలి చంద్రయ్యగారు, పెరవలి.
౧౪ ... కూర్మగిరి శేషమ్మగారు, పాకవీడు.

# శ్రీ ఆదిశైవపత్రిక.



ఏకోరుద్రస్స ఈశానస్సభగవాన్ సమహేశ్వరస్స మహాదేవః ॥

"అథర్వశిరసి"


| సంపుట | | సంచిక |
|---|---|---|
| ౯ | చిలుమూరు. శ్రీముఖనామ సం॥ర ఆశ్వయుజమాసము. | ౭ |


## దుర్గాస్తవము

(శ్రీమాన్ చిలుమూరు గురులింగశాస్త్రిగారు.)

మ॥ సిరులం గూర్తువు భక్తసంతతికి వా ♦ సిం గూర్తు వార్యాళికిం
పరముం గూర్తువు మానివర్యులకు ను ♦ త్పాతంబు లశ్రేయముల్
బరగం జేతువు దుష్టసంఘముల నం ♦ బా నీమహాత్మ్యముల్
గరముం బ్రీతినుతించెదం జనని దు ♦ ర్గాదేవి కాత్యాయనీ॥ ౧॥

మ॥ అలనాడుగ్రత రక్తబీజదనుజుం ♦ డాదిత్యవర్గంబుపై
చలముం బూని పురంబుసొచ్చిసిలుగుల్ ♦ సల్పంగ భీతార్తులై
కొలువైయున్న భవత్పదాబ్జముల నా ♦ క్రోశింప కారుణ్యతం
గలికీ వారి భయంబు వాపితివి దు ♦ ర్గాదేవి కాత్యాయనీ॥ ౨॥

మ॥ జననీ భక్తుడ నీపదాబ్జముల స ♦ క్రాంతంబు సేవించెదం
వినుతుల్ సల్పెద నీమహాత్మ్యముల నె ♦ వ్వేళం జగన్మాతరో
ఘనదుర్వార విపత్పరంపరల నీ ♦ కం జిక్కి చింతించునం
గనుమోయమ్మ కృపాకటాక్షముల దు ♦ ర్గాదేవి కాత్యాయనీ॥ 3॥

# విజయదశమి.

అనాద్యంత స్వయంభూతమగు విశ్వసృష్టికారిణి, మహామాత కాత్యాయని శృతి॥ నమః ప్రకృత్యై భద్రాయైనియతాః ప్రణతా స్మృతామ్” దేవ్యుపనిషత్” మహామహుడగు హితవంతునకు గూరిమి తనయ. విశ్వాధారమూర్తియగు మహాదేవుని కర్ధాంగి. జగన్మాతయగు పరాశక్తి నారాధించునదేజన్మ. మానవుని జీవితమంతయు మాయాకల్పితము. అట్టిమాయాస్వరూపిణియే జగదంబ. అట్టిచో మాతృదేవతారాధనము మానవవిధాయకకృత్యమని వేరుగజెప్పబనిలేదు. మాతృదేవతారాధన విశ్వమానవ కల్యాణహేతువని మహనీయుల నిర్ధారణ. ఇందులకు నేటికిని అనుయాయికముగా జరుగు ప్రత్యబ్దమహోత్సవములు సాదృశ్యములు. అందు విజయదశమి ప్రధానము. యిద్యోడ గాథ యొకింత సూక్ష్మముగ లిఖితయోగ్యము.

తొల్లి యమరావతిపై రక్తబీజుడను దానవుడు ససైన్యముగ దండెత్తిపోయెను. అన్యోన్యజయాభిలాషులై దేవదానవులు చాల కాలము ఘోరసంగ్రామమొనరించిరి. అందు నిర్జరులు పరాజితులైరి. మహేంద్రుడు గత్యంతరముగానక శరణార్థియై కైలాసమున కేగెను. సర్వేశ్వరుండగు మహాదేవుడు ప్రమథగణపరివేష్ఠితుడై సకళత్రముగ కొలువుదీరియున్న సమయమున సపరివారుడగు బిడౌజుడు, సభాస్థలికేగి దీనాతిదీనుడై పరమేశ్వర చరణ సరసీరుహంబులబడి విలపించె. సర్వజ్ఞుడగు సదాశివుడది యెరింగి మహానంద స్వరూపిణియైయున్న జగన్మాతను సాభిప్రాయముగ దిలకించెను వీక్షణమాత్రమున పతి హృదయమెరింగి జనని మహాప్రసాదమనియె. ఉమామహేశ్వరులచే నభయమందుకొని త్రిదశులు యుద్ధ సన్నద్ధులై శంఖకాహళభేరీ నినాదముల భోరుకొల్పిరి. వెంటనే సింహవాహినియు, త్రిశూలధారిణియు,

మంగళస్వరూపిణియునగు, మహామాత నాయికత్వమున ఆశ్వయుజ శుద్ధ పాడ్యమిని సుపర్వాణులు స్వారాజ్యపరిసరములజేరి జయభేరి మ్రోయించిరి. రక్తబీజుడుగ్రుడై ససైన్యముగ యుద్ధరంగమున ప్రవేశించెను. సప్తరాత్రులు ప్రళయలీల సమరము జరిగిపోయెను. అష్టమినాటి యుద్ధమున జగజ్జనని క్రోధస్వరూపిణియై దుర్గయనునామంబున రక్తబీజుని ప్రతిఘటించి దివ్యాస్త్రములనలయించెను. కాని మొండియగు దానవుడించుకయు చలింపడయ్యె. అంతనుగ్రహమూర్తియగు "దుర్గ" ప్రళయకాలాభీలమగు శూలంబున నాదనుజుని పీచమడంపజొచ్చెను. కాని యాతనిశరీరమునుండి యెన్నిరక్తబిందువులు భూమిపైబడిన నందరు దానవులుత్పన్నమగుచుండిరి. వరప్రసాదుడగు నాదనుజుని సమయించుటెట్లు, దుర్గ దీర్ఘాలోచనానిమగ్నయయ్యెను. పలాశనుని ప్రలాపములతిశయిల్లెను. మరునాటి యుద్ధదివసమున తా నాదిశక్తిరూపిణియై విశ్వమంతయు తనజిహ్వచే కప్పివైచెను. రక్తబీజుడిపుడు భూమిపైలేడు. దేవిజిహ్వపైనిలచి సంగ్రామమొనరించుచున్నవాడు. ఇక రక్తబిందువు భూమిపైబడు నవకాశములేదు. నాడు మహర్నవమి. రక్తబీజుడు దేవియందైక్యమై పోయెను. రాక్షసులందరు మడసిరి. దశమి దినంబున దేవతలందరు విజయులై అమితానందభరితులై "పండుగ" జేసికొనిరి. యిదియే "దసరాపండుగ" ఓం శాంతి శ్శాంతి శ్శాంతిః.

"లోకాస్సమస్తాస్సుఖినోభవంతు"

---

# వివాహములు - భేదములు.

(శ్రీమాన్ చావలి పిచ్చయ్యశర్మగారు)

లోకమందు మానవునిజీవితకాలమున నత్యావశ్యకమైనది వివాహమే. అట్టివివాహమునవలన ననేకసుఖములుబొంది సత్పుత్రులబడయుట ముఖ్యఫలమని దెలియుచున్నది. అనంతసౌఖ్యములకు కారణము "అనుకూలదాంపత్యమే"యని ప్రాజ్ఞులు బలుకుచుందురు. కీర్తి

కాములగు చంద్రమతీ హరిశ్చంద్రులు, సావిత్రి సత్యవంతులు, నల దమయంత్యాది దంపతుల చారిత్రములే తార్కాణములు. అట్టి వివాహము లెనిమిది విధములు. ౧. బ్రాహ్మ్య వివాహము. సుప్రసిద్ధముగ వరుని పూజించికన్యను దానమొసంగుట. ౨. దైవవివాహము. ఋత్విజుడు యాజ్ఞికమొనరించుచుండ కన్యనలంకరించి వరునకు దానమిచ్చుట. 3. ఆర్ష వివాహము. రెండుజతల గోవులను దీసికొని కన్యనొసంగుట. ౪. ఆసురవివాహము. శక్తికొలది కన్యకు ద్రవ్యమిప్పించి కన్య నొసంగుట. ౫. గాంధర్వవివాహము. వధూవరుల యిష్టానుసారముగా వరించుకొనుట. ౬. ప్రాజాపత్యవివాహము. వరునితో ధర్మకార్యాచరణనిమిత్తము కన్యనొసంగుట. ౭. రాక్షసవివాహము. కన్యను అపహరించుకొని వివాహమాడుట. ౮. పైశాచికవివాహము. నిదురించునపుడుగాని యేమరుపాటుగా నున్నపుడుగాని బలాత్కరించి కలియుట యని దెలియుచున్నది. వీటిలో రాక్షసపైశాచికములు దప్ప తక్కిన ఆరువివాహములు ఉత్తమమైనవని చెప్పుదురు. వివాహము నిమిత్తము కన్యను విచారించునపుడు బహుజాగరూకతతో పరిశీలించవలెను. దైవభక్తి, పితృ, మాతృభక్తి, విద్యావినయసంపద, శీలత్వము, శ్రద్ధ, మున్నగు సద్గుణములుగల్గిన కన్యను వివాహమాడువారు సుఖంతురు. అట్టిగృహస్థాశ్రమసౌఖ్యము స్వర్గసుఖంబగును. కన్యను పరిశీలించు విధము కొందరు పెద్దలు దెలిపియున్నారు. గమనింప ప్రార్థితులు.

కం. వాకిటనిలచిన యేడ్చిన గోకాడిన నిదుర చాలగలిగిన పలుకుల్ ।
గైకొనక నావలించిన నాకన్నియవర్జనీయమనిరి మునీంద్రుల్ ॥

శ్లో. నదుష్టాం దుష్టవాక్యాం వావ్యంగినీం పితృమాతృతః ।
నశ్మశ్రువ్యంజనవతీం నచైవపురుషాకృతిం ॥

కం. యేకన్నెనట విదూషక, లోకమునకు భీతిశేయు లోలుపమతియై ।
యేకన్నె నడువత్కాకంపమునొందునొ నట్టిదాని మానగవలయున్ ॥

శ్లో. నోద్వహేతకపిలాంకన్యాం నాధికాంగీం సరోగిణీం।
నాలోమికాం నాతిలోమాం నవాచాటాం నపింగళాం॥

కం. కాలిపెనువ్రేలుచేరువ వ్రేలధికంబైన నడిమివ్రేలు కృశంబై।
వ్రాలిన నవ్వలివ్రేళ్లను వ్రాలిక నిలుమోపకున్న వనితేమిటికిన్ ॥

కం. చెక్కుల నవ్విన వేళల సొక్కుచునురువైన నుదుట సుడియున్ననుపై
వెక్కసమైనను వట్రువ ముక్కైనను కన్నెమీద మోహంబేలా ॥

పై విధమును గమనించి వివాహమాడువారు సుఖపడుదురు. అనుకూలదాంపత్యముకొఱకై ప్రయత్నించుట శ్రేయస్కరము.

( సశేషము )

## చందాదారులారా !

తామివ్వవలసిన చందాపైకము విషయమై యిట్లు మౌనము వహించుట ధర్మముగాదు. స్వయముగా మేమువచ్చి మిమ్ములను సందర్శించేయడల మీరిచ్చేదివ్యము రైలుఖర్చులకే వ్యయమగునుగదా? వి. పి. చేసినచో మీరు త్రిప్పివేయుదురుగదా? జాబువ్రాసినచో జవాబువ్రాయరుగదా? పత్రికపంపుచుంటే గైకొనుచుంటిరిగదా? మాకష్టములు పరిశీలింపరుగదా? మాప్రార్థన గమనించి మీరివ్వవలసిన మొత్తమును వెంటనే పంపగోరెదము. లేకున్న అభిప్రాయం వ్రాసినచో మీకు నమస్కరింపగలము.

( సంపాదకుడు )

# అర్చకమహాజనులకు విజ్ఞప్తి.

## శ్రీమాన్ వింజరపు వెంకటాచార్యులుగారు.

మనపెద్దలు, మనకు అర్చకత్వపు యీనాములే, శాశ్వతపు వసతులుగా ఆధారములు కల్పించిరి. కాని మనపిల్లలకు నివే, యీఆస్తులు వప్పగింతచేయలేముసరిగదా, మన జీవితములుకూడ, నీయాస్తులవల్ల జరుగునట్టి యాశలేనిసమయమువచ్చినది. ఈ సమయమున మనము మనపూర్వోన్నతిని స్మరించుకొని, యిప్పటిదీనస్థితిని గుర్తించి, ముందభివృద్ధి పొందుటకు సంకల్పించుకొనవలెను. అందులకై యెడతెగని ప్రయత్నములు చేయుదురుగాకయనియు, ప్రయత్నముల కీశ్వరుడు తోడ్పడుగాకయనియు, కోరుచున్నాను.

మనలో స్వార్జితముగా, శాశ్వతవసతులు సంపాదించినవారును, సామాన్యులునుగూడ కలరు. కాని స్వార్జితముగ, శాశ్వతములగు, యీనాములను సంపాదించిన వారలకుగూడ, స్వార్జితమనుకొను యీనాములు శాశ్వతములుగావు. ఒకని తలాటములో సంపాదించినవి మరియొకని తలాటమున ఖర్చుపర్చవచ్చును. లేదా సంపాదించినవాని, జీవితకాలముననే, యేవ్యవహారపు యిబ్బందివలననో, అన్యాక్రాంతము కావచ్చును. గాన నట్టి స్వార్జితములు యెన్నటికిని, శాశ్వతములుగావు. దీనినిబట్టి స్వార్జితములు, సంపాదించుకొనవద్దని చెప్పుటకాదు. ఎవరెంత యైశ్వర్యముతోనున్నను, అర్చకులమగు మనకు, అర్చకత్వపు యీనాములు ఆచంద్రార్కముగా నుండదగినవి. అవి మనచేతులలోనున్నంతవరకే మన ఐశ్వర్యములయొక్క ఆధిక్యత ఈభూములులేనివాడు, నిరాధారులమై పోవుటయే తటస్థమగును.

ప్రస్తుతము మనచేతులలోనున్న యీనాములు, యీనాడు కిమ్మత్తు కట్టుకొన్న యెడల, అనేకవేలుచేయును. అనేకవేలు కిమ్మత్తుగల యీనాములనుగురించి, తగాయిదావచ్చిననాడు, కొన్నివందల

నైనను న్యాయమార్గముగా ఖర్చుపరచి, వాటిని సంరక్షించవలసిన బాధ్యత మన మీాదనున్నది. ప్రస్తుతఖర్చులకు, వెనుదీసి సంరక్షించక పోయినచో, మన జీవితము కష్టములపాలగుటయేగాక, మన పిల్లలను నిరాధారులుగా చేసినవారమగుదుము. జయాపజయములు ముందుగా నిశ్చయించుటకు యెవరికిని శక్యముగాదు. గనుక ముందు ఖర్చులను భరించి పాటుపడవలసియున్నది.

మన పౌరుషములకు, యీాఅర్చకసంఘములు అడ్డుదగులు చున్నవేమోయనికూడ భయమగుచున్నది. ఏలయన? మనలో చాల వరకు, సరిహద్దుతగాయిదాలకో, సోదరులలో పంపక భేదమువచ్చి నప్పుడో, మనోవృత్తిదావాలు వచ్చినప్పుడో, లేదా చిల్లరతగాయి దాలను కల్పించుకొనియో, అనేకవేలు ఋణములుచేసి, శివిల్ క్రిమినల్ చర్యలలో స్వయముగనో, ద్రవ్యము విశేషముగా వెచ్చించి యితరుల సహాయమునసో అప్పుపుట్టునంతవరకు దెచ్చిపెట్టుటయేగాక, క్రయము నకు అవకాశమున్న వాట్లను విక్రయపరచియైనను, తుదకు పట్టు దలయే ప్రధానముగాభావించి, అనేకకష్టములపాలైన వారలుకలరు. కాని ప్రస్తుత వ్యహారము అట్టిది కాదనియు, అనేకులకు వచ్చునట్టి యొకేవ్యవహారమనియు, తమతమ వ్యవహారభేదములతో, పనిలే కుండగ అన్నిటికిని సంఘమే పాటుపడుననుకొని, యూరకొను చున్నారు. ఇదియునుగాక ప్రస్తుతవ్యవహారమునకు, సంబంధములేని తమకు ఉండుకోబడిన, యితరతగవులను, పరిష్కరించని సంఘమెందుల కని, ప్రశ్నించుచున్నారు. న్యాయముగబోర్డుతోపోరాడవలెనని పౌరు షముగలవారుకూడ, సంఘములుండుటచేత సంఘములే పాటుపడు ననియు, ఆ వ్యవహారమేమగునో నావ్యవహారముకూడ నట్లేయగు ననియు, నుపేక్షాభావముగ పౌరుషములేకుండ నటించుచున్నారు.

బోర్డుతోచిరకాలము కోర్టులద్వారా, ఆక్టులోచెప్పబడిన చాలా సెక్షనులు పరిష్కరింపబడువరకు, పోరాడవలసినకాలము యెక్కువగా పట్టును. కావునను, భగవదారాధనయే, ప్రధానముగాగల, అర్చకుల

కందరకు, వ్యవహారజ్ఞాన ముండకపోవచ్చుననియు, విడివిడిగా మైవ రికి వారే వ్యవహరించుకొనిన ఖర్చులు అదనమగుననియు, ఈసంఘ మేర్పడినదిగాని, ప్రతివ్యక్తియు, తన వ్యవహారములను, తా నుపేక్ష చేయవలెననుట కేర్పడినదికాదని, గ్రహించవలసియున్నది.

సంఘమున కెన్నడును, చందా కట్టనివారును, ముందు కట్టదలచు కొననట్లు మాట్లాడువారును, సంఘముయొక్క కార్యస్థానమున కెన్నడును రానివారును, ఇతరులద్రవ్యమును ఖర్చుచేసి, వెంటనేబోర్డు వారు, మన సంఘములవారందరిపైన ఆక్టును యేసందర్భములోను, అమలు జరుపకుండ, శాశ్వతపు ఇంజక్షను పుట్టునట్లు చేయించవలసి యున్నది. లేదా బోర్డునేయెత్తివేయించునట్టి సూత్రమాలోచించ వలసియున్నది. మంత్రిగారిని దర్శనముచేసి, ఆక్టులో అర్చకత్వపు యీనాములను, శాశ్వతముగా అర్చకులపేర పట్టాపుట్టునట్లు, సవరించు కొన్న బాగుండునని, ఉవ్విళ్లూరుచు, కోరువారనేకులుగలరు. "కోరిక" యుండుట న్యాయమేగాని, రిక్తునికోరికలెట్లు నెరవేరును? మనము వ్యర్థమైన కోరికలను, కోరినంతమాత్రమున ప్రయోజనములేదు.

ఏయుద్యమమయినను, అభివృద్ధిగాంచుటకు వెనుకచూపు, ప్రస్తుతపుచూపు, ముందుచూపు, అను మూడువిధములగు దృష్టులను గలిగి ఉండవలెను. ఇందులకు అర్చకులందరి సహాయము, నపేక్షించు చున్నాము.' అర్చకులందరును, నీసంఘమునందు, పరిపూర్ణాదరాభి మానములనుచూపి, సంఘము నభివృద్ధి నొందించుకొన్న యెడల సరివా రిలో మనము తలయెత్తి తిరుగుచు, గౌరవముతోనుండగలము. ఇందు లకై తగినకృషి సల్పుదురుగాక ?

మానవుల సుఖదుఃఖములు, భాగ్యదారిద్ర్యములు, ధైర్యదైన్య ములు, మానావమానములు, వారివారి కర్మాధీనము. సామాన్య స్థితి యందు పుట్టిన మానవునికైనను మహోన్నతదశ ననుభవించుటకు, విశ్వమునం దనంతములయిన, యవకాశములు గలవు. ఎవరి కర్మఫల

మును వారనుభవించుచుందురు. సంకల్పము, వ్రతములేనప్పుడు ఫలము గలుగదు. గతవైభవమున కుప్పొంగుటయును, వర్తమానదైన్యస్థితికి విషాదమును బొందుటయును, పురుషునికి తగినపనికాదు. ఆపత్పరంపరలను జయించి, పురుషార్థమునుసాధించి, అర్చకసంఘాభ్యుదయమునకు సంకల్పించి, ధనమును వెచ్చించినచో, తప్పక గొప్ప యభివృద్ధి గాంచ నవకాశములుగలవు. ఈసమయమునందైనను, ఆత్మవిశ్వాస బీజములను, స్థాపించి, కృతార్థులమగుట, మన కనీస ధర్మమైయున్నది.

ఇంతవరకు వ్రాసినవిషయములలో, నేదయిన లోపమున్నచో క్షమించుడు. నేచెప్పంబోవు ముఖ్యాంశములు గమనింపుడు. ఆ యా సంఘములలో, ప్రతివారును తమతమ కులాచార ధర్మముల నుద్ధరించుకొనుచు, మూఢాచార పిశాచముల బారద్రోలుచు, ఐకమత్యత నభివృద్ధినొందించుచు, పాటుపడుచుండ, మనసాంఘికులు, గాఢనిద్రాపరవశులై రానున్న మహావిపత్సముద్ర తరణోపాయముల గమనింపక, సంఘమును స్మరింపక, అభిమానశూన్యులయి యుండుట హానికరము. కాన ప్రతివారును సంఘకార్యక్రమమును దిలకించి మీసోదరుల శ్రవణపుటములందు శంఖారావముల నొనరించి, మేల్కొలుపుడు. ఐకమత్యతను పురికొల్పుడు. న్యాయస్థానములందు జయము నొందెడి యత్నముల నొనరింపుడు. అంతశ్శుద్ధిగా, సంఘశ్రేయమును గోరుడు. ప్రచారమొనరించు సంఘసేవకుల నాదరించుడు. ఉత్సాహవంతులై, సంఘాభివృద్ధిగావింపుడు. సంఘదురాచారముల సంస్కరింపుడు. సాటిసోదరులదయకు పాత్రులై ప్రజలసానుభూతిని సంపాదింపుడు. గౌరవమర్యాదల నభివృద్ధినొందింపుడు సర్వభూతాదయాళుత్వమునకై యత్నింపుడు. మతవిద్యల నభివృద్ధిపరుచుడు. మీపుత్రులను విద్యావంతులుగా నొనరించి మతగౌరవముల బోధించి లోపములను సవరింపుడు. పరిశుద్ధహృదయులై ఆగమాచారధర్మముల నతిక్రమింపక భగవదారాధన గావింపుడు. భగవంతుని సేవింపుడు. ఆయనయందు, నిష్కళంకమయిన భక్తిని స్థాపింపుడు. శ్రీమత్పరాత్పరు

ననుగ్రహమును పొందుడు. దైవకటాక్షపాత్రులగుడు. అందులకు వ్యతిరేకముగా, ప్రవర్తించితిరేని, విపరీతఫలముల ననుభవింపక తప్పదు. భగవదనుగ్రహమునొందజాలక, ఆగ్రహమునకు గురియై సమస్తకష్టముల పాలుగాబోకుడు. శాస్త్రదూషణ సజ్జనతిరస్కరణ మున్నగు దురాచారముల దరిజేరనీయక శమదమాదిగుణసంపద్విశిష్టులై విరాజిల్లినచో, మీరు ధన్యులగుదురు. ఓం శ్శాంతి శ్శాంతి శ్శాంతిః.

---

## పత్రికావసానము.

గుంటూరుజిల్లా నవులూరుగ్రామ వాస్తవ్యులగు కీ. శే. సంగాపు పానకాలయ్యగారి జ్ఞాపకార్థం కుమాళ్లు పత్రికాసన్మానం నిమిత్తం (స॥ హా॥ రావుగారి ద్వారా) సమర్పించినది. రు ౩-౦-౦.

### యీనెలలో చందాలు చెల్లించినవారు.

౧ బ్ర॥శ్రీ॥ మా॥ నాగలింగం పార్వతీశం గురుకులుగారు నూతక్కి. (గుం)
౨ ,, కొత్తలంక విస్సన్నగారు గొల్లలమామిడాడ (గో)

☞ యింతటి నీరసస్థితిలో పత్రికనడపుటకు మార్గము దోచుటలేదు. యిప్పటికే షుమారు వెయ్యిరూప్యములు నాచేతినుండి వ్రియపరచిన విషయము గమనింపుడు . చందాదారులు నిల్వయుంచిన బాకీలు పంపినచో యిట్టి విషమస్థితిగలుగకుండెడిదే. స్వయంకృతాపరాధమున కెవరు బాధ్యులుగాగలరు. ( సంపాదకుడు )

---

# విగ్రహారాధనము.

(శ్రీయుతులు విమర్శకాగ్రేసర కాశీభట్ల బ్రహ్మయ్యశాస్త్రిగారు)

విగ్రహారాధనము మౌఢ్యబోధకమని కొందరు తలంచు చున్నారు. అవి తెలియక చెప్పుమాటలు. యిది ఆత్మస్వరూపుడగు భగవంతునితో సంబంధించిన విషయము. వివేకలోకము దంతటను విగ్రహారాధనము వాడుకలోయున్న విషయము క్రొత్తది గానేరదు. ఈ విగ్రహారాధన మొక్క హిందూమతమునందే గాక క్రైస్తవు లందును, మహమ్మదీయులందును బ్రాహ్మసామాజికులు మున్నగు నవీన మతస్థులయందును గూడ గలదు. వివేకానందులవారు దెల్పి నట్లుగా ప్రతి మతస్థునకును "తన మతమందలి ప్రతిమార్చనము" విగ్రహారాధనముగా గాన్పింపక ఇతర మతస్థుల ప్రతిమార్చనము మాత్రమే విగ్రహారాధనముగా గాన్పించును. క్రైస్తవులు క్రీస్తునెత్తు కొనిన మేరీప్రతిమ నారాధించినట్లే. క్రాసును గురిగాపెట్టుకొనినట్లే. మహమ్మదీయులు పీరులను పూజించినట్లే. బ్రహ్మసమాజ మతస్థాపకు డగు "రామమోహన రాయలవారు" తన ప్రార్థనమందిరములో నెదుటిగోడపై "ఓం" కారము చిత్రించుకొని దానిపై లక్ష్యము నుంచు కొనునట్లే. ఆ మందిరముచుట్టునూ ప్రదక్షిణము చేసుకొనునట్లే. హిందువులు తమ దేవాలయములలో శివవిష్ణువుల ప్రతిష్ఠించుకొనియు, గణేశాదుల నేర్పరచుకొనియు దైవము నారాధించుచున్నారు. ప్రతి మార్చనము దైవము నారాధించుటకు ముఖ్యసాధనము. భక్తులు దైవ స్మృతికై విగ్రహము నుంచుకొని తద్వారా దైవగుణములు స్మరించు కొని దైవము నారాధించుచున్నారే గాని ప్రతిమ నారాధించుచుండుట లేదు. ప్రతిమనే యారాధించినవా రగుచో జానెడు, మూరెడు పొడుగుగల ఓ నల్లరాతిబొమ్మా, ఓ లోహవిగ్రహమా, ఓ లింగా కారముగల రాయీ అని ప్రార్థింపవలసి వచ్చును. గాని అట్లు ప్రతి మను బిలువక ఓ మహాదేవా, ఓ నారాయణా, ఓ గోపాలమూర్తీ,

శ్రీరామచంద్రప్రభూ, విశ్వేశా యని ఆరాధించుచున్నారు. ఆలయమునకుబోవు ప్రతి హిందువుడును "శాంతాకారం" "వందేశంభు" ఇత్యాది శ్లోకజాలముతో ప్రతిమయందు భగవద్గుణ విశేషములు ఆరోపించి స్తుతించుచున్నారు. అట్టివారు దేవుని పూజించుచున్నారే గాని ఆలయమునందలి రాతివిగ్రహములను పూజించుటలేదు. గావున హిందువుల విగ్రహారాధనము భక్తిదాయకమే గాని హానికరము గానేరదు. విగ్రహారాధనము కూడదని బల్కుట లోకవంచనమే యగును. విశేష మహిమాఢ్యములైన యాత్మలక్షణములయందును, పరమేశ్వరునియందును నమ్మకముగల యాస్తికుల యారాధనము కేవల నాస్తికులును జడప్రకృతి సేవకులైనవారికి ఆక్షేపణీయములుగా కాన్పించినంత మాత్రమున ఆస్తికకర్మములకు నేవిధమగు కొఱంతయు వాటిల్లనేరదు..."సత్యమేవ జయతి నానృతమ్"........

---

# మహాత్ముడు.

(శ్రీ కొడాలి వెంకటసుబ్బారావుగారు)

సీ॥ గోచిపాతను బెట్టుకొను నీవగాబోలు ♦ భరతాంబకిడుమువంబర సమృద్ధి । గుప్పెడుపప్పు లా కొనువేళ తినునీవ♦యర్పింతు కమృత రసాన్నతుష్టి । ఉన్నచోటున నిల్వకుండపోయిన నీవ ♦ కల్యాణ నిలయ సంకల్పకుడవు । ఉప్పుదాడిని చెరనొందు పెద్దవు నీవ ♦ ముప్పదికోట్ల స్వాములకు దొరవు,

గీ॥ పలుకు నీదెంత నీ కృత్యములదె వింత ♦ నటన నీదంత నీ బోసి నవ్వుకొంత । నలుగడల నున్నవారు కన్నారదంత ♦ ధీతపోకర్షణాత్మ గాంధీమహాత్మ.

సీ॥ అనినాడెగాని తాననిపించగల్గెనా ♦ రోజూజపించ "సారోజి" తాత
అని యనిపించి శ్రేయము నందగల్గెనా ♦ రాణించునట్లు "తిలక్"
గురుండు । అని యనిపించియు నాచరించియు సిద్ధి ♦ రాబట్టుకొనెనె
"లాలాజి" నేత । అవసానమునగూడ నదె స్మరించుచు ♦ ఫలలబ్ధి
పొందెనె "మోతిలాలు" బాబు,

గీ॥ వారు నీకన్నముందున్న వారుగారె ♦ నీకెయనిపించుకొను తెల్వి
నిండిపోయె । ఆస్వరాజ్య మంత్రము జన్మహక్కటంచు ♦ ధీతపో
కర్షణాత్మ గాంధీమహాత్మ.

---

# అర్చకులకు హెచ్చరిక

తూర్పుగోదావరీమండలమున బోర్డు వ్యవహారములను గురించి స్పెషల్ జిల్లాకోర్టు ది 25-8-33 తేదీని రాజమండ్రిలో యేర్పరచి విచారణ ప్రారంభించిరి. కావున కోర్టువారి యెదుట మన హక్కులను ధృవపరుచుకొనుటలో నిరంతరము తదేక దీక్షతో నిర్వహించ వలసియుండును. విశేషద్రవ్యమును, రికార్డులు, సాక్ష్యము, వకీళ్ల సహాయమును కావలసియుండును. ఆగమశాస్త్రములను ధృవపరుచు నట్టి పండితుల సహాయముకూడ నవసరమైయుండును. మామూలు కోర్టులవలె యితర వ్యవహారములేవియు నుండవు గనుక ప్రత్యేక కోర్టు విచారణలో అర్చకు లుపేక్షించుటకు వీలుకాన్పించదు. తగు జాగరూకతతో మెలంగునటుల హెచ్చరింపబడుచున్నారు. (వి॥ వెం॥)

---

# విషాదవార్త

మైసూరు సంస్థాన ముజరాయి కమీషనర్ ఆఫీసు నందు ఆస్థాన పండితులును శైవాద్యాగమపంచాననేత్యాది బిరుదాంకితులును ఆదిశైవమహాజన సంఘాలంకారశిఖామణులును సమస్త శాస్త్రపరిశోధకులును సంఘశ్రేయోభిలాషులును పరమేశ్వరాంశసంభూతులునగు జగద్గురు నందీశ్వర దీక్షితులవారు శ్రీముఖసంవత్సర ఆశ్వయుజ బహుళతృతీయ భృగువాసరమున (6-10-33) సంధ్యా తరుణమున భౌతిక దేహమును పరిత్యజించి పరమేశ్వర పాదసేవాధురంధరులై నిత్యానంద నిమగ్నులై శాశ్వతదివ్యదేహమును ధరించి. శివసాయుజ్యపదవినొందిరని దెలుపుట కానందించుచూ,

పుత్రమిత్రాదులను బంధువర్గమును శిష్యకోటిమున్నగు సర్వులను శోకాంబుధినిద్రోసి సంఘమునకు మితిలేని చింత నొడగూర్చిరని విషాదమునొందుచూ, శ్రీవారి ఆత్మశాంతికై పరమేశ్వరుని ప్రార్థించుచూ శ్రీవారి కుటుంబమునకు సహానుభూతి నందజేయుచున్నారము.

పత్రికాధిపతి.

# సంపాదకీయములు.

**స్వవిషయము.**

పత్రికాభివృద్ధికై సాంఘికులను పదేపదే ప్రార్థించుచున్నను అభిమానము గన్పట్టుటలేదని దెలుపుటకు సిగ్గిలుచున్నాము. షుమారు

తొమ్మిది సంవత్సరములనుండి జరుగుచున్న పత్రికాప్రచారము గమనించియు, కులాభిమానము జూపకుండుట కడుంగడు శోచనీయమై యున్నది. పత్రికాప్రచార మత్యంతావశ్యకమని పలువురు పెద్దలు బోధించుచుండ నాటిసంఘములనుగాంచియైనను మనః పరివర్తనము గావింపని హేతువు సమంజసముగానుండదు. మాస్వలాభముకొరకిట్లు వ్రాయుటలేదు. సంఘాభిమానులగు సాంఘికులందరు మామనవి గమనించి తామొనరింపవలసిన సహాయమును వెంటనే గావింపప్రార్థితులు.

## శ్రీకంఠ శివాచార్యులవారు.

ప్రస్తుతము మదరాసునందు "బ్రహ్మసూత్రభాష్యము" అచ్చు వేయించుచున్నారు. చాలాభాగం పూర్తిఅయినదని తెలియుచున్నది. పిమ్మట ఉపనిషద్భాష్యము గీతాభాష్యముగూడ తెలుగు అక్షరములతో పూర్తిచేయగలరు. శ్రీవారిప్రయత్నములకు "దీక్షితుల" వారి మరణము నిరుత్సాహజనకమైనను విషయదూరులగు శ్రీవారిసంకల్పమమోఘమై కార్యసిద్ధిని జేకూర్పగలదని విన్నవించుచున్నాము. శ్రీవారు మదరాసునందు "ఆదిశైవసభలను" గావించుచూ, సంఘశ్రేయమునుగూర్చి యుపన్యసించుచూ, శ్రీకంఠమఠనిర్మాణము జరుగుటకై యత్నించుచున్నటుల దెలుపుటకు ఆనందించుచున్నాము.

## గౌరవసంపాదకులు.

మనపత్రికకు శ్రీమాన్ నాగలింగం వెంకటేశ్వరశాస్త్రిలవారిని "సబ్ ఎడిటరు"గా నియమించుకొని శ్రీవారిపరిశీలనతో పత్రిక నడపునటుల సలహానొసంగిన శ్రీయుతులు గూడూరు వియ్యన్నగారి నభినం

దించుచున్నాము. ఆరంభమునుండియు మాకోరిక యీమార్గమునే యనువదించుచున్నది. శ్రీశాస్త్రిలవారు ఉభయభాషా ప్రవీణులు, యువకులు. సరళస్వభావులు. పండితులు. శ్రీవారియాజమాన్యమునవే మన ఆదిశైవమహాజనసంఘము వర్తించుచున్నది. గావున శ్రీవారిని గురించి విశేషముగా వ్రాయనవసరముండదు. శ్రీవారు మావిన్నప మాలకించి సంపాదకీయ భారములో పాల్గొనుటకు ప్రార్థించుచున్నాము. రాబోవు సంచికనుండిగాని భావసంవత్సర సంపుటమునుండిగాని నూతనవిషయములతో శృంగారముగా పత్రిక వెలువడగలదు. సాంఘికులీముఖ్యవిషయమును గమనించి యుత్సాహమును జూపుదురని విశ్వసించుచున్నాము.

## గవర్నమెంటువారి ఆర్డరు.

ప్రతిఇంగ్లీషునెలయొక్క (20) యిరువదవతేదీరోజున మన పత్రిక వెలువడగలదు. ఆర్థికపరిస్థితులవలన సకాలమునకు పూర్తి చేయలేకున్నచో పై మాసమువరకు వేచియుండవలసివుండును. అవసరమైనచో 0-0-6 చీటీతో పంపవలసివుండును. గావున చందాదారులు యీవిషయమును గమనింపగోరుచున్నాము.

## విలేఖకులకు మనవి.

మీామీావ్యాసములు సకాలములో ప్రకటనగాలేదని ఆగ్రహింపకుడు. మితిలేని చిక్కులుగలిగి నిరుత్సాహము జనించుటచే పత్రికను సామాన్యముగా ప్రకటించుచున్నాము. క్రమముగా అందరివ్యాసములు రాగలవు.

---

## గృహలక్ష్మి — దసరాసంచిక.

గృహిణీలోకమున కత్యుత్సాహము గల్గించుచున్న యీదసరాసంచికను వందనపురస్సరముగా స్వీకరించి యందలి యమూల్యాభరణములైన వ్యాసరాజములను చిత్రపటములను దర్శించి యానందించుచూ, పత్రికాధిపతులైన శ్రీయుతులు డాక్టర్. కేసరిగారి నెంతయునభినందించుచున్నాము. యీపత్రిక ప్రస్తుతకాలమున స్త్రీలపాలిటి కల్పతరువై యలరారుచున్నది. ఆంధ్రదేశమంతయు వ్యాపించి స్త్రీవిద్యాభివృద్ధిని గౌరవమును గాపాడుచున్నది. ప్రతివారును తప్పక పరిశీలించవలసిన పత్రిక యని హెచ్చరించుచున్నాము. పరమేశ్వరుని యనుగ్రహమున నీపత్రిక చిరతరస్థాయిగా వర్ధిల్లుటకు గోరుచున్నాము.

(సంపాదకులు.)

## శ్రీ ధన్వంతరి జయంతిమహోత్సవము

## తెనాలి.

స్వస్తిశ్రీ శ్రీముఖనామ సం॥ కార్తీక బ౧౩ లు బుధవారం ది 15-11-1933 ఉదయం గం 10లకు సకలరోగపరిహారమునగు శ్రీ ధన్వంతరి వ్రతమును మాయొక్క స్వదేశి ఆయుర్వేదవైద్యశాలాభవనమున జరుగును.

ఉదయం గం 10లకు శ్రీధన్వంతరీ పూజయును సాయంత్రం గం 4లకు గానసభయును అనంతరం ఆయుర్వేదమును గురించియు ధన్వంతరి ప్రభావమును గురించియు ఉపన్యాసములు జరుపబడును. గాన, ఆయుర్వేద వైద్యులును, వైద్యాభిమానులును దయచేయ ప్రార్థితులు.

ఇట్లు,

పి. హనుమంతరావు, ఆయుర్వేద డాక్టరు, తెనాలి.

---

Regd No. M. 2073.

సం॥ర చందా రు 3.0-0 లు.

# శ్రీ ఆదిశైవ పత్రిక

శ్రీ శ్రీకంఠ మతాధిపతుల యాజ్ఞానుసారముగా, శైవసంఘాభ్యుదయమునకై శ్రీ గురుకులాశ్రమమునుండి ప్రతిమాసము ప్రకటింపబడును.

సర్వదేవాత్మకో రుద్రస్సర్వే దేవాశ్శివాత్మకాః ।
రుద్రస్య దక్షిణేపార్శ్వే రవిర్బ్రహ్మా త్రయోగ్నయః ।
వామపార్శ్వే ఉమాదేవి విష్ణుస్సోమోపి తేత్రయః ॥

(రుద్రహృదయోపనిషత్)

సంపాదకుడు:— చిలుమూరు పురుషోత్తమ గురుక్కళ్.

సంపుట ౯ } చిలుమూరు. శ్రీముఖనామసం॥ర కార్తిక-మార్గశిరమాసములు. { సంచిక ౮.౯

(విలేఖకుల వ్యాసములకు సంపాదకులు ఉత్తరవాదులు కానేరరు.)



## —◆ విషయసూచిక ◆—



భారతీ ప్రెస్, తెనాలి.

# మహారాజపోషకులు

[సంవత్సరమునకు ఆరురూపాయలు చెల్లించవలెను.]

౧ రాజవైద్య నాగలింగం నందయ్య అండు సన్సువారు ఆయుర్వేదభవనం అమృతలూరు

౨ శ్రీమాన్ కొల్లిపర వీరయ్యగారు, చివ్వలూరు.

౩ ... కంఠంరాజు వెంకటసుబ్బయ్యగారు, భట్లపల్లి అగ్రహారం.

౪ ... చావలి పాలయ్యగారు, పెదరావూరు.

౫ ... స్వర్ణ సుబ్బయ్యగారు, పాండ్రాక.

౬ ... గూడూరు లక్ష్మయ్యగారు. వెంటురుమిల్లి.

౭ ... ఆగమిక నంజుండ దీక్షితులుగారు, రామసముద్రము.

౮ ... పసుమర్తి పార్వతమ్మగారు, కూచిపూడి.

౯ ... వెలవలపల్లి వెంకటేశ్వరదీక్షితులుగారు.

## రాజపోషకులు. [సం॥రం 1కి రు 5-0-0లు.]

౧ ఆగమిక వాగీశ్వరదీక్షితులుగారు, పుంగనూరు.

౨ శ్రీమాన్ చావలి దుర్గాప్రసాద దీక్షితులుగారు, తరిగొప్పులు.

౩ ... యలమంచిలి సుబ్రహ్మణ్యంగారు, వెదురుపాక.

౪ ... గూడలి రామయ్యగురుకులు, చినమాంభట్ల అగ్రహారం.

౫ శ్రీమతి ఇంకొల్లు అన్నపూర్ణమ్మగారు, (తాలూకాబోర్డు మెంబరు) ప్రత్తిపాడు.

౬ శ్రీమాన్ S. రామప్పగారు, (కరణం) ఉప్పరపాలెం.

## పోషకులు. [సం॥రం 1కి రు 4-0-0లు]

౧ శ్రీమాన్ వడ్లమూడి కోటయ్యగారు, వడ్లమూడి

౨ ... నూతలపాటి వెంకటనారాయణ గురుకులుగారు, వరకవిపూడి.

౩ ... చావలి పిచ్చయ్యశర్మగారు, చాటపర్రు.

౪ ... S. A. నంజుండయ్యగారు, శిరస్తాదారు, పుంగనూరు.

౫ ... ఉయ్యాలవాడ మునెయ్యగారు, భండ్యాశ్మకూరు.

౬ ... ఆగమిక సుబ్రహ్మణ్యదీక్షితులుగారు, బెంగుళూరు.

౭ ... కొల్లిపర వెంకటసుబ్బయ్యశర్మగారు, అమ్మనబ్రోలు.

౮ ... నాగలింగం సత్యనారాయణగారు, డాక్టరు, మూలుపూరు.

౯ ... చుండి ఆనందరాయుడుగారు, రూపెనగుంట.

౧౦ ... ఆగమిక చంద్రశేఖరదీక్షితులుగారు, చౌడేపల్లి.

౧౧ ... S. A. అగస్త్యప్పగారు, చారాల.

౧౨ ... మురికిపూడి వెంకటేశ్వర్లుగారు, వల్లభాపురం.

౧౩ ... చావలి చంద్రయ్యగారు, పెరవలి.

౧౪ ... కూర్మగిరి శేషమ్మగారు, పాకవీడు.

# శ్రీ ఆదిశైవపత్రిక

ఏకోరుద్రస్సు ఈశానస్సభగవాన్ సమహేశ్వరస్సు మహాదేవః ॥

"అధర్వశిరసి"

సంపుట ౯ | చిలుమూరు. శ్రీముఖనామ సం॥ కార్తీక మార్గశిర మాసములు | సంచిక ౮-౯

## ప్రార్థన

ఉ॥ ఎవ్వడు లోకమెల్ల సృజియించి భరించి ధరించె పొట్టలో
నెవ్వడు మూడుమూర్తులలొ ముఖ్యుడునై చరియించుచుండెనో
ఎవ్వడు ప్రాణికోటుల కిహీనపరాక్రమ మిచ్చుచుండునో
నవ్విభు డాదిశైవులకు నాయువు సంపదలిచ్చి బ్రోచుత౯॥

[శ్రీగురుకులాశ్రమము.]

### 1. పత్రికా ప్రబోధము.

[శ్రీయుత శివపురం విఘ్నేశ్వరస్వాములు.]

సీ॥ శ్రీకరంబుగ దేశ సేవజేయుదమన్న
ఘనులార పత్రిక గాంచవలయు
మానవసేవచే మహి దరింతమటన్న
కనురలార పత్రిక గాంచవలయు
దివ్యదృష్టిస్థితి దెలియగావలెనన్న
జక్కగా పత్రిక జదువవలయు
బీదసోదరులను బెంపగావలెనన్న
పేదపత్రికనిల బెంచవలయు

గీ॥ బెంచగా మీదుహృది దయనుంచవలయు
నుంచి మీపేరు బత్రిక నుంచవలయు
నుంచుడని మిత్రులను బ్రోత్సహించవలయు
పుడమి పత్రికసేవయే బూనవలయు॥ ౧.

గీ॥ కులము దేశాభిమానముల్ కూలద్రోసి
యేపుమీరెడు దయ నిల రూపుమాపి
ధనముగని పొంగి ధర్మముల్ దలపకుండ
గర్వమున భువి జీవింప గార్యమేమి॥ ౨.

గీ॥ ధనముగల్గిన దానితో దానగుణము
ధర్మమునుగల్గ దానితో ధర్మగుణము
దానముగల్గ సత్పాత్ర తలచుగుణము
గుణముగల్గిన పత్రికగ గొనుటఫలము॥ 3.

2. [శ్రీమాన్ యస్. అగస్త్యప్పగారు, చీరాల.]

ఆదిశైవ సోదరులారా!

పత్రికాపరిస్థితులు విన్నవించు సంపాదకుని దీనాలాపములు గమనించువారి హృదయము నీరగుచున్నది. "గాఢాంధకారముచే గప్పివైచిన యీ శైవజాలము పత్రికారత్నమనెడి దీపికచే, తేజోవంతమై ప్రకాశించుచున్నదని సంతసించుచున్నాము. యీ మహాత్కార్యమునకు సహాయమొనరింపక కంకణబద్ధులైన చందాదారులిట్టి సంకటమును గలుగజేయుట మిక్కిలి విచారకరము. వారల కిట్టి కఠినమనస్సునొసంగిన పరమేశ్వరుని సంకల్పమెట్టిదియో దెలియకున్నది. యీలాటి ఘనకార్యమును బూనిన సంపాదకమహాశయులవంటి సత్పురుషులు నూటికొక్కరుండురాయని సందియము గల్గుచున్నది. మతోద్ధారకులు లేరని లోకమంతయు తపించుచుండ జేయుచున్న ప్రయత్నములు నిరర్థకపరచువారి నెంతయు గొనియాడదగును. సంఘోద్ధరణదీక్షా బద్ధకంకణులగు సంపాదకులను యీ తొమ్మిది సంవత్సరములుగా మితి

లేని విచారములపాలుజేసిన సాంఘికుల నెట్లనుడువవలెనో దెలియ కున్నది. యీ చందాదారులు భరించునది సంవత్సరమునకు మూడు రూపాయలుమాత్రమేగదా. భారమైనచో తగ్గించుకొనవలెనని తెలుప వచ్చునే. యింతటితో మనసంసారములు చిక్కులలోబడునా? నమ్మించి సహాయపడకుండుట న్యాయమా. సోదరులారా! తమ, సహాయము వలననే పత్రిక నడుపవలసివున్నది. యీ ఖర్చువలన మనకు నష్టము వాటిల్లదు. వేనకువేలు మహోదారులున్నారు. మీరందరు సహాయ పడి పత్రికను రక్షింపగలరని నమ్ముచున్నాను. మీమీ శక్తిననుసరించి బాకీలు పూర్తిగా దయచేసి కులము నుద్ధరింపగలందులకు అనవరతము పెద్దలయిన మిమ్ములను ప్రార్థించుచున్నాను.

### 3. [శ్రీమాన్ వెలవలపల్లి చినకామన్నగారు.]

ఆదిశైవ మహాశయులారా!

ధనసహాయ్యము లేనిదే యేకార్యము నెరవేరజాలదు. మన సంఘాభివృద్ధికై శ్రీగురుక్కళ్ మహాశయోగారు తొమ్మిది సంవత్సర ములనుంచి ఆదిశైవపత్రికను వెలువరించుచున్నారు. ప్రతిసంచికను ఆరంభమునుండి సాంతముగా పఠించినచో అందలి సద్విషయములు గోచరమగును. అట్లొనరింపక పత్రికయొందులకు, దానివలనలాభమేమి అని సందేహములుతో సహాయమొనరింపక పోవుటవలన మిక్కిలి విచారకరముగానున్నది. యీపత్రిక మనసంఘమునకు చాలా బలము గలుగజేయుచున్నది. దేవాదాయ వ్యవహారములు, మతాచారధర్మ ములు, ఆగమప్రమాణరహస్యములు, సంఘవిశేషములు మొదలగు విషయములు దెలుపుచూ, సంఘమున కమూల్యమగు సేవజేయు చున్నది. దుర్వాదములు జయించినది శైవదీక్షాయాగము. ఆచార్య ప్రతిష్ఠలకు కారణభూతమైనది. సంయుక్తసమావేశములు గావించి పండితప్రముఖుల సందర్శింపజేసినది. ఇట్టి మహద్విషయములు దెలు

పుచున్న కులపత్రికకు మనము సహాయపడి మతగౌరవముల నభి వృద్ధిపరచుట పరమధర్మము. సత్కార్యములకు సహాయమొనరించినచో పరమేశ్వరుడు సంతసించిమన కఖండైశ్వర్యాదులొసంగగలడని విన్న వించుచున్నాను.

---

# సత్యము.

[శ్రీమాన్ చావలి పిచ్చయ్యశర్మగారు]

ఈ ప్రపంచమున సత్యమునకంటె మిన్నయైన ధర్మమింకొకటి గన్పట్టుటలేదు. దానిమహాత్మ్యము వర్ణింప నశక్యము. పృధివ్యాది పంచభూతములు, నవగ్రహములు మున్నగునీ ప్రపంచమంతయు సత్యముపైననే యాధారపడియున్నది. వేదములందు సత్యమును గురించి కీర్తింపబడియున్నది. "ఋతంచ సత్యంచాభీద్ధా త్తపసోధ్య జాయత" "సత్యేనోత్తభితాభూమిః" "సత్యతేచ పరబ్రహ్మ" మున్నగు వాక్యములు సత్యముయొక్క యధార్థమహత్వమును గొనియాడు చున్నవి. "అశ్వమేధసహస్రంచ, సత్యంచ, తులయాధృతం, అశ్వమేధ సహస్రార్ధి సత్యమేవవిశిష్యతే" యనువాక్యములవలన సహస్ర అశ్వ మేధయాగములకంటె సత్యమే శ్రేష్ఠమని దెలియవలెను. "సత్యంవద ధర్మంచర, సత్యపూతం వదేద్వాచం. అనుమహావాక్యముల వలన సత్యము సర్వధర్మసారమని సత్యమునకే అగ్రస్థానమివ్వబడినది. మోసముజేసి మనబుద్ధిని ధర్మమున నుపయోగింపరాదు. అనగా ధర్మవంచనచేయరాదు. అట్లొనరించిన మనమే వంచింపబడవలసి వచ్చును. ఎవ్వరేని కూటసాక్ష్యాది ధర్మవంచనమొనరించినచో అతని కేడుపురుషాంతరములవార్కి మహానరకములు సంభవించునని ధర్మ శాస్త్రములు దెలుపుచున్నవి. "ననర్మయుక్తంవచనం హినస్తి. నస్త్రీ షురాజన్ నవివాహకాలే, ప్రాణాత్యయే సర్వధనాపహారే పంచా నృతాన్యాహురపాతకాని" హాస్యమునందును స్త్రీలవిషయములందును

వివాహకాలమందును, ప్రాణాపాయము సంభవించునపుడును, ధనాపహృతమునందును అబద్ధమాడిన దోషములేదని ధర్మశాస్త్రములు దెలుపుచున్నవి. యుధిష్ఠిరమహారాజు ఒక్కతూరి "నరోవా, కుంజరోవా" యని ఆంతరంగిక ప్రసంగమున స్మరించినంతమాత్రముననే అంతరిక్షమార్గమున నడచెడి తనరథము సామాన్యులవలెనేలపై నడువవలసివచ్చెను. ఆకారణముననే ఒక్కగడియయైనను నరకమనుభవింపక తప్పదయ్యెను. అటులే అర్జునుడు క్షాత్రధర్మము ననుసరించి శిఖండిని ముందిడుకొని భీష్మవధచేయుటచేతి బభ్రువాహనునిచే పరాభవింపబడెనని మహాభారతమునందుకలదు. స్వల్పఅనృతముల వలన నట్టివానికే అనేకకష్టములు సంభవింప ఘోరానృతవాదుల కెట్టి నరకబాధలు సంప్రాప్తమగునో దెలుసుకొనుటావశ్యకమని విన్నవించుచున్నాను.

---

## తయారగుచున్నది.

సోదరులారా !

శైవవిశిష్టాద్వైతమతానుసారముగా "బ్రహ్మసూత్రమీమాంసాభాష్యమగు శ్రీ శ్రీకంఠభాష్యము ఆంధ్రాక్షములతో [సంస్కృతభాషతో]అచ్చువేయుట పూర్తిగావచ్చినది. ప్రతిఆదిశైవగృహమునందును ఈ మహాభాష్యగ్రంథమును నెలకొల్పి. పూజించుటత్యంతావశ్యకమని హెచ్చరించుచున్నాము. ఉపనిషద్భాష్యము, గీతాభాష్యముగూడ వెలువడగలవు వివరములన్నియు ముందు తెలుపగలవారము.

[పత్రికాధిపతి]

# శ్రీకంఠభాష్య ముఖ్య తాత్పర్యనిర్ణయః.

ఓం బ్రహ్మవిదాప్నోతి పరం
జ్ఞాత్వాశివం శాంతి మత్యంతమేతి
ఈశంతం జ్ఞాత్వా అమృతాభవంతి
తమక్రతుంపశ్యతి వీతశోకోధాతుః ప్రసాధాన్మహిమానమీశం.
"ఆత్మానమరణిం కృత్వాప్రణవం చోత్తరారణిం
ధ్యాననిర్మథనాదేవ పాశందహతిపండితః"
"జ్ఞాత్వాదేవం ముచ్యతే సర్వపాశైః

నిరస్త సమస్త దోషకళంకం నిఖిలమంగళాధారభూతం బ్రహ్మతదేవజగతో అభిన్ననిమిత్తోపాదాన కారణం । సూక్ష్మచిదచిద్విశిష్టం బ్రహ్మకారణం । స్థూలచిదచిద్విశిష్టం బ్రహ్మకార్యం। ఇదంహిజగత్ పరమేశితుశ్శరీరం । సకల చిదచిత్ప్రపంచాకార పరశక్తివిశిష్టాద్వితీయ వైభవః, పరమేశ్వరః । పరమకారుణీకస్య, సర్వానుగ్రాహకస్య తస్య ప్రసాదాతిశయేన అధికారిణః ప్రధ్వస్తపాశపటలా కైవల్యలక్ష్మీస్సిధ్యతీతి, నిఖిలనిగమ, శివాగమానామాశయోప్యయమేవ॥

నిరవధిక పరమానందమయ, నిష్కళంక శివత్వప్రాప్తిర్హిముక్తిః శివత్వప్రాప్తిరాత్మనః, పశుత్వనివృత్తి మంతరేణ నసంభవతి పశుత్వనివృత్తిశ్చ నతద్భావభావనాం వినాఅతో నిరంతరం శివోహమితి భావనాప్రవాహేణ శిథిలితపాశతీయాఽపగత పశుభావ ఉపాసకశ్శివఏవభవతి నిరస్త సమస్తదోషకళంక నిరతిశయ మంగళాస్పదత్వంహిశివత్వం । పరం బ్రహ్మచతాదృగేవ తత్తద్భావనయోపాసకశ్చతద్రైవభవతిఅతఏవతదన్యస్యముముక్షుధ్యేయత్వంనిషిధ్యతే ధ్యేయశ్శివం కరస్సర్వ మన్యత్పరిత్యజ్యే॥ త్యాదిషు, శ్రుతిషుః నివృత్త బ్రాహ్మణాది దేహాభిమానాదిమయ, పశుభావశ్య నిరతిశయ స్వరూపానందసాక్షీ స్వప్రకాశ శివరూప పరమాహంభావాపత్తిర్ముక్తి రితి సర్వశ్రుతి తాత్పర్యాత్। బ్రహ్మభావేనోపాసన ముపాసకస్య ముక్తికర

మన్యథాకథం సంసారాన్నివృత్తిరితి॥ సాక్షాత్కృత పరబ్రహ్మ జ్యోతి షాంతత్పదాను ప్రవిష్టానాం ముక్తానాం సపునరావృత్తిస్సంసారే। బ్రహ్మవిష్ణ్వాది పదంత్యక్త్వా తదతీతత్వేన శివస్య పరబ్రహ్మణః పద విశేషం పురాణంచాభివ్యనక్తి।

"దినకృత్కోటిసంకాశం స్థానమాద్యముమాపతేః। సర్వకామ సమాయుక్తం విశుద్ధం నిత్యమక్షయం సంప్రాప్యతత్పదందివ్యం సమస్త క్లేశవర్జితాః। సర్వజ్ఞాసర్వగాశ్శుద్ధాః పరిపూర్ణభవంతిచ విశుద్ధకార్య కరణాః। పరమైశ్వర్యసంయుతాః। సదేహాశ్చ విదేహాశ్చ భవంత్యా త్మేచ్ఛయాపునః। యేసంప్రాప్తాః పరంస్థానం జ్ఞానయోగరతానరాః। నతేషాంపునరావృత్తి ర్ఘోరెసంసారమండలె॥ "నతత్రసూర్యోభాతిన చంద్రతారకం నేమావిదుతో భాంతికుతోయమగ్నిః। తమేవభాంత మను భావిసర్వం తస్య భాసా సర్వమిదంవిభాతి॥

ఓం శాంతిశ్శాంతిశ్శాంతిః॥

శ్రీకంఠశివాచార్యా పరాభిధాన బోధానందమహర్షిః.
శ్రీ శ్రీకంఠమఠాధిపతిః (కోటిఫలి.)

---

# శంకరాచార్యులతో వాదము సలిపిన నీలకంఠుడు శ్రీకంఠుడేనా ?

ఉత్తరమీమాంసా సూత్రములు వ్యాసమహర్షిచే ప్రసాదిత ములు. ఇవి దశోపనిషత్తులయొక్కయు గీతయొక్కయు సంగ్రహమే. ఈ పైమూటికిని వేదాంతశాస్త్రమని జగద్విఖ్యాతి. శ్వేతాచార్యుని శిష్యులును లకులీశ్వరావతారులునగు జగద్గురు శ్రీ శ్రీకంఠ శివా చార్యులవారు యీ వేదాంతశాస్త్రమునకు ప్రథమతః భాష్యము వ్రాసియున్నారు. అదియే "శైవవిశిష్టాద్వైతము". ఆమర్ధకాది మఠ

ముల కాధిపత్యము వహించి జగద్గురువులై ప్రపంచమందెల్లెడలను తమ శైవమతమును వ్యాపింపజేసిన వందనీయులు శ్రీశ్రీకంఠులే. ఈ మహానుభావుడు ఆదిశైవవంశోద్భవుడు. (శ్రీకంఠుని అనుయాయులాదిశైవులు.)

కొందరేయుద్దేశ్యముననో యీ క్రిందివిధమున వాదులాడుచున్నారు. ప్రస్తుత ప్రచారములోనున్న శ్రీకంఠభాష్యము ఆద్యభాష్యమనుటలో మాకు విరుద్ధాభిప్రాయము లేదు. క్రీ॥శ॥ 7వ శతాబ్దమున శంకరాచార్యులతో వాదమునలిపి పరాజయమొంది అద్వైత మాశ్రయించిన నీలకంఠుడను పేరుగలవాడితడే యనియు నీలకంఠభాష్యమే శ్రీకంఠభాష్యమనియు వాదించుచున్నారు. తాము వ్రాయుచున్నదానికి శంకరవిద్యారణ్యులు సాక్షులు. దీని నావంత విచారింతము. మొదటి సాక్షి శంకరాచార్యుడు. శంకరులు నీలకంఠులతో వాదించి యోడించినట్లు ఈసాక్ష్యము. ఆయన వాదించినది నీలకంఠునితోనేగాని శ్రీకంఠునితోగాదే? నీలకంఠ శ్రీకంఠశబ్దము లత్యంతభిన్నములు కావనుటకంటె నీలకంఠ శంకరసంజ్ఞల కత్యంత సామీప్యమున్నదనుట శ్రేయోదాయకము. ప్రస్తుతము భాష్యమొక్కటియే గన్పట్టుచున్నది. కావున నీలకంఠశబ్దమునకు మారు శ్రీకంఠశబ్దము వాడబడినదనుటకంటె నీలకంఠ శ్రీకంఠభాష్యములు రెంటిలో నీలకంఠుడు శంకరులతో యోడి తన భాష్యమును పారవైచెను. గనుక ఆభాష్య మంతరించిపోయినదనియు మిగిలినది శ్రీకంఠభాష్యమని గుర్తెరుంగుట మిక్కిలి శ్రేష్ఠము. శ్రీకంఠ నీలకంఠులొక్కటియే యని సాధించుటవలన గలిగెడి ప్రయోజనమేమో? ఏప్రయోజన మక్కరలేదు. మా నోటికివచ్చినట్లెల్ల పలుకుటయు కలముపోయినట్లెల్ల వ్రాసెదమనినచో అది పండితలక్షణము గాదని నొక్కి వక్కాణింపవలసివచ్చును. ఇంతకంటె వెర్రితనముండ నేరదు.

ఇక రెండవసాక్ష్య మెంతవరకు సత్యమో యోచింతము. యీ విద్యారణ్యులవారు "శంకర విజయమును" వ్రాసినందువలన యీ

సాక్ష్యముగూడ పరిశీలనార్హము. యీ గ్రంథమునందువ్రాసిన నీల గళ శంకరులకు ప్రవృత్తమైన వాదప్రతివాదములు జరుగుట సర్వజన వేద్యమే? నీలకంఠ శ్రీకంఠు లొక్కరేయని విద్యారణ్యులు తనగ్రంథ మం దెక్కడనైనా వ్రాసినట్లు జూపగలరా? ఆధునిక పండితప్రకాం డులవలె విద్యారణ్యులు స్వకపోల కల్పితము లెప్పుడును వ్రాయ జాలరు. విద్యారణ్యులు వ్రాసిన సిద్ధాంతసూత్రభాష్య వ్యాఖ్యాన మందు శ్రీకంఠులాద్యభాష్యకర్తయనిన్నీ వారికి తాము నమస్కరించు చున్నామనిన్నీ పలుమార్లు వ్రాసియుండ శంకరునితో యోడిన నీల కంఠుడు శ్రీకంఠుడని వ్రాయుటకు సాహసించునా? శంకరవిజయ ములో నీలకంఠుడు ఆద్యభాష్యకర్తయని ప్రశంసించియుండలేదే? రెండుపేర్లు ఒక్కరికే చెందియున్నవని తాను రచించిన ప్రార్థనా పద్య ములలోగాని శంకరవిజయమున పంచదశసర్గయందలి 31 మొదలు 72 వరకుగల శ్లోకములలోగాని శ్రీకంఠశబ్దమును జేర్చుటకు శక్తి లేకపోవచ్చునేమో? నీలకంఠుడు వేరు. శ్రీకంఠుడు వేరు. ప్రత్యేక ప్రత్యేక భాష్యములుగలవు. ఆద్యభాష్యకర్త శ్రీకంఠుడు శంకరు నితో వాదించి యోడిపోయి భాష్యము నస్తమింపజేసి అద్వైతమాశ్ర యించినది నీలకంఠుడని విద్యారణ్యులవారు నిష్పక్షపాతబుద్ధితో శంకర విజయాదిగ్రంథములు వ్రాసినారని యింతటనైనా గ్రహించుట బుద్ధి మంతుల లక్షణము. మరియు విద్యారణ్యులు తన శంకరవిజయమందు "గోకర్ణక్షేత్రవాసియగు నీలకంఠ మునివర్యులతో శంకరులు వాదించి నారని వ్రాసిరేగాని పవిత్రమైన మంథనకాళేశ్వరక్షేత్ర నివాసులును ఆమర్దకాది మఠాధిపతులగు శ్రీ శ్రీకంఠశివాచార్యులవారితో వాదించినట్లు వ్రాయలేదని బుద్ధిగలిగించుకొనుట శ్రేయస్కరము. యీ వాదములు నిరర్థకమైన వెర్రివాదములు, పిచ్చితలంపులు, మూర్ఖపువ్రాతలని బోధింపుచూ తెలియని విషయములలో జోక్యము కలుగజేసుకొని పరాభవము నొందుటకంటె మిన్నకుండుట శ్రేయ స్కరమని హెచ్చరించుచున్నాము.

ఇంతవరకు పూర్వపక్షులవాదము పూర్వపక్షమైనది. సాక్ష్య
ములు చర్చించితిమి. ఇకసిద్ధాంతమును విచారింతము. భాష్యకర్తయగు
శ్రీకంఠుడు తన భాష్యమునందే "వ్యాససూత్రమిదంనేత్రం విదుషాం
బ్రహ్మదర్శనే । పూర్వాచార్యైః కలుషితం శ్రీకంఠేన ప్రసాద్యతే
శ్రీమతాంవ్యాససూత్రాణాం. శ్రీకంఠీయః ప్రకాశతే ! మధురోభాష్య
సందర్భో మహార్థోనాతివిస్తరః" శ్రీకంఠశివాచార్య కృతమనివిశదముగా
జెప్పుకొనుచుండగా, నీలకంఠభాష్యమిదియే యని పలుకుట నిస్సార
ముగానున్నది. శ్రీకంఠభాష్యమునకు "శివార్కమణి" యను వ్యాఖ్యా
నము రచించిన శ్రీమదప్పయ దీక్షితులవారు శ్రీకంఠశబ్దముయొక్క
వ్యుత్పత్తినిట్లు పొందుపరచుచున్నారు. "శ్రీఃగ్రస్తస్య కాలకూటస్య
కంఠేనియమనప్రయుక్తా ధవళస్యనైల్యకృత పరభాగశోభాతమో క్ష
క్షితః కంఠోస్యేతి వ్యుత్పత్యా శ్రీకంఠశబ్దః శివేప్రవృత్తః ఇహాపితద్వ్యు
త్పత్తిస్మరణే నవిషసదృశస్యగృహీతస్య పరదోషజాలస్య కంఠేనియ
మయిత్వత్వమాత్మనశ్శైలీయా "గుణదోషౌ బుధోగృహ్ణన్నిందుక్ష్వేళా
వివేశ్వరః । శిరసాశ్లాఘతే పూర్వంపరంకంఠేనియచ్ఛతి॥ ఇతిసత్పురుష
త్వేనప్రసిద్ధేతి" తేనశ్రీకంఠనామ్నాఖ్యాయతే। అనగా చంద్రశేఖరుడు
తెల్లనికంఠమున విషముధరించినందువల్ల నాభాగము శ్యామలత్వము
నొందినను శోభనుగూర్చుచున్నదను నుపమానగ్రహణమున పరమత
దోషజాలమును కంఠమున నిడుకొని తన గ్రంధరచనాశైలిని ప్రమా
ణము విడిచి తనసత్పురుష ధర్మమును జాటెననియు, శ్రీకంఠశివా
చార్యులు బ్రహ్మసూత్రమీమాంసాభాష్యకర్తలు. తనభాష్యము సగు
శివపరముగా వ్రాయబడినట్లును ప్రతి పదమతిగంభీరముగుటచే మహా
బోంట్లకుగూడ తెలియశక్యముగాదని స్పష్టముగా తన వ్యాఖ్యానమం
యందు అప్పయ్యదీక్షితులవారు దెలుపుచున్నారు. ఇంకను పలువు
పండితవర్యులు శ్రీకంఠ శివదేశికేంద్రులవారు భాష్యకర్తయని
క్రీస్తుపూర్వము 6 శతాబ్దమునందలి వారనియు నుదాహరణపూర్వ
ముగా దెలుపుచున్నారు. గ్రంధవిస్తరభీతిచే నిటవ్రాయజాలకున్నాము

భాష్యరచయితలు, తద్వ్యాఖ్యాతలు, ముద్రాపకులు, ఇతరులు ప్రచారములోనున్న శ్రీకంఠభాష్యము శ్రీ శ్రీకంఠశివాచార్యులచే వ్రాయబడినదనియు నీలకంఠయోగిచే గాదనియు నీలకంఠభాష్యమని పిలువరాదనియు, అట్లు పిలుచుట యజ్ఞానమనియు, శంకరులతో వాదించిన నీలకంఠమునియొక్క మెడకు యీశ్రీకంఠభాష్యము తగిలించుట మహాపరాధమనియు, నీలకంఠుడు లింగధారణగల వీరశైవుడనియు వీరశైవమతప్రచారకుడనియు శంకరుని సమకాలికుడనియు, శ్రీకంఠ శివాచార్యులవారు శంకరునికి పూర్వము షుమారు వెయ్యి సంవత్సరములకు ముందేజన్మించినారనియు శ్రీకంఠవిజయాది గ్రంథములవలన దెలియుచున్నది.

పూర్వపక్షులు తమకు సాక్షులని పేర్కొనిన శంకరవిద్యారణ్యుల విషయము సహాయపడకపోగా, తాము నిర్మించిన దృఢతరాకాశసౌధము నిర్మూలనమై బాధకరమైనందులకు విచారించుచున్నారము. నిస్సారమైన దుర్వాదములగైకొని మతధ్వంసమొనరించుటకు యత్నించుట హానికరమని యింతటనైనా నిజస్థితులు దెలుసుకొని మౌనము వహించుట సన్మార్గవర్తనమని హితోపదేశముగావించుచూ, ధర్మసంరక్షణగావించుటకు జగత్కల్యాణమూర్తియగు నప్పరమేశ్వరుని ప్రార్థించుచున్నారము.

శివమ్ "యతోధర్మస్తతోజయః" M. R. శర్మ,
(శ్రీగురుకులాశ్రమము)

---

# సంపాదకీయములు.

<u>స్వవిషయము.</u>

ధనసహాయమే ఎప్పుడును గోరుచున్నారని కొందరు తలచుచున్నట్లు తెలిసి లజ్జించుచున్నాము. షుమారు రెండువేలరూపాయిలకు పైగా దిగుబాట్లుగావించి మావిన్నపము లరణ్యరోదనముజేయుట

నెవ్వరును గమనించనేరరు. పుష్కలముగా ధనముండినచో చిత్రవిచిత్ర ములతో పత్రికను నడుపుచూ ఆనందించుటకు వీలుగలుగునేగాని "దినదినగండాలతో" నడచునపు డేమిచేయుటకు దోచక అట్లు గోర వలసివచ్చుచున్నది. అట్టి మహానుభావులు సైతము దిగుబాటు చేసిన వారిలోనివారని మాత్రము దెలుపుటకు చింతిల్లుచున్నాము. త్వరలో మావిచారమును గమనించి పత్రికను సలక్షణముగా నడచునట్లు గావించుట శ్రేయస్కరము.

శ్రీ శ్రీకంఠ శివాచార్యస్వాములు.

శ్రీ స్వామివారు మదరాసునందు మకాంగావించి ప్రస్థానత్రయ శైవవిశిష్టాద్వైత భాష్యములు అచ్చువేయించుచున్నారు. త్వరలో పూర్తిగాగలవు. మిగతా విశేషములు ముందు దెలుపగలవారము. శ్రీవారి సత్యసంకల్పము నెరవేర్చుటకు పరమేశ్వరుని సర్వదా ప్రార్థించుచున్నాము.

మైసూరు సంస్థానం.

శ్రీ మైసూరు సంస్థానం ముజరాయి కమీషనర్ ఆఫీసునందు ఆగమపండితులుగానున్న కీర్తిశేషులగు శ్రీ శ్రీనందీశ్వర దీక్షితవర్యుల వారిస్థానే శ్రీవారి కుమారులగు శ్రీమార్తాండ సుందరదీక్షితగురువర్యుల వారే తగియుందురనియు శ్రీ వారి శక్తిసామర్థ్యములు ఆగమప్రయోగాది సద్విషయములు మున్నగునవి ఆంధ్రదేశపర్యటన శివదీక్షాయాగ శైవమత ప్రతిష్టాదులయందు సర్వులు గమనించియే యున్నారనియు శ్రీ ఆదిశైవ సంఘము తరఫున శ్రీవారినే ఆగమపండితులుగా స్వీకరించుటకు గౌరవనీయులగు శ్రీ శ్రీ మైసూరు గవర్నమెంటువారిని నిరంతరము ప్రార్థించుచున్నాము. శ్రీ శ్రీ మహారాజావారు మాప్రార్థన సఫలీకృతమొనరించుటకు పరమేశ్వరుని ప్రార్థించుచున్నాము.

సానుభూతి.

జగద్విఖ్యాత పురుషులలో నగ్రగణ్యుడును, స్వదేశవ్రతదీక్షాదక్షుండును, పలుమార్లేకగ్రీవముగా ఎసెంబ్లీసభాధ్యక్షపదవికి పోటీ

లేకుండా ఎన్నుకోబడి న్యాయపరిపాలనగావించుచూ తనపదవిని నిర్ల క్ష్యముగా రాజీనామాయొసంగిన ఆత్మగౌరవపరాయణుండగు కీ॥ శే॥ విఠల్‌భాయిపటేలుగారు అన్యదేశములో పరలోకమున కేగిరని దెలుపుటకు చింతిల్లుచున్నాము. శ్రీవారి కళేబరము ద్రావకములో ముంచి ఇండియాదేశమునకు జేర్చి అంత్యక్రియలుగావించి శ్రీవారిభౌతికదేహమును పరమేశ్వర ప్రీతిగావించియున్నారు. శ్రీవారి ఆత్మశాంతిని గోరుచూ "భారతకుంతి" యని పేరొందిన శ్రీవారి కుటుంబమునకు మాసానుభూతి నందజేయుచున్నాము.

రైతురక్షణ యాత్రాసంఘము.

యీ మాసమునందాంధ్రరాష్ట్రమున గావించిన రైతుమహాజన సభల తీర్మానము ననుసరించి జిల్లాఅధికారుల సందర్శనములు గావింపబడెను. శిస్తురిమిషన్ విషయములు శ్రీమదరాసు గవర్నమెంటువార్కి విన్నవింపబడెను. ఘనతవహించిన శ్రీ బ్రిటీషు ప్రభుత్వమువారు ప్రపంచార్థికపరిస్థితులు గమనించి రైతులోకమునకు సహాయమొనరించి ప్రజలసౌఖ్యములను సంరక్షింప ప్రార్థించుచున్నాము.

---

# యీనెలలో పత్రికకు చందాలు చెల్లించినవారు

౧ శ్రీమాన్ బాదంపూడి వెంకటరత్నంగారు రామవరం (గో)
౨ ,, నందివెలుగు వెంకటప్పయ్యగారు అత్తోట (గుం)
౩ ,, పొణుకుమాటి మల్లయ్యగారు శృంగవృక్షం (గో)
౪ ,, మురికిపూడినాగభూషణంగారు(ఆంగీరస)నందివెలుగు (గుం)

☞ చందా దారులు తామివ్వవలసిన చందాలు త్వరలో బంపగలందులకు ప్రార్థింపడుచున్నారు. ఎక్కువ మొత్తములు యివ్వవలసినవారు తమతమశక్త్యానుసారముగా బంపవచ్చును. ఎంతమాత్రము సంకోచింపక వెంటనే బంపగోరెదము. [సం]

# శశి

స్వీకృతి.

విజయనగరమున శ్రీయుతులు మోటూరు వెంకటరావు త్రిపురాన వెంకటకృష్ణారావుగార్ల సంపాదకత్వమున పైపేరుగల మాసపత్రికయొక్క ప్రథమసంచిక వందనపురస్సరముగా నందుకొని యందలి సద్విషయములు పఠించి యానందించితిమి. "చనవు" "తీయనితలపులు" "జీవసంధ్య" మున్నగు చక్కని వ్యాసములు సుప్రసిద్ధపండితవర్యులచే వ్రాయబడినవి. సామాన్యులకుగూడ బోధపడెడి పద్ధతిలో నీపత్రిక ప్రకటనయగుచున్నది. అంతానవీనత్వమే. సర్వులు పరిశీలింపదగియున్నది. చంద్రశేఖరుని యనుగ్రహామున నీశశి దినదినాభివృద్ధినొంది సార్థకనామమై యలరారునని విశ్వసించుచున్నాము. చందా సంవత్సరమునకు పది అణాలుమాత్రమే. వలయువారు సంపాదకులకు వ్రాయవలెను.

---

## వార్తలు

దివ్యజ్ఞాన సమాజస్థాపకురాలును హిందూదేశమునం దత్యంతమానవసేవగావించి మహాప్రసిద్ధికెక్కిన అనిబిసెంటమ్మగారు భౌతికదేహామునుత్యజించి పరలోకవాసియైనది. ఈమె మరణమువలన దేశములో చాలా కొరతగల్గినదని పరితపించనివారుండరు.

కృష్ణాజిల్లాగుడివాడతాలూకా యందలి దేవాలయట్రస్టీలందరు నవంబరు 6 తేదీని శ్రీవిశ్వదాత కాశీనాథుని నాగేశ్వరరావు పంతులుగారి యధ్యక్షతను సమావేశముగావించి, హిందువులైన వారందరిని దేవాలయములలో ప్రవేశింపజేయవలెనని తీర్మానించిరట.

హరిజనప్రవేశమున కాటంకముగలుగజేయుటకై సనాతనులైన పండితవర్యులందరు, గగ్గోలుపడుచూ రంగయ్యారుగారి దేవాలయ ప్రవేశబిల్లును ప్రతిఘటించుటకు మహాప్రయత్నములు గావించు

చున్నారని కాంగ్రెసువారు అస్పృశ్యతా నిర్మూలనమునకై శ్రీగాంధి మహాత్ముని డిశంబరు 16 తేది మొదలు 29 తేదీవరకు ఆంధ్రదేశ ములో పర్యటనముగావింపగలరని నిశ్చయమైన వార్తలుబయలుదేరినవి.

దేవాలయములందు హరిజనులు ప్రవేశించినచో అర్చకత్వము మానెదమని కొందరు అర్చకులు బెదరించుచున్నారనియు, అట్టి దేవాలయములలో అర్చకత్వముజేయుటకు నూతనఅర్చకులు గావలెనని కొందరుప్రకటించుటచే గ్రామములోని వారందరును ధర్మకర్తలును అంగీకరించినచో అర్చకుని అభ్యంతరమేముండగలదనియు, అర్చకసోదరులు గూడ కాలానుగుణ్యమగు మార్పులకంగీకరింపక తప్పదనికొందరు సలహాలనిచ్చుచున్నారు.

శారదాబిల్లుకు గురియైనవారికి షుమారైదువందలలోపుగా సంభావనలు తగిలించి సన్మానించుచున్నారు. గావున ఇకముందెట్లు గావలసియుండునోయని చాలామంది భీతిల్లి, మనోవ్యాధులచే మంచాలు పట్టినట్లు తెలియుచున్నది.

రాజమండ్రికోర్టులో స్పెషలు జడ్జీగారిని, అర్చకదావాను విచారించుటకు నియమించుటచే చాలా భాగము విచారణపూర్తి యైనదట. త్వరలో తీర్పులు జరుగునని దెలియుచున్నది. గుంటూరు జిల్లాలో కొందరుమాత్రము రాజీలనెడి పద్మవ్యూహములోచిక్కుకొని ఉక్కిరిబిక్కిరి యగుచున్నారు. మరికొందరు హైకోర్టులలో అప్పీళ్ళు చేసియు తాలూకాకోర్టులలో డిక్లరేషన్ దావాలు దాఖలుజేసియు, మిగిలినవారు తటస్థులుగానుండి ఏవైపుజయముగల్గునో అటుదూకుటకు నడుములుకట్టి సిద్ధముగానున్నారు. వ్యవహార పరిస్థితులలో ఏభాగమునవలంబించినను ఒకట్టిగానున్నచో అర్చక సంఘమునకు తప్పక విజయము గలుగగలదనియు సాంఘికులలో అభిప్రాయభేదములు గల్గి, యిట్లువ్యవహారములన్నియు ఖండఖండములై నానారూపములుగా వెడలినదని పలువురు విచారగ్రస్తులై పరితపించుచున్నారు.

---

# ఆంధ్రరాష్ట్రీయాదిశైవ యువజనసంఘ కార్యనిర్వాహకవర్గ (29-1-1933) ప్రథమ సమావేశము, పొన్నూరు.

ఈసమావేశమందు ఏకకంఠ్యముగా నంగీకృతములైన తీరుమానములు.

1. ఈ ఆంధ్రరాష్ట్రీయాదిశైవ యువజనసంఘ కార్యాలయ మును గుంటూరుపట్టణమునందే స్థాపించుటకు యీ సభవారు తీర్మా నించుచున్నారు.

ఉ॥ కొలకలూరు సుబ్బారావుగారు.

ఆ॥ నా॥ విశ్వనాథశాస్త్రిగారు.

2. ప్రస్తుతము యీ సంఘమునకయ్యెడి ఖర్చులకుగాని తాత్కా లికముగా చందాల నివ్వగలందులకు ఆదిశైవ మహాశయులందగను ఈ సంఘమువారు ప్రార్థించుచున్నారు.

ఉ॥ పోగుల సారంగపాణిగారు.

ఆ॥ పణతుల విశ్వనాథరావుగారు.

3. ఈ సంఘమువారి కార్యక్రమమును విమర్శించుచూ తగు సలహాల నిచ్చుటకు యీ క్రింద నుదహరింపబడినవారిని సలహా సంఘ ముగ నెన్నుకొనుటకై యీ సభవారు తీర్మానించుచున్నారు.

1. యస్. సంగయ్య బి.ఏ.,గారు, 2. కారంచేటి కుమార స్వామిగారు, 3. గుడ్లూరు వెంకయ్యగారు, 4. గూడూరు రాఘవ రావుగారు, 5. గూడూరు వియ్యన్నగారు.

ఉ॥ పో॥ సారంగపాణిగారు.

ఆ॥ సం॥ మల్లిఖార్జునరావుగారు.

4. సంఘనిబంధనలను పూర్తిచేయుటకై యేర్పడిన ఉపసంఘము, ఆపనిని పూర్తించనందులకు విచారించుచు ఉపసంఘ సభ్యుల నుండి వచ్చిన సూచనలను ప్రాతిపదికగా నుంచుకొని, అనతికాలములో నిబంధనల నిర్ణయింప నీక్రిందివారిని కార్యనిర్వాహకవర్గము కోరుచున్నది.

ఉ॥ పణతుల విశ్వనాధరావు.

ఆ॥ నాగలింగం విశ్వనాధశాస్త్రి.

1. నా వేంకటేశ్వరశాస్త్రిగారు, 2. చావలి బాలసుందర రావుగారు, 3. కొలకలూరు సుబ్బరావుగారు.

5. ప్రస్తుతము దేశమున జరుగుచున్న యాందోళనమును గమనించి, హరిజనులు దేవాలయప్రవేశమును-గ్రాహముయొక్క స్థితిగతులను, ఏకగ్రీవతను, న్యాయబద్ధతను గమనించుచు .అర్చకమహాజనులు అంగీకరింపవలెననియు, అట్లు చేయకున్న ఈసంఘ జీవనశోభలు సన్నగిల్లగలవనియు, నిర్ణయించుచు, అవసరమగుచోట్ల నీవిషయమున ప్రచారమొనర్ప నీసంఘమువారు తీర్మానించుచున్నారు.

ఉప॥ చావలి బాలసుందరరావుగారు.

ఆమో॥ కొలకలూరు సుబ్బారావుగారు.

యీతీర్మానము లనవసరమయినయెడల ప్రకటించుటకు గోరుచున్నాము.

ద్వితీయ కార్యనిర్వాహక వర్గసమావేశము (అమృతలూరు) చే నామోదింపబడిన తీరుమానములు—(5-11-33)

1. శైవాద్యాగమపంచానులును, మైసూరు సంస్థానముజరాయిఋలాఖా ఆగమ పండితులును, ఆదిశైవకులావతంసులును, సుప్రథిత నాములును, అగు శ్రీనందీశ్వర దీక్షితులవారి అకాలమరణమునకు,

పరితపించుచు శ్రీవారికి ఆత్మశాంతిని, కలిగించుటకు పాశవిమోచన చణుడగు, సదాశివుని ప్రస్తుతించుచున్నాము.

ఉ॥ నాగలింగం రాఘవయ్యగారు.

ఆ॥ సం. మల్లిఖార్జునరావుగారు.

2. ఉపసంఘమువారు తయారుచేసిన సంఘముయొక్క నిబంధనోద్దేస్యములు చదువబడి యంగీకరింపబడినవి.

ఉ॥ పణతుల విశ్వనాధరావు.

ఆ॥ మురికిపూడి రాఘవయ్య.

3. మహాసభాసమావేశమునకు స్థలకాల నిర్ణయమొనర్చుటకు కార్యదర్శి కధికారమీయబడినది.

ఉ॥ నాగలింగమ్ కృష్ణమూర్తిగారు.

ఆ॥ సోమరాజుపల్లి వేంకటరామయ్యగారు.

4. ప్రచారకులనుండి వారి ప్రచారవిషయోదంతమును వాటికి చేరిన చందామొత్తమును సేకరించి సమావేశము లోపుగనే, అర్హులగువారిచే విమర్శింపించి, ఆయవ్యయ పట్టికను తయారుచేయుటకు కార్యదర్శి కోరబడుచున్నాడు.

ఉ॥ నా॥ వేంకటేశ్వరశాస్త్రిగారు

ఆ॥ సం॥ మల్లిఖార్జునరావుగారు.

2. సమావేశముల తీర్మానములు.

ప్రకటింపదలంచి ప్రధమసమావేశపు తీరుమానములు ప్రకటించుటాలస్యమైనది. అందులకు క్షంతవ్యులము.

కార్యదర్శి.

# ఆంధ్రరాష్ట్రీయార్చకమహాసంఘ కార్యనిర్వాహకవర్గ సమావేశము.

ఆంధ్రరాష్ట్ర అర్చకసంఘముయొక్క కార్యనిర్వాహకవర్గ సమావేశము [12—11—33] ఆదివారం తెనాలిలో శ్రీయుత డాక్టర్ పి. హనుమంతరావుగారి భవనమున శ్రీమాన్ విద్వాన్ నాగలింగం వేంకటేశ్వరశాస్త్రిగారి యధ్యక్షతను జరిగెను. సభకు రాజాలనందులకు చింతిల్లుచూ కొలదిమంది సభ్యులువ్రాసిన వుత్తరములు చదువబడెను. పంచముల దేవాలయ ప్రవేశమునుగూర్చిన తీర్మానములపై దీర్ఘచర్చజరిగెను. సభ్యులలో నొకరగు శ్రీయుత డి. హెచ్. వి. రంగాచార్యులుగారు యిందునుగూర్చి ప్రత్యేకబాధ్యతతో సంభాషించిరి. మూడవ ఆంధ్రరాష్ట్రార్చక మహాజనసభ బెజవాడలో జరుపుట కంగీకరింపబడెను.

## తీ ర్మా న ము లు.

౧. (అ) శైవాగమవిద్వాంసులును సంఘసేవానిరతులును మైసూరు ప్రభుత్వమువారి ముజరాయి కమీషను ఆఫీసు శైవశాస్త్రపండితులు నగు కీ. శే. శ్రీమాన్ నందీశ్వరదీక్షితులవారి యకాలమరణమునకు యీసంఘమువారు గాఢసంతాపమునందుచూ వారి కుటుంబమునకు సానుభూతిని దెలుపుకొనుచున్నారు.

(ఆ) సుప్రసిద్ధరాజకీయవేత్తయు భారతదేశసేవైకజీవియు ఆదర్శప్రాయముగా సామ్రాజ్యశాసన సభాధ్యక్షతను వహించిన వారునగు కీ. శే. విఠల్‌భాయిపటేలుగారి మరణమునకు యీ సంఘమువారు చింతిల్లుచూ వారి కుటుంబమునకు తన సానుభూతిని తెలుపుకొనుచున్నారు.

(ఇ) భారతదేశమునందును, భారతధర్మమునందును, గాఢవిశ్వాసముగలిగి ఆమరణాంతము తదుద్ధరణమునకు పాటుబడినట్టియు దివ్యజ్ఞానసమాజాధిపురాలుగా అధ్యాత్మిక విజ్ఞానాభివృద్ధికి నిరంతరకృషి నొనర్చినట్టియు, ఆ నిబిసెంటమ్మగారి నిర్యాణమునకు యీసభవారు చింతిల్లుచున్నారు.

(౨) ప్రతిమండలమునందలి అర్చకసంఘమువారును వెంటనే వార్షికసమావేశముల జరిపి సాంఘికుల ఆర్థిక విద్యావిషయముల సుస్థితికి అభివృద్ధికి తగినయేర్పాటు గావించవలెనని యీసభవారు కోరుచున్నారు.

(౩) ప్రస్తుతము నావరించియున్న ఆర్థికదుస్థితి ననుసరించియు, న్యాయస్థాన నిర్ణయములందైనను, ఒకేపద్ధతి గాన్పింపనందువలనను బోర్డువారిస్కీము రద్దునిమిత్తమొనర్చిన దావాలయందు వ్యవహరించుట కన్నను సక్రమమును గౌరవయుక్తమును నగు రాజీమార్గమును పరిస్థితులననుసరించి యవలంబించుటయే శ్రేయమని యీసమావేశము వారభిప్రాయపడుచున్నారు.

౪. పంచముల దేవాలయప్రవేశమునుగూర్చి నేడు దేశమున జరుగుచున్న ఆందోళనాదికమును యీ సభవారు గమనించుచూ శాస్త్రధర్మసాంప్రదాయముల శాసనములద్వారా ప్రజేచ్ఛననుసరించి నడుపబడుచున్న యీసంఘములలో అర్చకమహాజనులు యిందును గూర్చి ఎట్టినిర్ణయమునుజేయ నక్కరలేదనియే విశ్వసించుచున్నారు. మరియు పంచములు దేవాలయములోనికి వచ్చుటనుగూర్చిన తగవులు మంచిచెడ్డలయొక్క బాధ్యతలను అర్చకమహాజనులు ఎంతమాత్రమును వహింపగూడదని హెచ్చరింపబడుచున్నారు.

౫. మైసూరుప్రభుత్వమువారి ముజరాయి ఆఫీసునందు శైవశాస్త్ర పండితపదవికి ఆగమవిద్వాంసులను దేవాలయప్రతిష్ఠోత్సవాది వైదిక కార్యనిర్వహణ దక్షులునునగు శ్రీమాన్ పండిత డి. యన్. సుందర దీక్షితులవారు అర్హులని యీసభవారు విశ్వసించుచున్నారు. మరిన్ని అట్టి ఉద్యోగగౌరవమును శ్రీ దీక్షితులువారి కొసంగవలసినదిగా శ్రీ మైసూరు ప్రభుత్వమువారిని యీసభవారు కోరుచున్నారు.

(౬) మూడవ ఆంధ్రరాష్ట్ర అర్చకమహాజన సభను బెజవాడలో జరుపుటకు కృష్ణామండల సభ్యులొసంగిన యాహ్వానమును యీసభ వారంగీకరించుచున్నారు.

తెనాలి. } వేదాంత శ్రీనివాసాచార్యులు,
12—11—33 } ప్రధానకార్యదర్శి.

Regd. No. M. 2073. సం॥ చందా రు 1-8-0 లు.

# శ్రీ ఆదిశైవ పత్రిక.

శ్రీ శ్రీకంఠ మఠాధిపతుల యాజ్ఞానుసారముగా, శైవసంఘాభ్యుదయమునకై శ్రీ గురుకులాశ్రమమునుండి ప్రతిమాసము ప్రకటింపబడును.

సర్వదేవాత్మకో రుద్రస్సర్వే దేవాశ్శివాత్మకాః।
రుద్రస్య దక్షిణేపార్శ్వే రవిర్బ్రహ్మా త్రయోగ్నయః।
వామపార్శ్వే ఉమాదేవి విష్ణుస్సోమోపి తేత్రయః॥
(రుద్రహృదయోపనిషత్)

సంపాదకుడు:— చిలుమూరు పురుషోత్తమ గురుక్కళ్.

సంపుట ౯ { చిలుమూరు. శ్రీముఖనామ సం॥ర పుష్యమాసము. } సంచిక ౧౦

(విలేఖకుల వ్యాసములకు సంపాదకులు ఉత్తరవాదులు కానేరరు.)



— విషయసూచిక. —



భారతీ ప్రెస్, తెనాలి.

# మహారాజపోషకులు

[ సంవత్సరమునకు నాలుగురూపాయలు చెల్లించవలెను. ]

౧ రాజవైద్య నాగలింగం నందయ్య అందు సన్నువారు ఆయుర్వేదభవనం అమృతలూరు

౨ శ్రీమాన్ కొల్లిపర వీరయ్యగారు, చివ్వలూరు.
3 ... కంఠంరాజు వెంకటసుబ్బయ్యగారు, భట్లపల్లి అగ్రహారం.
౪ ... చావలి వాలయ్యగారు. పెదరావూరు.
౫ ... స్వర్ణ సుబ్బయ్యగారు పాట్రాక.
౬ ... గూడూరు లక్ష్మయ్యగారు వెణుతురుమిల్లి.
౭ ... అగమిక నంజుండ దీక్షితులుగారు రామసముద్రము.
౮ ... పసుపర్తి పార్వతమ్మగారు నూచిపూడి.
౯ ... వెలవలపల్లి వెంకటేశ్వరదీక్షితులుగారు.

## రాజపోషకులు.

[స॥రం 1 కి రు 3 0.0లు.]

౧ అగమిక వాలేశ్వరదీక్షితులుగారు పుంగనూరు.
౨ శ్రీమాన్ చావలి దుర్గాప్రసాద దీక్షితులుగారు తిరిగొప్పుల.
3 ... యలమంచిలి సుబ్రహ్మణ్యగారు వెదురుపాక
౪ ... గూడలి రామయ్యగురుకులు చినమాంభట్ల అగ్రహారం.
౫ శ్రీమతి ఇంకొల్లు అన్నపూర్ణమ్మగారు (తాలూకాబోర్డు మెంబరు) ప్రత్తిపాడు.
౬ శ్రీమాన్ S. రామప్పగారు (కరణం) ఉప్పగపాలెం.

## పోషకులు.

[స॥రం 1 కి రు2-0-0లు.]

౧ శ్రీమాన్ వడ్లమూడి కోటయ్యగారు వడ్లమూడి.
౨ ... నూతలపాటి వెంకటనారాయణ గురుకులుగారు వరకవిపూడి.
3 ... చావలి పిచ్చయ్యశర్మగారు చాటపర్రు.
౪ ... S. A. నంజుండయ్యగారు శిరస్తాదారు పుంగనూరు.
౫ ... ఉయ్యాలవాడ మునెయ్యగారు భండ్యాత్మకూరు.
౬ ... అగమిక సుబ్రహ్మణ్యదీక్షితులుగారు బెంగుళూరు.
౭ ... కొల్లిపర వెంకటసుబ్బయ్యగారు అమ్మనబ్రోలు.
౮ ... నాగలింగం సత్యనారాయణగారు డాక్టరు మూలుపూరు.
౯ ... చుండి ఆనందరాయుడుగారు రూపెనగుంట.
౧౦ ... అగమిక చంద్రశేఖరదీక్షితులుగారు చాడేపల్లి.
౧౧ — S. A. అగస్త్యప్పగారు చారాల.
౧౨ — మురికిపూడి వెంకటేశ్వర్లుగారు వల్లభాపురం.
౧3 — చావలి చంద్రయ్యగారు
౧౪ — కూర్మగిరి శేషమ్మగారు పాకవీడు.



శ్రీ కంఠశివాచార్యులవారు

శ్రీకంఠమఠాధిపతులు,

కోటిఫలి.

# శ్రీ ఆదిశైవపత్రిక.



సర్వోవై రుద్రస్స ఈశానస్సభగవాన్ సమహేశ్వరస్స మహాదేవః ॥
"అధర్వశిరసి."

| | | |
|---|---|---|
| సంపుట | చిలుమూరు. | సంచిక |
| ౯ | శ్రీసుఖనామ సం॥ర పుష్యమాసము. | ౧౦ |

## ప్రార్థన.

ఉ॥ పావనమూర్తి యార్తజనబాంధవ దీనశరణ్య సర్వలో
కావనదీక్ష శాశ్వతమహామహిమా కరుణాసముద్ర దే
వా విలసత్స్వభావ పరమాత్మ పరాత్పర దేవ సార్వభౌ
మా వరలోకనాయక యనంత మహేశ నుతింతుమీశ్వరా॥

(దీనబంధు.)

---

## ఆశీస్సు.

శ్రీయుతులు ఎ. ఆర్. రాయుడుగారు, బి. ఎ.,

ఉ॥ కాముని గాల్చి బూడిదను గంధముగాఁగొని యెద్దునెక్కి-చర్మ
కాములు దోలు నెమ్ములు గపాలములన్ దనమేని సొమ్ముగా
వేమరు దాల్చు నాథుఁడు విశ్వజనాంతర హృత్సరోజుఁడున్
నేమమెలర్ప బత్రిక కనేకవిధంబుల సాయమయ్యెడిన్॥

---

# గమనింపు.

సోదరులారా!

జగద్గురు శ్రీ శ్రీకంఠ శివాచార్యులవారిచే ననుగ్రహింపబడిన, బ్రహ్మసూత్ర మీమాంసాభాష్యమగు "శ్రీకంఠభాష్యము" ఆంధ్రాక్షరములతో (సంస్కృతభాషయందు) పూర్తి అయినది. ప్రతివారును పఠించి తరించగోరుచున్నాము. వలయువారిట్లు వ్రాయవలెను.

౧ మానేజరు:-శ్రీ శ్రీకంఠమఠము, కోటిఫలి, ద్రాక్షారామంపోస్టు, (గోదావరిజిల్లా.)

౨ మానేజరు:-శ్రీ గురుకులాశ్రమము, చిలుమూరు, కొల్లూరుపోస్టు, (గుంటూరుజిల్లా.)

☞ ధరలవిషయం రాబోవు సంచికలో దెలుపగలము.

---

# బ్రహ్మమీమాంస

## శైవవైష్ణవాది సిద్ధాంతము

### 1. శైవసిద్ధాంతము : శ్రీకంఠమతము

వేదాంతతత్త్వనిరూపణమందు, ద్వైతాద్వైతవిశిష్టాద్వైత మతములే ప్రధానములయ్యును, ముఖ్యము లయిన యితర సిద్ధాంతములును గలవు. వైష్ణవపురాణాగమ ప్రబంధములు వైష్ణవమతమున కెటులు మూలాధారములయి యున్నవో, యటులే, శైవమతమునకును, శైవోపనిషత్పురాణములను, తేవారమును, తిరువాచకమును, నిరువదియెనిమిది శైవాగమములును, ముఖ్యాధారములై యున్నవి. దక్షిణభారతదేశప్రతిభవలన నెలకొన్న వేదాంతసిద్ధాంతములలో నెన్నికఁగన్న శైవసిద్ధాంతమునుగుఱించి తరువాతఁ బ్రత్యేకముగాఁ దెలిపెదను శైవసిద్ధాంతమునకును, వైష్ణవసిద్ధాంతమునకుఁబోలె మిక్కిలిఁ బురా

తనములైన ప్రామాణములును, వేదాధారములును లేకపోలేదని మాత్ర మిచ్చుట స్పష్టముగాఁ జెప్పవచ్చును.

ఈక్రింది వేదవాక్యములు శివదేవుని లోకోన్నతప్రభావమును దన్మహిమాదులను గీర్తించుచున్నవి.

(1) "యోబ్రహ్మాణం విదధాతి పూర్వం యోవై వేదాంశ్చ ప్రహిణోతితస్మై । తగ్ హదేవమాత్మబుద్ధిప్రకాశం ముముక్షుర్వై శరణ మహం ప్రపద్యే॥"

(ఏ పరమాత్మ హిరణ్యగర్భుని సృజించెనో, యే పరమాత్మ యా హిరణ్యగర్భునికొఱకు వేదములను జెప్పెనో, యాత్మబుద్ధి ప్రకాశుఁడును స్వయంప్రకాశమానుఁడు నగు నాపరమాత్మను మోక్షేచ్ఛఁగలవాఁడనై శరణొందుచున్నాను.)

(2) "త మీశ్వరాణాం పరమం మహేశ్వరం తం దేవతానాం పరమంచ దైవతం । పతిం పతీనాం పరమం పరస్తాత్ విదామ దేవం భువనేశ మీడ్యం॥"

(ఆపరమాత్మను వైవస్వతుఁడు మొదలైనవారిలో శ్రేష్ఠుఁడైన యీశ్వరునిగాను, నింద్రాదిదేవతలలో శ్రేష్ఠమైన దేవతగాను, ప్రజాపతులలో శ్రేష్ఠమైన ప్రజాపతిగాను, అక్షరస్వరూపముకంటెఁ బరముగా స్వయంప్రకాశమైన భువనేశ్వరునిగా నుతింపఁదగినవానిగాఁ దెలిసికొనుచున్నాము.)

(3) "పరాఽస్యశక్తి ర్వివిధైవ శ్రూయతే స్వాభావికీ జ్ఞానబల క్రియా చ॥"

(ఈ పరమాత్మయొక్క శ్రేష్ఠమైన శక్తి స్వభావసిద్ధమైన జ్ఞాన క్రియను, బలక్రియను గలదై నానాప్రకారమైనదిగా వినఁబడుచున్నది.)

(4) "అస్మాన్మాయీ సృజతే విశ్వ. మేత త్తస్మింశ్చాన్యో మాయయా సంనిరుద్ధః॥"

(ఈ యక్షర బ్రహ్మమువలన, మాయతోఁగూడుకొనిన యీశ్వరుఁడీవిశ్వమును సృజించుచున్నాఁడు. ఆ భూతాదిప్రపంచమునందు మాయచేతను అన్యుఁడైయున్నవాఁడై నిరోధింపఁబడుచున్నాఁడు.)

"యదాఽతమ స్తన్న దివాన రాత్రిః న స న్నచా సత్ శివ ఎవ కేవలః॥"

(ఏయవస్థయందు తమోరహితమైన తత్త్వస్వరూపము కలదో అప్పుడు పగలులేదు, రాత్రిలేదు; సత్స్వరూపములేదు, అసత్స్వరూపములేదు; శుద్ధస్వభావముగల శివుఁడు మాత్రము కలఁడు.)

(5) "ఏకో దేవః సర్వభూతేషు గూఢః।
సర్వవ్యాపీ సర్వభూతాంతరాత్మా।
కర్మాధ్యక్షః సర్వభూతాధివాసః।
సాక్షీ చేతా కేవలో నిర్గుణశ్చ॥"

(అద్వితీయుఁడును, స్వయంప్రకాశమానుఁడు నగు పరమాత్మ, సమస్త ప్రాణులందును రహస్యమైయుండువాఁడును, సర్వవ్యాపియును, సర్వభూతాంతరాత్మయుఁ, గర్మముల కధిష్ఠాతయు, సర్వభూతాధివాసుఁడును, సర్వసాక్షియుఁ, జేతనస్వరూపుఁడును పాధిరహితుఁడు, నిర్గుణుఁడు నగుచున్నాఁడు.)

శ్రీరామానుజ శ్రీమధ్వమతానుయాయులై వైష్ణవులు శివనామము లన్నిటికిని విష్ణ్వర్థము చూపఁ బ్రయత్నించునటులే, అప్పయ్య దీక్షితాదులు విష్ణునామము లన్నిటికిని శివార్థము నిర్ధారణముచేసి, శివునినే పరమదైవముగా స్థిరీకరింపఁగడఁగియున్నారు. ఈ పద్ధతి కేవలము మతావేశ విషయమునకు విశేషయుక్తమైనిది. ఇట్టి మతావేశకలహాడంబరములను వేదాంతము నిర్లక్ష్యభావముతో నుపేక్షింపదగును. వేదాంతసూత్రములకు శ్రీకంఠభాష్యము కలదు. దానికి "శివార్కమణిదీపిక" యను పేరు అప్పయదీక్షితులవారు వివరణము వ్రాసిరి. ఆ వివరణమందు, శ్రీరామానుజ మతాభిప్రాయములను

స్వీకరించిరి; కాని, అంబాసహితుఁడైన శివునినే (సాంబుని) పరమ దైవముగాఁ జెప్పుచున్నారు. కాని, కాశ్మీరమందలి "ప్రత్యభిజ్ఞ" మను పేరఁ బరగు శైవసిద్ధాంతము, శైవాగమములే మూలాధారములుగాఁ గలదయ్యు నెక్కువ యద్వైతపరముగాఁ గన్పించుచున్నది.

---

## 2. ప్రత్యభిజ్ఞమతము.

ఈ మతకర్త క్రీస్తు శ॥ ఎనిమిదవ శతాబ్దమందుండిన వసుగుప్తుడయ్యును, నీ సిద్ధాంతకారులలో నగ్రగణ్యులు అభినవగుప్తుఁ డనువారు. శివుడొక్కఁడే ప్రపంచమున కెల్లను, నిర్వికారమై, నిత్యమైనవస్తు వని యీ సిద్ధాంతము బోధించును. ఆ శివశక్తిఁ చిదానందేచ్ఛాజ్ఞానక్రియా రూపములు కలవు. ఈ మతమున ముప్పదియాఱు తత్త్వములున్నవి. ఈశ్వరుఁడు స్పందుఁడు, చైతన్యుఁడు (అనంతప్రజ్ఞానము కలవాఁడు) సంకల్పబలమున నతఁడీజగత్తును సృష్టిఁజేయును. ఆతని శక్తిమూలముననే, జీవజగద్రూపముల నతఁడు కల్పించును. జీవులకును శివునకును నభేదమే యీ మతము నిర్ధారణచేయును. ప్రత్యభిజ్ఞ (పరమతత్త్వము గనుఁగొనుట) వలన ముక్తిచేకూరును. విరహార్తమైన స్త్రీకిఁ దన మెదుటఁ దన ప్రాణేశ్వరుఁడు నిల్చున్నమాత్రముననే విరహముక్తి గలుగదు. నిల్చియున్నాఁడని యా స్త్రీ కనుఁగొనవలయును, స్వయముగా గుర్తింపవలయును, అందుమీఁదఁగాని విరహముక్తి గలుగదు. అట్టి ప్రత్యభిజ్ఞ మోక్షమునకు ముఖ్యావశ్యకమని యీ మతసిద్ధాంతము.

---

## 3. భాస్కరమతము

క్రీస్తుశ. తొమ్మిదవ శతాబ్దమున నుండి భాస్కరుఁడు భేదాభేద వాదమును నెలకొలిపి బ్రహ్మసూత్రములకు నొక భాష్యమువ్రాసెను. శ్రీశంకరుల యద్వైతవాదమునుగాని, యదివఱకే యీ దేశముననుండి

యిటీవల శ్రీ రామానుజులవారిచే సిద్ధాంతీకరింపఁబడిన విశిష్టాద్వైతవాదమును గాని భాస్కరుఁ డనుసరింపఁడు. జీవేశ్వరులకు నిజముగా భేదములేదనియు, వారికి నభేదము స్వాభావిక మనియు, ఔపాధికభేదముమాత్రమే కలదనియు, భాస్కరుఁ డనును. కర్మావిద్యలకుఁ కట్టుబడిన బ్రహ్మాంశమే జీవుఁడు. అతఁడీశ్వరార్కుని కిరణము వంటివాఁడు; మధ్యాగ్నినుండి వెడలు విస్ఫులింగమువంటివాఁడు. అతఁ డణువు; కాని, యతని యణుత్వ మతని కర్మవలనఁ గలిగినది. కాని, యతనికి ముఖ్యమైనదికాని స్వాభావికమైనదికాని, కాదు. కావున జీవుఁడు, స్వసంకుచితమైన యీశ్వరునిరూపము. జగత్తు సైత మీశ్వరుని స్వాపరిమితమైన స్వరూపమే. భాస్కరుఁడు సత్కార్యవాదమును సమర్థించుచున్నాఁడు; ఈశ్వరుఁడు నిర్గుణుఁడని యంగీకరింపఁడు; ఈశ్వరునకన్న జీవుఁడు భిన్నుఁడనికూడ నొప్పుకొనఁడు. ఔపాధికవశమున నీశ్వరుఁడు తన పరిణామశక్తిచే, జీవులుఁగాను బ్రపంచముగాను నగును. తరంగములు సముద్రము నెటుల తెలుపునో పరిమిత మపరిమితము నటులే తెలియఁబరచును. గాని, యపరిమితము కానేరదు. కావున నుపాధి యపరిమితమును పరిమితముగా నొనర్చును. ఘటాకాశమున జీవుఁడు బ్రహ్మోపాధి. ఉపాధి యంతరించునపుడు జీవబ్రహ్మైక్యమే. జ్ఞానకర్మసముచ్చయవాదమును భాస్కరుఁడు సమర్థించుచు, జ్ఞానకర్మసంయోగమువలన మోక్షప్రాప్తియగునని చెప్పుచున్నాఁడు. దానివలన నవిద్యయుఁ గామమును, కర్మయును, విద్యగాను, నాత్మకామముగాను బరిణమించును. భాస్కరుఁడు జీవన్ముక్తి నంగీకరింపఁడు; క్రమముక్తి నంగీకరించును. ఇతఁడు, ముక్తజీవునకుఁ బ్రత్యేకతయున్నదనుమతమునుగాని భగవత్కైంకర్యమును గాని యొప్పికొనఁడు. ఉపాధి యంతరింపఁగానే, జీవుఁడు బ్రహ్మము నేకీభావము నొందును! ఆ యేకీభావము నిర్గుణము కాదు, సత్యజ్ఞానానందమని భాస్కరుని మతము.

---

## 4. యాదవప్రకాశమతము.

క్రీ॥శ॥ పదునొకొండవ శతాబ్దమునందుండి, శ్రీరామానుజుల గురు వైన యాదవప్రకాశులు, చాలవఱకు భాస్కరమతాభిప్రాయములే కలవారై యుండిరి. బ్రహ్మమే, నిజముగా చిదచిదీశ్వరులుగా మాఱు నని వీ రభిప్రాయపడిరి. కావున బ్రహ్మమును, జగత్తును, నభిన్నము లయ్యును, భిన్నములై యున్నవి. చిదచిదీశ్వరులు చివరకును వేఱే అను తప్పుటభిప్రాయమువలననే సంసారము రూపొందుచున్నది. కర్మ జ్ఞానసంయోగమువలన మనము మోక్షమును బొందఁగలము. కాని, సత్యమైన కర్మజ్ఞానైక్యమే బ్రహ్మ మను సరియైన జ్ఞానము మనము కలిగి యుండవలయును. బ్రహ్మేశ్వరులకు భేదము కలదని శ్రీరామానుజులీ మతమును విమర్శనాపూర్వకముగ నాక్షేపించిరి.

---

## 5. నింబార్కమతము.

'వేదాంతపారిజాతసౌరభ' మనుపేర బ్రహ్మసూత్రములకు నింబార్కులు భాష్యము రచించిరి. ఆయన పదునొకొండవ శతాబ్దపువారు. ఆయనమతము ద్వైతాద్వైతము. కేశవులు బ్రహ్మసూత్రభాష్యము రచించిరి. వీరును నింబార్కమతానుయాయులే. జీవాత్మ లణుస్వరూపములతోఁ జిదానందము కలిగియున్నదనియు, నీశ్వరుఁడు సకల కల్యాణగుణాకరుఁడనియు, నియంత యనియు, నింబార్కుని మతము. జగత్తున కతఁడే యుపాదానకారణము, నతఁడే నిమిత్తకారణము. ఈశ్వరపరిణామమే జగత్తు. జగత్తీశ్వరసంకల్పమువలనఁ గల్పితము.

---

## 6. వల్లభాచార్యులమతము.

క్రీ॥ శ॥ పదునాలుగవ శతాబ్దమందుండిన వల్లభాచార్యులు బ్రహ్మసూత్రభాష్యకారులై, మాయావాదము నంగీకరింపక, తమమతమునకు

శుద్ధాద్వైత మని పేరిడిరి. జీవాత్మలును జగత్తును నిజముగా బ్రహ్మై క్యమై యుండుననియు, బ్రహ్మము జగత్ సృష్టిచేయుట తన సంకల్ప మూలముననే కాని మాయామూలమునఁ గాదనియు, నతని మతము. ఈశ్వరుఁడు నిర్గుణుఁడు కాఁడు, కల్యాణగుణసంపన్నుఁడు. అతఁడు కృష్ణుఁడు; అతని అనంతజ్ఞానక్రియాశక్తి ఆతనిభక్తుల సంతోషార్థ మనేకరూపములఁ దాల్చును. ఆయన సచ్చిదానందమూర్తి. జీవాత్మ లకు లోన నానంద మణఁచికొనియుండును; జడమునకు లోనఁ జిదా నందము లణఁచికొనియుండును. జీవుఁ డణువే కాని బ్రహ్మముతో నైక్యమై బ్రహ్మాంశమైయున్నాఁడు. జీవులకు ముక్త్యవస్థలో నీశ్వరైక్య ప్రాప్తియగును. జగత్తు చిదానందములు మాటు మణఁగియున్న బ్రహ్మమే, మాయ కానేరదు. ఈశ్వరుఁడే జగత్తున కుపాదానకారణ మును నిమిత్తకారణమును. బ్రహ్మమే తాను బహురూపము, లనఁగా జీవాత్మలును జగత్తును, గావలయు నని సంకల్పించుకొనియె నను తన మతమునకు, వల్లభుఁడు, బృహదారణ్యకోపనిషత్తు నాధారము చేసికొనియెను. అనేకరూపములుగా నున్న ప్రపంచముగాఁ బరిణ మించిన దీశ్వరుని శక్తియే; యదియే మాయ. జగత్తు సత్యము. దానిని బ్రహ్మాంశముగా గుర్తించి భావింపవలయును. అది సత్యము కాని యెడల, సత్యమైన బ్రహ్మముతో నేకముగానుండుటకు వీలులేదు. భక్తిమూలమున నీశ్వరుని బొందుదుము. దేహము దేవాలయము కావున దానిని నవమానపరుపఁదగదు. ముక్తి కలుగునపుడు జీవ బ్రహ్మైక్యమగుట తెలియఁగలదు. అప్పు డఖండానంతానంద మను భవ మగును.

---

## 7. శ్రీ కృష్ణచైతన్యమతములు

ఉత్తరభారతదేశమందలి వైష్ణవమతములోఁ గృష్ణుఁడే యిష్ట దైవము. నింబార్కమతములో రాధయే భగవానుని రాణి. జయదేవ

ిద్యాపతి, ఉమాపతి, చండీదాసుల గేయములమూలమున నుత్తర భారతదేశములో రాధాకృష్ణమతము బలముగా వృద్ధిఁజెంది, క్రీస్తు శ. పదేనవ శతాబ్దమందలి చైతన్యుని సిద్ధాంతమువలన నత్యుచ్చదశకు వచ్చెను. చైతన్యమతమునకుఁ జెందిన బలదేవుఁడు 'గరుడభాష్య' మనుపేర బ్రహ్మసూత్రభాష్యమును జేసెను. ఇతని సిద్ధాంతప్రకారము కృష్ణుడే పరమసత్యదైవము; అతఁడు సచ్చిదానందమూర్తి; అనంత కృపామయుఁడు; అఖండప్రేమస్థానము; ప్రకృతిగుణములు లేని నిర్గుణుఁడు; సకల కల్యాణగుణమూర్తియైన సగుణుఁడు; అతనికి చిన్మాయాజీవశక్తులు గలవు. అతఁడు తనచిచ్ఛక్తివలనఁ బరమానంద మును బ్రసాదించు శక్తి (హ్లాదినీశక్తి) రూపమును ధరించును. హ్లాదినీ శక్తి రాధ (పరమానందస్వరూపిణి). అతఁడు తన మాయాశక్తివలనఁ బ్రపంచసృష్టిఁ జేయును. తన జీవశక్తివలన జీవాత్మలను నిర్మించును. ఈతత్సంబంధమువలన నతఁడు భగవానుఁడు; స్వభావసిద్ధముగ నతఁడు బ్రహ్మము. అతనికిని జీవాత్మలకును భేదమే లేదు. లేకున్నను, ఉభయులు భిన్న (అచింత్యభేదాభేదు) లగుచున్నారు. జగత్తు సత్యము. ఈశ్వరుఁడు జీవాత్మలకు నియంత. ఈ జీవాత్మ లణుపరిమాణ ములు. భక్తి కృష్ణప్రీతి (ప్రేమ, రుచి)కి సాధనము. దీనిమూలమున జీవాత్మ పరమప్రేమానందము కలిగి ముక్తి నొందును.

(అనువాదకులు)

భువనగిరి కోదండపాణి,

వావిలాల వెంకటశివావధాని. (దివ్యజ్ఞాన)

---

# తెనాలి తాలూకా ఆదిశైవ మహాజనసభా ప్రథమ సమావేశము, (చివ్వలూరు.)

స్వస్తిశ్రీ శ్రీముఖనామ సంవత్సర మార్గశిర శుద్ధ ఏకాదశి సోమవారం రోజున శ్రీమాన్ కొల్లిపర వీరయ్యడాక్టర్ గారి గృహము నందు జరిగిన శ్రీలక్షబిల్వార్చన పూర్వక కాశీ సమారాధన మహోత్స వతరుణమున, సాయంత్రం అయిదుగంటలకు, శ్రీమాన్ నాగేశ్వరం సుందరశర్మగారి (శృంగారపురం) యాధిపత్యమున తెనాలి తాలూకా ఆదిశైవ మహాజనసభా స్థాపనగావించుటకై షుమారు (50) యేబది మంది ప్రముఖులతో భగత్ప్రార్థనలతో సమావేశము గావింపబడి యీ క్రింది తీర్మానములు ఏకగ్రీవముగా సభ్యులచే ఆమోదింపబడెను.

## —♦ తీ ర్మా న ము లు. ♦—

౧ శ్రీశ్రీ జగద్గురు శ్రీ శ్రీకంఠశివాచార్యా పరనామక అవధూత శ్రీ బోధానంద మహర్షుల (శ్రీకంఠమఠాధిపతుల) వారి యాజ్ఞలను ఈ సభవారు శిరసావహించి ఆచరించుటకు సంసిద్ధులై యున్నారు.

ఉపపాదకులు, చిలుమూరు పురుషోత్తమగురుక్కల్ గారు.
ఆమోదకులు, యీ సుబ్బారాయగురుకులుగారు.

౨. (అ) ఘనతవహించిన, శ్రీ మైసూరుసంస్థానం ముజరాయి కమీషనర్ ఆఫీసునందు ఆగమ పండితులును, సుప్రసిద్ధ సంఘసేవా నిరతులును, కైలాసవాసులునగు శ్రీమాన్ ఆగమిక నందీశ్వర దీక్షితులవారి యకాలమరణమున కీసభవారు మిక్కిలి పరితాపమొందు చున్నారు.

(ఆ) శ్రీవారి పుత్రులును సకలాగమ పారావార పారీణులును సంఘాభిమానులునగు శ్రీమాన్ డి. ఎస్. సుందరదీక్షితులవారినే తమ సంస్థానమునందు ఆగమ పండితులుగా నియమించుటకు గౌరవనీయులగు శ్రీ మైసూరు సంస్థానాధిపతులైన శ్రీశ్రీ మహారాజా వారిని ఈ సభవారు సవినయముగా ప్రార్థించుచున్నారు.

ఉ॥ కొల్లిపర వీరయ్యగారు

ఆ॥ చిలుమూరు పురుషోత్తమగురుక్కల్ గారు.

,, నాగేశ్వరం సుందరశర్మగారు.

3. దేశమునావరించి పీడించుచున్న ఆర్థిక పరిస్థితుల గమనించుటకును గౌరవమార్గ ప్రవర్తకులై, సంఘమర్యాదల నతిక్రమింపక పూర్వపుమాదిరిగా ఐకమత్యత, మతవిద్య, మున్నగుసంస్థలను ఆదరించి పోషించుకొనుట కీసభవారు సాంఘికులను ప్రార్థించుచున్నారు.

ఉ॥ కొలకలూరు శేషయ్యగురుకులుగారు.

ఆ॥ సంగాపు వీరయ్యగురుకులుగారు.

ర. స్వకులాచార సంబంధమగు దావాలవిషయములో, చాలకాలమునుంచి సాంఘికులు వ్రయప్రయాసలకోర్చి కోర్టులలో వ్యవహరించుచున్నప్పటికి సరియైన పర్యవసానము తేలనందున, సాధ్యమైనంతయవకాశముగలవారును సరియైన ఆధారములు (రికార్డు) గలవారును ప్రధానన్యాయస్థానములందు వ్యవహరించి హక్కులను సంరక్షించుకొనుట కీసభవారు గోరుచున్నారు.

ఉ॥ చావలి వాలయ్యగారు.

ఆ॥ కొల్లిపర నాగయ్యగారు.

,, పావులూరు నాగభూషణంగారు.

,, నందివెలుగు సత్యనారాయణగారు.

,, చిలుమూరు పురుషోత్తమగురుక్కల్ గారు.

,, పొన్నూరు కామయ్యగారు.

,, కొండవీటి మాధవరాయుడుగారు (గుంటూరు తాలూకా)

౫. ప్రతితాలూకాయందును తగినంత శీఘ్రకాలమున స్వమతా చార ధర్మముల నభివృద్ధికి దెచ్చుటకు సులభమార్గములైన లక్షబిల్వా ర్చన భక్తసమావేశములు వ్రతములు మున్నగు భగవత్కైంకర్యము సంకల్పించి ఆయాతాలూకాలలో నివసించు సాంఘికులను విధిగా నాహ్వానించి సమావేశములు గావించి సంఘస్థాపన మొనరించుట కీసభ వారు ప్రార్థించుచున్నారు.

ఉ॥ చిలుమూరు పురుషోత్తమగురుక్కల్ గారు

ఆ॥ నందివెలుగు లక్ష్మీనరసయ్యగారు (గుంటూరుతాలుకా)

,, మామిళ్లపల్లి వెంకటేశ్వర్లుగారు డిటో

౬. ఈ క్రిందవారిని ద్వితీయసమావేశము జరుగువరకును అధి కారవర్గముగా నిర్ణయించడమైనది.

| | | |
|---|---|---|
| అధ్యక్షులు: | శ్రీమాన్ | నాగేశ్వరం సుందరశర్మగారు |
| ఉపాధ్యక్షులు: | ,, | కొల్లిపర వీరయ్యగారు |
| కార్యదర్శి: | ,, | చిలుమూరు పురుషోత్తమగురుక్కల్ గారు |
| సహాయకార్యదర్శి: | ,, | చిలుమూరు సుబ్బరాయగురుకులుగారు |
| కోశాధిపతి: | ,, | పెనుమూడి హనుమంతరావుగారు |

ఉ॥ కొల్లిపర లక్ష్మీనారాయణగురుకులుగారు

ఆ॥ నందివెలుగు వెంకటసుబ్బయ్యగారు

2. యీ తాలూకాలో నివసించు ప్రతి ఆదిశైవ కుటుంబ యజ మానులు యీ సంఘమునందు సభ్యులుగా పరిగణింపబడుదురని యీ సభవారు నిర్ణయించుచున్నారు.

ఉ॥ కొల్లిపర వీరభద్రయ్యగారు

ఆ॥ సంగాపు వీరయ్యగురుకులుగారు

ఆ॥ నందివెలుగు వెంకటప్పయ్యగారు

౯. శైవమతకర్తయగు శ్రీ శ్రీకంఠశివాచార్య గురుప్రతిష్ఠలు వీరలైనతావులందు ఉదారస్వభావులచే నిర్మాణముగావించి, ఆచార్య గౌరవముల నభివృద్ధి నొనరించుట కీసభవారు సాంఘికులను ప్రార్థించుచున్నారు.

ఉ॥ చిలుమూరు పురుషోత్తమగురుకళ్ గారు.
ఆ॥ చావలి వాలయ్యగారు.
ఆ॥ సంగాపు వీరయ్యగురుకులుగారు.
ఆ॥ కొలకలూరు శేషయ్యగురుకులుగారు.

౯. తెనాలి తాలూకా ఆదిశైవ మహాజన సభాస్థాపనమునకు మూలాధారమైన లక్షబిల్వార్చన పూర్వక శ్రీకాశీసమారాధనా తత్పరులైన శ్రీమాన్ కొల్లిపర వీరయ్యగారిని యీ సభవారు ఆశీర్వచన పురస్సరముగా నభినందించుచున్నారు.

ఉ॥ నాగేశ్వరం సుందరశర్మగారు.
ఆ॥ సంగాపు వీరయ్య గురుకులుగారు.

౧౦. ప్రతిఆదిశైవుడును, స్వకులాచారధర్మమగు భగవత్కైంకర్యమును అత్యంత భక్తిశ్రద్ధలతో నెరవేర్చి లోకశ్రేయమొనరించుట కీసభవారు ప్రార్థించుచున్నారు.

ఉ॥ కొల్లిపర లక్ష్మీనారాయణగురుకులుగారు.
ఆ॥ నాగేశ్వరం సుందరశర్మగారు.

౧౧. భక్తిప్రబోధముచే, ప్రజల మానసికారోగ్యమును (ఆయుర్వేద) వైద్యసేవచే శారీరకారోగ్యమును, నొనగూర్చి మానవసేవ జేయుట ప్రతిఆదిశైవుని ముఖ్యవిధియని ఈసభవారు దెలుపుచున్నారు.

ఉ॥ నాగేశ్వరం సుందరశర్మగారు.
ఆ॥ చావలి నాలయ్యగారు.

సభ్యుల వివిధోపన్యాసములతోడను అధ్యక్షులవారు ప్రసంగించిన అభివృద్ధి సూచనలగు సద్విషయములతోడను అంత్యోపన్యాసములతో అభినందనములతో సభ జయప్రదముగా ముగింపబడెను.

☞ త్వరలో అన్ని తాలూకాలయందును, సంఘస్థాపన మొనరించుటకు ఆయా తాలూకాసాంఘికులు ప్రార్థింపబడుచున్నారు.

ఇట్లు మతసేవకుడు,
కార్యదర్శి.

---

## వార్తలు.

దేశములోధరలు బొత్తిగా మందగించుటవలన రైతుమహాజనులు పరితపించుచూ శిస్తులుచెల్లించుటకు శక్తిలేక మిక్కిలి భయపడుచున్నట్లు దేశవార్తా పత్రికవలన దెలియుచున్నది.

మామూలు శిస్తునకు మూడవవంతు తగ్గించిననే గానిలోకము బాగుపడనేరదని ఆందోళనగావించుచూ గవర్నమెంటువారికి బంపిన విన్నపముల వలన లాభముగలుగలేదని కొందరు అసంతృప్తిని వెల్లడించుచున్నారు.

హరిజనులు దేవాలయ ప్రవేశమొనరించిన కొన్నిచోట్ల నూతన అర్చకులు కావలెనని ప్రకటించిన, కృష్ణాపత్రికలోని విషయము కాంగ్రెసున కవమానకరముగ నున్నదనియు, అర్చకులు చాలించుకొనునట్లు ప్రబోధముచేయుమాదిరిగా పరిణమించినదని కొందరు హాస్యయముగా పలుకుచున్నారు.

ఆలయప్రవేశవిషయములో ఒక్కఅర్చకుడు మాత్రమే గర్భాలయ ప్రవేశమున నర్హుడనియు పూజాదికైంకర్యములు నెరవేర్చుచుండవలెననియు, మిగతా చాతుర్వర్ణ్య ప్రజలు మున్నగు భక్తులు దేవదర్శన స్తోత్రములుగావించి ప్రసాదములగైకొనవలెనేగాని గర్భాలయముల

ప్రవేశింపరాదని ఆగమశాస్త్రములు జెప్పుచున్న ధర్మములు పరిశీలించియే గాంధిమహాత్ముడు (1933 సంవత్సరం మార్చి 11 తేదీ కృష్ణా పత్రికలో) ప్రకటించినవార్త సమంజసముగా నున్నదనియు సర్వసమ్మతమైనదనియు పలువురు దెలుపుచున్నారు.

ఆలయధర్మకర్తలును గ్రామములోని ప్రజలందరు నేకీభవించి, హరిజనుల నాలయప్రవేశము గావించినయెడల అర్చకులభ్యంతరపెట్టరాదనియు, ఆవిషయములో ఏవిధమైన జోక్యము గలిగించుకొన కూడదనియు, అర్చకమహాజనసంఘములు తీర్మానించుట బాగుగానున్నదని అనేకులు సంతోషించుచున్నారు.

అసూయ అగ్నిహోత్రమువంటిదనియు. దానినెచ్చటదాచిన నచ్చటదగ్ధమగుననియు అందువలన లోకము పాడైపోవుచున్నదనియు మతములు పట్టుదలలు దానివలననేర్పడియున్నవనియు అట్టిదుర్గుణముల బారద్రోలి హృదయ పరివర్తనముగావించినగాని ప్రపంచశాంతి గలుగనేరదని, యనుభవనీయులును, సర్వమానవ సౌభ్రాతృత్వనాయకులును, పండితులును, భక్తులును దెలుపుచున్నారని యనేకులు బోధించుచున్నారు.

నిర్గుణోపాసనయే ప్రధానముగాగల క్రైస్తవ మహమ్మదీయ అద్వైత రాజయోగ అచలమత మున్నగు ప్రతివారును, లోకములో తమ తమ మతప్రచారముల నత్యంతగాఢదీక్షతో గావించుచూ ప్రజలనందరిని వేదాంతశిఖామణులుగా నొనరించుటకు సంకల్పించిన యీ తరుణమున భగవానుని యాజ్ఞానుసారముగా సగుణసిద్ధాంతమే సర్వజనాచరణీయమని స్థాపించుటకై దేవాలయములందే దేవుడుగలడనియు ఆయనను దర్శించుట ప్రధానకర్తవ్యమనియు, అశేషజనులు సగుణమూర్తిని ధ్యానించిసేవించుట మోక్షదాయకమనియు, సగుణసేవ సత్కర్మలలో శ్రేష్ఠమైనదని బోధించు హిందూమతోద్ధారకుడగు గాంధిమహాత్ముని సిద్ధాంతము. లోకసంరక్షణహేతువై యున్నదని యనేకులు ఆనందించుచున్నారు.

అగ్రహారపు భూములవిషయములో రైతులకు జిరాయితీ హక్కులు ఖాయపరచినట్లు మదరాసు కౌన్సిలువారు తీర్మానించిన విషయము వెల్లడికాగా శ్రోత్రియందార్లందరు గుంపులుగుంపులుగా జేరి రొమ్ములు బాదుకొనుచూ మా"కన్యాయము" జరుగుచున్నదని తీర్మానములు గావించి గవర్నరుగారివద్దకు యాత్రవెడలుటకు ఆత్రపడుచున్నట్లు పత్రికలో ఎక్కువగా దెలియుచున్నది.

రైతులకు భూములులేక అల్లాడుచు దీనులై యీనాందార్లను ఆశ్రయించుకొని వుండవలసిన గతి పట్టినదనియు వారిభూములలో రైతులకు జిరాయితీ హక్కులున్నయెడల రైతులు బాగుపడగలరనియు అస్వతంత్రులై వ్యవసాయముచేయుట దుర్భరముగానున్నదనియు యిక రైతులు బాగుపడగలరనియు భూములు లేనికొరత తీరగలదనియు దలంచి బొబ్బిలి రాజాగారు యీచట్టము ఖాయపరచినారని అగ్రహారీకులు పరితపించుచున్నారు.

---

# సంపాదకీయములు

## తాలూకాసంఘములు

ప్రస్తుతమున తెనాలితాలూకా ఆదిశైవ మహాజనసభా సమావేశమును స్థలాంతరమునముద్రించితిమి. ప్రతితాలూకా యందును, సంఘస్థాపన మొనరించుట యత్యంతా వశ్యకమైయున్నది. రాష్ట్రీయ సంఘములు. మండల సంఘములు స్థాపించి బహుకాలమైనను తృప్తికరమైన యభివృద్ధి గన్పట్టుటలేదనియు తాలూకాసంఘములు లేని కొరత వలననే యట్టి లోటు వాటిల్లినదనియు దెలియవచ్చుటచే ఆ విషయములు సాంఘిక హృదయసీమల నాశ్రపరచి కార్యరూపముగా పరిణమించినది. గావున, ప్రతితాలూకావారును ఆయా ప్రదేశములందు సమావేశములు జరిపి సంఘాభివృద్ధికరమగు తీర్మానములు గావిం

చుట శ్రేయస్కరమని హెచ్చరించుచున్నాము. తాలూకా సమావేశ ములకు గొప్ప శ్రమజేయనక్కరలేదు. ఎక్కువ ద్రవ్యము వ్యయ పరుప నవసరముండదు. గావున అభిమానముగలవారు భగవత్పూజా సంబంధమైన ఏవ్రతమో సంకల్పించి సంఘాభిమానుల నాహ్వానించి సహాయ మొనరింపవచ్చును. ఇంతకంటె సులభమార్గము గన్పట్టుట లేదు. త్వరలో గుంటూరుజిల్లా యందన్నితాలూకాలయందును సంఘ ములు నేర్పడగలవని విశ్వసించుచున్నాము.

అభినందనము:—

కొలదికాలము క్రిందటనే కాశీయాత్రను ముగించిన శ్రీమార్కొల్లిపర వీరయ్యగారు యీ తరుణమున గావించిన మహత్కార్యము వలన సంఘమునకొక నూతన మార్గము స్థిరపడినందులకు శ్రీవారి కాయురారోగ్యైశ్వర్యాదు లొసంగునటుల విశ్వేశ్వరుని ప్రార్థించుచూ మాయభినందనమును వెలువరించుచున్నాము. కేవలము సాంఘికులకే గాక గ్రామములోని యశేషజనులు వారికిని గావించిన అన్నప్రదానము విశేష ఫలమొసంగగలదని విన్నవించుచున్నాము.

గాంధిమహాత్ముని దేశయాత్ర:—

లోకోత్తర మహాపురుషుండగు శ్రీగాంధీమహాత్ముడు యీ నెల పదునారవతేదీ మొదలు ఆంధ్రదేశపర్యటన మారంభించి కృష్ణా గుంటూరు, నెల్లూరు, మదరాసు, కడప కర్నూలు బళ్ళారి, మున్నగు మండలములకు విజయముచేసి మానవులందైకమత్యము నెలకొల్పి దేశోద్ధరణమొనరించుచూ దక్షిణదేశములకు విజయముజేసియున్నారు. మహాత్ములయొక్క లీలలత్యద్భుతములు. భగవానుని యనుగ్రహము భక్తులయందు ప్రవహించుచుండుట శాస్త్రసిద్ధము. సనాతనుడగు పరమేశ్వరుడు లోకకల్యాణ మొనరించుగాత. ఇట్లే ౧౯౩౮ సంవత్సరం జులై నెలాఖరువరకు భరతఖండమునంతయు పర్యటనము చేయునని

తెలియుచున్నది. శ్రీవారి కాయురారోగ్యముల ప్రసాదించుటకు భగవానుని ప్రార్థించుచున్నాము.

శ్రీ శ్రీకంఠ శివాచార్యులవారు:—

మదరాసునందుగల ఆంధ్రమహాసభవారిచే నాహ్వానింపబడి శ్రీ విశ్వదాత దేశోద్ధారక కాశీనాధుని నాగేశ్వరరావు పంతులవారి యాధిపత్యమున డిశంబరు 6 తేదీని వేదాంతోపన్యాసముల గావించి సభ్యుల హృదయము లానందసాగరమున నోలలాడించియున్నారు. శ్రీవారు బ్రహ్మసూత్ర మీమాంసా భాష్యముద్రణమును పూర్తిగావించి శ్రీమార్ ఏకామ్రగురుకులుగారితోసహా డిశంబరు 14 తేదీని బయలుదేరి ఆంధ్రదేశమున కరుదెంచియున్నారు. శ్రీవారు పరమేశ్వరాంశ సంభూతులగుటచే మహత్తరకార్యముల నెరవేర్చుచూ ధర్మసంస్థాపన చేయుచున్నారు. "గీతాభాష్యము" గూడ త్వరలో పూర్తి చేయగలరనియును కాశ్మీరదేశమునందు పర్యటనమొనరించి ఉపనిషద్భాష్యముతో సహా ప్రస్థానత్రయమును పూర్తిగావించగలరని సాంఘికులు శ్రీవారి ప్రయాసకు కృతజ్ఞులై ద్రవ్యసహాయమొనరించి ఆనందింపగోరుచున్నాము. సామాన్య గృహస్థులు మత సంరక్షణ చేయజాలరనుటకీనిదర్శనములే తార్కాణములు. గావున శ్రీవారికాయురారోగ్యైశ్వర్యాదుల నొసంగునటుల పరమేశ్వరుని ప్రార్థించుటయే మనవిధియని విన్నవించుచున్నాము.

స్వీకృతి:—

తెనాలియందుగల "శ్రీ ఓంకారాశ్రమము" వారిచే ప్రకటితములయిన శంకర ప్రబోధము, రంతిదేవోపాఖ్యానము, పెద్దయ్యగారి పాటలు మున్నగు చిన్నగ్రంథములు వందనములతో స్వీకరించి యందలి సద్విషయములు పఠించి యానందించియున్నాము. సదరు పుస్తకములు ప్రతివారును పరిశీలించి యందలినీతిని గ్రహించి తరించుట ముఖ్యా

వశ్యకమని విన్నవించుచున్నాము. వలయువారు 'ఓంకారాశ్రమము' తెనాలి, యని వ్రాసిన బడయగలరు. వెల ప్రతి యొకటింటికి ఆరుపైసలు మాత్రమే. యని నిరుత్సాహపడవలసినంత యవసరము లేదు. లోక ములో ప్రచారము జరుగుటకై స్వల్పధరమాత్రమే ఏర్పాటుచేసి యున్నారు.

నంగనాచి:—

పండిత దంతనాల నాగేశ్వర శాస్త్రిగారిచే "బ్రాహ్మణోత్పత్తి మార్తాండాంతర్గమైన "తైలంగ బ్రాహ్మణుల"యుత్పత్తినిగురించి వ్రాయ బడినది. సంస్కృతశ్లోకములేగాక తాత్పర్యముతోగూడ ప్రకటింప బడినవి. గావున సదరు పుస్తకమును పరిశీలించి సంశయనివర్తి చేసుకో గలరు. వలయువారు. "ఈదరాడ చిదంబరాచార్యులుగారు" బెజవాడ. యని వ్రాయవలెను. వెల 0-2-0 లు మాత్రమే. ఆంధ్రదేశ బ్రాహ్మ ణులలోగల నాడీవిధానమెట్లు ఏర్పడినదియు సప్రమాణముగా నిరూ పింపబడినది.

కృతజ్ఞత:—

పత్రికయొక్క క్షేమమునుగోరి సన్మానించిన మహానుభావుల యందును తమతమ చందాలుబంపి పత్రికను సంరక్షించిన సోదరుల యందును నిరంతరము. కృతజ్ఞతతో వర్తింపగలము. శ్రీవారల కాయు రారోగ్యముల ప్రసాదించుటకు భగవానుని ధ్యానించుచున్నాము.

---

## శ్రీ శ్రీకంఠ భాష్యము.

ఆంధ్రాక్షరములతో సర్వాంగసుందరముగా పూర్తి గావించిన "బ్రహ్మమీమాంసా భాష్యమును" ప్రతి ఆదిశైవుని గృహమందును నెలకొల్పి "శ్రీ శ్రీకంఠ శివాచార్యుల" వారి నారాధించుటకు నమస్కారపురస్సరముగా ప్రార్థించుచున్నాము.

సంఘసేవకుడు.

ప త్రి కా ధి ప తి.

## ప త్రి కా స న్మా న ము లు.

ఈక్రింది మహానుభావుల సహాయమును వందనములతో గైకొని మాకృతజ్ఞతను వెలువరించుచున్నాము.

౧. గుంటూరుజిల్లా దండమూడి వాస్తవ్యులగు శ్రీమాన్ పొన్నూరు శంకరయ్యగారు తనకుమారుల ఉపనయన మహోత్సవ తరుణమున పత్రికాసన్మానం (నం॥ శే ద్వారా) సమర్పించినది. ౨ ౦-౦

౨. డిటో పెనుమాక వాస్తవ్యులు శ్రీమాన్ సంగాపుపానకాలయ్యగారు తన కుమారుని విద్యారంభమహోత్సవ తరుణమున పత్రికా సన్మానం ౧-౦-౦

౩. డిటో చివ్వలూరు గ్రామవాస్తవ్యులు శ్రీమాన్ డాక్టర్. కొల్లిపర వీరయ్యగారు శ్రీకాశీసమారాధన మహోత్సవ తరుణమున పత్రికా సన్మానం. ౫ ౦-౦

౪. కృష్ణాజిల్లా కాపవరం వాస్తవ్యులు కీ॥ శే॥ చావలిబుచ్చయ్యగారి జ్ఞాపకార్థం కుమాళ్లు వెంకటసుబ్బయ్య వగైరాలు పత్రికాసన్మానం నిమిత్తం (చి॥ కు॥ గారిద్వారా) సమర్పించినది ౧-౦-౦

౫. బె:గుళ్లూరుజిల్లా గూళూరువాస్తవ్యులు శ్రీమాౕ. అర్చకం కాళప్ప దీక్షితులుగారు పత్రికాసన్మానం. ౧-౪-౦

---

## యీ నెలలో చందాలు చెల్లించినవారు.

౧. శ్రీమాౕ. వెలవలపల్లి వెంకటేశ్వర దీక్షితులుగారు శ్రీముఖ (రాజపోషక చందా) సాలూరు (వి)

౨. శ్రీమాౕ. పూజ్యంవిశ్వనాథ గురుకులుగారు (శ్రీకంఠమఠనివాసులు) ఆంగీరస శ్రీముఖ చందాలు కోటిపల్లి (గో)

3. శ్రీమాౕ. చుండి ఆనందరాయుడుగారు పోషకచందా (ఆంగీరస శ్రీముఖ) రూపెనగుంట్ల [గుం]

---

## చందా తగ్గింపబడెను.

సోదరులారా! కాలమార్పునుబట్టి మన పత్రికకు చందాలు మార్చినాము. గావున చాలా కాలమునుంచి దిఃకుబాటు గావించిన వారును ముందు చెల్లించినవారునుగూడ యీ క్రిందివిధముగా వెంటనే పంపగోరుచున్నాము. నూతన మార్గముతోనైనను పత్రికకు సహాయ పడగలందులకు ప్రార్థించుచున్నాము.

వి వ ర ము లు.

౧ ఉద్ధారకులు (ఒక్క పర్యాయమే ౨౫ రూపాయిలు యివ్వవలెను.)

౨ మహారాజపోషకులు ప్రతి సంవత్సరం నాలుగురూపాయిలు చెల్లింపవలెను.

3 రాజపోషకులు ప్రతి సంవత్సరం మూడు రూపాయిలు చెల్లింపవలెను.

౪ పోషకులు ప్రతి సంవత్సరం రెండు రూపాయిలు చెల్లింపవలెను.
(పైవారిపేర్లు పత్రికలో ప్రతిమాసం వెల్లడి యగుచుండును)

౫ చందాదారులు - ప్రతిసంవత్సరం ఒక్క రూపాయి యెనిమిదణాలు మాత్రమే చెల్లింపవలెను.

☞ యీ మార్పువలన ప్రతివారును సులభముగా సహాయ పడగలరని విశ్వాసము. దీనివలన పత్రికలు ఎక్కువగా వ్యాప్తి జెందగలవను నమ్మకముతో యిట్లొనరింప బడెను. లోగడ బాకీలున్నవారికిని, ముందురాబోవు చందాదారులకును మంచి తరుణము. గావున పత్రికను సంరక్షింప గోరుచున్నాము.

(సంపాదకుడు)

---

# శ్రీస్వాములవారి కార్యక్రమము.

సోదరులారా !

శ్రీవారు 14 వ తేది సాయంత్రము తెనాలిచేరి రాత్రి అచట నివసించి 15 తేది ఉదయం పెదరావూరు గ్రామవాస్తవ్యులు శ్రీమాన్ చావలి వాలయ్యగారి గృహమున భిక్షగావించి రాత్రికి వోలేరునకు విజయం చేసియున్నారు.

2వ తేది ధూళిపూడి మఠామునకు దయచేసి రేపల్లె తాలూకా ఆదిశైవమహాజన సభా ప్రథమ సమావేశము గావించగలరని దెలియుచున్నది.

పిమ్మట ఇంటూరు, యాజలి, పెదనందిపాడు, గుంటూరు గ్రామములకు విజయంచేయగలరు.

గీతా భాష్యమునకు సంకల్పము గావింపగలరని విన్నవించుచున్నాము.

మకాం, తెనాలి. 15-12-33. } ఇట్లు, తుమ్మపూడి లక్ష్మీనారాయణ గురుకులు.

---

# శ్రీ ధన్వంతరి జయంత్యుత్సవము, తెనాలి.

కార్తీక బ ౧౩ లు బుధవారం ది 15-11-33 యీ గ్రామ వాస్తవ్యులును స్వదేశీఆయుర్వేద వైద్యశాలాధిపతులగు, శ్రీయుతుల పెనుమూడి హనుమంతరావుగారు తమ వైద్యశాలయందు శ్రీధన్వంతరి జయంతిమహోత్సవము నత్యంత వైభవముగా జరిపిరి. ప్రాతఃకాలమున శ్రీధన్వంతరి వ్రతమును పూర్తిగావించి ప్రేక్షకులకు శ్రీధన్వంతరితీర్థప్రసాదములనిచ్చి తృప్తులగావించి మధ్యాహ్నము బంధుమిత్రాదులకు సమారాధన మొనరించి సాయంత్రం ఘం 4కు మహాసభ ప్రారంభింపబడి బ్రహ్మశ్రీ పండిత, కాశినాధుని రాజలింగశాస్త్రిగారు ఆయుర్వేదమునుగురించి చాలావిపులముగా ఉపన్యసించిరి. తదుపరి బ్రహ్మశ్రీ ఆయుర్వేదాచార్య ములుగు విశ్వేశ్వరశాస్త్రి L.I.M. & H.P.I.M గారికి స్వాగతపట్టము నొసంగిరి.

యీ సభకు ఆయుర్వేద వైద్యులునూ అలోపతి వైద్యులునూ వైద్యాభిమానులున్నూ, అనేకులువచ్చిరి. సభ జయప్రదముగా జరిపిరి.

పినపాడు, ది 16—11—33. } ఇట్లు, ఆయుర్వేదాభిమాని, చావలి సుబ్బయ్య.

---

# శ్రీమాన్ జగద్గురు నందీశ్వర దీక్షితులవారి శివసాయుజ్య స్మారక పద్యరత్నములు.

మ॥ సిరిసౌఖ్యంబుల కాలవాలమయి స ♦ చ్ఛ్రీలొందు సద్విద్యల
చ్చెరువొందందమిఁ దీరఁజేది తగు వా ♦ సిన్ సత్యధర్మంబులుం
మరువంజాలక యాదిశైవ మత స ♦ న్మానంబులంగాంచు శ్రీ
వరనందీశ్వర దీక్షితా! శివ పద ♦ ప్రాప్తింగనంబోయితే ? ౧

సీ॥ వేదాగమశ్శాస్త్ర ♦ వేత్తలౌ బుధులెల్లఁ
గొనియాడఁదగు విద్యఁ ♦ గనెనంగ
సంపదోద్యుక్త వి ♦ స్తార సాగరులెల్ల
వర్ణించు స్థిరవిత్త ♦ వంతుఁడనఁగ
దానధౌరేయ ని ♦ ర్మాణకర్తులెల్ల
శ్లాఘించు పరధర్మ ♦ శాలియనఁగ
శాంతసద్గుణ గణ ♦ సంజాతపరులెల్ల
స్మరియించు కలసత్య ♦ సంధుడనఁగ
గీ॥ బరగి భౌతిక దేహమీ ♦ ధరణివిడచి
శివపదస్సన్ని ధానంబుఁ ♦ జేరినట్టి
ప్రథిత నందీశ ధీక్షితు ♦ హృదయమునకు
శాంతిసర్వేశుఁ డొసఁగూర్చి ♦ సాకుగాత. ౨

సీ॥ భాషాభివృద్ధికై ♦ పజ్జఁ జేరినయట్టి
శిష్యవర్గంబేమి ♦ చేతుమనుచు
మతిమంతులగు హితుల్ ♦ సతియు బంధులుసుతుల్
గతియేమిముందు నీ ♦ క్షితినటంచు
సమతవ్రతాచార ♦ సాంఘికావళులెల్ల
భరియించుటెటు దుఃఖ ♦ భరమటంచు

మానితోద్యుక్త తీ ♦ ర్మాన కోవిమలాత్మ
సంశయం బెడఁబాయఁ ♦ జాలమనుచు

గీ॥ దలచి వాపోవుమర్త్యుల ♦ ధరణివిడచి
సరగ గౌరీవరుని సభ ♦ కరిగినట్టి
విదిత నందీశదీక్షితు ♦ మదికిఁదగిన
శమము సమకూడుటకు నేమి ♦ సందియంబు. 3

గీ॥ అహహా శ్రీయూది శైవాగ ♦ మాబ్ధిఁబొడమి
శాస్త్రవిజ్ఞాన చంద్రికల్ ♦ సకలదిశలఁ
బర్వఁ గృతులను నక్షత్ర ♦ పటలిబెనిచి
శర్వుఁదరిఁజేరె నందీశ ♦ చంద్రమూర్తి. ४

క॥ నందీశ్వర దీక్షితులెద
సందియ మెడఁబాసి శివుని ♦ సాన్నిధ్యమునన్
జెందును; సౌఖ్యములని యా
నందముతోఁ బలికి నట్టి ♦ యభిమతిఁ గనుఁడీ॥ ౫

చింతమనేని జగ్గయ్య చౌదరి

దుగ్గిరాల, గుంటూరుమండలము,

---

# విశ్వకళ

గుంటూరు పట్టణమునుండి శ్రీయుతులు కుందుర్తి నరసింహారావుగారి సంపాదకత్వమున వెలువడుచున్న మాసపత్రికను వందన పురస్సరముగా నందుకొని యందలివిషయములు పరిశీలించి యానందించితిమి. పేరునకుతగినట్లు చక్కని వ్యాసములతో విరాజిల్లుచున్నది. సంవత్సరచందా ఒక్కరూపాయి మాత్రమే. వలయువారు సంపాదకులకు వ్రాయవలెను.

---

Regd. No. M. 2073. సం॥ చందా రు 1-8-0 లు.

# శ్రీ ఆదిశైవపత్రిక.

శ్రీ శ్రీకంఠ మఠాధిపతుల యాజ్ఞానుసారముగా, శైవసంఘాభ్యుదయమునకై శ్రీ గురుకులాశ్రమమునుండి ప్రతిమాసము ప్రకటింపబడును.

సర్వదేవాత్మకో రుద్రస్సర్వే దేవాశ్శివాత్మకాః ।
రుద్రస్య దక్షిణేపార్శ్వే రవిర్బ్రహ్మా త్రయోగ్నయః ।
వామపార్శ్వే ఉమాదేవి విష్ణుస్సోమోపి తేత్రయః ॥
(రుద్రహృదయోపనిషత్)

సంపాదకుడు:—చిలుమూరు పురుషోత్తమ గురుక్కళ్.

| సంపుట ౯ | చిలుమూరు. శ్రీముఖనామ సం॥ర మాఘమాసము. | సంచిక ౧౧ |
|---|---|---|

(విలేఖకుల వ్యాసములకు సంపాదకులు ఉత్తరవాదులు కానేరరు.)



—♦ విషయసూచిక. ♦—



భారతీ ప్రెస్, తెనాలి.

# మహారాజపోషకులు

[ సంవత్సరమునకు నాలుగురూపాయలు చెల్లించవలెను. ]

౧ రాజవైద్య నాగలింగం నందయ్య అండు సన్సువారు ఆయుర్వేదభవనం అమృతలూ:

౨ శ్రీమాన్ కొల్లిపర వీరయ్యగారు, చివ్వలూరు.
౩ ... కంఠంరాజు వెంకటసుబ్బయ్యగారు, భట్లపల్లి అగ్రహారం.
౪ ... చావలి వాలయ్యగారు. పెదరావూరు.
౫ ... స్వర్ణ సుబ్బయ్యగారు పాణ్ డ్రాక.
౬ ... గూడూరు లక్ష్మయ్యగారు వెణుతురుమిల్లి.
౭ ... అగమిక నంజుండ దీక్షితులుగారు రామసముద్రము.
౮ ... పసుపర్తి పార్వతమ్మగారు కూచిపూడి.
౯ ... వెలవలపల్లి వెంకటేశ్వరదీక్షితులుగారు.

## రాజపోషకులు. [సం॥రం 1 కి రు 3-0-0లు]

౧ ఆగమిక వాలేశ్వరదీక్షితులుగారు పుంగనూరు.
౨ శ్రీమాన్ చావలి దుర్గాప్రసాద దీక్షితులుగారు తరిగొప్పుల.
౩ ... యలమంచిలి సుబ్రహ్మణ్యగారు వెదురుపాక.
౪ ... గూడలి రామయ్యగురుకులు చినమాంభట్ల అగ్రహారం.
౫ శ్రీమతి ఇంకొల్లు అన్నపూర్ణమ్మగారు (తాలూకాబోర్డు మెంబరు) ప్రత్తిపాడు.
౬ శ్రీమాన్ S. రామప్పగారు (కరణం) ఉప్పరపాలెం.

## పోషకులు. [స॥రం 1 కి రు2-0-0లు]

౧ శ్రీమాన్ వడ్లమూడి కోటయ్యగారు వడ్లమూడి.
౨ ... నూతలపాటి వెంకటనారాయణ గురుకులుగారు వరకవిపూడి.
౩ ... చావలి పిచ్చయ్యశర్మగారు చాటపర్రు.
౪ ... S. A. నంజుండయ్యగారు శిరస్తాదారు పుంగనూరు.
౫ ... ఉయ్యాలవాడ మునెయ్యగారు భండాత్మకూరు.
౬ ... ఆగమిక సుబ్రహ్మణ్యదీక్షితులుగారు బెంగుళూరు.
౭ ... కొల్లిపర వెంకటసుబ్బయ్యగారు అమ్మనబ్రోలు.
౮ ... నాగలింగం సత్యనారాయణగారు డాక్టరు మాలుపూరు.
౯ ... చుండి ఆనందరాయుడుగారు రూపెనగుంట.
౧౦ ... ఆగమిక చంద్రశేఖరదీక్షితులుగారు చాడేపల్లి.
౧౧ — S. A. అగస్త్యప్పగారు చారాల.
౧౨ — మురికిపూడి వెంకటేశ్వర్లుగారు వల్లభాపురం.
౧౩ — చావలి చంద్రయ్యగారు
౧౪ — కూర్మగిరి శేషమ్మగారు పాకవీడు.

# శ్రీ ఆదిశైవ పత్త్రిక.



సప్తకోరుద్రస్స ఈశానస్సభగవాన్ సమహేశ్వరస్స మహాదేవః ॥
"అథర్వశిరసి."


| సంపుట | చిలుమూరు: | సంచిక |
|---|---|---|
| ౯ | శ్రీముఖనామ సం॥ర మాఘమాసము. | ౧౧ |


## ప్రార్థన.

(శ్రీయుతులు యం. వెంకటరత్నంగారు)

శ్లో॥ జటాటవీగళజ్జలప్రవాహపావితస్థలే గళేవలంబ్యలంబితాం
భుజంగ తుంగమాలికాం డమడ్డమ, డ్డమ డ్డమ న్నినాదవడ్డ
మవ్యయం చకార చండతాండవంతనోతునశ్శివ శ్శివమ్॥ ౧

శ్లో॥ జటాకటాహసంభ్రమ భ్రమన్నిలింపనిర్ఝరీ విలోలవీచివల్లరీ విరాజ
మానమూర్ధని ధగద్ధగద్ధగ జ్వలల్లలాటపట్టపావకే కిశోరచంద్ర
శేఖరే రతిఃప్రతిక్షణంమమ॥ ౨

శ్లో॥ ధరాధరేంద్రనందినీ విలాసబంధుబంధుర స్ఫురద్దిగంత సంతతి
ప్రమోదమానమానసే కృపాకటాక్షధోరిణీ నిరుద్ధ ధుర్ధరాపది
క్వచిద్దిగంబరే మనోవినోదమేతు వస్తునే॥ 3

(శివతాండవేశ్వరస్తోత్రము)

(శ్రీమాన్ కొల్లిపర కోటయ్యగురుకులుగారు)

ఏకాక్షరరూపా, అకారఉకారస్వరూపా, ఆత్మరూపా, విద్యారూపా, ఆదిదేవా, నీకు నమస్కారము. తృతీయ మకారస్వరూపా, పరమాత్మా, జలస్వరూపా, జలపూజ్యా, జలశాయీ, నీకు నమస్కారములు. నీవ చిత్తస్వరూపుండవు. అంతఃకరణస్వరూపుండవు. పరమాత్ముండవు. జ్ఞానగమ్యుండవగు నీకు నమస్కారములు. హిరణ్యబాహుండవు. హిరణ్యరేతస్కుండవగు నీకు నమస్కారములు. ఓకపర్దీ! నాగాభరణభూషితుండవు, ఓవృషాకపీ, శర్వా, కర్తా, హర్తా, శివా, శివస్వరూపా, సర్వవ్యాపీ, వ్యోమకేశా, నీ కనంతప్రణామములు. ఓదేవా! నీవు నిధులకధీశ్వరుండవు. లింగస్వరూపుండవు. శాశ్వతుండవు. వరిష్ఠుండవు, వారిజగర్భుండవు, యోగీశ్వరుండవగు నీ కనేక నమోవాకములు. ఓతేజస్వరూపా, తేజోధారా, సర్వస్వరూపా నీకు వందనములు. దేవా, త్రికాలస్థితుండవు. సామగేయుండవు, బ్రహ్మవర్చస్వరూపుండవు, ఆత్మవు, ఋషివి, స్వామివి, విష్ణువగునీకు నమస్కరించుచున్నాను. ఓంకారస్వరూపుండవు సర్వజ్ఞుండవగు నీకు నమస్కారములు. (శివపురాణము)

---

## (నవరస సీసమాల)

(శ్రీయుతులు ధవళ వెంకటబలరామయ్యగారు.)

సీ. కరమొప్ప పార్వతీ కల్యాణశుభలగ్న
కాలోత్సవమున శృంగారరసము
అచ్ఛోటకేళిడప్పు డగ్నివచ్చిన, సంత
సమున మాట్లాడుట శాంతరసము
ఫాలనేత్రమునుండి బడునగ్నికణమంత
బాలుడై పుట్టు టద్భుతరసంబు

శక్రు మదమడంప శుక్లమార్గమునుండి
అతని రమ్మనుటయే హాస్యరసము
క్షీరాబ్ధిబొడమిన క్ష్వేలంబు దిగమి్రంగి
భీతిబోనాడుట వీరరసము
వృత్రారికరము స్తంభింపజేసియు వాని
భస్మంబుజేయుట భయరసంబు
అరిసేనలార్వంగ అల జలంధరునంత
భంజించుటదియ భీభత్సరసము
ఆజిని సురలపై నామహాస్త్రంబును
రయమున విడుచుట రౌద్రిరసము
దక్షుకోపాగ్నికింధనమైన చందు్రని
రూపునిల్పుటయె కారుణ్యరసము
గీ॥ అట్టిరసములు నీయందె యమరియుంట
వేరుతావుల నెలకొననేరమయ్యె
అద్రిరాజనివాస యార్యాకళత్ర
భవవిమోచన ఈశ్వర బ్రోవుమయ్య.

(దేవాంగ)

---

# మహాత్ముడు

సీ॥ తనదృష్టి విశ్వసంతానరక్షణకునై
సారించు "గౌతమ" చక్రవర్తి
తనమేనికండ సంతసముతో నర్పించు
పృధువదాన్యుండు "శిబి" ప్రభుండు
తనశతృషడ్వర్గమును జయించు రమేశు
నర్చనసేయు "ప్రహ్లాద" సుకృతి

తనలోన నెచటజూచిన సత్వమెభరించి
శాంతాత్ముడైన యజాతశత్రు
గీ॥ డితఁడె పో యని "సర్వమహీతలమున"
దిశలుశబ్దింప తనదివ్య తేజమునను
వెలుగు "గాంధీమహాత్మున" కలఘుమతిని
నంజలింపని మానవు లవనిగలరె.

(ఆంధ్రభూమి)

## శ్రీ శ్రీకంఠ భాష్యము

పత్రియింటియందును స్థాపించి పూజించి, తరించగలందులకు జగద్గురుశ్రీశ్రీకంఠ శివాచార్యులవారి (శ్రీకంఠమఠంకోటిఫలి) యాజ్ఞమైనదిగావున వలయువారు శ్రీగురుకులాశ్రమమునకు వ్రాసినచో ఉచితముగా బడయగలరు. (సంపాదకుడు)

# సంపాదకీయములు.

<u>స్వవిషయము.</u>

కాలానుగుణ్యముగా పత్రికచందాలు మార్పుదలచేసినాము. దిగుబాటుచేసినవారుగూడ యీ నూతనపద్ధతి ననుసరించి సహాయమొనరింప వచ్చునని గతసంచికలో దెలుపుకున్నాము. అట్టిమహాభాగ్యమువలన సమరసదృష్టి జూపవలసిన తరుణము సంప్రాప్తించనందుకు విచారకరము. సాంఘికుల సహాయముండినచో నెట్టిమహత్తర కార్యములైనను సాధించవచ్చును. పత్రికావ్యాప్తి నభివృద్ధిపరచుటకీనూతన చందామార్గము సహాయపడగలదని నమ్మికతో ఒక్కతరుణ

మున సగము తగ్గించినవిషయము ఆనందకరమని పలువురు దెలుపు చున్నారుగాని కార్యరూపమున పరిణమించి మాశ్రమను సార్థకపరుప గలరని నిండు విశ్వాసముతో సాంఘికులను బ్రార్థించుచున్నాము.

## శ్రీ శ్రీకంఠ శివాచార్యులవారు.

గుంటూరుమండలమున కొద్దిసంచారముగావించి భీమడోలు జువ్వలపాలెం మున్నగు గ్రామాదులకు విజయంజేసి యున్నారు. త్వరలో కృష్ణాజిల్లా పర్యటనముగావించి "గీతాభాష్యము" పూర్తి చేయ సంకల్పించినట్లు దెలియుచున్నది. మతోద్ధరణదీక్షా బద్ధులగు శ్రీవారి సంకల్పమమోఘమై నిర్విఘ్నముగా నెరవేరగలదని నమ్మవలెను. శ్రీవారు గావించిన "శివదీక్షాయాగము" శ్రీకంఠమఠప్రతిష్ఠ "బ్రహ్మ సూత్రభాష్యము" మున్నగు మహాత్కార్యములే నిదర్శనములై యల రారుచున్నవి. సామాన్యులవలన నెరవేరెడి ప్రయత్నములుగావు. "శివలోకనివాసులగు శ్రీ నందీశ్వరదీక్షితుల వారి యకాలమరణము వలన శ్రీస్వాములవారి సంకల్పబలమునకు లోటువాటిల్లియుండునని పశ్చాత్తాపపడుచున్నాము. పరమేశ్వరుడట్టి లోటులను పూర్తి చేయు నని విశ్వసించుచున్నాము.

## ఆయుర్వేద వైద్యులరిజష్ట్రేషన్.

ఆయుర్వేదవైద్యులు రిజష్టరుచేయించు పద్ధతిని స్థలాంతరమున జూడవలెను. దానిని గమనించి త్వరలో పూర్తిజేసుకొని సత్కీర్తి నార్జించుట ప్రతివాని విధియైయున్నది. మనసంఘమునందు వైద్యము తెలియనివారు మిక్కిలి అరుదుగానుందురు. గావున ప్రతివైద్యుడును ముందురాబోవు నిర్ణయములు గమనించి తమవైద్యమును అభివృద్ధి లోనికి దెచ్చుకొని సుఖజీవన మొనరింప ప్రార్థితులు.

## అభినందనము.

కృష్ణాజిల్లా వడ్లమన్నాడుగ్రామవాస్తవ్యులును నిరంతర సంఘ సేవా పరాయణులును సుప్రసిద్ధాయుర్వేద వైద్యశిఖామణులును

శ్రీమృత్యుంజయ ఔషధశాలాధిపతులునగు శ్రీహర్ గూడూరు వియ్యన్నగార్కి స్వస్తిశ్రీ శ్రీముఖ సంవత్సరం పుష్య బహుళ తృతీయ సౌమ్యవాసరమున పుత్రుడు గల్గినటుల విని మిక్కిలి యానంద భరితులమైతిమి. పరమేశ్వరుని యనుగ్రహమున శుక్లపక్ష చంద్రుని మాడ్కి దినదిన ప్రవర్ధమానుడై నబ్బాలుడు ఆయురారోగ్యములతో విరాజిల్లుటకు భగవానుని ప్రార్థించుచున్నాము.

ప్రబుద్ధాంధ్రపత్రిక.

కొంతకాలముక్రితం నిలుపుదలజేసి మరల రాజమహేంద్రవరము నుండి పండిత శ్రీపాద సుబ్రహ్మణ్యశాస్త్రిగారి సంపాదకత్వముననే పునరుద్ధరింప బడిన అయిదవసంపుటము ప్రథమసంచికను వందన పురస్సరముగా నందుకొని యందలి సద్విషయములు పఠించి యమందా నందహృదయులమైతిమి. శ్రీ శాస్త్రిగారి రచనాసామర్థ్యము లోక మెరింగియుండుటచే నెక్కువగా వ్రాయబనియుండదు. అద్భుతవిమ ర్శనలు వినోదమైన కథలతో ప్రతినెలారంభమున వెలువడుచున్నది. చందా ఒక్కరూపాయిమాత్రమే. వలయువారు సంపాదకులకు వ్రాయవలెను.

ఆంధ్రభూమి సంక్రాంతిసంచిక.

ఘనతవహించిన నీపత్రికారాజమును గురించి విశేషించి వ్రాయ నవసరముండదు. అయిన నీ సంచిక యత్యంత శోభాయ మానముగా వెలువరించిన సంపాదకు లెంతయు వందనీయులు. ప్రతి ఆంధ్రుడును తప్పక పరిశీలించి యందలి సద్విషయములు గమనించి తీరవలెనని ఖండితముగా హెచ్చరించుట కానందించుచున్నాము. అచిరకాలముననే ఆంధ్రలోకమునకు వ్యాపించి ఆంధ్రప్రతిభను మారుమ్రోగించుచున్నందులకు పరమేశ్వరు డీ పత్రికారాజమును నిర్వి ఘ్నముగా బ్రోచునటుల ప్రార్థించుచున్నాము. చందాసంవత్సరమునకు రు 3-0-0 లు వలయువారు ఆంధ్ర శేషగిరిరావు, వేపేరి, మదరాసు అని సంపాదకులకు వ్రాయవలెను.

గాంధిమహాత్ముని పర్యటనము.

జనవరి 4 తేదీతో ఆంధ్రరాష్ట్రపర్యటనము పూర్తిఅయినదని తెలుపుట కానందించుచున్నాము. శ్రీవారుగావించిన మహోపన్యాస సారాంశములు విశాలహృదయముతో పరిశీలించితిమేని పరిశుద్ధసనాతన ధర్మములు మహాత్మునియందు మూర్తీభవించియున్నటుల నిదర్శనము లనేకముగా గాన్పింపగలవు. హైందవవిజ్ఞానమును సర్వసామాన్యులు గ్రహించులాగున బోధించుటచే "యదార్థవాదీ బంధువిరోధి" యను నెపమునకు గురియగుచున్నాడు. సర్వోపనిషత్సార భూతములైన మహావాక్యమననము శ్రీ వారియందే గమనింపదగును. శ్రీవారి యుపదేశామృతమును గ్రోలినవారు ధన్యులై యానందసాగరమున నోలలాడుచున్నారు. "ధర్మసంస్థాపనార్థాయ" యనెడి మహావాక్యము శ్రీవారికే అన్వయించుట సమంజసమైయున్నదని లోకులు నిర్మలహృదయములతో దెలుపుచున్నారు.

విషాదము.

గోదావరీమండల శనివారపుపేట వాస్తవ్యులును సుప్రసిద్ధ విఖ్యాతపురుషులునగు శ్రీమాన్ గూడూరు సీతయ్యగారు పుష్యశుద్ధ చతుర్దశీ శనివారంరోజున భగవానుని యాజ్ఞాప్రకారం భౌతికదేహమును వదలి శివలోకమలంకరించినారని దెలియుటవలన మిక్కిలి విచారము నొందితిమి. శ్రీవారనేక ధర్మకార్యము లాచరించుటయేగాక మన పత్రికారాజమునకు ఉద్ధారకులై విరాజిల్లియుండిరి. అట్టి పరిశుద్ధ హృదయుడగు శ్రీవారి మరణమునకు చింతిల్లుచున్నాము. పరమేశ్వరుడీ మహామహునకు ఆత్మశాంతి నొసగూర్చుటకు ప్రార్థింపుచూ శ్రీవారి కుటుంబమునకు మాసానుభూతి నందజేయుచున్నాము.

వినోదినీ పత్రిక.

మదరాసునుండి పి. గోపాలస్వామినాయుడుగారిచే వెలువడుచున్న మాసపత్రిక నవంబరు సంచిక మాకార్యాలయమలంకరించి పై

పేరును సార్థకపరచి యానందమును గలుగజేసినది. సంపాదకుల పరిశ్రమ మెచ్చదగినట్లుగా పత్రికను ఒక్కసంవత్సరము పూర్తిచేసియున్నారు. డిశంబరునుండి రెండవసంపుటము ఆరంభించి జయప్రదముగా ప్రజాహ్లాదమును బొందగలదని మాయాశయము. అనేకసంస్కరణరూపకమగు కథలు పొట్టచెక్కలగునట్లు నవ్వునుగలుగజేయుటచే "ఆనందో బ్రహ్మ"ది శృతులు సార్థకమగుచున్నవి. సంవత్సరమున కొక్క రూపాయి చందా మాత్రమే. ప్రతి ఆంధ్రుడును స్త్రీలును పరిశీలించి యానందింపగోరుచున్నాము. వలయువారు వినోదిని కార్యాలయము. 234 గోవిందప్పనాయకన్ వీధి, మదరాసు. అనివార్యవలయును.

## కరుణలేని కమతము—ఉచితము.

గుంటూరు జిల్లా తెనాలి తాలూకా అనంతవరం గ్రామవాస్తవ్యులును సుప్రసిద్ధదేశసేవాపరాయణులును కార్మికసంఘాద్యనేక ధర్మకార్యనిర్వహణదక్షులును అగు ధూళిపాళ్ల కోటయ్య చౌదరిగారిచే ప్రకటింపబడిన చిన్నిపొత్తము. దీనియందొక పాలేరు చరిత్రము వ్రాయబడినది. నీతిబోధకమై యున్నది. వలయువారు గ్రంథకర్తగారికి వ్రాసినచో ఉచితముగా బడయగలరు.

## బాలశతకము.

చక్కని నీతిదాయకములగు పద్యములతో విరాజిల్లుచున్నది. ప్రతిసారశాలయం దుపయోగించి బాలుర నీతి నభివృద్ధిపరచునటుల వ్రాసిన గ్రంథకర్తలగు "కవిజంట" నభినందించుచున్నాము. వలయువారు "చౌదరి రామకృష్ణమిత్రమండలి, కూచిపూడి" తెనాలి తాలూకా యని వ్రాయవలెను.

## గమనింపు.

సోదరులారా! మనపత్రికకు చందా రు 1-8-0లు చేసి నప్పటికి తమతమ చందాలు ఒక్కరైనను బంపకపోవుట శోచ నీయముగా నున్నది. దిగుబాటు జేసినవారందరు యీనూతన పద్ధతితోనైనను బంపి సహాయపడగోరుచున్నాము. మౌనము వహించిన యడల మేముగూడ యీ ప్రయత్నము విరమించి యున్నకుండవలసి వచ్చునని విన్నవించుచున్నాము.

పత్రికాధిపతి.

# ఆయుర్వేద వైద్యుల రిజష్ట్రేషన్

ఆయుర్వేదవైద్యులు తమపేరులను రిజష్టరీ చేయించుకోవలసిన దని శ్రీగవర్నమెంటువారు 1933 సంవత్సరం ఫిబ్రవరి ఒకటవతేదీని గెజెట్టునందు ప్రకటించిరి ఒక ఆక్టును నిర్మించినారు. అందువలన ప్రతి ఆయుర్వేదవైద్యుడును తనపేరును రిజష్టరుచేయించుకొనుట చాలా అవసరమైయుండును. యిష్టమైనవారు అయిదు సంవత్సరములలోగా రిజష్టరీ చేయించుకోవలెనని ఆక్టునందుగలదు. ఆయుర్వేద కళాశాల లందుగాని ప్రైవేటుగా ఆయుర్వేదగ్రంథములు చదివిగాని పరీక్షలలో నుత్తీర్ణులయినవారు పదిసంవత్సరములనుండి వైద్యానుభవము గల్గిన వారు మాత్రమే రిజష్టరు చేయించుకొనుట కర్హులైయుందురు. అట్టి వారు కలెక్టరు, తహస్సీలుదారు, తాలూకాబోర్డు ప్రెసిడెంట్లు మున్నగు గౌరవనీయులచే సర్టిఫికెట్టు పొందవలెను. లేనిచో రిజష్టరుచేసుకొను టకు వీలుండదు. రిజష్టరు చేయించుకొననివారు వైద్యము చేయరా దని మున్ముందు యిబ్బంది గలుగగలదు. అయిదుసంవత్సరములయ్యి

పిమ్మట గవర్నమెంటువారే రిజష్టరు చేయించుకొనునటుల నిర్బంధిం
గలరు. అప్పుడు తప్పనిసరిగా ప్రతివారును రిజష్టరు చేయించుకొన
తప్పదు గనుక అట్టి చిక్కులు రాకపూర్వమే ప్రతివారును ఆయుర్వే
శాస్త్రమునందు మంచి జ్ఞానము సంపాదించుకొని అనుభవమును
పొందుచూ, త్వరలో యోగ్యతాపత్రములు (పైనదెలిపినవారిచే
సంపాదించుకొని రిజష్టరు చేయించుకొనుట శ్రేయోదాయకము
ఆయుర్వేద కళాశాలలందు తీర్ణులయినవారు అయిదుసంవత్సరముల
అనుభవమున్నను, బి. క్లాసుక్రింద రిజష్టరు చేయించుకోవచ్చును. ప
సంవత్సరములు అనుభవముగలవారు ఏ. క్లాసుగా రిజష్టరు చేయబ
దురు. బి. క్లాసువారు తమపేరు రిజష్టరు అయిన యేడుసంవత్సరము
పిమ్మట ఏ క్లాసుగా మార్పు జేయించుకోవచ్చును.

---

# రిజష్టరీవలనగలుగు లాభములు, పద్ధతి.

ఇతర వైద్యులకంటె రిజష్టరుఅయిన వైద్యులకు కొన్నిఅధికా
ములు గలుగగలవు. నెలకు యేబదిమొదలు నూరురూపాయీలవరకు
జీతముగల్గి తమతమ తాలూకాబోర్డులక్రింద పనిచేయువారలను పరీక్షి
చుటయు, ఆరోగ్యవిషయములు బోధించుటయు లైసన్సుల నిచ్చు
టయు గలిగియుందురు. జిల్లాబోర్డులందు ఉద్యోగములు సంపాదిం
కొన గల్గుదురు. వైద్యముచేయుటకు అర్హతగలిగియుందురు. య
స్థితిలో ఆయుర్వేద వైద్యులందరు రిజష్టరుచేయించుకొనుట మిక్కి
యుపయోగకరము. గావున ప్రతివైద్యులును ఆయుర్వేదశాస్త్రము
బాగుగాపఠించి త్వరలో రిజష్టరు ప్రయత్నములొనరించుట చాల
మంచిది. కేవల మనుభవజ్ఞానమే ప్రధానముగా నుంచుకొనక శాస్త్ర
జ్ఞానముగూడ సంపాదించుట కర్తవ్యమని విన్నవించుచున్నాము. అ

వారు చరక శుశ్రుతాది ఆయుర్వేదగ్రంథములు చదివి పరీక్షయం దుత్తీర్ణులు గావలసియుండును.

ఇప్పుడు రిజష్టరు చేయించుకొనువారు రు 15—12—0 లు ఫీజును గవర్నమెంటువారి ట్రజరీలోచెల్లించి రసీదును దరఖాస్తుతోటి పంపవలసియుండును. యోగ్యతాపత్రిము మున్నగునవి పరిశీలించి మెడికల్ బోర్డువారు తమకు యుక్తమని తోచినచో రిజష్టరుచేసుకొనె దరు. లేనిచో ఫీజుతోసహా నిరాకరించి దరఖాస్తు త్రిప్పివేయుదురు.

(సశేషము)

(ఆయుర్వేదచంద్రికనుండి)

---

# ఆగమధర్మములు.

౧. భక్తిలేనివారి సహవాసము చేయరాదు. ౨. అహంకార మును అభిమానమును వదలవలెను. 3. పరహింస పరదారపరిగ్ర హణము పరద్రవ్యాపహారము, అసత్యము, అభక్ష్యభక్షణము మున్నగు నవి త్యజింపవలెను ౪. భక్తులయందు దయగల్గియుండుట, భగవంతుని సేవయందు నమ్మికగల్గుట. భగవంతుని పూజించుచుండుట. భగవత్సేవ యందు డాంబికము లేకుండుట. భగవత్కథలనే వినగోరుట. భగవ ల్లీలల స్మరించి ఆనందపరవశుడగుట, నిరంతరము భగవంతుని స్మరిం చుట. భగవంతునియందే మనస్సు అర్పించుట. మున్నగునవి భక్తు లభ్యసింపవలెను. ౫. సద్గురువు నాశ్రయింపవలెను. ౬. ఆహార నియతిని బొందవలెను. (అనగా దోషరహితమైన భగవత్ప్రసాదమును ఆరగించుట) ౭. అనువర్తన నియతి . . భ్యసింపవలెను. (అనగా భగవద్విషయములందణకువతో దాసులవలె ప్రవర్తించుట) ౮. శరీర ధారణము భగవత్సేవకని నిశ్చయించుట. ౯. కష్టములువచ్చినప్పుడు దుఃఖింపక కర్మఫలమనిదెలిసి భగవంతుని ప్రార్థించుట. ౧౦. భగ వంతుడే తండ్రియనియు భక్తులే సోదరులనియు దలంచుట.

౧౧. భగవంతునికంటె రక్షకులు లేరనియు ఆయనకు దాసులమనియు పరమానందముతో వర్తించుట. ౧౨. భగవంతునియందు భక్తిగల వారు చండాలురైనను బ్రాహ్మణులకంటె యధికులనియు భక్తిలేని బ్రాహ్మణులు చండాలురనియు భక్తు లేకులము వారైనను మానవ శ్రేష్ఠులనియు దెలుసుకొనుట. ౧౩. ఆచార్యకోటిలో జేరినభక్తులు దరు సమానప్రేమతో వర్తించవలెను. (అనగా జాతిమతవిచక్షణ చేయరాదు). ౧౪. గురువును: దైవముగానెంచి సకలవిధశుశ్రూషలతో సర్వసమర్పణబుద్ధితో సేవించువాడే శిష్యుడు. (ఆచార్యుని సదా సంతోషపెట్టుచుండవలెను) ౧౫. మాణిక్యము రాపిడివలన నెక్కు వగా ప్రకాశించు విధమున శిష్యుడు ఆచార్యోపదేశములవలన పరి శుద్ధుడు కాగలడు. ౧౬. ఆచార్యానుగ్రహపాత్రుడగుటకు సర్వదా ప్రయత్నించవలెను. సంసారసాగరమునుండి తరింపజేయగల సమర్థుడు ఆచార్యపురుషు డొక్కడేయనియు భక్తిజ్ఞానవైరాగ్యముల బోధించి భగవంతుని దర్శనముగల్గించువా డాచార్యపురుషుడే యనియు గురు నింద మహాపాతకమనియు ఆచార్యవమానము నరకలోకప్రాప్తి నొన గూర్పగలదనియు దెలిసికొని గర్వరహితులై దంభమాత్సర్యవర్జితులై సర్వమానవ సౌభ్రాతృత్వహృదయులై వర్తించువారే భక్తులు. అట్టి వారితో సహవాసముచేయువారు ధన్యులు అని గ్రహించుట జన్మ రాహిత్యమునకు హేతుభూతమని దెలుసుకోవలెను: (సశేషము)

శ్రీ గు రు కు లా శ్ర మ ము.

---

## జపమాలా లక్షణము.

(శ్రీమాన్ పొత్తూరు లింగయ్యగారు)

శ్లో॥ అక్షమాలావిధింవక్ష్యే శృణుష్వావహితోనృప
సామ్రాజ్యం స్ఫటికోదద్యాత్పుత్రజీవః పరాంశ్రియమ్॥

తా॥ అక్షమాలావిధి జెప్పబడుచున్నది. స్ఫటికమాలసామ్రాజ్యము నొసంగుటయేగాక పుత్రులనొసంగ గలదు.

శ్లో॥ ఆత్మజ్ఞానం కుశగ్రంధీ రుద్రాక్షస్సర్వకామదః
ప్రవాళైశ్చకృతామాలా సర్వలోకవశప్రదా॥

తా॥ కుశగ్రంధి ఆత్మజ్ఞాన మొసంగును. రుద్రాక్ష సమస్తకోర్కెల నిచ్చును. పగడము లోకవశీకరము గావించును.

శ్లో॥ మోక్షప్రదాచమాస్యాదామలక్యాః ఫలైఃకృతా
ముక్తాఫలైఃకృతామాలా సర్వవిద్యాప్రదాయినీ॥

తా॥ ఉసిరిక పండ్లుగల మాల మోక్ష మొసంగును. ముత్యాలమాల సర్వవిద్యల నొసంగ గలదు.

శ్లో॥ మాణిక్యరచితామాలా త్రైలోక్యస్యవశంకరీ
నీలైర్మరకతైర్వాపి కృతాశత్రుభయప్రదా॥

తా॥ మాణిక్యమాల మూడులోకములు వశీకరము గావించును. నీల మరకతములు శత్రువుల జయింపజేయును.

శ్లో॥ సువర్ణరజతామాలా దద్యాద్వైమహతీంశ్రియమ్
తథారౌప్యమయీమాలా కన్యాంయచ్ఛతికామితామ్.

తా॥ బంగారుమాల గొప్ప సంపదనొసంగును. వెండితో జేయబడిన మాల కోరిన కన్యనొసంగును.

శ్లో॥ ఉక్తానాం సర్వనామానాం దాయినీ పారదైఃకృతా
అష్టోత్తరశతంమాలా తత్రస్యాదుత్తమోత్తమా॥

తా॥ చెప్పబడినయన్ని కోర్కెలను పాదరసపుమాల యొసంగగలదు. నూటయెనిమిది సంఖ్యగలమాల యుత్తమోత్తమము.(సశేషము)

---

# మహావాక్యములు.

(శ్రీమాన్ సంగాపు కోటయ్యగారు.)

శ్లో॥ రాజకార్యే నియుక్తానాం నరాణాం భూపసేవినామ్.
శ్మశ్రులోమనఖచ్ఛేదే నాస్తికాల విశోధనమ్.

తా॥ రాజకార్య నిమగ్నులగువారు క్షౌరమునొనరించుకొనుటకు మంచి చెడుగుల పరిశీలింప నవసరములేకున్నను దోషములేదని దెలియ వచ్చుచున్నది.

శ్లో॥ సకంచుకయతీం దృష్ట్వాఽకంచుక సువాసినీం ।
సకేశాం విధవాం దృష్ట్వా సచేలస్నానమాచరేత్.

తా॥ అంగీని ధరించినయతియు ఆచ్ఛాదనలేని శరీరముగల సువాసినియు కేశఖండనలేని వితంతువును జూడరాదనియు, ప్రమాదవశమున చూచుటతటస్థించినచో, సచేలస్నానముతో శుద్ధియగునట.

శ్లో॥ శిరః కేశయుతానారీ మృతే భర్తాచపైతృకే ।
తత్పాకమలమూత్రంతు దృష్ట్వాస్నానం సమాచరేత్.

తా॥ కేశఖండనముజేయక భర్తయొక్క శ్రాద్ధదినమందు ఏవితంతువు వంటజేయునో ఆపాకము యోగ్యముగానేరదు. అట్టివితంతువును జూడరాదు. (సశేషము)

---

# పత్రికా సన్మానములు.

౧. గుంటూరుజిల్లా మందడం గ్రామకాపురస్థురాలు కొండవీటి పిచ్చమ్మ గారి జ్ఞాపకార్థం సంవత్సర విమోక శ్రాద్ధమునందు కుమార్తె శాంతమ్మగారు పత్రికాసన్మానం నిమిత్తం (సం॥ కోటయ్యగారి ద్వారా) సమర్పించినది. ౧—౦—౦.

౨. డిటో పెద్దకాకాని గ్రామకాపురస్థులు చదలవాడ జాలయ్యగారు పత్రికాసన్మానం నిమిత్తం (సం॥కో॥ద్వారా) సమర్పించినది.౧-౦-౦.

3. బెజవాడతాలూకా చోడవరం గ్రామకాపురస్తురాలు లంక కోటమ్మ గారి జ్ఞాపకార్థం కుమార్డు రామశాస్త్రిగారు పత్రికాసన్మానం నిమిత్తం గూడూరు సదాశివసుందరమూర్తిద్వారా సమర్పించినది.

౧—౪—౦.

---

## యీ నెలలో చందాలు చెల్లించినవారు.

౧. శ్రీమాన్ టంగుటూరు మల్లయ్యశర్మగారు (శ్రీముఖ) సంగం (నెల్లూరుజిల్లా)

౨. శ్రీమాన్ పుల్లేటికుర్తి నాగభూషణంగారు డిటో ఆత్రేయపురం (గోదావరిజిల్లా)

3. శ్రీమాన్ అయలూరు రామశాస్త్రులుగారు డిటో అర్థవరం (గో॥)

---



## ఏమండోయి - నామాటవినరూ.

ఇప్పటికి మనపత్రిక ఆరంభించి తొమ్మిది సంవత్సరాలయిందిగదా, ఇక ఒకసంచికతో తొమ్మిదవ సంపుటము పూర్తిగాబోవుచున్న దే? ఇంతవరకు ఒక పైస మైనను సహాయపడనివారును, కొంతకాలమువరకు, అభిమానము జూపించి, తాళముచెవులు మొలలో కట్టిన మహానుభావులును, వారినిజూచి వీరు, వీరినిజూచివారు, ఒకమాదిరే ఆలోచించి అన్నిజిల్లాలవారు సమ్మెకట్టినట్లుగా షుమారు రెండువేల పైచిల్లరగా, దిగుబాటుచేసి యున్నట్లు అనేకపత్రికలలో చూచియే యుందురు.

పత్రికల్లో వ్రాస్తూవుంటే, "మనపత్రిక రుచిగా లేదనియు, చొప్పదంటు వ్రాతలుగా వుంటున్నవనియు, ప్రతి పత్రికలోను "డబ్బు

డబ్బో, యని కలవరిస్తున్నదనియు, మంచి పద్యాలులేవని కొందరును, హాస్యపు కథలులేవని మరికొందరును, ధర్మశాస్త్రాల వచనాలు వ్రాయటములేదని యింకా కొందరును, అవిలేవని, యివిలేవని, సాకులుచెప్పి చందాసొమ్ముకు స్వస్తిజెప్పియున్నారు. అట్టివారు మాకు పత్రిక అవసరములేదని తెలియపరచక అయిదారు సంవత్సరాలనుంచి యీరోజు వరకు పత్రికమాత్రము పుచ్చుకుంటున్నారే. ఏమి మీయుక్తి. పంపుచుంటే పుచ్చుకుంటున్నామంటారా. బాగున్నది. వి. పి. చేస్తే త్రిప్పి వేయటము, వుత్తరంవ్రాస్తే జవాబుయివ్వకపోవటము ఎక్కడనైనా కనబడితే, నాలుగైదు రోజులలో మీకు పైకమంతా మనియార్డరుచేస్తానని సత్యవాక్యములుబల్కటం, పంటలరోజుల్లోవస్తే వడ్లుఅమ్మి వెంటనే పంపగలమనటం పిమ్మట వెళ్లితే పైకం ఖర్చయిపోయింది, కిస్తీలకు మళ్లీ పైకంరాగలదు అప్పుడుచూతుములే అనటం, పోనీ మీరు ఏదో వకటి గట్టిగా తేల్చిచెప్పండి. మీకు మనస్సులో వుత్సాహంవుంటే చూడండి, బలవంతములేదని నిష్కర్షగాఅడిగితే అబ్బే ఎందుకండి యింత మాత్రమునకే మాకు దరిద్రము వస్తుందా! అలాఅక్కరలేదు. మీ పైకంఅంతా వడ్డీతోసహా పంపుతానని సాగనంపటం. పిమ్మట మామూలుగా సంచరించుటం. ఒకవేళ యీగోలపడలేక ఏకొంచమోయిస్తే రైలు ఖర్చులకుగూడ చాలకపోవటం, వూరువూరు తిరిగి తిరిగి బ్రతుకుజీవుడా యని కొంపజేరటం, పత్రిక వుండవలసినదేనండి. మీరు మానవద్దండీ ఏమైనాసరే, పత్రికనుమాత్రం విడవకండీ యని ధైర్యములు చెప్పటంతోనే, కాలమంతా వెళ్లిపోయినదిగదా, సోదరులారా! యింకను చేయవలసిన యనేకవిషయములు మిగిలియున్నవే. అవెట్లు నిర్వహింపగలరు?

అర్చకసంఘాలుపెట్టి మంచిఘట్టాన, కాడి క్రిందపడవేసి వ్యవహారాలు పాడుచేసుకున్నాము. ఆదిశైవసంఘాన్ని అసలే నిద్రపుచ్చాం, ద్రవ్యమంతా ఖర్చుచేశాం, కాలంతప్పి తల్లక్రిందై, గుడ్లు మిటుకరించుచున్న వారినందరిని చూస్తున్నాం, ఇప్పుడేమిచేయగలం, ద్రవ్యముపుట్టదు. ఇదివరకు తెచ్చిన ఋణాలుతీరవు. యిళ్లువాకిళ్లు తెగనమ్ముటకైనా

కొనేవారులేరు. భూములు అమ్ముటకు వీలులేదు. యీస్థితిలోనున్న మనసంఘం, ఏమిచేయగలదో యోచింపుడు అని మరికొందరు వుపన్య సించుచున్నారు.

అందుకనే సగానికి చందా తగ్గించినారు. గనుక మీరు యివ్వవల సిన బాకీమొత్తములో సగమైనా పంపి పత్రికను రక్షించండి. పత్రిక పడిపోతే మరల నుద్ధరింపలేము. పిచ్చో, పాటో, మనసంఘానికొక పత్రికవున్నదని ఏకొందరు పామరులైనా, సంతోషించుచున్నారు. గావున దయయుంచి వెంటనే సహాయపడండి లేనియడల "అనాథ పేతమై" యస్తమింపగలదు. తరువాత విచారించిన ప్రయోజనముండదు.

"లోకసంచారి"

---

# శైవపరిచారిణీ ప్రకటనఖండము.

వరంగల్లునుండి కొలదిసంవత్సరములక్రితం వెలువడిన "శైవ పరిచారిణీ" యను ఆరాధ్యులు ప్రకటించిన క్రోధనసంవత్సర కార్తీక మార్గశిరములందు వెలువడిన పత్రికయందు, లింగప్రతిష్ఠోత్సవము లెవరు చేయవలెనని శంకించి "ఆరాధ్యులే లింగప్రతిష్ఠాదులు చేయ వలెనని యొచ్చటగలదు" అను హెడ్డింగుతో, పేరూరు గ్రామవాస్తవ్యు లగు మల్లంపల్లి శంకరశాస్త్రిగారు, నైజాంరాష్ట్రనివాసులగు మల్లంపల్లి నాగలింగారాధ్యులవారికిని, ముదిగొండ పాపయారాధ్యులవారికిని, ముదిగొండ యల్లమందయ్యఅయ్యవారికిని, లేఖలు వ్రాయగా అందుకు వారు ప్రాచీన తాళపత్రగ్రంథములనుండి కొన్నిశ్లోకములువ్రాసి పంపి నారని ప్రకటనచేసియున్నారు. అవి పరిశీలింతము.

మకుటాగమమునందు.

శ్లో॥ ఆచార్యలక్షణం వక్ష్యేయని ఆరంభించి లింగధారణసంయుక్తో లింగార్చనవ్రతస్తథా" యనియు. శివరహస్యమునందు లింగధారణ,

హీనశ్చ శివసంస్కారవర్జితః"అను వాక్యములుగల కొన్నిశ్లోకములు ప్రకటించినారు. అర్హానర్హతలు నిర్ణయించినారు.

కారణాగమమునందు.

ఆచార్యనిర్ణయ లక్షణముగల చతుర్దశపటలమున "లింగధారణాదీక్షైవ శివదీక్షేతికథ్యతే అని యారంభించి దీక్షాహీనత్వమును = తత్ఫలిత మును దెలుపు శ్లోకములు ప్రకటించినారు. యీశ్లోకములందు తమకుపయోగించు స్వకపోలిత వాక్యములు గలవు. ప్రాచీనకోశము లందు పరిశీలింప నీవాక్యములలో కొన్ని గన్పట్టుటలేదు. ఆరాధ్యులు శైవదీక్షానిర్వహణదక్షులు. ఆత్మార్థపూజాదురంధరులు. ఆగమమార్గ ప్రవర్తకులు అంతియేగాని గ్రామాభివృద్ధికరమగు పరార్థాలయప్రతి ష్ఠోత్సవములందు జోక్యము గలుగజేసికొనుట మహాపాతకము. లోక వినాశకరము గావున అట్టి మోసకృత్యపు వాౖతలను ఖండించుటయు సత్యమును వెల్లడించుటయు సజ్జనలక్షణమగుటచే యీఖండనమునకు దొరకొనుచున్నవాడను. ధర్మము నెప్పుడును మరుగుపరచరాదు. అట్లొనరించుట ధర్మద్రోహమనంబడును గావున ఆగమములు దెలియని ప్రజలను మోసగించి తామే ఆచార్యలక్షణములు గలవారమని శాస్త్ర ములు మార్పుజేసి ప్రతిష్ఠాది కలాపములు తామేనిర్వహింప సమర్థుల మని బయలుదేరిన ఆరాధ్యమహాశయుల నెంతని గొనియాడగలము. సర్వాధికారులగు ఆదిశైవులనుగురించి ఆగమములెట్లు వచించుచున్నవో గమనింపక ప్రాచీన తాళపత్రాదులనుండి యీశ్లోకములు వెల్లడిం చుటవలన వారివాౖతలువారి యుపయోగార్థమైనట్లు స్పష్టపడుచున్నది. ఆరాధ్యులు లింగధారులు అనగా మెడయందొక లింగకాయగట్టుకొనిన స్మార్తుల శాఖలోనివారు. వెలనాటి శాఖలోవారు అర్చకత్వము చేయుటయు నియోగి శాఖాసంబంధులగు ఆరాధ్యులు ప్రతిష్ఠోత్సవ ములు నిర్వహించుటయు బహుయోగ్యముగా నున్నదని ప్రజలు పండి తులు దేవతలు చాలా ఆనందముతో యున్నారు. గనుకనే మనదేశ

మిట్లున్నది. నెల్లూరు మొదలు రామేశ్వరము వరకు పరిశీలించినచో అందరి సంశయములు నివర్తి కాగలవు. శాస్త్రములు పరీక్షించినచో ఎవరధికారులో విశదముకాగలదు. ఆగమములు తాంత్రికములని ప్రచురించిన దురాత్ములను, ఆగమాచారముల నాశనముగావించి స్వేచ్ఛామార్గ ప్రవర్తకులగు పండితమ్మన్యులను దురాచారప్రస్థాపకులగు దురభిమానమూఢశిఖామణులను పరమేశ్వరుడేపరిపాలింపగలడు. "ఆదిశైవులుగానివారెవ్వరును ఆలయ కార్యక్రమమునందు జోక్యము గలుగజేసుకొనరాదనియు అట్లొనరించుట రాజారాష్ట్ర గ్రామాదులకు విశేష నష్టదాయకమనియు, శాస్త్రముల తిరస్కరించుట మహాదోషమనియు, వేనోళ్ల బొగడుచున్న శైవాగమములు పరిశీలింప గోరుచున్నాము.

శ్రీ గురుకులాశ్రమము.

---

## వార్తలు.

లోకోత్తర మహాపురుషుండును దీనజనోద్ధరణ దీక్షాపరతంత్రుడును త్యాగమూర్తియునగు శ్రీ గాంధిమహాత్ముడు డిశంబరు పదునారవ తేది మొదలు జనవరి నాల్గవ తేదీవరకు ఆంధ్రరాష్ట్ర పర్యటన మొనరించి హరిజనోద్యమమునకు డెబ్బదివేల రూప్యములు సమకూర్చినట్లు విని సంతసింపనివారుండరు.

జనవరి 25 తేదిని అసెంబ్లీయందు రంగయ్యరుగారి దేవాలయ ప్రవేశబిల్లు విచారణకు రాగలదని పలువురు సనాతనవాదులు తహతహపడుచూ మరొక సంవత్సరమువరకు వాయిదావేయించుటకు యత్నించుచున్నారని గుసగుసలు బయలుదేరినవి.

వెలనాటి అర్చక సోదరులు బందరులో నొక మహాజనసభగావించి పాఠశాలాపోషణ మున్నగు తీర్మానములు గావించియున్నారు.

గుంటూరు జిల్లాకోర్టులో కొన్ని దావాలు కంట్రిబ్యూషన్ కూడా లేనట్లు నిశ్చయించి అర్చకనౌకరీ యీనాములని తీర్మానములో సంగి బోర్డువారివలన ఖర్చులు రాబట్టుకొనుటకై అర్చకులకు డిక్రీలు యివ్వబడినట్లు విని బోర్డువారితో రాజీలుపడిన వారందరు పశ్చాత్తా పము జెందకపోయినను ప్రతికక్షులకు మాత్రం హాడల్ గల్గుచున్నట్లు వార్తలు బయలుదేరుచున్నవి.

ఆర్థికదుస్థితి ప్రబలుటచే శిస్తు చెల్లింపజాలమనియు నూటికి 25 రూపాయీలు తగ్గించవలసినట్లుగా "ఆంధ్రరాష్ట్రరైతు మహాజన సంఘము గావించిన యాందోళనఫలితముగా రూపాయకు అణన్నరలు తగ్గింపుజేసినట్లు దెలియవచ్చుచున్నను కనీసము రూపాయకు మూడణా లైనను తగ్గించుట ధర్మమేని అసంతృప్తిని కనబరుచుచున్నట్లు దెలియు చున్నది.

ఇంగ్లాండుదేశములో నిటీవల నెక్కువ బాల్య వివాహములే జరుగుచున్నవట. మనదేశములో శారదాబిల్లు నామోదించి ప్రౌఢ వివాహములే జేయవలెనని శాసించుట విచిత్రముగా నున్నదనియు భారతీయులనుజూచి హాస్యముగా బలుకు బ్రిటీషువారిచర్య లత్యంతా శ్చర్యకరములని దలంచనివారుండరు.

---

## శ్రీకంఠీయ గీతాభాష్య ప్రకటన.

శైవవిశిష్టాద్వైత మత ప్రవర్తకులయిన శ్రీ ఆదిశైవ మహాజన సంఘమువారికి ఇందుమూలముగా తెలియపరచున దేమన.

పరమేశ్వరాజ్ఞానువర్తులమై శ్రీకంఠాచార్యకృత బ్రహ్మ మీమాంసాభాష్యమును ఆంధ్రాక్షరములతో ముద్రణ పూర్తిగావించి డిశంబరు పదునాల్గవ తేదినుండి ఏతద్భాష్యగ్రంథములు ఉచితముగా మావలన పంచిపెట్టబడుచున్నవి. వలయువారు (శ్రీ ఆదిశైవ పత్రికా ఆఫీసు) శ్రీగురుకులాశ్రమము చిలుమూరు నకుగాని శ్రీ శ్రీకంఠమఠము

కోటిఫలికిగాని వ్రాసినచో బడయగల్గుదురు. తరుణము మించిన ప్రతులు లభింపనేరవు. గుంటూరు మండలవాసుల ద్రవ్యసహాయముతో బ్రహ్మసూత్రభాష్యము పూర్తిగావించితిమి. రెండవగ్రంథమగు గీతాభాష్యవిషయములో కృష్ణామండలముపశ్చిమగోదావరీ మండలము లందు యీగామాఖబహుళ మొదలు మేమును మాతోగూడ శ్రీమాన్ చావలి శివరామపాకయాజి, శ్రీమాన్ స్వర్ణ వెంకటశివావధానులు శ్రీమాన్ పావులూరు నాగేశ్వరశర్మ శ్రీమాన్ తుమ్మపూడి లక్ష్మి నారాయణదీక్షితులు శ్రీమాన్ పాలపర్తి సీతారామదీక్షితులు (శ్రీకాంచీ పురనివాసులు) యజుర్వేదఘనాపాఠియు సకలాగమపారావారపారీణు లగు శ్రీమాన్ ఏకామ్రగురుకులు విద్వాన్ పండిత కవి శ్రీమాన్ సుబ్రహ్మణ్య దీక్షితులు మున్నగు ప్రముఖులతో సహా ప్రచారముగావింప బడును. సదరు ప్రచారతరుణమున శ్రీకంఠమతాధిపతులమగు మాచే శ్రీకంఠభాష్యవిషయములు ఉపన్యసింపబడుచుండును. గావున సదరు గీతాభాష్యము ప్రాచీనకోశములనుండియె త్తివ్రాయబడుచున్నదిఅందుగల మధురశైలి వర్ణనాతీతమై యలరారుచున్నది. గీతాభాష్యమునకు తెలుగు తాత్పర్యము మాచే వ్రాయబడుచున్నది. ఉపనిషద్భాష్యము గూడ త్వరలో తయారుగావింపబడి శ్రీకంఠాచార్యకృత ప్రస్థానత్రయ భాష్యములు లోకమున ప్రకాశింపజేయబడును. అప్పుడు శైవవిశిష్టా ద్వైతమతము పూర్వోత్కృష్టతను స్థాపించుకొని యానందింపగలదని మాయాశయము శ్రీకంఠభాష్యమునకు సాటియైన భాష్యములు లోకమున గన్పట్టుటలేదని యనేకపండితులు వ్రాయుచున్నారు. గావున యీప్రకటనగాంచిన ప్రతివారును సదరు గీతా ఉపనిషద్భాష్యములకు శక్త్యానుసారముగా ద్రవ్యసహాయ మొనరించుటకు మావలన హెచ్చరింపబడుచున్నారు.

పరిణవస్మరణ

కోటిఫలి.
గోదావరీ మండలము
మకాం, భీమడోలు

ఇట్లు,
శ్రీజగద్గురు శ్రీకంఠశివాచార్య
శ్రీకంఠ మతాధిపతులు.

పత్రికాపరిచయము.

పశుసంరక్షణ. కృష్ణామండలమునందు అంగలూరు గ్రామవాస్తవ్యులగు శ్రీయుతులు యేజళ్ల శ్రీరాములుచౌదరి, కోనేరు శ్రీహరి నారాయణగార్ల యాధిపత్యమున రెండుమాసములకొకతూరి ప్రకటనచేయుచున్న పైపేరుగల పత్రిక రెండవ సంపుటము ప్రథమ సంచికను వందనపురస్సరముగా స్వీకరించి యందలి సద్విషయములు పఠించి యానందించితిమి. సదరు పత్రిక ప్రతిరైతుని గృహమందు నెలకొల్పిపరిశీలించుట ముఖ్యకర్తవ్యమని మా యాశయము. పశుసంబంధమైన అభివృద్ధిమార్గములు రోగములు చికిత్సలు మున్నగు ననేకవిషయము లిందు వ్రాయబడుచున్నవి. చందా ఒక్కరూపాయి మాత్రమే. పశుపతి యనుగ్రహమున నీపత్రిక చిరతరస్థాయిగా వర్ధిల్లునని మేము విశ్వసించుచున్నాము. వలయువారు సంపాదకులకు వ్రాసుకోవలెను.

---



Regd. No. M. 2073. సం॥ చందా రు 1-8-0లు.

# శ్రీ ఆదిశైవపత్రిక.

శ్రీ శ్రీకంఠ మఠాధిపతుల యాజ్ఞానుసారముగా, శైవసంఘాభ్యుదయమునకై శ్రీగురుకులాశ్రమమునుండి ప్రతిమాసము ప్రకటింపబడును.

సర్వదేవాత్మకో రుద్రస్సర్వే దేవాశ్శివాత్మకాః ।
రుద్రస్య దక్షిణేపార్శ్వే రవిర్బ్రహ్మా త్రయోగ్నయః ।
వామపార్శ్వే ఉమాదేవి విష్ణుస్సోమోపితేత్రయః ॥
(రుద్రహృదయోపనిషత్)

సంపాదకుడు:—చిలుమూరు పురుషోత్తమ గురుక్కళ్.

సంపుట ౯ } చిలుమూరు. శ్రీముఖనామ సం॥ర ఫాల్గుణమాసము. { సంచిక ౧౨

(లేఖకుల వ్యాసకులకు సంపాదకులు ఉత్తరవాదులు కానేరరు.)



—♦ విషయసూచిక. ♦—



భారతీ ప్రెస్, తెనాలి.

# మహారాజపోషకులు

[ సంవత్సరమునకు నాలుగురూపాయలు చెల్లించవలెను. ]

౧ రాజవైద్య నాగలింగం నందయ్య అండు సన్సువారు ఆయుర్వేదభవనం అమృతలూరు

౨ శ్రీమాన్ కొల్లిపర వీరయ్యగారు, చివ్వలూరు.
౩ ... కంఠంరాజు వెంకటసుబ్బయ్యగారు, భట్లపల్లి అగ్రహారం.
౪ ... చావలి వాలయ్యగారు. పెదరావూరు
౫ ... స్వర్ణ సుబ్బయ్యగారు పాన్‌డ్రాక.
౬ ... గూడూరు లక్ష్మయ్యగారు వెణుతురుమిల్లి.
౭ ... ఆగమిక నంజుండ దీక్షితులుగారు రామసముద్రము.
౮ ... పసుపర్తి పార్వతమ్మగారు కూచిపూడి.
౯ ... వెలవలపల్లి వెంకటేశ్వరదీక్షితులుగారు.

## రాజపోషకులు. [సం॥రం 1 కి రు3-0-0లు.]

౧ ఆగమిక వాగీశ్వరదీక్షితులుగారు పుంగనూరు.
౨ శ్రీమాన్ చావలి దుర్గాప్రసాద దీక్షితులుగారు తరిగొప్పుల.
౩ ... యలమంచిలి సుబ్రహ్మణ్యగారు వెదురుపాక.
౪ ... గూడలి రామయ్యగురుకులుగారు చినమాంభట్ల అగ్రహారం.
౫ శ్రీమతి ఇంకొల్లు అన్నపూర్ణమ్మగారు (తాలూకాబోర్డు మెంబరు) ప్రత్తిపాడు.
౬ శ్రీమాన్ S. రామప్పగారు (కరణం) ఉప్పరపాలెం.

## పోషకులు. [సం॥రా 1 కి రు2-0-0.]

౧ శ్రీమాన్ వడ్లమూడి కోటయ్యగారు వడ్లమూడి.
౨ ... నూతలపాటి వెంకటనారాయణ గురుకులుగారు వరకవిపూడి.
౩ ... చావలి పిచ్చయ్యశర్మగారు చాటపర్రు.
౪ ... S. A. నంజుండయ్యగారు శిరస్తాదారు పుంగనూరు.
౫ ... ఉయ్యాలవాడ మునెయ్యగారు భిండ్యాత్మకూరు.
౬ ... ఆగమిక సుబ్రహ్మణ్యదీక్షితులుగారు బెంగుళూరు.
౭ ... కొల్లిపర వెంకటసుబ్బయ్యగారు అమ్మనబ్రోలు.
౮ ... నాగలింగం సత్యనారాయణగారు డాక్టరు మూలుపూరు.
౯ ... చుండి ఆనందరాయుడుగారు రూపెనగుంట.
౧౦ ... ఆగమిక చంద్రశేఖరదీక్షితులుగారు చాడేపల్లి.
౧౧ — S. A. అగస్త్యప్పగారు చారాల.
౧౨ — మురికిపూడి వెంకటేశ్వర్లుగారు వల్లభాపురం.
౧౩ — చావలి చంద్రియ్యగారు
౧౪ — కూర్మగిరి శేషమ్మగారు పాకవీడు.

# శ్రీ ఆదిశైవపత్రిక.

సఏకోరుద్రస్స ఈశానస్స భగవాన్ సమహేశ్వరస్స మహాదేవః॥
"అథర్వశిరసి."

| సంపుట ౯ | చిలుమూరు. శ్రీముఖనామ సం॥ర ఫాల్గుణమాసము. | సంచిక ౧౨ |
| --- | --- | --- |


## ప్రార్థన.

(శ్రీమాన్ చిలుమూరు గురులింగశాస్త్రిగారు)

శ్లో॥ శ్రీకల్యాణ గుణోజ్జ్వలం శుభకరం చింతార్థ సిద్ధిప్రదం
రాకేందుద్యుతిశోభితం ప్రవిమలం లావణ్యచూడామణిం,
పాకారి ప్రముఖామరాళి వినుతం భక్తార్థచింతామణిం,
సాకారం సకలాంతరాత్మకవిభుం సాంబంశివం ప్రార్థయే॥

శ్లో॥ శ్రీకంఠం ఫణిభూషణాంకితవపు శ్శ్రీనాథసంసేవితం
విశ్వేశం మహిమాభిరామ మభవం వేదాంతవేద్యం గురుం
ఈశానం వృషభేంద్ర వాహనవిభుం యేణాంకపాణిం శివం
గౌరీశం సకలార్థవైభవకరం గంగాధరః పాతుమాం॥

---

(శ్రీమాన్ చంద్రమౌళి సూర్యనారాయణ శాస్త్రిగారు)

శ్లో॥ యేషాం పర్వతకన్యకాపతి పదద్వన్ద్వేనభక్తిస్థిరా
యేషాందారుక దారకాప్రియ గుణాలాపేఽనురక్తిర్నచేత్
యేషామీశ్వర రూపవర్ణన విధానాలం వచశ్చాతురీ
తేషాం జన్మనిరర్థకం పునరిలాభారాయ మన్యామహే॥

---

(శ్రీమాన్ చింతమనేని జగ్గయ్య చౌదరిగారు)

చ॥ సలలితమైన భక్తి మదిఁ జాలనుతింపుచు మ్రొక్కుచుంటి నా
తలపుననిల్పి దుర్మదులదాపున జేర్చక దివ్యగానముల్
గలిగి చెలంగఁ జల్పుమిలఁ గాలములన్నిఁట జ్ఞానమూర్తి ని
ర్మల కరుణాపయోనిధి ధరాధర పూర్వర మల్లికార్జునా॥



సంపాదకీయములు.

స్వవిషయము

తొమ్మిది సంవత్సరములు పూర్తియగుటవలన ఆదాయ వ్యయ పట్టికగూడ ప్రకటించితిమి. గమనించి, దశమసంపుటమునకు సహాయపడ గోరుచున్నాము. సులభముగా చందాదార్లు జేరగలందులకే చందా సగమునకు తగ్గించబడెను. గనుక ప్రతివారును సహాయమొనరించి చందాదార్లను జేర్పించుటకు ప్రార్థించుచున్నాము. దిగుబాటు గావించిన మహానుభావులుగూడ నూతన పద్ధతిలో బంపవచ్చునని దెలుపుకొనుచున్నాము.

శ్రీ శ్రీకంఠ శివాచార్య స్వాములవారు

శ్రీమద్గోలునందు కొంత విశ్రాంతినొంది "గీతాభాష్య" ప్రకటనార్థం కృష్ణా, గోదావరీ మండలములందు పర్యటన మొనరించుచున్నారు. సాంఘిక సహాయము వలనను శ్రీవారి సత్యసంకల్ప ప్రభావములవల్లను "ప్రస్థానత్రయభాష్యములు" లోకములో వ్యాప్తి జెందగలవని నిండు విశ్వాసముతో విన్నవించుచున్నాము. గావున ఆదిశైవ మహాజనులీ శుభతరుణమును వ్యర్థపరుపవలదని మా ప్రార్థనలు.

ఉమామహేశ్వర భక్తసమాజము.

తెనాలితాలూకా శృంగారపురమునందు కార్తీకమాసమున నీభక్తసమాజమును బోర్డుప్రాథమిక పాఠశాలోపాధ్యాయుల వార్ల ప్రోత్సాహమున స్థాపించినట్లును, ప్రతిసోమవారము భక్తిసంబంధమైన ఉపన్యాసములతోడను భజనల తోడను జయప్రదముగా నెరవేరుచున్నట్లు విని యానందించుచూ, సమాజ సభ్యులను హృదయపూర్వకముగా నభినందించుచున్నాము. పరమేశ్వరానుగ్రహము వలన నీసమాజకార్యక్రమ మభివృద్ధినొంది ఇతరగ్రామాదులకు మార్గదర్శియై వర్ధిల్లుటకు నిరంతరము ప్రార్థించుచున్నాము. భగవద్భక్తి వలన జన్మరాహిత్యము గలుగగలదని యనేక పురాణములు, ఇతిహాసములు గలవు. గావున నిర్మలమగు మనస్సుతో భగవన్నామములు స్మరించువారు ధన్యులు.

---

పత్రికా స్వీకారము.

ప్రాథమిక పాఠశాల.

కృష్ణాజిల్లా ఘంటసాలనుండి శ్రీయుతులు అయినంపూడి గురునాథరావుగారి సంపాదకత్వమున వెలువడుచున్న విద్యావిషయక మాసపత్రిక అయిదవ సంపుటం, తొమ్మిది, పది సంచికలుగల్గిన సం

యుక్త సంచికను వందన పురస్సరముగా నందుకొని, యందలి సద్విషయ ములు పరిశీలించి యానందించితిమి. ఆంధ్రదేశమునందలి ప్రతిప్రాథ మిక పాఠశాలయందు నీపత్రికను నెలకొల్పి, యందలి వివిధోపదేశ ముల గమనించుట ప్రతి యుపాధ్యాయుని కర్తవ్యమైయున్నదని నిస్సం శయముగా విన్నవించుచున్నాము. ఉభయ భాషా ప్రవీణులగు శ్రీ గురు నాథరావుగారి సంకల్పమమోఘమై, గురునాధుని యనుగ్రహ పాత్రమై యలరారునని మానిందు విశ్వాసము. సంవత్సరచందా రు 1-8-0 లు.

## ఆయుర్వేదచంద్రిక.

నెల్లూరుజిల్లా పెరిదేపినుండి ఆయుర్వేద వైద్య విద్యావతంసులగు శ్రీయుతులు పి. శి. ఏ. అందుకోవారి సంపాదకత్వమున ప్రకటితమగు మాసపత్రిక యెనిమిదవ సంపుటం సప్తమగుచ్ఛమును వందనములతో స్వీకరించి ఆయుర్వేద విషయములు గమనించి సంతోషించితిమి. అనేక రహస్యవస్తు విశేషములు, గుణములు, యోగములు, మున్నగు సద్విషయములు లోకోపకారముగ వెలువరించుచున్నందులకు సంపాద కుల నభినందించుచున్నాము. ధన్వంతరీ దేవుని యనుగ్రహమున నీ పత్రిక చిరతరస్థాయిగా వర్థిల్లగలదని యాశించుచున్నాము.

చందా రు 2-0-0

## శ్రీదేవీ యజ్ఞపత్రిక.

శ్రీమాన్ గంగవరం నంజుండ దీక్షితులవారిచే పెద్దకాంచీ పురమునందు గావింపబోవు మహాయాగలగ్న పత్రికను యీసంచిక యందే ముద్రించితిమి. గమనించి మీరు గావింపదలచిన సహాయ సం పదలు త్వరలో సమర్పింపవలసియుండును.

---

యీ నెలలో చందాలు చెల్లించినవారు.

౧ శ్రీమాన్ కారంచేడు పున్నయ్యపంతులుగారు పోలంరాజు గుంటలు. (నె)
౨ శ్రీమాన్ చావలి శివరామపాకయాజిగారు చావలి [గుం]
౩ ,, చావలి వాలయ్యదీక్షితులుగారు చావలి [గుం]
౪ ,, దొంతుకుర్తి పాకయ్యపంతులుగారు ఆర్యాపురం[గో]
౫ ,, పోగుల వీరభద్రయ్యగారు తుర్లపాడు (గుం)
౬ ,, ఉండి రాజన్నదీక్షితులుగారు సోమేశ్వరం [గో]
౭ ,, దేవరపాలెం సుబ్బయ్యగురుకులుగారు చాగొల్లు [నె]
౮ ,, చావలి చంద్రమౌళీశ్వరరావుగారు కాజ [గుం]

---

# పత్రికాసన్మానములు

౧ శ్రీమాన్ కొల్లిపర కోటయ్యగురుకులుగారు తనకుమార్తె నామకరణమహోత్సవ తరుణమున పత్రికాసన్మానం నిమిత్తం సమర్పించినది 0-8-0

౨ శ్రీమాన్ పెనుమూడి హనుమంతరావుగారు శ్రీగురుకులాశ్రమ సందర్శన తరుణమున పత్రికాసన్మానంనిమిత్తం సమర్పించినది1-0-0

3 శ్రీమాన్ గూడూరు వెంకటప్పయ్యగారు కీ॥ శే॥ శ్రీమతి సంగాపు శేషమ్మగారి జ్ఞాపకార్థం పత్రికాసన్మానం ఆచార్యకానుక [కొ॥ వీ॥ గారిద్వారా] సమర్పించినది 3-4-0

---

# శ్రీ కామాక్షీదేవీ త్రిశతీ సువాసినీ పూజా యాగలగ్నపత్రిక.

శ్లో॥ జయ దేవి! జగన్మాతర్జయ దేవి! పరాత్పరే!
జయ శ్రీకాంచినిలయే జయ కామకలాత్మికే!

ఆస్తికభక్త మహాజనులారా !

శ్రీమత్పరమహంసేత్యాది సకల బిరుదాంకితులైన శ్రీశృంగగిరి శారదాపీఠాధిపతులగు శ్రీసచ్చిదానంద శివాభినవ నృసింహ భారతీ స్వాములవారి అనుగ్రహమును బొంది, బెంగుళూరు శంకరపురములో శ్రీవారి మఠమందు ఆనందనామ సం॥మునను, తత్సమీపస్థ మల్లేశ్వర మున దుందుభినామ సం॥మునను, పై వివరించిన శ్రీదేవీయాగము జరిగి నది. మైసూరు మహారాజులు శ్రీకృష్ణరాజేంద్ర వడయర్ బహద్దూర్ జి. సి. ఎస్. ఐ. వారి మహోపకారమువలనను, దివాణ్జీగానుండిన సర్. ఎమ్. విశ్వేశ్వరయ్యరుగారు, వే॥ బ్ర॥ శ్రీకంఠశాస్త్రిలవారు, బెంగుళూరు హైకోర్టుజడ్జి శంకరనారాయణరావుగారు, హెడ్ మాస్టరు పి. ఆర్. సుబ్రహ్మణ్యశాస్త్రి బి. ఏ. గారు, జమీన్దారు గుండురావు గారు, మఱికొందరు, మహజనుల సహాయమువలన అప్పట్లో జరిగి యందరానందించిరి.

అదేరీతిగా, విశేషక్రమ విధులతో, శ్రీ కామకోటి స్థానమగు పెద్దకంచిలో గంగాబాయి సత్రములో, శ్రీమద్భావసంవత్సర ఆషాఢ బహుళ ఏకాదశి భానువారము రోహిణీనక్షత్రము అమృతయోగ యుక్తమైన (5-8-1934) ప్రశస్త శుభదినమున, కన్యాలగ్న మధ్యకాల మందు (8¾ ఘంటలనుండి 9¾ ఘంటలలోఁగా) శ్రీ యాగశాలను ప్రవేశించి యాగదీక్షనుపొంది, శుక్రవారము (10-8-1934) నుండి శ్రావణ పూర్ణిమా శుక్రవారము (24-8-34) వరలో పూజా

యాగము జరిపి, కడపటిదినము (24-8-34) కన్యాలగ్నమందు శ్రీ లలితాదేవికి పూర్ణాహుతినిచ్చి, బ్రాహ్మణ సువాసినీ పూజన దీనజన సమారాధనాదులు జరుపఁబడును. కావున, ఈమహాకార్యమునకు మీరు ఇష్ట బంధుమిత్ర కుటుంబ సమేతులై వచ్చి, చూచి, ఆనందించి, దేవీప్రసాద పాత్రులు కావలయునని ప్రార్థించెదను.

అధిక ద్రవ్యముతోను, జన సహాయముతోను చేయఁదగిన సద్ధర్మకార్య మగుటచే ఎల్లరును, తమ సహాయమును ద్రవ్యరూపము గానో పదార్థరూపముగానో చేసి, కార్యము జరిపించి భాగ్యభాగు లగుదురు గాక.

ఇట్లు,

ఆస్తిక మహాజన విధేయుఁడు,

గంగవరం. నంజుండ దీక్షితులు, యాగకర్త.

---

# కార్యక్రమవివరణము

5-8-34 భానువారము. 8¾ ఘంటలనుండి 10¾ ఘంటలోపల యాగ శాలాప్రవేశము, గణపతిపూజ, పుణ్యాహవాచనము, నాంది, మహాసంకల్పము.

6-8-34 సోమవారము : మృత్సంగ్రహణము, అంకురారోపణము, వాస్తుశాంతి.

7,8-8-34 మంగళ బుధవారములు : వేదికానిర్మాణము, కుండ నిర్మాణము.

9-8-34 గురువారము : మధ్యాహ్నము నిత్యాబలి, ఋత్విగ్వరణము, సాయంకాలము కలశస్థాపన, అగ్నిప్రతిష్ఠ.

10-8-34 శుక్రవారము : మొదలు } ఆవరణపూజ, హోమము,
24-8-34 శుక్రవారము : వరకు } జపము, బ్రాహ్మణ సువాసినీ
పూజలు భోజనాదులు. ప్రతిదినము బ్రాహ్మణ సువాసినీ
భోజనాదులు.

24-8-34 శుక్రవారము : ఉదయము కన్యాలగ్నమందు పూర్ణాహుతి,
రాత్రి ఆవరణపూజ.

25-8-34 స్థిరవారము : ఉదయం 8ఘంటలకు అవబృథ స్నానము, ఋత్విక్
సంభావనములు.

ఆదిశైవసోదరులారా!

యీదేవీయాగము యిరువదిరోజులు జరుగగలదు. వీలున్న వారందరును, తిరుపతి యాత్రిలు ముగింపవలసినవారున్నూ యీకాంచీ పురప్రయాణమున కనుకూలురగుట శ్రేయస్కరము. ఆషాడ బహుళ ఏకాదశి మొదలు శ్రావణపూర్ణిమవరకు యీమహోత్సవము జరుగగలదు. సర్వులు సహాయపడి పూర్తిగావించుటకు హెచ్చరించు చున్నాము. సభలు, ఉపన్యాసములు, మున్ముందు తెలుపగలము.

(సంపాదకుడు.)

---

## శ్రీ ఉమమహేశ్వరభక్తసమాజము.

స్వస్తిశ్రీ శ్రీముఖనామ సంవత్సర కార్తీకశుద్ధ త్రయోదశీ సోమవారంరోజున మాగ్రామ పాఠశాలోపాధ్యాయులగు, శ్రీమాన్ కొల్లిపర కోటయ్యగురుకులుగారును, మరీదు వెంకటరత్నంగారును, మరికొందరు యువకులునుజేరి, యీసమాజమును నెలకొల్పి ఉపన్యాసములతోడను, భజనలతోడను, జయజయధ్వానములతో యవిచ్ఛిన్నముగా జరుగునటుల స్థాపించియున్నారు. సంక్రాంతిమాసమునను

నగర సంకీర్తనములు మున్నగు విశేషవిధులు ఆచరింపబడెను. యీ మహత్తర సంకల్పముచే గ్రామములోని సర్వులు ఆయురారోగ్యైశ్వ రాదుల బడయగలుగుట నిస్సంశయమని పలువురు పెద్దలు దెలుపు చున్నారు. ఉపాధ్యాయులిట్లే ప్రతిగ్రామమందు గ్రామపునరుద్ధర ణకై పాటుబడినయెడల గురుశబ్దము సార్థకమగునని మాయాశయము. పరమేశ్వరుడే సమాజమును నిర్విఘ్నముగా యభివృద్ధి పరచునటుల ప్రార్థించుచున్నాము.

శృంగారపురం.  ఇట్లు విబుధజనవిధేయులు,
నాగేశ్వరం శివప్రసాదశర్మ,
వేలమూరి వెంకటేశ్వరశర్మ.

## చందాదారులారా!

మీ సహాయమున్నగాని పత్రిక నెరవేరదు. ప్రతివారును, తమతోబాటు ఒక్కొక్క క్రొత్తచందాదారుని చేర్పవలెను. మీకు వీలుగానుండుటకై చందా రు 1-8-0 లు చేయబడెను. వెనుకటి దిగుబాటు సొమ్ముగూడ యీ పద్ధతితోనే పంపించవలెను. అభిమానముగలవారు సంవత్సరాదిలోపుగా చందా చేర్పగోరుచున్నాము. చందాలు చేర్చని వారికి పత్రిక పంపజాలము. గమనించుడు.

| | |
|---|---|
| మహారాజపోషకులు | 400 |
| రాజపోషకులు | 300 |
| పోషకులు | 200 |

యిట్లు చెల్లించినవారి పేర్లు మాత్రమే ప్రకటింతము. తరువాత ఆగ్రహపడిన ప్రయోజనముండ నేరదు
(పత్రికాధిపతి)



# నాగొప్పసలహాలు.

(1) సభలకు ఎప్పుడు వెళ్ళబోకుము. ఒకవేళ వెళ్ళకతప్పనప్పుడు మీటింగుఆఖరుక్కు వెళ్ళి ఏమూలనో కూర్చుని ఏదో మరొకవిధమైన గొడవ తెచ్చిపెట్టి గల్లంతు చేస్తూవుండు. నీ యభిప్రాయ మేమని అడిగితే ఏబ్బే మీ యందరి యిష్టానుసారమే యనిఅంటూ సభముగించిన తరువాత మీటింగేమి బాగుండలేదని మాట్లాడుతూవుంటే కొంతకాలానికి నీవేనాయకుడవు గావొచ్చు.

(2) ఏ సహాయమైనా చేయాలశొస్తే ముందుగా సరేఅనవద్దు ఒకవేళ ఏమాత్రం అయినా చేయకతప్పనప్పుడు పెళపెళా సంఘాన్ని, సభలను వాలంటీర్లను తిట్టుచుండేయెడల నీనోటికి ఝడిసి, వచ్చిన దోవనె పోగలరు. ఎవరికైనా తెలిస్తే పరువునష్టముగనుక సంఘప్రచారకులు నన్ను అలక్ష్యంచేశారని మాయింట్లో తిండికూడా తినకుండా వెళ్ళినారనీ ఒకనెపంవెయ్యాలి. ముందుగా ఏసహాయముచేయవద్దు తిరిగి తిరిగి వాళ్లే మానుకోవచ్చు.

(3) ఒకవేళ నిన్నుగూడ ఒకసభ్యుడుగా చేర్చుకునే యెడల ఏపనీ సాగకుండా ప్రతివిషయం అడ్డుపెట్టుచుండాలి. సంఘంలోజరిగే పనిని ఎంతమాత్రం గౌరవించరాదు. పొరపాటుచేతనైనా సంతోషించ గూడదు. పైగా యీ కరువుకాలాల్లో దొంగవేషాలు వేసుకొని బయలుదేరి జీవించుతారనీ దుర్మార్గులనీ, టక్కర్లనీ, నీయిష్టానుసారంగా దూషిస్తూ వుంటే ఏ పదిమందైనా నీతో జేరగలరు.

సోదరులారా చిరకాలమునుంచి యిట్టి సలహాలు దొరకనందున చాలా తొట్రుపాటు సంభవించుచున్నది. అట్టివారి నుద్ధరించుటకై చిత్రగుప్తుని సహాయముతో వ్రయములేని సలహాలు సంపాదించి వెల్లడించుచున్నాను. అంగీకారముగలవారు నా సలహాత్రయమును చవిజూచి

యానందించేయడల నాశ్రమ సార్థపరచి సంశయనివర్తులై గొప్పప్రవీణులు కాగలరని మనవిచేయుచున్నాను.

ఇట్లు

మకాం భూలోకపురం. } కుటిలజన శ్రేయోభిలాషి లుబ్ధాగ్రేసర చక్రవర్తి.

సదరు వ్యాసములకు యెవరును ఆగ్రహించరాదని ప్రార్థించుచున్నాను. సం॥

---

# వార్తలు.

ఆంధ్రపత్రికయొక్క సంపాదకవర్గములో నొకరగు కీ॥ శే॥ చల్లా శేషగిరిరావుపంతులవారి యకాల మరణమునకు చింతించని ఆంధ్రుడే లేడని దెలియవచ్చుచున్నది.

యీ మాసమునందు గల్గిన భూకంపమువలన అనేక దేశములందు మేడలు వగైరాలు కూలి గొప్పనష్టము గల్గినట్లును, షుమారు పదివేల ప్రజలు ఘోరమరణములపాలైనట్లును, గంగానదిలోని నీరు అయిదునిమిషములు పాతాళమునకుబోయి యిసుకలో గొప్ప ధ్వని గల్గి, పిమ్మట నీరుపైకి లేచి చాలాప్రమాదము సంభవించినట్లు విని మన జార్జిచక్రవర్తిగారు గవర్నరుజనరలుగారు గాంధిమహాత్ముడు నెహ్రూ, మాళవ్యా, మున్నగు కాంగ్రెసు నాయకులు, దేశభక్తులు మున్నగువారు పరితపించి ఇళ్ళు, అన్నము గుడ్డలేనివారలకు అపరిమితమైన ధనసహాయము చేయుచున్నట్లు దెలియవచ్చుచున్నది. లండన్ దేశమునుండియు మనదేశమునుండియు షుమారు యిరువది లక్షల రూపాయీలు ధర్మము నొసంగినట్లు దెలియుటచే గొప్ప భూకంపమనియు ఇదివరకెన్నడిట్టి విపత్తుగలుగలేదనియు దెలియుచున్నది.

తాలూకాబోర్డు లన్నియు ఎత్తివేసి గ్రామపంచాయతీబోర్డుల నభివృద్ధిపరచి పరిపాలనగావింపవలెనని శ్రీబొబ్బిలిరాజాగారు గావించిన

లోకలుబోర్డు ఆక్టు సవరణను శాసనసభవారిచే ఆమోదింపబడెను. జిల్లాబోర్డువారు మరిమెచ్చోటనైనను బ్రాంచి జిల్లాబోర్డును ఏర్పాటు చేసి రద్దుపరచిన తాలూకాబోర్డు ప్రసిడెంట్లను బ్రాంచి బోర్డునందు సభ్యులుగా నియమింతురట. ముస్ముందు విచిత్రపరిపాలన జరుగగలదని యనేకులు సంతసించుచున్నారు.

భారతశాసనసభయందు చర్చించిన "అస్పృశ్యతా నివారణ చట్టము" ప్రజాభిప్రాయములకై మరల వాయిదాపడినట్లు దెలియు చున్నది.

మదరాసుశాసనసభయందు, దేవాదాయచట్టమును సవరించు టకై గౌరవనీయులగు పాములపాటి వెంకటకృష్ణయ్యచౌదరీగారు దెచ్చిన సవరణ సెలక్టు కమిటీయందు విచారణజరుగుచున్నది. ఈ తరుణముననైనను "అర్చకమహాజనసంఘము" కన్నుల దెరచి వ్యవహార ప్రతిబంధకముల నివారించుకొనుట శ్రేయస్కరమని పలువురు హెచ్చరించుచున్నారు.

సనాతనుల తర్జన భర్జనలు మామూలుగా జరుగుచున్నను, మహాత్ముని ప్రచారమత్యంతవైభవముతో ప్రశాంతముగా ద్రవిడ, కర్ణాటక, మళయాళ రాష్ట్రములందు పర్యటనము పూర్తియగుచున్న దని పలువురు సంతసించుచున్నారు.

మదరాసునందు వెలువడుచున్న హిందూపత్రికా సంపాదకు లును, సర్వసమర్థులును, రౌండుటేబిల్ సభ్యులునగు ఎ. రంగస్వామి అయ్యంగారు పరమపదమునొందిరని వినిన ప్రతివారును తల్లడిల్లు చున్నారని దెలియుచున్నది.

---

# హిందువులందరికిని బ్రాహ్మణనామకరణము

## భారత శాసనసభలో జాదవ్‌గారు నోటీసిచ్చిన బిల్లు

ఢిల్లీ, ఫిబ్ర 5:—

ప్రభుత్వమువారును కోర్టులును, వర్ణములను పాటింపరాదనియు, హిందువులనందరిని బ్రాహ్మణులని పిలువవలెననియు కోరుటకు బొంబాయి సభ్యుడగు జాదవ్ గారు భారతశాసనసభలో నొకబిల్లు ప్రతిపాదింప నోటీసిచ్చియున్నాడు.

బిల్లుయొక్క ఉద్దేశ్యములు, కారణములలో నీక్రింది విధముగా కలదు:—

మొదట హిందువులందరును సమానులుగానుండిరి. ఒకరు హెచ్చని ఒకరు తగ్గనిలేకుండెను. హంసలనివారు పిలువబడుచుండిరి. తరువాత వారు బ్రహ్మ,క్షత్రియ, వైద్య,శూద్రులుగా విభజింపబడిరి. కొంతకాలము తరువాత నిమ్నజాతులవారు కల్పింపబడి చాలక్రూరముగా చూడబడుచుండిరి. కొన్ని రాష్ట్రములలో వారు ఆది శూద్రులని, కొన్నిరాష్ట్రములలో వారు పంచములనియు పిలువబడుచుండిరి. పంచములను అస్పృశ్యులనుండి తొలగింపవలసినచో హిందూసంఘములో వారికి నిశ్చితమగు స్థాన మొసంగవలెనని అస్పృశ్యతా నిర్మూలనబిల్లు సందర్భమున లామెంబరుగారు చెప్పియుండిరి. వారిని శూద్రులనుగా చేయదగునని కొందరు తలచుచున్నారు. కాని శూద్రులు వారిని తమలో చేరనివ్వరు మొదటి వర్ణవిభాగ మిప్పుడు లేదు. వారి స్థానమును క్రొత్తకులములనారు. ఆక్రమించుకొనివారు. ధర్మశాస్త్రముల ప్రకారము ఒకరిని పైవర్ణములో వేయుటగాని, క్రిందివర్ణములో వేయుటగాని రాజుపని. ప్రస్తుతస్థితిగతులలో నది శాసనసభవారిపని. ప్రభుత్వమువారి రికార్డులలో వర్ణమును గుర్తింపకపోవుట వీలుగానుండును. ఈయుద్దేశముతో వేలకొలదిహిందువులు తమవర్ణములను తెలుపుకొనక తాము హిందువులమనిమాత్రము చెప్పుకొనిరి. ఒకని వర్ణమునుబట్టి

దత్తువిషయము, వారసత్వము విషయము హక్కులు మారుచున్నవి. వీనివలన సంఘర్షణలు, తగాదాలు కలుగుచున్నవి. కోర్టులును, ప్రభుత్వము వారును, వర్ణమును గమనింపకుండుటయే దీనికి ప్రతిక్రియ. బ్రాహ్మణులు తమకు వర్ణవిభేదములు లేవనియు, వర్ణమునకు తామతీతులమనియు చెప్పుకొనుచుందురు. గాన వారుబిల్లునుసమర్థింతురు. పూర్వకాలములో హిందువులందరును హంసలని పిలువబడుచుండిరి. ఈరోజులలో "బ్రాహ్మణులు" లనుపదము అందరికిని తెలియుచు గనుకదానిని అన్నివర్ణములవారికిని వర్తింపజేయుట తగును.

## ఈక్రిందివి బిల్లులోని ముఖ్యషరతులు.

పంచములు, హరిజనులు అనిపిలువబడు నిమ్నజాతులు ప్రస్తుత హిందూ ధర్మశాస్త్ర పరిపాలనమునందు అంగీకరింపబడి యుండలేదు గావునను, సామాన్య హిందూ ధర్మశాస్త్రములు వారికి వర్తింప జేయబడుచున్నవి గనుకను, వర్ణమువలనను, ఉపవర్ణములవలనను హిందువులకు సాంఘికముగను, రాజకీయముగను, మతవిషయముగను, పారిశ్రామిక విషయముననను చాలనష్టము కలుగుచున్నది గనుకను.

నిమ్నజాతులందరును శూద్రులనుటవలన వారిహోదాను యెక్కువజేయుట కష్టముగనుకను ఈక్రిందివిధముగా శాసనము చేయడమైనది.

## శాసనముయొక్క నామము

1. ఈబిల్లు 'హిందూస్ స్టేటస్ ఆక్టు' అని పిలువబడవచ్చును.

2. ఈశాసనము గవర్నరుజనరలు గజెట్టులో ప్రకటించిన తారీఖున అమలలోనికి వచ్చును. హిందూమతమవలంబించువారి కందరకును, బ్రిటిష్ ఇండియాలో నివసించువారి కందరకును శాసనము వర్తించును.

హిందూమతము నవలంబించు నందరును పంచములు, హరిజనులు అని పిలువబడు నిమ్నజాతులతో సహా ఇకముందు బ్రాహ్మణు

లని పిలువబడుచు, బ్రాహ్మణులకు వర్తించు శాసనములద్వారా పరిపాలింప బడవలెను. (అం. ప్రె.) ఆంధ్ర (10-2-34)

---

తొమ్మిదవ సంపుటం [శ్రీముఖ సంవత్సరం] బాపతు
శ్రీ ఆదిశైవ పత్రికయొక్క ఆదాయ వ్యయ పట్టిక.

| రు. | అ. | పై. | జమల వివరం. |
|---|---|---|---|
| ... | | ... | మహారాజపోషకులు. |
| ... | | ... | రాజపోషకులు. |
| 33 | 0 | 0 | పోషకులు |
| 15 | 12 | 0 | ధర్మములవలన [పత్రికాసన్మానములతో సహా] |
| 139 | 0 | 0 | చందాదారుల వలన |
| 187 | 12 | 0 | జమ మొత్తం. |

| ఖర్చు వివరము. | | రు. | అ. | పై. |
|---|---|---|---|---|
| పోస్టల్ ఖాతా | ... | 64 | 4 | 9 |
| సాదరు ఖాతా | ... | 39 | 7 | 0 |
| స్టేషనరీ ఖాతా | ... | 1 | 0 | 6 |
| ప్రయాణం ఖాతా | ... | 36 | 4 | 6 |
| ప్రెస్సువారి ఖాతా | ... | 161 | 10 | 9 |
| పత్రికల ఖాతా | ... | 25 | 14 | 0 |
| ధర్మ ఖాతా | ... | 6 | 6 | 0 |
| ఖర్చు మొత్తం | | 334 | 15 | 6 |
| జమ మొత్తం | | 187 | 12 | 0 |
| జమపోను సంపాదకుని పెట్టుబడి | | 147 | 3 | 6 |
| లోగడ సంవత్సరము వరకు పెట్టుబడి | | 571 | 3 | 9 |
| పత్రిక ఆరంభించినది మొదలు సంపాదకునికి గల్గిన నష్టం మొత్తం | | 718 | 7 | 3 |

[ఏడువందల పదునెనిమిది రూపాయిల ఏడు అణాల మూడుపైసలు]

☞ సోదరులారా! మన సంఘాభివృద్ధికై ఏర్పాటుచేసిన సంఘ పత్రికవలన గల్గిన లాభనష్టముల స్వరూపమే ఆదాయవ్యయ పట్టికగా పరిణమించినది. అనేక విధముల దూషణ తిరస్కారములు గావించుచున్నట్లు తెలిసి ఎంతటి పరితాపము జెందవలసివచ్చుచున్నదో వ్రాయశక్యముగానేరదు. సహాయపడని మహానుభావులు మిన్నకున్నను చాలా బాగుండగలదని కొందరు దెలుపుచున్నారు. మరికొందరు అమానుషకృత్యముల సంకల్పించి పత్రికను సంపాదకులను స్వేచ్ఛగా నిందించుచున్నారు. గనుక దశమసంపుటమారంభించే విషయములో మార్గము గోచరమగుటలేదని విన్నవించుచున్నాము. తొమ్మిది సంవత్సరములనుండి సహాయపడనివారు సైతము పత్రికను తిరస్కరించునటుల వర్తించుట సాహసమనక తప్పదు. సర్వాంతర్యామియగు పరమేశ్వరుడే సహాయపడగలడని దృఢవిశ్వాసముతో పత్రిక జరుగుచున్నదని తెలుసుకొనగోరుచున్నాము.

(మానేజరు)

## ఆఖరుమనవి.

పత్రిక కంటె మించిన ప్రచారము మరియొకటిలేదు. మాసపత్రికనే నిర్వహించనేరని సంఘము లెక్కలో జేరదు. పత్రిక పడిపోయిన పిమ్మట ఏమిచేయవలెనో యోచించుకొనుడు. పత్రికకు సహాయపడుడు. మరియొక మార్గము బోధింపుడు. సంఘసేవగావింపుడు. ఆగ్రహింపకుడు. దశమ సంపుటమునకు ప్రోత్సాహపరచుడు.

( సంపాదకుడు )

Regd. No. M. 2073. సం॥ చందా రు 1-8-0 లు.

# శ్రీ ఆదిశైవపత్రిక.

శ్రీ శ్రీకంఠ మఠాధిపతుల యాజ్ఞానుసారముగా, శైవసంఘాభ్యుదయమునకై శ్రీగురుకులాశ్రమమునుండి ప్రతిమాసము ప్రకటింపబడును.

సర్వదేవాత్మకో రుద్రస్సర్వే దేవాశ్శివాత్మకాః ।
రుద్రస్య దక్షిణే పార్శ్వే రవిర్బ్రహ్మా త్రయోగ్నయః ।
వామపార్శ్వే ఉమాదేవీ విష్ణుస్సోమోపి తేత్రయః ॥
(రుద్రహృదయోపనిషత్)

సంపాదకుడు:— చిలుమూరు పురుషోత్తమ గురుక్కళ్.

సంపుట ౧౦ } చిలుమూరు. కొల్లూరుపోస్టు { సంచిక ౧
భావనామ సంవత్సర చైత్రమాసము.

(విలేఖకుల వ్యాసములకు సంపాదకులు ఉత్తరవాదులు కానేరరు.)



## —♦ విషయసూచిక. ♦—



భారతీ ప్రెస్, తెనాలి.

# ఉద్ధారకులు.

౧ శ్రీ॥ శ్రీ॥ చిలుమూరు తీర్థేశ్వరులవారి జ్ఞాపకార్థం కుమాళ్లు ఉమామహేశ్వరం వగైరాలు, చిలుమూరు.

౨ కర్ణాటక రాష్ట్రీయ ఆదిశైవ మహాసంఘమువారు, బెంగుళూరు.

౩ శ్రీమాన్ నడింపల్లి నాగేశ్వరశివాచార్యులుగారు, ఇంటూరు.

౪ ... గూడూరు రాఘవరావుగారు, పోతునూరు.

౫ ... గూడూరు శీతయ్యగారు, శనివారపుపేట.

౬ ... అయలూరు వెంకటసుబ్బయ్యగారు, అత్తమూరు.

౭ ... పావులూరు రామచంద్రయ్యగారు, మునికోటిపురం.

౮ ... పావులూరు హనుమంతయ్యగారు, మునికోటిపురం.

౯ ... వెనుమూడి సత్యనారాయణగారు, తూర్పుకూచిపూడి.

౧౦ ... స్వర్గస్థ వెంకట శివావధానులుగారు, బూతుమల్లి.

౧౧ ... పావులూరు నాగేశ్వరశర్మగారు, అనంతవరం.

౧౨ ... వెనుమూడి హనుమంతరావుగారు, తెనాలి.

౧౩ ... మామిళ్ళపల్లి శంకరమ్మగారి జ్ఞాపకార్థం భర్త శివరామ దీక్షితులుగారు, చుండూరు.

౧౪ ... మామల్లపల్లి సాంబయ్యగారు, చుండూరు.

౧౫ ... పొన్నూరు సుబ్రహ్మణ్య పాకయాజిగారు, దండమూడి.

౧౬ ... వేమూరు శివయ్యగారు తేలప్రోలు.

౧౭ ... కుందుర్తి ఆనందరావు B A. దుగ్గిరాల.

౧౮ ... కుందుర్తి పార్వతమ్మగారి జ్ఞాపకార్థం సత్తెనపల్లి వెంకట రామయ్యగారు ఓవర్‌సీయరు, దుగ్గిరాల.

౧౯ ... చావలి గంగయ్యగారి జ్ఞాపకార్థం కుమాళ్లు సుబ్బయ్య వగైరాలు, చముదుబాడు

౨౦ ... సంగాపు పానకాలయ్యగారు, నవులూరు.

౨౧ ... సంగాపు కోటేశ్వరగురుకులుగారు, మంగళగిరి.

౨౨ ... చిలుమూరు వెంకటసుబ్బయ్యగారు, చిలుమూరు.

౨౩ ... చిలుమూరు కుటుంబయ్యగారు, చిలుమూరు.

౨౪ ... శేకూరు రాఘవశర్మగారు, గుడివాడ.

౨౫ ... చావలి సుబ్బయ్య పంకయ్యగార్లు, పినపాడు.

౨౬ ... చావలి లక్ష్మికాంతయ్యగారు, బాపట్ల.

౨౭ ... కొల్లిపర రామయ్య పిచ్చయ్యగారు, వెనుమూలి

౨౮ ... స్వర్గస్థ చినమల్లయ్యగారి జ్ఞాపకార్థం ధర్మపత్ని బుచ్చమ్మగారు, చీరాల.

౨౯ ... వెనుమూడి శీతమ్మగారు, జొన్నలగడ్డ.

౩౦ ... పొన్నూరు కనకమ్మగారు, ఆకిమండ.

# శ్రీ ఆదిశైవపత్రిక.



సఏకోరుద్రస్స ఈశానస్సభగవాన్ సమహేశ్వరస్స మహాదేవః ॥
"అధర్వశిరసి."


సంపుట ౧౦ } చి లు మూ రు. కొల్లూరుపోస్టు. భావనామ సంవత్సర చైత్రమాసము. { సంచిక ౧


## ప్రార్థన

(శ్రీమాన్ చంద్రమౌళి సూర్యనారాయణశాస్త్రిగారు)

గీతగర్భచంపకమాల॥

పురహర, సాంబ, యో "విమలమోక్షసుధాయక, ఈశ శర్వ" సం
భరిత గుణాకరా "దురితభంజనపాలిత తోయజాక్ష" యో
సరస రసాశ్రయా "సకలశత్రువినాశన సార్వభౌమ" శం
కర కరుణాకరా "మములగావుము ధూర్జటి మారమార" కా.

(శ్రీయుతులు అవధానుల రామమూర్తిగారు)

గీ॥ హర మహాదేవ ♦ శంకర యఖిలలోక
నాయకా పార్వతీనాథ ♦ నందివాహ
శివ అనంత దయామయ ♦ భవవిదూర
దీనులము మమ్ముబ్రోవుమా ♦ దేవదేవ.

కం॥ హర త్రిపురాసురమదహర
పరమాత్మ యుమాకళత్ర ♦ ప్రమథగణనిరం
తరసేవిత గంగాధర
కరుణన్ మముగాంచి ప్రోవగదె ♦ సాంబశివా.

కం॥ శంకర పాపవిమోచన
పంకజరిపుధర మహేశ ♦ భక్తావన మా
వంకన్ బ్రసరింపగదే
శంకింపక నీకృపార ♦ సము సాంబశివా॥

(శ్రీయుతులు చింతమనేని జగ్గయ్యచౌదరీగారు)

చం॥ విమలపదార్థసంపదల ♦ విన్నదనంబెడఁబాపి జీవులన్
భ్రమల మునుంగనీక ♦ కల భాగ్యములన్నిటఁ బెంపొనర్చి వై
రముల నడంచి ధర్మముల ♦ బ్రాజ్ఞతఁగూర్చెడు నీదుభక్త స
ఖ్యము ఘటియించినన్ బెనుపఁగా ♦ నినుఁగొల్చెద మల్లికార్జునా!

---

## నేటివిద్యార్థులు.

సీ॥ పరిణయ మాడంగ భార్యలో సగమాట
మీసంబు లిరుప్రక్క కోసివేత
సతులెల్ల మనకొట సతులకు మనమాట
మర్ధింగుచేతులు పొర్టుకట్టు
పాశ్చాత్యపాఠంబు ఫలమిది యనితెల్ప
కత్తిరించిన పొట్టి క్రాపుజుట్టు
నిత్యాగ్నిహోత్రంబు నియతిని గాపాడ
చేతిలో సిగరెట్టు సిజర్ మార్కు

గీ॥ కాలబూటును మెడలోన కాలరులను
పొట్టికోటును పలుచని పొడుగులాగు
వెనసి సోయగంబులొకింత హెచ్చరింప
నలరుచున్నారు నేటి విద్యార్థులనట॥ ౧

సీ॥ కాలచక్రము ద్రిప్ప ఘనులు వీరనిదెల్ప
పట్టి కట్టిన రిస్టువాచి సాక్షి
సామాన్యులే వీరు సర్వమెరిగిరన
చూపులిచ్చెడు కళ్ళజోడు సాక్షి
మతభేదముల రూపుమాప జాలుదురన
కడిగి విడిచిన ముఖంబుసాక్షి
భూచక్రమేలెడి బుద్ధిశాలురనంగ
కేలగలట్టి సైకలొకసాక్షి

గీ॥ అన్నిటను జూడ పూర్వులకన్న మిన్న
లనగ జెల్లుగాక మన విద్యార్థులిపుడు
శేముషీసింధులై పోకు సేవజేయు
కంకణంబులు దాల్చిరి జంకులేక॥

---

# శివద్రోహములు.

(శ్రీయుతులు యఱ. వెంకటేశ్వరశర్మగారు)

దేవద్రవ్యమును హరించుటఁ గాని, హరింపఁజేయుటఁ గాని, హరించుచుండఁ జూచి యూరుకొనుటఁ గాని తగిన బాధ్యత వహింపక మిన్నకుండువాడు భ్రష్టుడై శివద్రోహి యగుచున్నాడు భగవత్కార్యములందు శక్తిగల్గియు అశక్తునివలె నటించువాఁడును, అలసభావమును గన్పరచువాఁడును, తద్ధనాంబర పశు, ధాన్య, వాపీకూప తటాకాదులు వ్యర్థమై పోవుతరిఁ జూచుచు నుపేక్షఁజేయువాఁడు, పాతకుడై శివాప

రాధి యగును. అన్యు లపహరించినను, అపహరించినట్లు విన్నను, అట్టి వారి సహవాస మాచరించినను వారిఁబోలె తానును శివద్రోహి కాగలఁడు. నిగమాగమంబుల యందును, భస్మరుద్రాక్షుల యందును, శివభక్తులయందును నిరసనభావము గల్గినను, అట్టివారి పల్కు లాలకించినను, అవాచ్యపుప్రసంగములు విని మందలింపకున్నను, అట్టివారి చేరువనున్నను, జూచినను, స్పృశించినను శివద్రోహి యనంబడును. ఆలయములందు, ఉద్యానవనములందు, తటాకంబులందు విణ్మూత్ర ములఁ గావించువాఁడు మహాపాతకోప పాతకంబులబడి భరింపరాని నరక బాధలజెంది పిమ్మట నీచాతి నీచజన్మలదిరుగాడి పలుశ్రమలు నొంద గలఁడు.

దేవాలయములందెవరు నిష్ఠీవనము, మూత్రపురీషములు, వమనము, తాంబూలభక్షణము, హాస్యము, రోదనము, అనృతవాక్కులు, శయనము, అపానవాయువు, ఆత్మస్తుతి, కలహము మున్నగునవి జేయుచున్నారో అట్టివారు మహారణ్యములందు బ్రహ్మరాక్షసులుగా జన్మించగలరు. ఆలయవాహనాదులను ఉపయోగించుకొనువారు కుంటివారై బుట్టుదురు. చెప్పులతో ఆలయము ప్రవేశించువారు కాళ్ళులేనివారుగా జన్మించుదురు. జాతాశౌచ మృతాశౌచముగల వారు ఆలయములకు జేరరాదు. శరీరమునిండా వస్త్రము ధరించుకొని దేవతాదర్శనముఁజేయువారు కుష్ఠురోగులుగా జన్మించగలరు. తలగుడ్డ చుట్టుకొనిగాని, కర్రనుధరించిగాని, చొక్కాతొడుగుకొనిగాని, గొడుగువేసుకొనిగాని, ఆలయములకు రాగూడదు. దేవధర్మముల నాశనమొనరించువారు కుంభీపాకనరకమునబడి అనేకవేలసంవత్సరములు దుఃఖించి పిమ్మట నీచజన్మ వెత్తగలరని ఆగమశాస్త్రములు బల్కుచున్నవి. (సశేషము.)

---

# దైవ పరీక్ష

(శ్రీయుతులు అవధానుల రామమూర్తిగారు.)

పూర్వకాలంలో ఒక వూళ్లో ఒక బ్రాహ్మణుడున్నాడు. అతని పేరు శంకరశాస్త్రి. అతడు శివభక్తుడు. నిరుపేద. బహుకుటుంబీకుడు అయినప్పటికి ఈశ్వరభక్తినేనమ్మి కాలక్షేపం చేస్తున్నాడు. యీ కాలంలోవలె ధనమంతయు దుర్వినియోగంజేసి దరిద్రబాధతో నరక మనుభవించేవారి మాదిరిగాదా శంకరశాస్త్రి. పుట్టుకతోనే దరిద్రుడు. కుచేలుని కథ తెలిసిన వారికి శంకరశాస్త్రి విషయము క్రొత్తగానుం డదు. సంతానం ఎంతఎక్కువో కలిమి అంతతక్కువ. అట్టిబీద కుటుంబాన్ని ఎలాపోషిస్తున్నాడో ఆశంకరునికే యెరుక. ప్రతిరోజు ఉదయం నాలుగుగంటలకేలేచి శివాలయమువద్దగల కోనేటిలో స్నానంచేసి పరమేశ్వరుని దర్శించి అనేకవిధములుగా స్తోత్రముజేసి గ్రామంలో ముష్టికిబయలుదేరి దొరికినదానితో కుటుంబపోషణజేసు కొనుచుండెను.

ఒకనాడు మామూలుగా శంకరశాస్త్రి ఈశ్వరుని దర్శించి వెళ్లుచుండగా "ఆ ఆలయమునందొక శబ్దము వినవచ్చినది. ఓ యీ నందికేశ్వరా యీశంకరశాస్త్రి చాలాకాలమునుంచి నన్నుప్రార్థించు చున్నాడు. మిక్కిలి దరిద్రదశలోనున్నాడు గావున అతనికి ఒక లక్షరూపాయలు యిచ్చివేయుము. అని ఈశ్వరుడు బలుకుచుండెను. యీవిషయము పాపము మన శంకరశాస్త్రి వినుపించుకొనకయే తనపనిమీద త్వరగావెళ్ళిపోయెను. ప్రక్కనుండి విన్నటువంటి ధనం జయశర్మయను ఆగ్రామవాసుడగు నొక ధనికుడు త్వరగా మన శంకరశాస్త్రిని బిలిపించి యివ్వాళ నీకు దొరికే భిక్షాటనపూర్తిగా నాకు కంట్రాక్టు యిచ్చినయెడల నీకు వేయిరూప్యములు యివ్వగల నని అడుగగా పిచ్చిశాస్త్రి అతిసంతోషముతో సరేయని వేయిరూప్య

ములు గైకొని యింటికి వెళ్ళి భార్యతో వాక్రుచ్చెను. లక్షరూప్య ములు లాభము వచ్చుచుండగా ఒక వేయిరూప్యములు ఖర్చుపెట్టుట లెక్కలోని దాయని మన శర్మగారు మతిపోయిన వాగుడుతోమించిన యానందముతో మధ్యాహ్నమునకు గ్రామమంతయు వెల్లడిచేసి శాస్త్రిగారి యా యవారముకొరకు నిరీక్షించుచుండెను.

పరమేశ్వరుని యనుగ్రహ పాత్రుడగు మన శంకరశాస్త్రి గారి కీకపటము దెలియక తనకు దొరికిన నాలుగుశేర్ల బియ్యమున్నూ కూరగాయలు తెచ్చి మన శర్మగారికి యిచ్చివేసెను. పిమ్మట ఉన్మా దుని చందమున శర్మగారి హృదయము మార్పుజెందుటవలన అధికా రులు సంకెళ్ళువేసి ఆలయము ముందర పడవైచిరి. గొప్ప కుటుం బమువారగుటచే బంధుమిత్రాదులతోసహా శర్మగారి స్థితి విచార సాగ రమున మునింగి దుఃఖించుచున్న తరుణమున ఆలయమునుండి మాటయొక శబ్దము వినవచ్చెను.

నాభక్తునికి యీపోయిన లక్షరూప్యములు అనుగ్రహించితిని. మిగతా 99 వేలరూపాయలు శంకర ప్రీతిగా శంకరశాస్త్రికి జెందజేసిన యెడల యీవిచిత్ర సంఘటనము ఉపశాంతి గలుగ గలదని వినుటతోనే బంగారు పల్లకీయందు శంకరశాస్త్రిని గూర్చుండబెట్టి లక్షరూప్యములు పూర్తిగా యొసంగి బ్రహ్మరథముతో ఉత్సవము గావించి ఉభయకుటుంబములు మహావైభవము ననుభవించి పిమ్మట సాయుజ్యపదవి నలంకరించినారట.

భక్తులను పరమేశ్వరుడే రక్షింపగలడు. ఆయన స్వయముగా రూపాయలను సృష్టించనేరడు. యిట్లే ఒకరిసహాయమున గాపాడు ననుట చరిత్ర ప్రసిద్ధమే. దైవభక్తికి మించిన సాధన మరియొకటిలేదు.

(సరస్వతినుండి)..........

---

# ఆగమములు-ఆలయములు

ఆలయమనగా మానవులు లయించు స్థలము. లయించుట యన ఏకాగ్రచిత్తముతో ధ్యానించుట. అట్టి నిష్ఠయందు మనస్సును లయింపజేసి పరమేశ్వరుని ధ్యానించుటయే తపస్సు. భగవంతుని ధ్యానించుట కేర్పడిన పవిత్రస్థలమే దేవాలయము అని పెద్దలు నిశ్చయించిరి. ఆ ఆలయములందు జరుగు కృత్యములన్నియు దైవసంబంధములై నానావిధోపచారములతో స్తోత్ర నృత్య గీతాదులతో ఆత్మవికాసమునకు సాధనములై యుండును. నిరంతర వ్రతనిష్ఠా గరిష్ఠులకు మాత్రమే భగవత్సాన్నిధ్యము గోచరమగుచుండును. అట్టివారు ఆత్మప్రేరితమును ఆకర్షించుచుండగలరు. సామాన్యులకు సమస్తపాతకహారమై జ్ఞానసాధనమై జన్మరాహిత్యమునకు మూలకందమై యలరారు నీ సగుణోపాసనా మందిరములు సృష్ట్యాదినుండి దేవతలచేతను రాక్షసులచేతను మహర్షులచేతను మానవులచేతను నెలకొల్పబడి నేటికిని సర్వతోముఖముగా ప్రకాశించుచున్నవి. కొన్ని దివ్యస్థలములందు స్వయంభువమూర్తులు గానబడుచున్నవి. ఆసేతుహిమాచల పర్యంతము శివాలయములు విష్ణ్వాలయములు లెక్కకు మిక్కిలిగా నెలకొల్పబడినవి. షట్కాల పంచకాల త్రికాలములయందు దేశకాలానుగుణ్యముగా పూజాకృత్యములు జరుగుచున్నవి. యేయే దేశములం దేయే విధముగా భగవత్కైంకర్యములు గావింపబడుచున్నవో ఆయాఫలితములు ప్రజలు అనుభవింపక తప్పవని అనుభవనీయులైన పెద్దలు వచించుచున్నారు.

అట్టి ఆలయనిర్మాణవిధులను, పూజాపద్ధతులను, ప్రాయశ్చిత్తాది నిర్ణయములను, ఉత్సవ ప్రతిష్ఠాక్రియాకలాపములను దెలుపునట్టి మహాశాస్త్రములే ఆగమము లనంబడుచున్నవి. ఆగమశబ్దమును విచారించినచో శివుడు పార్వతికిని విష్ణువునకు బోధించిన వాక్కులని దెలియనగును. ఈ ఆగమములకు పరశ్రుతులను నామాంతరము గలదు.

నిగమాగమముల కభేదమని భాష్యకర్తలు వ్యాఖ్యాన మొనరించిరి. ఈశ్వరుని పంచముఖములలో ఊర్ధ్వమై ప్రధానముఖమునగు ఈశాన వదనమునుండి మంత్రస్వరూపమై జీవుల మలమాయాకర్మపాశ విముక్త మగు నటువంటి ఆగమశాస్త్రజాల ముద్భవించి పిమ్మట నాలుగు ముఖములనుండి నాలుగు వేదము లుత్పన్నమై నటుల యనేక ప్రమాణములు గన్పట్టు చున్నవి. అందువలన వేదములకంటె ఆగమములు శ్రేష్ఠమైనవని యనేక స్మృతులు, పురాణములు ఘోషించు చున్నవి. ఈ ఆగమశాస్త్రము లనంతములై విరాజిల్లు చున్నవి. అందు శైవాగమములు యిరువది యెనిమిది గలవు. ఉపాగమములు రెండువందలకు పైగా గలవు. యిట్టి మహాశాసనముల తిరస్కరించి పూజించుట మహాపాతకమనియు, దేశోపద్రవకరమనియు, తత్ఫలితము సకల క్షామడాంబర మహామారీ ప్రవేశాగ్ని జారచోరాదులకు హేతువు కాగలదని దెలియుచున్నది. శాస్త్రాది క్రమణము మహాదోషమని దెలుసుకొనుట వలననే నేటివరకును మన భారతదేశమున ఆలయము లందు ఆగమ విధులతో భగవత్కైంకర్యము జరుగుచున్నదని స్పష్టముగా గ్రహించవలెను. కొన్నితావులలో ఆగమశాస్త్ర గౌరవముల బోగొట్టి నూతనాచారములతో నూతనశాస్త్రములతో ఆలయవిధులు నెరవేర్చు చున్నటుల దెలియుచున్నది. అట్టి ఆలయముల దర్శించుట మహాపాపమనియు, దైవాపరాధహేతువనియు దెలుసుకోవలెను. ఆగమతిరస్కరణ శివనిందకు కారణమగుటచే ఈశ్వరుని యాగ్రహమునకు గురియగుట అనాలోచితముగదా. ఆగమము, ల ప్రమాణ మను వారిని ఆలయములకు రానివ్వక బహిష్కరించవలెను. సగుణోపాసనా మార్గముల నిందించువారితో సంభాషించుట మహాపాతకము ద్వేషబుద్ధి గలవారిని, దుర్మార్గులను ఆలయములోనికి రానివ్వకూడదు. గర్భాలయములలో శైవ, వైఖానస, పాంచరాత్రులు గాక అన్యుల ప్రవేశింపరాదు. నిత్యపూజమొదలు కర్షణాది ప్రతిష్ఠాంతము. యీ అర్చకత్రయమే గావింపవలె గాని అన్యులాచరించుట రాజా శాస్త్రము

లకు వినాశకారణమని ఆగమశాస్త్రములు బల్కుచున్నవి. అహింసా మార్గవర్తనులకును, భూతదయాపరులకును ఆలయద్వారములు సదా తెరువబడియే యుండగలవు. హింసాది కృత్యము లొనరించువారు సదా పాపులగుటవలన అట్టివారిని ఆలయమునుండి తొలగింపవలెను. స్వార్థపరులను కపటవర్తనులను దేవదూషణ శాస్త్రనిగసన సాధునిందా పరాయణులను ఆలయములదరికి జేరనివ్వరాదు. అని ఆగమశాస్త్రములు వేనోళ్ల చాటుచున్న ప్రమాణముల తిరస్కరించి లోకవంచన జేయబూనుట రాక్షసకృత్యము లనక తప్పదు.

(సశేషము.)

(శ్రీగురుకులాశ్రమము.)

---

# మహాప్రసాదము.

(౧) శ్రీమన్నిగమాగమేత్యాది శ్రీ శ్రీకంఠమఠాధీశ్వరులును, జగద్గురు శ్రీ శ్రీకంఠశివాచార్యేత్యాద్యవర నామధారులగు మహర్షి శ్రీ బోధానందులవారు పత్రికా పరిస్థితులు గమనించి దశమసంపుట మారంభించుటకై ప్రబోధించి ఆశీర్వచన పురస్సరముగా అయిదు రూపాయలు దయచేయించినందున సహస్రనమస్కార పురస్సరముగా యందుకొని శ్రీవారి యాజ్ఞలను మాళిందాల్చి దశమసంపుట మారంభించుచున్నాము. సంకల్పసిద్ధులగు శ్రీ మహర్షులవారి యాశీః ప్రభావమే. పత్రిక కంతరాయము గలుగనీయక రక్షించగలదని నిండు విశ్వాసముతో వర్తించుచున్నాము.

(౨) నెల్లూరుజిల్లా బుచ్చిరెడ్డిపాలెం మినగల్లు గ్రామవాస్తవ్యులగు శ్రీమాన్ గుడ్లూరు రామలింగయ్య, మన్నూరు వెంకయ్యగార్ల చందాధనమును గూడ యందుకొన్నాము. (సంపాదకుడు)

---

# ఆదిశైవ మతగురుక్రమః

శ్వేతస్సు తారో మదనస్సుహోత్రః కంకోధలా గాక్షిజిగీష
యోగీ। మానిర్ద్ధీవోరుషభోమురుగ్రో, హ్యత్రిస్సుపాల్గౌతమీవేద
శిర్షాః, । గోకర్ణయోగీచగుహాది వాసీ శిఖండీయోగీచ జటాకలాపః॥
తథాట్టహాసోముని దారుకశ్చలాంగ్లీ మహాకాళత్రిశూలిదండినః॥ ముండీ
సహిష్ణుస్త్వధసోమ శర్మాల లక్ష్మీశ్వర స్తేహి యుగక్రమోద్భవాః।
తేరుద్రలోకాదవతీర్యరుద్రామానుష్యమాశ్రిత్య జగద్ధితాయ।
చరంతి నానావిధ చారుచేష్టాస్తే భ్యోనమస్త్ర్యంబక పూజకేభ్యః॥
శ్రీదూర్వాసాః పైంగళాచార్య ఉగ్రజ్యోతిస్సద్యోజ్యోతిరీశాగమజ్ఞః।
శ్రీకంఠ శ్రీవిష్ణుకంఠస్సు బోధోవిద్యాకంఠో రామ కంఠో మనీషీ।
జ్ఞాతాశేషప్రౌఢగూఢాగమార్థాన్ ప్రీతాశేషక్షోణికాన్ దృగ్విలాసైః।
జాతానందద్యోత మానానుభావా నేతాన్వందే దేశికేంద్రాన్ కులీనాన్।

తా॥ యీ శ్వేతాచార్యాదిల కులీశాచార్యంతము యిరువది యెనమండ్రు యోగాచార్యులు. ఒక్కొక మహాయుగమునకు అనగా ప్రతి కృతయుగమందును ఒక్కొక యోగాచార్యులై ఈశ్వరుం డవతరించుచుండెను. ఇదియే శివునికి యోగావతారము. కృతయుగమందు యోగాచార్యులును, ఇతరయుగములయందు శిష్యులును గురువులుగా నుండిరి. యీ యిరువదియెనమండ్రు గురువులకు ఒక్కొక్కరికి నలుగురు శిష్యులచొప్పున నూటపన్నెండుగురు శిష్యులుండిరి. ఈ యోగాచార్యులు కైలాసమునుండి, రుద్రుడై భూలోకమందు జగద్ధితవుకొరకవతరించిన శివాచార్యులు శివారాధన చేయునట్టి యాదిశైవులు.

దూర్వాసాదులు, యీ కలియుగమునందలి పీఠాధిపతులు. వీరిలో శ్రీకంఠశివాచార్యులు భాష్యకర్తలు, తదితరులును గ్రంథములు రచించి అనుభవజ్ఞులును జగద్గురువులునై. ఆమర్ద, గోళకీ, పుష్పగిరి, రణభద్ర, మఠములను పాలించిరి. గాన వీరలు నిత్యము స్మరణీయులు.

బోధానిందమహర్షి—(శ్రీకంఠ మఠాధిపతులు)

---

# సంపాదకీయములు

## స్వవిషయము

భగవదనుగ్రహముతో దశమ సంపుట మారంభింపబడెను. చందా సగము తగ్గించినను ఉత్సాహము జూపుటలేదని సాంఘికులను ప్రార్థించుచున్నాము. వెంటనే ప్రతివారును సహాయపడి పత్రికను నిర్విఘ్నముగా నడపగలరని విశ్వాసముతో పనిజేయుచున్నాము.

## శ్రీ శ్రీకంఠశివాచార్యులు.

శ్రీవారు భీమవరం తాలూకా ప్రచారము పూర్తిగావించి మరల గుంటూరుజిల్లాకు విజయంచేసి శృంగారపురం, నూతక్కి, వల్లభాపురం, మునికోటిపురం, ఈమని, చుండూరు, మున్నగు గ్రామాదుల యందు పర్యటన మొనరించి బెంగుళూరు మదరాసులకు విజయం చేసినారని దెలుపుటచు ఆనంద మొందు చున్నారము.

## గీతాభాష్య ప్రకటన.

శ్రీ శ్రీకంఠ శివాచార్యకృత బ్రహ్మమీమాంసా భాష్యానంతరము గీతాభాష్యము ముద్రించవలెనని శ్రీవారు సంకల్పించియున్నారు. గావున ప్రతి ఆదిశైవ కుటుంబీకుడును, సహాయపడి త్వరలో పూర్తి జేయింప గలందులకు హెచ్చరింప బడుచున్నారు. గ్రంథముద్రణ విషయములో సహాయ మొసరించిన వారిపేర్లు ఆరంభమునుండి ప్రకటించవలెనని కొందరు సలహాల నొసంగుచున్నారు. రాబోవు సంచికయందైనను ప్రకటన చేయగలము.

## దేవీయజ్ఞము.

కాంచీపురమునందు శ్రీమార్గ గంగవరం నంజుండదీక్షితులు వారిచే ఆషాఢ బహుళము మొదలు శ్రావణ పూర్ణిమవరకు గావింపబడు దేవీయజ్ఞమునకు చందాలు (బియ్యం) వేసినవారు ప్రచారకుల ద్వారా వప్పగింత పెట్టుటకును ఆహ్వానముల ననుసరించి కాంచీపురము

నకు దయచేయుటకును ముందుగా జ్ఞాపక మొనరించు చున్నాము. కార్యక్రమము గత పత్రికలో వెల్లడించితిమి. మున్ముందు విశేషములు తెలుపగలము.

సరస్వతి పత్రిక.

విశాఖపట్ణంనుండి శ్రీయుతులు వి. సత్యనారాయణగారి సంపాదకత్వమున వెలువడుచున్న పైపేరుగల నారపత్రికను వందనములతో స్వీకరించి యందలి సద్విషయములు పఠించితిమి. ముద్దులొలుకు చక్కని వ్యాసములతో విరాజిల్లుచున్నది. ప్రతివారును పఠించగలందులకు హెచ్చరించుచున్నాము. చందా సం॥ రెండురూపాయిలు మాత్రమే.

అభినందనము.

దశమ సంపుటమునకు సహాయ మొనరించినవారిని గత సంవత్సరం చందాలు చెల్లించినవారిని మా హృదయ పూర్వకముగ నభినందించుచున్నాము. మిగతా మహాశయులందరు సహాయముగావించుటగాని లేక తమ యుద్దేశ్యములు దెలుపుటగాని జేసినచో మహోపకారమని విన్నవించుచున్నాము. గత సంచికయందు గలపట్టీని గమనించి పత్రిక లోటుపాటులను సవరించుట శ్రేయస్కరము. చందాదార్ల సంఖ్య పెరిగినకొలది చందా తగ్గించవచ్చును.

## విన్నపము.

పత్రికయందు నిరుత్సాహము గలవారు గాని, ద్రవ్య సహాయము జేయుటకు శక్తి లేనివారు గాని, పత్రికను జూచిన అగౌరము గల్గునని దలంచెడివారు గాని, సంపాదకునియందు విశ్వాసము లేనివారుగాని పత్రిక అక్కరలేదని వ్రాయుట వలన గలుగు లాభము ముఖస్తుతులకు మించగలదని విన్నవించుచున్నాము.

# గమనింపు.

సోదరులారా !

ఆర్థికపరిస్తితినిబట్టి యీ క్రిందినియమములతో పత్రికను నడుపబూనితిమి.

పదిమందిచందాదార్లను జేర్చువారికి ఒక్కసంవత్సరం పత్రిక ఉచితముగా బంపగలము.

యిరువదిమందిని జేర్చువారిని పోషకులుగా ప్రకటించి పత్రిక ఉచితముగా బంపగలము.

అంత ఎక్కువగా జేర్చినయెడల అట్టిమహానుభావులను రాజపోషకాదుల పట్టీయందు జేర్చి పత్రిక ఉచితముగా పంపబడును.

యేబదిమందికి పైగా జేర్చినవారికి రైలుఖర్చులు వగైరాలు భరించి మహారాజ పోషకులుగా ప్రకటించి పత్రిక బంపగలము.

వ్యాసములువ్రాయువారికి పత్రిఉచితముగాబంపబడును.

మా అనుమతిపై ప్రచారమొనరించువారికి కమీషన్ యివ్వబడును.

ద్రవ్యసహాయమొనరించువారు స్వయముగాగాని మనియార్డరుద్వారాగాని మాఆఫీసునకు జేర్చవలెను. లేనియడల మాజవాబుదారీ లేదు. మోసపడక జాగ్రత్తగా వుండవలెను.

ద్రవ్యసహాయమొనరించిన వారికిమాత్రమే పత్రిక పంపబడును.

ఏమాసములోజేరినను చైత్రమునుండియు పత్రికలు పంపబడుచుండును.

ప్రతి ఇంగ్లీషు నెలయందును 20 తేదీని పత్రిక వెలువడగలదు. చేరనివారు మాకు వ్రాస్తే మరలపంపుదుము.

## యీ నెలలో చందాలుచెల్లించినవారు.

శ్రీమాన్ తులగాపు నరసింహంపంతులుగారు విజయనగరం, (విశా)
,, నంది వెలుగు వెంకటేశ్వరగురుకులుగారు శ్రీముఖ మైలవరం. (కృ)
,, కొమార్లపల్లి వరహానరసింహంగారు శ్రీముఖ వల్లూరు. (గో)
,, కాళధరి మూర్తిరాజుగారు శ్రీముఖ మహేంద్రవాడ. (గో)
,, పొత్తూరు పానకాలయ్యగారు పెనుమాక. (గు)
,, మడనూరు సుందరయ్యగురుకులుగారు శ్రీమడనూరు ,,
,, బిక్కవలిస్వామి ల్యాండులార్డుగారు విజయనగరం. (విశా)



నాయనలారా ! నాయందు దయయుంచి యీ క్రిందివిషయము గమనించండి.

పత్రికరేట్లు సగానికి తగ్గించబడెను. వెనుకటి దిగుబాట్లుగూడా యీ నూతనపద్ధతితోనే పంపించ వచ్చునని ఘట్టిగా తెలుపబడినది. గావున సంకోచము జెందక శక్త్యాను సారముగా సహాయపడి పత్రికను నడపండి. లేనియడల సంఘపత్రిక పడిపోవును. పిమ్మట ఏపనిచేయిటకు వీలుండదు. పదిసంవత్సరాలనుంచి పత్రికనుపెంచి యిప్పుడు ధ్వంసముచేసుకొనుట తెలివిగల పనికాదు. గావున ఆలసింపక మీచుట్టుపట్టు గ్రామాదులలో ప్రచారము జేసి క్రొత్తచందాదార్లను జేర్పండి. ఉత్సాహము జూపండి. సహాయముజేయండి పత్రికను రక్షించండి. యీ స్వల్ప వ్యయమునకు వెనుకాడకండి... సంవత్సరానికి మహారాజపోషకులు: నాల్గురూపాయలు రాజపోషకులు మూడురూపాయలు, పోషకులు రెండురూపాయలు చందాదార్లు రూపాయన్నర పంపి రెట్టింపు సంతోషముతో వ్యాసములు వ్రాసి ప్రచారముగావించి సంపాదకునికి ధైర్యము గలుగ జేయ గోరు

చున్నాను. అట్టియుత్సాహము జూపనందువలన తొమ్మిది సంవత్సర ములనుంచి ప్రతిమాసం మీకు పత్రికలు బంపినను మీజవాబులేక మీ సహాయములేక పరితపించుచున్న విషయములు పత్రికలయందే గలదు. ధనసహాయము నొసరించిన వారిపేర్లుమాత్రమే ప్రకటింపబడెను. మీపేర్లు ప్రకటనచేయులేదని మీరు ఆగ్రహపడక వెంటనే మీ దిగుబాట్లు విష యమై సవరించుకొని నూతనపద్ధతిలో మీ వుద్దేశ్యములను తెలుప గోరుచున్నాము. ఏదో సాకుజెప్పి సంపాదకునిపై అపనింద బడవే యక మీ యిష్టానుసారం జేయండి. సంపాదకుని యందుగల లోప ములు తెలియపర్చండి. సవరణ జేసుకొని క్షమాపణగోరుటకు సిద్ధ ముగా నున్నాడు. గావున మంచి సలహాలతో పత్రికకు సహాయు పడగలరని ప్రార్థించుచున్నాను.

(సంచార కార్యదర్శి.)

---

## ☞ ఆగ్రహింపకుడు.

మహారాజపోషక, రాజపోషక, పోషకుల పేర్లు యీ సంవ త్సరం ప్రకటన చేయనందుకు కారణము లేకపోలేదు. సహాయపడిన వారిపేర్లు మాత్రమే క్రమక్రమముగా ప్రకటింప దలంచితిమి.

చందావివరము—సంవత్సరమునకు

| | | | |
|---|---|---|---|
| మహారాజపోషకులు | 4—0—0 | పోషకులు | 2—0—0 |
| రాజపోషకులు | 3—0—0 | చందాదార్లు | 1—8—0 |

అర్జంటుగా మనియార్డరు చేయవలెను.

దిగుబాటువారుగూడ పై పద్ధతినే అవలంభించ వచ్చును.

మానేజరు.

---

Regl. No. M. 2073.                సం॥ చందా రు 1-8-0 లు.

# శ్రీ ఆదిశైవపత్రిక.

శ్రీ శ్రీకంఠ మఠాధిపతుల యాజ్ఞానుసారముగా, శైవ సంఘాభ్యుదయమునకై శ్రీ గురుకులాశ్రమమునుండి ప్రతిమాసము ప్రకటింపబడును.

సర్వదేవాత్మకో రుద్రస్సర్వే దేవాశ్శివాత్మకాః ।
రుద్రస్య దక్షిణేపార్శ్వే రవిర్బ్రహ్మా త్రయోగ్నయః ।
వామపార్శ్వే ఉమాదేవి విష్ణుస్సోమోపి తేత్రయః ॥

(రుద్రహృదయోపనిషత్)

సంపాదకుడు:—చిలుమూరు పురుషోత్తమ గురుక్కళ్.

సంపుట ౧౦ } చిలుమూరు, కొల్లూరు పోస్టు / భావనామ సంవత్సర వైశాఖమాసము. { సంచిక ౨

(విలేఖకుల వ్యాసములకు సంపాదకులు ఉత్తవాదులు కానేరరు.)



—♦ విషయసూచిక ♦—



భారతీ ప్రెస్, తెనాలి.

# ఉద్ధారకులు.

౧ కీ॥ శే॥ చిలుమూరు తీర్థేశ్వరులవారి జ్ఞాపకార్థం కుమాళ్లు ఉమామహేశ్వరం వగైరాలు, చిలుమూరు.

౨ కర్ణాటక రాష్ట్రీయ ఆదిశైవ మహాసంఘమువారు, బెంగుళూరు.

౩ శ్రీమాన్ నడింపల్లి నాగేశ్వరశివాచార్యులుగారు, ఇంటూరు.

౪ ... గూడూరు రాఘవరావుగారు, పోతునూరు.

౫ ... గూడూరు శీతయ్యగారు, శనివారపుపేట.

౬ ... అయలూరు వెంకటసుబ్బయ్యగారు, ఆర్తమూరు.

౭ ... పావులూరు రామచంద్రయ్యగారు, మునికోటిపురం.

౮ ... పావులూరు హనుమంతయ్యగారు, మునికోటిపురం.

౯ ... పెనుమూడి సత్యనారాయణగారు, తూర్పుకూచిపూడి,

౧౦ ... స్వర్ణ వెంకట శివావధానులుగారు, బూతుమల్లి.

౧౧ ... పావులూరు నాగేశ్వరశర్మగారు, అనంతవరం.

౧౨ ... పెనుమూడి హనుమంతరావుగారు, తెనాలి.

౧౩ ... మామిళ్ళపల్లి శంకరమ్మగారి జ్ఞాపకార్థం భర్త శివరామ దీక్షితులుగారు, చుండూరు.

౧౪ ... మామిళ్ళపల్లి సాంబయ్యగారు, చుండూరు.

౧౫ ... పొన్నూరు సుబ్రహ్మణ్య పాకయాజిగారు, దండమూడి.

౧౬ ... మేదూరు శివయ్యగారు, తేలప్రోలు

౧౭ ... కుందుర్తి ఆనందరావు, B. A.. దుగ్గిరాల,

౧౮ ... కుందుర్తిపార్వతమ్మగారి జ్ఞాపకార్థం సత్తెనపల్లి వెంకటరామయ్యగారు, ఓవర్ సీయరు, దుగ్గిరాల.

౧౯ ... చావలి రంగయ్యగారి జ్ఞాపకార్థం కుమాళ్లు సుబ్బయ్య వగైరాలు చముడుబాడు.

౨౦ ... సంగాపు పానకాలయ్యగారు, నవులూరు.

౨౧ ... సంగాపు కోటేశ్వర గురుకులుగారు, మంగళగిరి.

౨౨ ... చిలుమూరు వెంకటసుబ్బయ్యగారు, చిలుమూరు.

౨౩ ... చిలుమూరు కుటుంబయ్యగారు, చిలుమూరు.

౨౪ ... శేకూరు రాఘవశర్మగారు, గుడివాడ.

౨౫ ... చావలి సుబ్బయ్య, పంతయ్యగార్లు, పినపాడు.

౨౬ ... చావలి లక్ష్మీకాంతయ్యగారు, బాపట్ల.

౨౭ ... కొల్లిపర రామయ్య, పిచ్చయ్యగారు, పెనుమూలి.

౨౮ ... స్వర్ణ చినమల్లయ్యగారి జ్ఞాపకార్థం ధర్మపత్ని బుచ్చమ్మగారు, చీరాల.

౨౯ ... పెనుమూడి శీతమ్మగారు, జొన్నలగడ్డ.

౩౦ ... పసుమర్తి పార్వతమ్మగారు, కూచిపూడి.

# శ్రీ ఆదిశైవపత్రిక.

సఘోరురుద్రస్స ఈశానస్సభగవాన్ సమహేశ్వరస్స మహాదేవః ॥
"అధర్వశిరసి"


సంపుట ౧౦ } చిలుమూరు. కొల్లూరుపోస్టు { సంచిక ౨
భావనామ సం॥ర వైశాఖమాసము.


## ప్రార్థన

సీ॥ ధనికులెంతటి యనాదరణఁ జూపినగాని
మీవిభూతియె జాలు దేవ దేవ
పండితుల్ కడు పక్షపాతంబు చూపిన
మీయండయే జాలుః మిత్రిగొంగ
కవివరుల్ మూగలై కపటతంజూపిన
మీబోధయే జాలు మేటివేల్ప
సోదరులసహాయశూరతంజూపిన
మీసహాయమెజాలు భాసురాంగ

గీ॥ చూడగా సాంఘికులు దయఁ జూపకున్న
మీకృపావృష్టియేఃజాలు మేల్దనర్చి
పత్రికా కన్యకకు పదివత్సరముల
ప్రాయమును గూర్చజాలగ పరమపురుష
ప్రణుతిశతములు గొనుమివే పార్వతీశ !!

## భావ

గీ॥ భావ శ్రీముఖభావమై బరఁగుగాత
భావ సస్యస్వభావమై బఱఁగుగాత
భావ యారోగ్యదాయిమై బఱఁగుగాత
భావ విజయ ప్రభావమై బఱఁగుగాత.

(చిట్టికవి)

---

## ముఖ్యగమనింపు



పత్రికా సంబంధమైన చందాలవిషయమై ఏమీ గడబిడలేదు, అంతయు విరమింపబడినది. గత్యంతరము లేక మౌనము వహింపబడెను. పరమేశ్వరానుగ్రహమున సంప్రాప్తమైన ధనముతోడనే పత్రిక నడుపదలంచినారు. వాగ్దానములు భంగపరచి అభిమానమును త్యజించి సంఘసేవను విడనాడి పత్రికను మరచి సంపాదకుని ప్రార్థనల తిరస్కరించి మహాప్రవాహమున బడద్రోసి మిన్నకున్నటువంటి సాంఘికులను పీడించుట భావ్యముగానేరదనియు యీ నష్టము స్వయంకృతాపరాధమనియు దైవానుగ్రహమున్నచో ఇదియొక లెక్కలోనిదిగాదని మనస్సు దిట్టపరచుకొని ఆర్థిక పరిస్థితులనుబట్టి చందారేట్లను సగానికి తగ్గించి యెప్పట్లో పత్రికను వెలువరించుచున్నారు.

సంపాదకుని సంఘసేవయందు విశ్వాసముగలవారు శక్త్యానుసారముగా సహాయమొనరించుచున్నారు. షుమారు రెండువేలరూప్యముల చందా ధనమునకు ఒక్క త్రుటికాలములో స్వస్తిజెప్పగలిగిన సాంఘికుల యనుగ్రహము చరిత్రాత్మకమై ఆచంద్రార్క స్థాయిగా ప్రకాశింపగలదను విషయము మాత్రము మఱువగూడదు.

సర్వరక్షకుడగు భగవానుని యనుగ్రహమును నమ్మినవానికెట్టి యాపదలు రానేరవు. ఓం శాంతి శ్శాంతి శ్శాంతిః

---

# ☞ "శ్రీమజ్జగద్గురు శ్రీకంఠ భగవత్పాదాచార్యేంద్ర స్వామి నామవతార కాలనిర్ణయః॥"

## (౧) స్కాందేగోదాఖండే మంథన కాళేశ్వర మాహాత్మ్యే॥

శ్లో॥ ద్వితీయేతుపరార్ధేచ దివసేత్వద్యసప్తమె । మన్వంతరే వర్తమానే అష్టావింశే చతుర్యుగే। చతుర్దశశతేతీతే శరాశీతిశ్చహాయనే। సత్యబ్దే శ్రీస్వభానాఖ్యే మాసే ఫాల్గుని కేతతః। శుక్లపక్షేచ పంచమ్యామంత్యభే త్విందువాసరే। శుభేకర్కటకేలగ్నే సాక్షాచ్ఛ్రీల కుళీశ్వరః। ధర్మసంస్థాపనార్థాయ జగత్సంరక్షణాయచ। యోగాచార్యః కలౌ రాజా శ్రీకంఠాఖ్యఇతిశ్రుతః। మద్వాపోహం భవిష్యామి శివజ్ఞానమహోదధిః॥

## (౨) శ్రీభవిష్యోత్తరపురాణే.

శ్లో॥ చతుర్దశశతైచైవ పంచాశీత్యాచసంయుతే। కలౌ యుగే గతేబ్దానాం స్వభానుర్నామకేతతః వర్షేపాల్గునమాసేచ। పంచమ్యాం పూర్వపక్షకే। ఇందువారే శుభేలగ్నే శ్రీమత్పూషాభిధోడుని। అంశేనలకులీశస్య యోగయోగీశ్వరస్యచ। ఆదిశైవాన్వయాంభోధిచంద్రిమాశ్చతురానన। జాతోవై శ్రీకంఠశివో లోకసంరక్షణాయసః॥

## 3. శ్రీఉమామహేశ్వర సంహితాయాం.

శ్లో॥ చతుర్దశశతేతీతే పంచాశీతిశ్చవత్సరే । కలాయుగేసతి శుభే శ్రీస్వభానాఖ్యవర్షకే। సితేపక్షేతుపంచమ్యాం తిథౌ మాసేచ పాల్గునే। పూషాఖ్య దైవతేతారే లగ్నేకర్కటసంజ్ఞకే । దినేయుతే సోమవారే లోకానాంహితకామ్యయా। వేదాంతాది ప్రకాశాయ

లకు లీశాంశతోమహాన్ లోకైకదేశికశ్శ్రీమానాది శైవకులేశివే । అంబికాయాం సదేశార్యాచ్ఛ్రీకంఠ శివయోగిరాట్ । శారీరకమహా భాష్య గ్రంధకర్తాభవిష్యతి॥

## ౪. అన్యత్ర

కుంభేమాసిసితే పక్షేపంచమ్యామధకర్కటే । లగ్నేశ్రీలకులాంశే నీరేవత్యామిందువాసరే । సద్యోజాతశివాచార్యాదంబికాయామజాయతీ । శ్రీకంఠార్యోమహాతేజా భగవాన్దేశికోత్తమః। కలౌచతుర్ధశీశతే, గతే సంవత్సరేయుతే। ఆదౌచపంచాశీతిశైర్వ । స్వభాన్వాభిఖ్యవర్షకే, శుక్లపక్షేతుపంచమ్యాం ఫాల్గునేమాసిపౌష్ణభే, సర్వలోకహిత శ్రీమాన్లకులీశోమహాగురుః । జగత్సంరక్షణార్థాయ శ్రీశంభోరాజయాతదా, అమర్దగిర్యస్వవాగ్మేసు లగ్నేచేందువాసరే సద్యోజాతస్యాంబికాయాం । జజ్ఞేహ్యాంశేనభూతలే శ్రీకంఠభగవత్పాదశివాభిఖ్య ఇతిశ్రుతః॥

## (౫) తత్రైవ.

తపస్యే శుక్లపక్షేతు పంచమ్యామంత్యతారకే । అంబికాయాం సదేశస్య భగవాన్లకులీశ్వరః । సర్వలోకహితార్థాయ । ధర్మసంస్థాపనాయచ కర్తుం స్వాంశేనావిరభూ, దచలాయాం మహాద్యుతిః । తజ్జన్మదివసేపూజాం సవిశేషం సమాచరేత్॥

## (౬) శ్రీకంఠ జయంతీ.

స్వభానువర్షజాతాయ యోగాచార్యాయ మంగళం
ఫాల్గునేమాసిజాతాయ భాష్యకారాయ మంగళం
శుక్లపక్షే సముత్పన్న శ్వేతశిష్యాయ మంగళం
పంచమ్యాంలకులీ శాదుద్భవాయాస్తు మంగళం
ఇందువారేంబికా గర్భాదుత్పన్నాయాస్తు మంగళం
రేవత్యాం శైవవంశాబ్ధావుత్పన్నాయాద్య మంగళం

లగ్నేకర్కటకే సద్యోజాతపుత్రాయ మంగళం
అమర్దగిరి సంతానసంభవాయాస్తు మంగళం
మంత్రకాళీశ్వరక్షేత్ర సముద్భూతాయ మంగళం
దూర్వాసకుల సంభూత దేశికాయాస్తు మంగళం.

తాత్పర్యము.

కల్యాది ౧౮౮౭ స్వస్తిశ్రీ స్వభానునామసంవత్సర ఫాల్గునశుక్ల పంచమీ సోమవారం రోజున రేవతీనక్షత్రయుక్త కర్కటకలగ్నమందు మంథన కాళీశ్వరక్షేత్రమున అమర్దగిరి సంతానమైన ఆదిశైవకులమందు సద్యోజాత శివాచార్యులవారికి అంబికాదేవియను ధర్మపత్నిగర్భశుక్తి ముక్తారత్నముగా శ్రీకంఠశివాచార్యులవా రవతరించిరి. ఆదిసమందు ఆదిశైవులందరును జయంతీమహోత్సవమును యథాశక్తి జరుపుకొని భాష్యపారాయణలు చేయించుకొనవలయును. (మంగళంభూయాత్)

ఇట్లు శైవాద్యాగమపంచానన,
ఆగమిక నందీశ్వర దీక్షితుడు.

సదరు శ్రీకంఠజయంతీ నిర్ణయమును, కీర్తిశేషులగు శ్రీనందీశ్వరదీక్షితులవారు తమ ఆఫీసు రికార్డులో నుంచి శివసాయుజ్యము నొందిరి. పిమ్మట శ్రీ శ్రీకంఠమఠాధిపతుల మగు మేము బెంగుళూరాప్రాంతమునందు పర్యటనము గావించుతరి, యీ వ్యాసమును మాచే ఆదిశైవ ఆఫీసునకు జేర్పబడినది గావున ప్రతి ఆదిశైవుడును శక్త్యానుసారముగా ప్రతి వత్సరము ఫాల్గుణ శుద్ధ పంచమీ రోజున శ్రీకంఠజయంతీ వ్రతమును గావించి మత గౌరవములతో ఆచార్యుల వారిని స్మరించునటుల ఆజ్ఞాపించుచున్నాము. (మహర్షి బోధానంద.)

---

## శివమ్

భారతీయాద్యాదిశైవ మహాదోర్భ్యవిజ్ఞప్తిః॥ మయా భావవత్సర చైత్రశుక్లద్వాదశీ భౌమవాసరే మార్గవశాద్గోదావరీమండల, వైన

తేయ తీరస్థ గన్నవరగ్రామోగతః తత్రపూజ్యంకామశాస్త్రిణో జేష్ట వీరభద్రశివాచారీ ఉపనీతో బోధాయనసూత్రేణ తత్రగురుః అయలూరి కామేశ్వర గురుక్కళ్ తద్బోధాయనోక్తసంస్కారాన్ కారయిత్వా ప్రేక్షకాణామత్యంత మానందముత్పాదయామాస ఏతచ్ఛుభ కార్యది దృక్షార్థమాగతైర్బంధుజనై రప్యేవమేవ సర్వైరపిబోధాయన సూత్రాంతరజ్ఞా విబుధాశ్చసంతోషితాస్సంతః బోధాయనః ఆదిశైవ త్వాత్తేన కృతసూత్రపవ ఆదిశైవరత్యంతాదరణీయఇతి భగవాన్ త్రిలోచనస్సహామోభవత్యేతేషాం మహాత్కాల్యాణామితిచ, సర్వై రేకగ్రీవేణాభాణి, ఏతత్సమయేవటోఃపితా, త్వేకంరూప్యం ఆదిశైవ పత్రికాసన్మానార్థం మదాత్సఫలతాంబూలం॥

ఏవంభవతాంవిధేయో,

౨౮—3—౧౯౩౮.

రాంపల్లి సుబ్రహ్మణ్యశాస్త్రి,
ప్రాగ్గోదావరీమండల కోటనందూరువాసీ.

---

# చెన్నపురి ఆదిశైవ మహాసభ.

చెన్నపురి యందీసభ ఏటేట శ్రీ ముత్తుకుమారస్వామివారి బ్రహ్మోత్సవసమయమున మదరాసు టంకశాల వీధి నెం. 495 రు గేహమున, పదమూడు వత్సరములుగ జరుగుచు వచ్చుచున్నది. సభ యొక్క ముఖ్యోద్దేశములు, ఆదిశైవ బాలురకు వేదాగమముల జెప్పించుటయును, త్రిపదార్థ లక్షణములను బోధించునట్టి శాస్త్రజ్ఞులచే మతోపన్యాసముల నిప్పించుటయును నై యున్నది. గడచిన శ్రీముఖ నామసంవత్సర మాఘ శుద్ధ దశమీ గురువారము మొదలు నాలుగు రోజులు సభ సాంగోపాంగముగ నెరవేరినది. రెండు రోజులు ద్రవిడ భాషా విద్వాన్ శ్రీమాన్ మధురాంతకం [చెంగల్పట్టుజిల్లా]

సుబ్రహ్మణ్యశివాచార్యస్వాములవారి అధ్యక్షత క్రింద అయిదు ఉపన్యాసములును, రెండు రోజులు, తర్క-వేదాంత న్యాయశాస్త్ర మహావిద్వాన్ శ్రీమాన్ పాలూరి శివసుబ్రహ్మణ్య శివాచార్యస్వాముల [శ్రీకాంచీపురక్షేత్రము] వారి అధ్యక్షతక్రింద ఏడు ఉపన్యాసములును జరిగినవి. సంస్కృతాంధ్ర ద్రవిడ భాషాజ్ఞానసంపన్నులగు శ్రీమాన్ పల్లిపట్టు ఆగమిక, కైలాససుందరశివాచార్యస్వాములవారు సభ జరిగిన ప్రతి రోజును ఉపన్యసించుచు, శైవాద్యాగమపంచానన మహావిద్వాన్ శ్రీమాన్ ఆగమిక నందీశ్వర దీక్షితగురువర్యుల [శ్రీమైసూరు సంస్థానం ముజరాయి కమిషనర్ ఆఫీసు] వారి శివపదప్రాప్తికిని, ఆగమ విద్వాన్ శ్రీమాన్ తిరుప్పాపులియూరు అరుణాచల శివాచార్య గురువర్యులవారి శివపదప్రాప్తికిని, శోకమును వెలిబుచ్చుచు వారల గుణగణములను ఉపన్యసించుచు, ఆదిశైవ సంఘోన్నతికి వారల ఆశీర్వాదములను కోరుచు సభను ముగింపునకు తెచ్చిరి. ఏతత్సభావిశేషములను మునుముందు విశదముగ వ్రాసెదము. తమయొక్క ఆదిశైవ పత్రికయందీవ్యాసమును ప్రకటింప ప్రార్థితులు.

పల్లిపట్టు,
4—4—34.

ఇట్లు, సుజనవిధేయుడు,
అ. సుబ్రహ్మణ్యశర్మ.
చిత్తూరుజిల్లా.

---

# యువజనహృదయాగ్ని

౧

చారుగీతాలల్లి నీనుకీర్తి
శోభల కీర్తించిన కవి
వతంసుల నీదుసంఘ
ము ప్రభవించినదీ.

౨

నిర్మలోజ్జ్వల జ్ఞానజ్యోతీ
రింఛోఘల దీప్తి మంతంబై
న సంఘము దీనదృశ్యా
న్నిపుడుదాల్చినదీ.

3

మాతృదేవీ పూతచరణాల్పూ
జ సేయుడు, భ్రాతలారా!
మీదు సేవాత్యాగసుభగ
ప్రసూనావళిచే.

నేడు భారతవర్షంలో మత విద్యాసాంఘిక రాజకీయాశయాలు క్షణక్షణం కల్లోలితములవుతూన్నవి. స్వాతంత్ర్యాభిలాష వివర్ధమాన మవుతూన్నది. న్యూనాధిక వైచక్షణ్యం సమసి, సమానత్వ ప్రబోధం జరుగుతూంది. ఐకమత్యంతో, భారతీయులంతా, దేశాభ్యుదయానికి పాటుపడుతూన్నారు. సాంఘిక వ్యవహారపరిష్కారాలు సర్వతోముఖంగా ఆవిర్భవిస్తూన్నవి. ఇది కాలస్వభావం, అట్టిది దాని మహత్వం. దీన్ని మన సంఘీయులు, గుర్తించలేకుండటం శోచనీయం. ప్రపంచపరిస్థితుల్ని తారుమారుగావిస్తూన్న యీకాల గర్భమంతర్లీనమైయున్న ప్రత్యగ్రకాంతులు, ప్రత్యగ్రశక్తులు అసమగ్రంగానైనా తమ ప్రాబల్యభద్ర ముద్రల మన సంఘసౌభాగ్యంమీద చిత్రింపలేకుండటం ఎంత ఆశ్చర్యకరమో పరిశీలించండి. ఏవిషయంలోనూ మార్పులేక జీవరహితంగా, గాఢనిద్రాపరవశమై అంధకారావగుంఠితమైయున్నది మన సంఘము. ఆత్మీయసంఘ కళాసౌభాగ్యాన్ని మనం స్వహస్తాలతో, రూపుమాపుతూన్నాము. నూత్నభావకుసుమ పరిమళితమై నవ్యౌత్సుక్యపూర్ణమై, వాయువేగ మనోవేగాలతో, మాంగళిక పరిణామ ప్రభావిలసితమగు యీనూతన ప్రపంచములో, క్రొం

గ్రోత్రగీతికల నాలపింపవలెగాని, ప్రాతపాటలే పాడటంవల్ల మన సంకుచిత చిత్తప్రవృత్తులు ప్రదర్శితములవుతూన్నవి.

ఆదిశైవులెట్టి ధీరకార్యాలకైనా దక్షులేగాని నిర్వీర్యులుగారు. అయితే ఉత్తమాదర్శరత్నగర్భమైన, మన సంఘములో సామరస్యం స్నేహభావం అభావంగావటంచేత, మనసంఘం సమగ్రకాంతులతో ప్రకాశించటంలేదు. పూర్వంభారతీయసోదరులందరికిఆదర్శకులైనఆదిశైవులు జడత్వమావహించటంచేత, వెనుకకు నడుస్తూన్నారు. ధైర్యసాహసాదిశీలసంపత్తి అంతరించింది. స్వస్వరూపాన్ని పూర్ణంగా అభివ్యక్తంగావించుకోలేకుండావున్నారు. ఇప్పుడైన కళ్ళుతెరచి కలహబీజాలనునూడపెరికి, నూతనసంస్కారణాల్లోమనసంఘంగూడ పాల్గొనేటట్లొనరించటంశ్రేయస్కరం. తిరిగి మనసంఘం అర్హస్థానాన్ని ప్రాపించటానికి మనమంతా ఐకమత్యంతో ఐకకంఠ్యంగా, ఆవేశమధురగీతాలను గానంచేసి, సేవాపరాయణులం కావలయును. జీవవంతంగా, కాంతిమంతంగా సంఘంవిలసిల్లటానికి సంఘీయులంతాకలసి కొన్నిసంస్థల సంస్థాపించాలి. అందుకు ప్రాథమ్యమున మనభావాల్లోకొంతవరకైనామార్పుఅవశ్యకం.

ఇప్పుడు ప్రతిసంఘీయుని హృదయకమలం, అసూయాధారోపహతమై, గడగడనడకుతూంది. సంఘం అంధకారోన్మగ్నమగుటకీ అసూయాపిశాచంచేత గ్రసింపబడుటయే ప్రధానమైన నిదానం. అందుననే సంఘసౌభాగ్య కాంతులు సన్నగిల్లుతూన్నవి. సోదరుడా! దీన్ని సమగ్రంగాత్యజించు మానసిక పారిశుధ్యమును పూర్ణంగాఅలవరచుకో. నిరవధికంగా నిన్నావేశించి నీ శీలాన్ని కళంకితం గావిస్తూన్న అసూయను వదల్చుకో. ఎందుకు నీకంత అవధిలేని అసూయ? నీవేమో సంఘాభ్యుదయకారములగు విధానముల నవలంబింపక తూష్ణీభావమును వహిస్తూన్నావు. నీసంఘీయుడు, నీ సోదరుడు మాంగళికములగు సంస్కారణాలవలంబించి త్యాగసంయుతములైన తలపులతో కార్యరంగమును ప్రవేశిస్తూంటే, భావగర్భితంగా నవ్వుతూన్నావు.

కర్కశహృదయుడవై పొగడలేక తెగడుచూన్నావు. నీవో? పెద్ద వాడవు. జ్ఞానవృద్ధుడవు. నీకు ఛీ ఎందుకింత అసూయ? ఛీ ఛీ ఇంత నైచ్యమా? క్షుద్రతా! సోదరా! అసూయ, నధఃకరించి మనో వైమల్యాన్ని సంపాదించు నీకు కోపమెందుకూ? ఈమాత్రపు ప్రసన్న మైన సమగ్రదృష్టినైనా అలవరచుకొని శీలాన్ని దిద్దుకో అదేపదివేలు.

సంస్కరణలయందలి మహాత్మ్యాన్ని నవ్యతనూ మాంగళ్యాన్ని, చులకనజేయకు. సంకుచిత దృష్టితోగాక, సమగ్రదృక్సంయుతుడవై, సర్వమంగళోపేతుడైన పరమశివుని, దృక్ప్రసారమే పరిణామసంవళిత మని విశ్వసించు. కాలమా! వైచిత్ర్యగర్భితము. విశాలహృదయుడవై, స్త్రీవిద్య,విధవావివాహాలయందలి సాంఘికకల్యాణసంధాయకత్వమును, పరిశీలించి సరసహృదయుడవై సంఘసౌధాన్ని మనోజ్ఞంగావించుటకు ప్రయత్నించుచూ విజ్ఞానజ్యోతిస్సుల విస్తరింపజేయుటకు పాటుబడుట శ్రేయ్యము.

ప. విశ్వనాథరావు,
సో. వెంకటరామయ్య,
సేవాసమితి.

---

## శ్రీ ఆదిశైవ యువజన సంఘము.

శ్రీయాదిశైవ యువజనసమితి, వేంకటేశ్వరశాస్త్రిగారి కరుణారసాశీస్సులతో నావేశ మధురగీతికల గానము గావించినది. యువ జనుల హృదయాంతర్గతములును స్వర్గీణములు నునగు తలపుల పవిత్రా విర్భావమే యువజన సంఘమని సారస్యసంయుతులగు సోదరులకు సువిదితమే. ఆ భోగములును, పరిపూర్ణములునగు, వీరి యాశయ ముల ప్రస్ఫుట స్వరూపమే యువజనసంఘము. సాటి సంఘములతో మన సంఘమును సౌభాగ్యవంతముగా దిద్ది తీర్చుటయే వారి భావము.

శాస్త్రిగారి యాదేశమణులతో, నాదిశైవ సంఘమును సముజ్జ్వలము గావించుటకు యువజనులందరును సమావేశమై వారి ప్రణయంపు లేఖియలనుండి యవతరించిన సేవాభావ కుసుమమాలను మాతృదేవీ కోపకంఠమున వెలిగొలుపుట యెంతయు ప్రశంసనీయము. కాని యువజనులలో కొందరు వారి యావేశపూరితములగు భావములను కార్యరూపముగ పరిణమింపజేయుటయందు ప్రదర్శించిన యలసతకు హేతువు దురూహ్యము. ప్రచారము గావించుటకు కార్యనిర్వాహణవర్గ మందలి సోదరు లాహ్వానింపబడిరి. కాని కొందరు మాత్రమే ప్రచార మందు పాల్గొనిరి. ఇది యెంతయు విచారణీయము. కాని యది గతజల సేతుబంధనము.

ద్వితీయాదిశైవ మహాజనసభ సమావేశమునకు పూర్వము మరల ప్రచార మొనరించుటకు నిశ్చయింపబడినది. చందా దారులను జేర్చుచూ సంఘాశయముల సంఘీయులకు వ్యక్తీక రించుటయే ప్రధానాభిప్రాయము. ప్రచారము కొన్ని తాలూకాల యందు సంపూర్ణముగ జరిగినది. విద్యార్థులైన యువకుల కందరకు ప్రచార మొనరించుటకు తరుణము లభించలేదు. యీ వేసవి సెలవుల యందైనను వారు హృదయపూర్వకముగ సేవను గావించిన యువజన సంఘము విజయవంతముగాగలదని యింతకు పూర్వము జరిగిన యల్ప ప్రచారసాఫల్యము నిరూపించుచున్నది. ప్రచార మొనరింప నుత్సుకులై యున్న యువజనులు కార్యదర్శికి తెలియ పరచినయెడల ప్రచార విధానము పంపబడును. ఆదిశైవ యువజన సంఘమును రిజష్టరు గావించినగాని సహాయము గావింపమని కొందరు నుడువుచున్నారు. రిజష్టరు గావింపవలెనని యాదేశించుట శ్లాఘ్యమే యైనను మూల ధనము రిజష్టరు జేయుటకైనను లేదని దీనులమై విన్నవించుచున్నాము. రిజిష్టరు గావింపనిచో సహాయము గావింపని యెడల రిజిష్టరు గావిం చుట మూల ధనము లేక యెట్లు సంభవించును? ఇట్లన్యోన్యాశ్రమము లుగా సంఘ పరిస్థితులున్నవని సంఘీయులకు రిజష్టరు గావించుట కను

కూలములగు నవకాశములు కల్పించి సాహాయ్యసంపత్తినిదానించుట కభ్యర్థించుచున్నాము.

నందివెలుగు } ఆదిశైవయువజన సంఘశక్రటరీ.
తెనాలి తాలూకా }

---

## సంపాదకీయములు.

### స్వవిషయము.

కరువులో అధికమాసమను నార్యోక్తి మాకు సార్థకమైనట్లు సాక్షికులు దలంపరని నమ్మకము. ఆలస్యమునకు క్షమించుటకును మున్ముందు పత్రిక నిర్విఘ్నముగా నెరవేరునటుల సర్వులు సర్వవిధముల సహాయమొనరించుటకు ప్రార్థించుచున్నాము. యీసంచిక గమనించి వెంటనే సదయహృదయులరై సహాయపడగలరని నిండు విశ్వాసము.

### అర్చకదావాలు.

గుంటూరుజిల్లాయందలి అర్చకదావాలు చాలావరకు తీర్పులు చెప్పబడినవి. అర్చకుల స్వాధీనములోయుండు భూములు అర్చకత్వపు నౌకరీనిమిత్తం యివ్వబడినటులయు అట్టిభూములపై కంట్రిబ్యూషన్ విధించుట న్యాయముగాదనియు నిర్నిమిత్తముగా అర్చకుల భూములపై బోర్డువారు స్కీములు గావించి అనవసరముగా దావాఖర్చులు తగిలించినారు. గనుక దావా ఒకటింటికి రు 150—0—0 లు దేవాదాయపు బోర్డువారు అర్చకులకు యివ్వవలెనని ఖండితమైన తీర్పులు యిచ్చినారు. దయామయుండగు పరమేశ్వరుని యనుగ్రహపాత్రులైన అర్చకమహాజనులు ఆనందాంబుధిని మగ్నులై భగవన్మహిమల స్తుతించుచూ పరమేశ్వర పాదసేవా దురంధరులై యున్నారు. కొందరు రాజ

నామా డిక్రీలుపొంది నిశ్చేష్టులగుచున్నారు. మఱికొందరు తమ కేవిధమున తీర్పులు వచ్చునో యని పరితపించుచున్నారు. ఇప్పటికి అర్చకమహాజనసంఘము ప్రథమ విజయమును బడసినందులకు సంతసింపనివారుండరు. పిమ్మట ఎట్లు జరుగగలదో తెలియకున్నది.

శారదా బిల్లు.

గుంటూరుమండలమునగూడ శారదాకమిటీలు నియమింపబడినవి. బాల్యవివాహముల విషయమై కమిటీవారు పరిశీలించి రిపోర్టుగావించెదరట. పిమ్మట జరిమానాలు ప్రసాదించెదరట. భగవానుడే మార్గము స్థిరపరుపనున్నాడో దెలియదు.

దేవాలయప్రవేశబిల్లు.

విచారణ ముగిసినది. త్వరలో బిల్లు ప్యాసు కాబోవుచున్నది పిమ్మట ప్రతిగ్రామమునందును రణరంగములు సాగనున్నవి. భగవానుడీవిషపరీక్ష నెందులకు గావించుచున్నాడో ఎవరు చెప్పగలరు? తిరువాన్కూరు సంస్థానమువారు ముందడుగువేసి జగద్విఖ్యాతి నొందనున్నారని దెలియుచున్నది. హృదయపరివర్తనము ముఖ్యమని పలువురు వక్కాణించుచున్నారు.

శ్రీకంఠుని పర్యటనము.

శ్రీ శ్రీకంఠమఠాధిపతులగు శ్రీకంఠ శివాచార్యులవారు మదరాసునుండి బెంగుళూరు మున్నగు ప్రదేశములకరిగి అచ్చటి క్షేమములనారసి పుంగనూరునకు విజయంచేసి గోదావరిజిల్లా ముఖ్యపట్టణమగు ఏలూరునందు కొంతకాలము విశ్రాంతి గైకొనెదరని దెలియుచున్నది. గీతాభాష్య ముద్రణవిషయములు ఇచ్చటనే పూర్తిగావింతురని దెలియవలెను. పరమేశ్వరాంశసంభూతులగు నీమహాత్ముని సంకల్పము నిర్విఘ్నముగా నెరవేరగలదని నమ్మకముతో ఆదిశైవసంఘము భగవానుని ప్రార్థించుచున్నది.

## దేవీయజ్ఞము.

శ్రీ కాంచీపురమునందు శ్రీమాన్ గంగవరం నంజుండ దీక్షితులవారిచే ఆషాఢబహుళ ఏకాదశి మొదలు శ్రావణ పూర్ణిమవరకు గావింపబడు దేవీయజ్ఞమునకు చందాలు వేసిన మహానుభావులు తమతమ చందా ధనమును, సిద్ధపరుప హెచ్చరించుచున్నాము. మా ఆఫీసునుండి వాలంటీర్లువచ్చి, తమ దర్శనము చేయ యత్నములు జరుగుచున్నవి. త్వరలో వత్తురు—మా ఆఫీసు ముద్రగల రసీదులు ఇవ్వబడును.

## విషాదము.

మాపత్రికోద్ధారకులైన శ్రీమాన్ చిలుమూరు వెంకటసుబ్బయ్యగారి ధర్మ పత్నియగు "మాచమ్మ" గారును మా మేనమామగారి భార్యయగు దుర్గమ్మగారును మశూచక వ్యాధివలన శివసాయుజ్యము నొందినందులకు చింతిల్లుచున్నాము. పరమేశ్వరుని యనుగ్రహము వలన వీరి యాత్మలకు శాంతి నొనగూడుటకు ప్రార్థించుచు వారల కుటుంబములకు మా సానుభూతి దెలుపుచున్నాము.

## అభినందనము.

పత్రికాభివృద్ధికై సహాయపడిన మహాశయుల నందరిని హృదయ పూర్వకముగా నభినందించుచున్నాము. మిగతావారుగూడ త్వరగా తమతమ దిగుబాటు చందాలను నూతనపద్ధతితోనైనను వెంటనే బంపునటుల ప్రార్థించుచున్నాము.

## గమనింపు.

ప్రతిమాసం ఇంగ్లీషు నెల 21 తేదీకి పత్రిక రవానా చేయబడుచుండును. నెలాఖరులోపుగా పత్రిక చేరనివారు మాకు తెలియ పరచిన యెడల మరల నొక పత్రిక బంపగలము. ఉచితముగా

గైకొనెడివారుగూడ లజ్జింపక పత్రికను పఠించ ప్రార్థించుచున్నాము.
పరమేశ్వరుడు మీహృదయములందు ప్రవేశించి పత్రికకు సహాయము
జేయింపగలడని దృఢమైన నమ్మకముతో పనిచేయుచున్నాము.

---

# స్వీకృతి

---

చంద్రిక.

మదరాసునుండి శ్రీయుతులు V. A. కేశవచంద్రగారి యాధి
పత్యమున ఆనందాప్రెస్సువారిచే వెలువడుమాసపత్రికయొక్క ప్రథమ
సంచికను వందనపురస్సరముగా యందుకొని యందలి సద్విషయ
ములు పఠించి యానందించితిమి. పండితులచే వ్రాయఁబడిన పలువిధ
ములగు వ్యాసరాజములతోడను చక్కని చిత్రపటములతోడను
విరాజిల్లు నీపత్రిక చంద్రికయను నామమును సార్థకపరచుచున్నది.
చంద్రసేఖరుని యనుగ్రహమున నీ చంద్రిక శుక్లపక్షచంద్రుని
వలెనే దినదిన ప్రవర్థమానమై విరాజిల్లగలదని మాయందువిశ్వాసము.
ప్రతి ఆంధ్రుడును పఠించి యానందించుటకు హెచ్చరించుచున్నాము.
సంవత్సరచందా రు 4—0—0లు. వలయువారు చంద్రికా కార్యాల
యము ఆనందముద్రాక్షరశాల, లోన్‌స్క్వేర్, మదరాసు, అనివ్రాయ
వలెను.

భక్తిప్రబోధినీ.

గుంటూరునందుగల శ్రీరామకృష్ణ పూజామందిరము వారి తర
ఫున శ్రీయుతులు అవ్వారి హనుమయ్యగారి సంపాదకత్వమున ప్రతి
మాసము వెలువడుచున్న రెండవసంపుటమునందలి 5, 6 సంచికలు.
కల్గిన సంయుక్తసంచికను గైకొని యానందించితిమి. అందలి మహా

పురుషుల జీవితచరిత్రలు భక్తి జ్ఞానసంబంధమగు సద్విషయములు పరిశీలించి తరించితిమి. యీ కాలమున నిట్టి సద్విషయములు బోధించెడి పత్రికారాజములుండుట మహాభాగ్యమనక తప్పదు. ఇందులకు సంపాదకుల నెంతేని గొనియాడక తప్పదు. శ్రీవారి సంకల్పమమోఘమై ప్రజానంద మొనరింపగలుగునని మాయాశయము. భక్తిసులభుడగు పరమేశ్వరుని యనుగ్రహమున నీ పత్రిక చిరతరస్థాయియై వర్ధిల్లుగాత. సంవత్సరచందా 1—0—0. వలయువారు సంపాదకులకు వ్రాసిన బడయగలరు.

### 3 వైద్యప్రదీపిక.

గుంటూరునుండి ది హెరిడిటరీ ఆయుర్వేదిక్ డాక్టర్సులీగు పక్షమున శ్రీమాన్ ప్రొఫెసర్ డి. రంగాచార్యులవారి యాధిపత్యమున వెలువడు మాసపత్రికయొక్క ప్రథమసంపుటం నాల్గవసంచికను గైకొని యానందించితిమి. ఇందనేక రహస్యములైన ఆయుర్వేద విషయములుగలవు. శాస్త్రోక్త చికిత్సలు మున్నగు సద్విషయములనేకముగా ప్రకటనచేయుచున్నారు. ప్రతివైద్యుడును యీ పత్రిక గైకొని పరిశీలించుటత్యంతావశ్యకమని వేరుగా వ్రాయనక్కరలేదు. సంవత్సరచందా 2—0—0 లు. వలయువారు సంపాదకులకు వ్రాసిన బడయగలరు.

### ర లోకలుబోర్డు.

తూర్పుగోదావరిజిల్లా కపిలేశ్వర పురమునుండి శ్రీయుతులు చాగంటి శేషయ్యగారిచే ప్రకటనచేయుచుండిన పై మాసపత్రిక రెండవసంపుటం పదునొకండవ సంచిక మాకార్యాలయ మలంకరించినది. ఇందనేక లోకల్ వ్యవహారములు ప్రకటితమగుచున్నవి. ఏ మాత్రము వ్యవహారజ్ఞానము కావలసినను యీ పత్రిక పఠించుట శ్రేయస్కరము. చాలాకాలమునుంచి వీరి పత్రిక లోకమునవెలసి

యుండుటచే సర్వులు దెలుసుకొనియే యుందురు. మాకు నేడే చేరుట వలన వీరిని గురించి విశేషముగా వ్రాయుట చర్విత చర్వణము. సంవత్సరచందా రు 3—0—0లు. వలయువారు సంపాదకులకు వ్రాసిన బడయగలరు.

---

## యీ నెలలో చందాలు చెల్లించినవారు.

శ్రీముఖ సంవత్సరం బాపతు.

౧ శ్రీమాన్ చాగంటిపాటి శేషయ్యగారు, తోట్లవల్లూరు [కృ]
౨ ,, మన్నూరు వెంకయ్యగారు, మినగల్లు [నె]
౩ ,, గుడ్లూరు రామలింగేశ్వరగురుకులుగారు, బుచ్చిరెడ్డిపాలెం
౪ ,, బాదంపూడి గవరయ్యగారు, కందికుప్ప [గో]
౫ ,, కాళ్లకూరు బాపన్నగారు, కుండలేశ్వరం [గో]
౬ ,, కొండవీటి శేషయ్యగారు [లోగడ సంవత్సరాలు] మండడం [గుం]
౭ ,, మానేపల్లి శివన్నారాయణమూర్తిగారు మోడేకుర్రు [గో
౮ ,, సంగాపు సుబ్బయ్యగురుకులుగారు [గుం]

[భావ సంవత్సరమునకు]

౯ శ్రీమాన్ అయలూరు నీలకంఠంగారు, ఖండివరం [గో]
౧౦ ,, యలమంచిలి వీరయ్యగారు, క్రొత్తపేట [గో]
౧౧ ,, మాచరి సత్యనారాయణమూర్తిగారు, మాచవరం [గో]
౧౨ ,, ఆగమిక కైలాససుందరశర్మగారు, పల్లిపట్టు [చి]
౧౩ ,, యస్. వాలేశ్వరదీక్షితులుగారు [శ్రీముఖ రాజపోషక] పుంగనూరు [చి]

౧౪ శ్రీమాన్ నాగేశ్వరం సుందరశర్మగారు [భావ రాజపోషక]
శృంగారపురం [గుం]
౧౫ ,, పొత్తూరు పానకాలయ్యగారు [భావ పోషక]
పెనుమాక [గుం]
౧౬ ,, చుండి ఆనందరాయుడుగారు [భావ పోషక]
రూపెనగుంట్ల [గుం]
౧౭ ,, పాలపర్తి శంకరయ్యగారు [భావ పోషక] ఎరుకపాడు
౧౮ ,, యలమంచిలి సుబ్రహ్మణ్యంగారు [లోగడ దిగుబాటు
భావ సంవత్సరముతో సహా రాజపోషక] వెదురుపాక [గో]
౧౯ ,, రాంపల్లి సూర్యనారాయణగారు [శ్రీముఖ]
కొత్తపేట [విశాఖపట్నం]
౨౦ ,, మానేపల్లి లక్ష్మినారాయణ అవధానులుగారు
[భావ సం॥] కస్తూరివారిపాలగుమ్మి [గో]
౨౧ ,, నాగలింగం పార్వతీశం గురుకులుగారు [భావ]
నూతక్కి [గుం]
౨౨ ,, సత్తెనపల్లి హనుమంతరావుగారు [భావ పోషక]
గుండిమెడ [గుం]
౨౩ ,, మొవ్వ వెంకటరామశాస్త్రిగారు [శ్రీముఖ భావ]
ఆకీడు [కృ]
౨౪ ,, పణతుల రాఘవయ్యగారు [భావపోషక] రామతీర్థం [నె

# పత్రికా సన్మానములు.

౧ శ్రీమాన్ కారంచేడు వెంకటసుబ్బయ్యగారు [జాండ్రపేట] ద్వితీయ పుత్రునిఉపనయనకార్యమహోత్సవ తరుణమున [చావలి లక్ష్మినారాయణగారి ద్వారా] పత్రికా సన్మానం.
౧—౦—౦

౨ శ్రీమాన్ నూతలపాటి వాలయ్యగారు [రాజోలు] తన కుమార్తె పునస్సంధాన మహోత్సవ తరుణమున [చా॥ ల॥ నా॥ ద్వారా] పత్రికాసన్మానం. ౧—౦—౦

3 ,, నందివెలుగు కన్నయ్యగారు [కారుమూరు] తన పుత్రుని ఔపోసనకార్యమహోత్సవతరుణమున పత్రికాసన్మానం. ౧—౦—౦

౪ ,, పూజ్యం కామశాస్త్రిగారు [గన్నవరం] తన కుమారుని ఉపనయన మహోత్సవ తరుణమున పత్రికాసన్మానం. ౧—౦—౦

౫ ,, స్వర్ణ కుటుంబయ్యగారు [నారాకోడూరు] తన కు॥ ఉపనయన మహోత్సవ తరుణమున [చానలి సుబ్బయ్యగారి ద్వారా] పత్రికాసన్మానం. ౧—౦—౦

౬ ,, కొండవీటి సుబ్బయ్యగారు [కొండపల్లి] తన నాల్గవ కు॥ ఉపనయన మహోత్సవ తరుణమున [సం॥ కో॥ గారి ద్వారా] పత్రికాసన్మానం. ౧—౦—౦

౭ శ్రీమతి కాకుమాను లలితాంబగారు [తెనాలి] తన భర్తగారి సాంవత్సరీకమున జ్ఞాపకార్థం [సం॥ కో॥ ద్వారా] పత్రికా సన్మానం. ౧—౦—౦

౮ శ్రీమాన్ కొల్లిపర వెంకటసుబ్బయ్యగారు [చుండూరు] తన అత్తగారి అంత్య క్రియల సందర్భమున పత్రికాసన్మానం [కొ॥ వీ॥ ద్వారా] సమర్పించినది. ౨—౦—౦

౯ ,, చిలుమూరు వెంకటసుబ్బయ్యగారు [చిలుమూరు] తన భార్య జ్ఞాపకార్థం పత్రికాసన్మానం నిమిత్తం సమర్పించినది. ౨—౦—౦

౧౦ ,, నందివెలుగు సత్యనారాయణగారు [చిలుమూరు] తన తల్లిగారి జ్ఞాపకార్థం పత్రికా సన్మానం నిమిత్తం సమర్పించినది. ౨—౦—౦

# వార్తలు.

దేశమాతటను మశూచకవ్యాధులు చెలరేగి ప్రజలను బాధించు చుండుటవలన గ్రామాదులందు భజనలు కొలుపులు ఆరాధనలు మున్నగునవి జేయుట కర్తవ్యమని పెద్దలు దెలుపుచున్నారు.

... ... ... ...

యీ నెలయందు అచ్చటచ్చట గాలి తుపానులవల్ల చాలా భాగము నష్టముగల్గినదట. మామిడితోటలు గలవారికి విశేషనష్టము సంభవించినదట.

... ... ... ...

గాంధిమహాత్ముని హరిజనయాత్ర సందర్భమున సనాతనులు తమ ఆవేశమును నిలుపుకొనజాలక ఒక జట్టు బయలుదేరి కర్రలతోను రాళ్ళతోను మోటారుపైబడి బ్రద్దలు కొట్టిరట. కొందరు మరణించు టయు, మరికొందరు స్పృహతప్పి గాయములు బడుటయు సంభవించి నను మహాత్ముడు చిరునవ్వుతో నాతలకాయనుమాత్రమే పగులగొట్టు టకు ప్రార్థించుచున్నాననియు, నావలన మీకు చాలా అపకారము జరుగుచున్నదని శాంతముతో బలుకగా సనాతనులు లజ్జనొంది సభ గావించి మహాత్ముని హితవుల నాలకించి సన్మానించి పంపినవిషయము తెలియనివారికి నచ్చకుండు టాశ్చర్యకరమే.

... ... ... ...

గాంధిమహాత్ముని హరిజనోద్యమ ప్రచారము వర్ణాశ్రమ ధర్మ నిరతుల కెట్టిభంగము రాజాలదనియు గృహమునందలి ఆచారపద్ధతు లకు కొరత గలుగ నేరదనియు ధర్మబద్ధులకు బాధకరము గలుగజాల దనియు జిజ్ఞాసులకు వ్యతిరేకము లేదనియు వేదోపనిషత్తుల సారముగా మహాత్ముడు బలుకుచున్నాడనియు అయ్యదియే పరమపావనమై నిష్క ల్మషమై హైందవవిజ్ఞానరూపమైన బోధయనియు పండితులైనవారు

దెలుపుచుండ సామాన్య సనాతనబృందము వారల జడిగావించుచూ తామే పరిశుద్ధ సనాతనులమని మహోపన్యాసములు గావించుచూ దేశపర్యటనము జేయుచూ నోటికొచ్చినరీతిని మహాత్ముని దూషించుచూ, దేశీయ మహాసభలను నిరసించుచూ వైదికమత సంరక్షకులవలె బయలుదేరి ప్రజలహృదయములు కలవరపరచు చున్నారని నిందించెడి మహావాక్యములు మనసనాతన మహాశయులు వినుటలేదని దేశములో గొప్పపుకారుపుట్టుచున్నదని యనేకపత్రికలుపల్కుచున్నవి.

... ... ... ...

ఆగమములు తంత్రములనియు కల్పితములనియు అప్రమాణములనియు ఆచార్యపురుషులు ప్రమాణత్వేన స్వీకరింపలేదనియు విగ్రహారాధన నింద్యమనియు దానివలన దేవలకత్వదోషముగలుగునని యు తదర్చకులు బ్రాహ్మణులుకారనియు దేవుని పూజించుటకు అర్హత మాత్రమేగల్గినందున ప్రచ్ఛన్నవైదికత్వమే గలుగుననియు సంపూర్ణబ్రాహ్మణత్వము లేదనియు, ఆలయములు అమంగళప్రదమైనవనియు, ఆలయములకు వెళ్ళిరాగానే స్నానములు గావింపవలెనని బలుకుచూ, అసురకృత్యముల నెన్నిటినో గావించిన మన సనాతన సోదరులకు, హరిజనోద్యమఖండనగావించి గాంధి మహాత్మునిపై దండయాత్రగావించుటకు, ఆగమములే శరణ్యమగుటాశ్చర్యకరమైనను లోకము వీరికృత్యములగాంచి హాస్యమొనరించుచున్నను, అనేకమతములను నిర్మూలించి లోకధ్వంస మొనర్చినట్లు వీరిచరిత్రలు దెలుపుచున్నను, వీరు జంకుగొంకులేక నోరెత్తి మాట్లాడటకు బయలుదేరినందులకు నవ్వని మానవుడే లేడని పలువురుబలుకుచున్నారట.

... ... ... ...

ఇటీవల అలహాబాదునందు రక్తవర్షము కురిసినట్లును పూరీ జగన్నాథంవద్ద సముద్రములోని చేపలు వగైరాలుచచ్చి రేడురోజులు కొట్టుకొనివచ్చినట్లును పత్రికలు దెలుపుచున్నవి.

... ... ... ...

యీమధ్య కలకత్తాలో కాళ్ళుచేతులు గట్టుకొని 72 గంటల కాలము నదిలోయీదిన ఘోష్‌గారి శిష్యురాండ్రు 8 సంవత్సరముల బాలిక, పది సంవత్సరముల బాలిక లిరువురును పైవిధముగా 12 గంటల సేపు నీళ్ళలో యీదినట్లును, మహమతులోసంగినట్లు దెలిసి ఆనందించనివారు లేరు.

... ... ... ...

రాంచీ యను పట్టణమున అఖిలభారత స్వరాజ్యపార్టీనాయకుల కార్యనిర్వాహక సమావేశముజరిగిన పిమ్మట ఢిల్లియందు అఖిలభారతకాంగ్రెస్ మహాసభజరిపి, మరల శాసనసభలందు కాంగ్రెస్ పార్టీవారు వచ్చుచున్నారని ప్రజలు అపరిమితానంద భరితులుగా నున్నారట.

---

Regd. No. M. 2073. స॥ చందా రు 1-8-0 లు.

# శ్రీ ఆదిశైవపత్రిక.

శ్రీ శ్రీకంఠ మఠాధిపతుల యాజ్ఞానుసారముగా, శైవ సంఘాభ్యుదయమునకై శ్రీ గురుకులాశ్రమమునుండి ప్రతిమాసము ప్రకటింపబడును.

సర్వదేవాత్మకో రుద్రస్సర్వే దేవాశ్శివాత్మకాః ।
రుద్రస్య దక్షిణే పార్శ్వే రవిర్బ్రహ్మా త్రయోగ్నయః ।
వామపార్శ్వే ఉమాదేవి విష్ణుస్సోమోపి తే త్రయః ॥
(రుద్రహృదయోపనిషత్)

సంపాదకుడు:— చిలుమూరు పురుషోత్తమ గురుక్కళ్.

| | | |
|---|---|---|
| సంపుట | చి లు మూ రు. క్రొత్తూరు ౦౦ | సంచిక |
| ౧౦ | భావనామ సం॥ర జ్యేష్ఠ-ఆషాఢ మాసములు. | 3-౪ |


(విలేఖకుల వ్యాసములకు సంపాదకులు ఉత్తరవాదులు కానేరరు.)



—♦ విషయసూచిక ♦—



భారతీ ప్రెస్, తెనాలి.

# ఉద్ధారకులు.

౧ కీ॥ శే॥ చిలుమూరు తీర్థేశ్వరులవారి జ్ఞాపకార్థం కుమాళ్లు ఉమామహేశ్వరం వగైరాలు, చిలుమూరు.

౨ కర్ణాటక రాష్ట్రీయ ఆదిశైవ మహాసంఘమువారు, బెంగుళూరు.

౩ శ్రీమాన్ నడింపల్లి నాగేశ్వరశివాచార్యులుగారు, ఇంటూరు.

౪ ... గూడూరు రాఘవరావుగారు, పోతునూరు.

౫ ... గూడూరు శీతయ్యగారు, శనివారపుపేట.

౬ ... అయలూరు వెంకటసుబ్బయ్యగారు, ఆర్తమూరు.

౭ ... పావులూరు రామచంద్రయ్యగారు, మునికోటిపురం.

౮ ... పావులూరు హనుమంతయ్యగారు, మునికోటిపురం.

౯ ... పెనుమూడి సత్యనారాయణగారు, తూర్పుకూచిపూడి.

౧౦ ... స్వర్ణ వెంకట శివావధానులుగారు, బూతుమల్లి

౧౧ ... పావులూరు నాగేశ్వరశర్మగారు, అనంతవరం.

౧౨ ... పెనుమూడి హనుమంతరావుగారు, తెనాలి.

౧౩ ... మామిళ్ళపల్లి శంకరమ్మగారి జ్ఞాపకార్థం భర్త శివరామ దీక్షితులుగారు, చుండూరు.

౧౪ ... మామిళ్ళపల్లి సాంబయ్యగారు, చుండూరు.

౧౫ ... పొన్నూరు సుబ్రహ్మణ్య పాకయాజిగారు, దండమూడి.

౧౬ ... మేడూరు శివయ్యగారు, తేలప్రోలు

౧౭ ... కుందుర్తి ఆనందరావు: B. A. దుగ్గిరాల.

౧౮ ... కుందుర్తిపార్వతమ్మగారి జ్ఞాపకార్థం సత్తెనపల్లి వెంకటరామయ్యగారు, ఓవర్ సీయరు, దుగ్గిరాల.

౧౯ ... చావలి రంగయ్యగారి జ్ఞాపకార్థం కుమాళ్లు సుబ్బయ్య వగైరాలు చముడుబాడు.

౨౦ ... సంగాపు పానకాలయ్యగారు, నవులూరు.

౨౧ ... సంగాపు కోటేశ్వర గురులుడుగారు, మంగళగిరి.

౨౨ ... చిలుమూరు వెంకటసుబ్బయ్యగారు, చిలుమూరు.

౨౩ ... చిలుమూరు కుటుంబయ్యగారు, చిలుమూరు.

౨౪ ... శేకూరు రాఘవశర్మగారు, గుడివాడ.

౨౫ ... చావలి సుబ్బయ్య, పంతయ్యగార్లు, పినపాడు.

౨౬ ... చావలి లక్ష్మీకాంతయ్యగారు, బాపట్ల

౨౭ ... కొల్లిపర రామయ్య, పిచ్చయ్యగారు, పెనుమూలి.

౨౮ ... స్వర్ణ చినమల్లయ్యగారి జ్ఞాపకార్థం ధర్మపత్ని బుచ్చమ్మగారు, చీరాల

౨౯ ... పెనుమూడి శీతమ్మగారు, జొన్నలగడ్డ.

౩౦ ... పసుమర్తి పార్వతమ్మగారు, కూచిపూడి.

# శ్రీ ఆదిశైవపత్రిక.

సఘోరుద్రస్స ఈశానస్స భగవాన్ సమహేశ్వరస్స మహాదేవః॥
"అధర్వశిరసి."


సంపుట ౧౦ | చిలుమూరు. కొల్లూరు P.O. శ్రీ భావనామ సం॥ర జ్యేష్ఠ ఆషాఢ మాసములు. | సంచిక 3-౪


## పరమేశ్వర స్తోత్ర పంచకము.

[శ్రీమాన్ చిలుమూరు గురులింగశాస్త్రిగారు]

శా॥ శిరిగై సేతువు కోరినంతటనె వా ♦ సిన్ గూర్తు వ్రశాంతముల్
మరువన్ జాలవు నీను భక్తులను స ♦ న్మానంబులన్ గూర్చుచో
ధర నెవ్వారలు నీ సరిన్ గలరహో ♦ ధన్యోస్మ్యయంచున్ సదా
గరిమంబా భవదాకృతిన్ గొలుతు భ ♦ ర్గా భక్తకల్పద్రుమా ॥౧॥

శా॥ జనిసార్థక్యము జెందనీ గుణములన్ ♦ శ్లాఘింపగా నెంచి నే
ననయంబున్ జతనంబొనర్చియు నితాం ♦ తామోఘబాధాళిచే
వినుతింజేయగనైతి నేడిడిగో నా ♦ విజ్ఞప్తి నర్పించెదన్
ఘనకారుణ్యము జూపుమయ్య మది భ ♦ ర్గా భక్తకల్పద్రుమా ॥౨॥

శా॥ చాపల్యంబిసుమంత లేని కతనన్ ♦ సంతోషచిత్తంబునన్
యేపాండిత్యము లేకయే యిటుల ని ♦ న్నీవేళ భక్త్యున్నతిన్
నాపాపంబులు దీరుగాతయని స ♦ న్నాహంబునన్ గొల్చునన్
గాపాడంగను నీదె భారమిక భ ♦ ర్గా భక్తకల్పద్రుమా ॥3॥

శా॥ నిను విశ్వేశు హృదాబ్జమందునిచి వా ♦ ణీశాది దేవోత్తముల్
మునుసర్వార్థము లొందిరంచనిరి స ♦ మ్మోదంబునన్ బండితుల్

మనమం దెప్పుడు నిన్ను నే దలచెదర ♦ మన్నించిరక్షింపుమో
ఘన తేజా శివ యద్రిజారమణ భ ♦ ర్గా భక్తకల్పద్రుమా ॥౪॥

మ॥ అరయ న్శక్యమె నీమహామహిమల ♦ య్యా సర్వలోకేశ నీ
చరణోత్ఫుల్ల సరోరుహంబులను ని ♦ ష్టా పూర్తి సేవించెదన్
గురులింగాహ్వయ భక్తవందితుడ సం ♦ కోచింపకన్ బ్రోవుమో
కరుణాసింధు పరాత్పరా యభవ భ ♦ ర్గా భక్తకల్పద్రుమా॥ ౫॥

[ శ్రీమాన్ చావలి సుబ్బారావుగారు. ]

కం॥ శివశంకరయని బొగడిన
భవసంచయమెల్ల బాసి, బహుపుణ్యుండై
భవదీయ లోకవాసము
నవిరళముగ బొందునట మహాద్భుతము శివా.

---

# గృహస్థాశ్రమము.

( శ్రీమాన్. చావలి పిచ్చయ్యాశర్మగారు )

శ్లో॥ యథామాతరమాశ్రిత్య । సర్వే జీవంతి జంతవః।
ఏవంగార్హస్థ్యమాశ్రిత్య । వర్తంత ఇతరాశ్రమాః ॥

లోకములో పృథివి నాశ్రయించి సకలజంతువులు జీవించుచున్నటుల యితరాశ్రమములన్నియు, గృహస్థాశ్రమము నాశ్రయించుచున్నవి. గృహస్థాశ్రమము సాగరమువంటిదనియు, ఇతరాశ్రమములు నదులనియు దెలుసుకోవలెను. అనగా నదులన్నియు సాగరమునే యాశ్రయించునుగదా! ఇట్టి గృహస్థాశ్రమమే శ్రేష్ఠమైయున్నదని మహామహులు దెలుపుచున్నారు. దీనిని వ్యర్థముజేసికొని ఈశ్వరభక్తిశూన్యులై, పాపభూయిష్ఠులై, వ్యర్థులగుట కడుంగడు విచారమునకు హేతువగుచున్నది. అయినను మరణకాలమునందు భగవధ్యానము జేయుటవలన సమస్తపాతకమునుండి విముక్తుడగునని యనేక ఇతిహాస

ములు గప్పట్టుచున్నవని కొందరు దలంచవచ్చును. అట్టికోరిక నిష్ఫలము ఏలననగా కఫవాతపిత్తాదులచే గప్పంబడి మాయామోహితుడై స్మృతిలేక బడియుండును. అజామిళుడు, ఖట్వాంగమహీపాలుడు మున్నగువారు తరించుటకు జన్మాంతర సంస్కారము వలన హఠాత్తుగా భక్తియోగము సంప్రాప్తించి తరించియున్నారు. దేవపితృకార్యాసక్తుడగు గృహస్థుడు తరింపగలడని విధులు నిర్ణయించుచున్నవి. గావున గృహస్థుడు షట్కర్మనిరతుడై వైదికసంస్కారాసక్తుడై శ్రద్ధాన్వితుడై దయాసత్యశౌచాదులతో సర్వమానవసౌభ్రాతృత్వపరాయణుడై వర్తించుట శ్రేయస్కరమనియు పవిత్రమోక్షహేతుభూతమనియు దెలియుచున్నది.........

---

# ఆంధ్రరాష్ట్రీయాదిశైవ - యువజనసంఘ ద్వితీయవార్షిక సమావేశము, పొన్నూరు.

శ్రీయుతులు నాగలింగం సుబ్బయ్యగారి (పొన్నూరు) యాహ్వానము ననుసరించి ది 21–5–34 తేదీన విజయవంతముగ పైసమావేశము పర్యవసితమగుట యువజనసంఘమందు ఆదిశైవ సంఘీయులకు గల నిరవధికాభిమాన విశ్వాసములు వ్యక్తీకరింపబడుచున్నవి. ఈ సమావేశమునకు శ్రీమాన్ సత్తెనపల్లి హనుమంతరావుగారు అధ్యక్షులుగ నుండుట కంగీకరించి కార్యాంతరములచే సభకు రాజాలక పోయిరి. అందువలన సాంఘికుల ప్రోత్సాహమువలన శ్రీయుత చావలి బాలసుందరరావుగారు అధ్యక్షతవహించి ధర్మనిర్వహణము సర్వతోముఖప్రతిభను ప్రదర్శించునట్లు నూత్నభావాంఛితమై సుందరముగ మృదుమధుర వాక్యములతో సంఘసంస్కరణ విధానావలంబనము ఆవశ్యకమని మహోపన్యాసముగావించి సభికులనోలలాడించిరి. పిమ్మట

కార్యదర్శినివేదిక చదువబడి యీక్రింది తీర్మానము లేకగ్రీవముగా నంగీకరింపబడినవి. (తీర్మానములు)

౧. ఆదిశైవ బ్రాహ్మణ సంఘచరిత్రను ప్రవరాదివిషయములతో సుప్రసిద్ధులైన పండితవర్యులచే వ్రాయించి శ్రీకనుపర్తి మార్కండేయశర్మగారు ప్రకటింపనున్న బ్రాహ్మణ సంఘచరిత్రయందు ప్రకటింపజేయుట ముఖ్యమని యీసభవారు తీర్మానించుచున్నారు.

ఉ॥ నా. వేంకటేశ్వరశాస్త్రిగారు.
ఆ॥ చావలి కోటేశ్వరరావుగారు.

౨. మితిలేని వ్యయప్రయాసలతో సంఘోద్ధరణకై శ్రమపడుచున్న ఆదిశైవ పత్రికకు నూతనచందాదారుల సేకరించుటకును దిగుబాటు ద్రవ్యమును వసూలు పరచుటకును విలేఖరులు మున్నగు శోభాయమాన సామగ్రులను సంతరించుటకు ప్రచారమొనరింపవలెననియు యీసభవారు తీర్మానించుచున్నారు.

ఉ॥ నాగలింగం చినవేంకటేశ్వరశాస్త్రిగారు
ఆ॥ సోమరాజుపల్లి వెంకటరామయ్యగారు

3. శీఘ్రకాలమున యీ సంఘమునుండి శాఖాసంఘములు ప్రతిజిల్లాయందు స్థాపింప ప్రచారమొనరించుటకు యీసభవారు నిశ్చయించుచున్నారు.

ఉ॥ చావలి కోటేశ్వరరావుగారు.
ఆ॥ నాగలింగం రాఘవయ్యగారు, నూతక్కి.

౪. ఈ క్రింది విధముగా పరిపాలనవర్గమును యీసభవారు యేర్పరచుకొనుచున్నారు.

అధ్యక్షులు:- నాగలింగం వేంకటేశ్వరశాస్త్రిగారు.
ఉపాధ్యక్షులు:- పణతుల విశ్వనాథరావుగారు.
కార్యదర్శి:- సోమరాజుపల్లి వెంకటరామయ్యగారు.

సహాయ కార్యదర్శులు:- { చావలి కోటేశ్వరరావుగారు.
నాగలింగం చినవేంకటేశ్వరశాస్త్రిగారు. }

కోశాధిపతి:- నాగలింగం, రాధాకృష్ణమూర్తిగారు.

కార్యనిర్వాహకులు.

1 నండూరు చంద్రమౌళిగారు.
2 మామిళ్లపల్లి నాగయ్యగారు.
3 మురికిపూడి రాఘవయ్యగారు.
4 సంగాపు మల్లిఖార్జునరావుగారు.
5 చావలి కృష్ణమూర్తిగారు.
6 నాగలింగం, రాఘవయ్యగారు.
7 చావలి బాలసుందరరావుగారు.
8 వడ్లమూడి పిచ్చయ్యగారు.
9 స్వర్ణ బాపనయ్యగారు.
10 నాగలింగం సకలేశ్వరరావుగారు.
11 నాగలింగం రామమూర్తిగారు.
12 పొన్నూరు బావయ్యగారు
13 గూడలి లక్ష్మీకాంతంగారు.
14 గూడూరు వియ్యన్నగారు.
15 అయలూరు నీలకంఠంగారు.

ఉ॥ కుందుర్తి ఆనందరావుగారు.
ఆ॥ నాగలింగం సీతారామయ్యగారు.

౫. ప్రస్తుతము దేశమునందు జరుగుచున్న ఆందోళనమను సరించి గ్రామపరిస్థితుల గమనించి ఏకగ్రీవమైన న్యాయబద్ధతను పరిశీలించి అర్చక మహాజనులు హరిజనులదేవాలయ ప్రవేశమును అంగీకరింపని యడల సంఘజీవన శోభలు సన్నగిల్లగలవని నిర్ణయించుచూ అత్యవసర మైనప్రదేశములందు ప్రచారమొనరింప యీ సభవారు నిశ్చయించు చున్నారు.

ఉ॥ నాగలింగం వేంకటేశ్వరశాస్త్రిగారు
ఆ॥ పణతుల విశ్వనాథరావుగారు

౬. ఆదిశైవకవుల రచనలను అనతికాలమున సంపాదించి ప్రకటించుట కవకాశములు గలుగజేయుట ముఖ్యమని యీసభవారు అభిప్రాయపడుచూ కార్యక్రమమున కుపక్రమింప తీర్మానించుచున్నారు.

ఉ॥ సోమరాజుపల్లి వెంకటరామయ్యగారు.
ఆ॥ పణతుల విశ్వనాథరావుగారు.

పిమ్మట శ్రీమాన్ నాగలింగం వేంకటేశ్వర శాస్త్రిగారు విస్తృతముగను, మృదుమధురముగ నుపన్యసించిరి. పలువురచే వివిధోపన్యాసములు గావింపబడి యధ్యక్షుని యంత్యోపన్యాసములతో సభ జయప్రదముగా ముగింపబడెను. ఓం శాంతి శ్శాంతి శ్శాంతిః.

సెక్రటరి [నందివెలుగు.]

---

# వార్తలు.

దేశీయమహాసభయందు [కాంగ్రెసునందు] స్వరాజ్యపార్టీ వారి ప్రోత్సాహములతో శాసనసభ్యత్వము నంగీకరింపబడుటచే రాబోవుఎన్నికలయందు కాంగ్రెస్సు పార్టీవారుగూడ యభ్యర్థులుగా నిలువగలరని జస్టీసుపార్టీవారేకమై తమతగవులను కక్షలను పారద్రోలి కాంగ్రెసువారిని ఓడింప ప్రబల ప్రయత్నమొనరించు చున్నారని గుసగుసలు బయలుదేరినవి.

* * *

సత్యాగ్రహ ప్రచారము ప్రస్తుతము నిలిపివేసినందున ఖైదీలను విడుదల చేయుటయు ప్రభుత్వమువారి వశమందున్న ఆశ్రమములు తిరిగి కాంగ్రెస్సువారి కొసంగుటయు జరుగుట వలన ప్రస్తుతము దేశమున ప్రశాంత వాతావరణము జుట్టుకొనియున్నదని పలువురు ఆనందించు చున్నారట.

* * *

శారదాయాక్టు బాధలనుండి తప్పించుకొనుటకు ఫ్రెంచివారి పేటలయందును నైజాంవారి భూములయందును వేలకువేలు పెండ్లిండ్లు జరుపుచుండుటచే బ్రిటీషుగవర్నమెంటువారి తీవ్రమైన శిక్షనులతో శారదా సంఘములు, కేసులుపెట్టి జరిమానాలువేయక తప్పనందున ప్రజలు మిక్కిలి భీతిల్లుచూ గత్యంతరమునకు యోచించుచున్నారట.

* * *

శ్రేయస్కరమైన రజస్వలానంతర వివాహములు యిష్టమైన ప్రజలు ఆచరింపగలరేగాని నిర్బంధ చట్టములతో నూతనాచారములు స్థాపింపబూనుట కేవలము మోటుగానున్నదని పలువురు సనాతనులు విచారమును బొందుచున్నారని హాస్యము జేయుచున్నటుల దెలియ వచ్చుచున్నది.

♦ ♦ ♦

అవతారపురుషుడగు గాంధిమహాత్ముని ప్రచారమునందు నిష్కారణ వైరముబూని తిరస్కరించి వ్యతిరేక ప్రవర్తనులవలె నటించుచున్న సనాతన నామధారులు, లజ్జింపక అనాలోచితముగా, మహాత్ముని పైబడి కొట్టుటయు, బాంబులు విసరుటయు, రైలుపట్టాల నూడదీయుటయు, ప్రాణములుదీయ నుద్యమించుటయు, జరిగించు చుండుట మిక్కిలియవమాన కరమైన విషయములని ప్రతివారును తహతహ పడుచూ, మహాత్ముని దీవించుచుండుటవలన మన పూర్వా చారపరాయణుల హృదయములందుగల అసూయాగ్ని నానాటికి వృద్ధియై, వెర్రివెంగళాయకథలోనికి దింపుచున్నదని లోలోన దలంచని వారుండ నేరరు.

♦ ♦ ♦

వర్ణాశ్రమధర్మ నిర్వహణము నావల్ల ద్రోసిపైచి, పూర్వాచార పరాయణత్వము బుగ్గిగావించి వేదసంస్కృతపఠనము యజ్ఞయాగాది క్రతువులు ధ్వంసమొనరించి నిరాధారులై పాశ్చాత్యవేషభాషా ప్రవీణులై, స్నానసంధ్యానుష్ఠానములు గ్రంథాలయందు భద్రపరచి మాన హోత్తములని విర్రవీగెడి మన సనాతన మహామండలివారి ప్రవర్తన గురించి, నవ్వనివారుండ నేరరని యింతవరకు గుర్తెరుంగజాలనందులకు పలువురు వగచుచున్నారని దెలియవచ్చుచున్నది.

---

## అతనిమహిమ.

౧. తను వ్యాఘ్రచర్మధరుఁడై
తన భక్తుల దివ్యవస్త్రధారుల జేయుఁ
ఎనలేని కృపారసమున
అనఘాత్ముండతని లీల లతిచిత్రములౌ.

౨. తను వృషభవాహనుండయి
తనవారల, రథతురంగ దంత్యాది, సువా
హన, సంస్థితులను, జేయును
ఘనుఁ, డాతని మహిమ, దెలియగా, శక్యంబే.

3. తను భస్మము ధరియించుచు
తనయాశ్రితులను, సుగంధ తతపరిమళ, చం
దన, లిప్తాంగుల జేయును,
ఘనతేజుం, డతనిమహిమ, గననద్భుతమౌ!

౪. తను సర్పభూషణుండయి
తన సేవాసమితి నెల్లఁదనుపు, హేమ ర
త్న నవభూషణాదుల,
గన, నాతని వర్తనంబు, గడు చోద్యంబౌ!

౫. తను పైశాచికరాజై
తన పరిచారికుల, రాజ్యతంత్రజ్ఞులుగఁ
ఘన సార్వభౌములుగ జే
యును, నాతనిమహిమ, గననహో! నవ్వాలయుఁ.

"చిట్టికవి"

# వి వి ధ పా ప ము లు

[శ్రీయుత - పుచ్చాసత్యనారాయణశర్మగారు]

తైత్తిరీయోపనిషత్తునందు [నారాయణోపనిషత్తు ౫౭ వాక్యము] పురుషులకు లభించు పాపమార్గములు దెలుపబడినవి. ఆవివర మిట్లున్నది.

౧. దేవకృతపాపము అనగా దేవతలవిషయములో చేయు పాపము. దేవతా కార్యములు చేయవలసినవి చేయక పోవటము చేయువానిని ఆక్షేపించి లోపములు గలుగజేయుట దేవకృతపాపమనబడును.

౨. మనుష్యకృతపాపము అనగామనుష్యులవిషయములోచేయు పాపము. పెద్దవారిని ధిక్కరించుట, ఇతరులకు ద్రోహ మొనరించుట, ఇతరులధనమపహరించుట, ఇతరస్త్రీలతో క్రీడించుట, ఇతరులనువంచన జేయుట, అసత్యమాడుట, ఇతరులకు నష్టముకలుగజేయుట, శక్తిగల్గియు అతిధి అభ్యాగతులను పోషింపకపోవుట మున్నగునవి మనుష్యకృత పాపమనబడును.

3. పితృకృతపాపము అనగా పితృదేవతల విషయములో జేయు పాపము. శ్రాద్ధాదులు చక్కగాజేయకపోవుట, అశ్రద్ధచే క్రియలు లోపముచేయుట, తర్పణాదులు జరుగకపోవుట పితృకృతపాపమన బడును.

౪. ఆత్మకృతపాపము అనగా ఆత్మవిషయకమైన పాపము. పోరానిచోట్లకుబోవుట, పొందరాని స్త్రీలనుపొందుట, కామ క్రోధ లోభ మోహ మద మాత్సర్యాదుల వృద్ధిపరచి భక్ష్యాభక్ష్యవిచారణ జేయక అధర్మవర్తనముతో అధోగతి పాలగుటయే ఆత్మకృతపాప మనబడును.

౫. అన్యకృతపాపము అనగా ఇతరులవలన గలుగు పాపము. భార్యపుత్రాదులుచేసిన పాపము భర్తకును, ప్రజలుచేసిన పాపము రాజునకును, రాజుచేసిన పాపము పురోహితుల ( ఆయన కాలోచన చెప్పువారల ) కును, శిష్యులపాపము గురువులకును, జెందుటయేగాక యే వంశములోనైనా పరమపాపి జన్మించినచో ఆ వంశమునందు మూడు, ఏడు తరములవారధోగతి పోవుటయే అన్యకృత పాపమన బడును.

౬. అస్మత్కృతపాపము అనగా సమిష్టికుటుంబము నందు కుటుంబయజమానిగాని, మరెవ్వరో ఒకరు గావించిన పాపము. ఆ పాపము అందరకు జెందుటయే అస్మత్కృత పాపమనబడును.

౭. రాత్రిగాని, పగలుగాని గావించుపాపము. ౮. స్వప్నావస్థ యందుగాని, జాగ్రదావస్థయందుగాని గావించుపాపము. ౯. సుషుప్తి యందుగావించుపాపము. ౧౦. బుద్ధిపూర్వకముగను, ప్రమాదవశమునను గావించు పాపము. ౧౧. పాపులతో చెలిమిజేయుటవలన గలుగు పాపము. ౧౨. ప్రాణమిత్రులవలన గలుగుపాపము. ౧౩. మిత్రద్రోహమువలన గలుగుపాపము. [యింకను యెన్నియోవిధములు గలవు.]

[సశేషము.]

సోదరులారా! వేదములయందు పాపవర్ణనమిట్లు జెప్పబడి యున్నది. గావున ప్రతిమానవుడును జాగ్రతతో తమ జీవితములను వెళ్లదీయుట ముఖ్యావస్యకమని విన్నవించుచున్నాను.

---

# శ్రీ ఉమామహేశ్వర భక్తసమాజము.

మా సమాజమునకు శ్రీ జగద్గురు, శ్రీకంఠశివాచార్యస్వాముల వారరుదెంచి భక్తిజ్ఞానదాయకములగు ఉపన్యాసములు గావించి తరింపజేసిరి. పురప్రముఖులనేకులు విచ్చేసి సభను జయప్రదముగా

నెరవేర్చిరి. గానవిద్యా విశారదులగు, శ్రీమాన్ చినలూరు కుమార స్వామిగా రరుదెంచి మమ్మానందాబ్ధినిముంచినటుల గానవిద్యాప్రదర్శనము గావించిరి. మంత్రశాస్త్ర జ్యోతిషవిద్వాన్ శ్రీమాన్ అకలంకం నృసింహాచార్యులవారరుదెంచి విశిష్టాద్వైతమునుగూర్చి ఉపన్యసించిరి. పరమేశ్వరుడీ మహాశయుల కాయురారోగ్యైశ్వర్యాదు లొసంగి రక్షించుగాత! యని మా సమాజము ప్రార్థించుచున్నది. యీ విధముగనే పెద్దలు మాయం దనుగ్రహముంచి మా సమాజమునకు దయచేసి మాకు జ్ఞానప్రదాన మొసంగ ప్రార్థించుచున్నాము.

ఇట్లు.

మకాం, శృంగారపురం. } పుచ్చా సత్యనారాయణశర్మ, కొల్లిపర కోటయ్యగురుకులు.

---

## వి భూ తి

శ్రీమాన్ కొలకలూరు శేషశాస్త్రిగారు.

గీ॥ భక్తులకు నెల్ల ముంగొంగు పసిడిపండు
కలుషముల జెండు వజ్రంపు కణికెసుండు
పూని ధరియింతు రేని విభూతిమెండు
గాంచ నపవర్గమిదియె మార్గము వినుండు.

## చి త్ర ప్ర శ్న

గీ॥ ముప్పు......... ముఖ్యుడెవడు
తప్పు...... ...ధవుడతండె
ముప్పు......... ప్రోచు నెవడు
తప్పు...... ...త్రాతయతడె
[ఈశ్వరపరంబు దీని పూరించుడయ్య]

---

# సంపాదకీయములు.

## స్వవిషయము.

సాంఘిక నిరాకరణమే నిరుత్సాహమునకు తావగుచున్నది. ఉత్సాహమున కేమాత్రము సావకాశము లేకపోయినను గత్యంతరము గాన్పించుటలేదు. పత్రికనుయస్తమింపజేయుట కంతరాత్మయొప్పుకొనక ఈశ్వరానుగ్రహముచే సాంఘికులు సహాయపడగలరని ఆత్మప్రబోధము గలుగుటచే విశ్వాసరాహిత్యమగుటలేదు. వెనుకటి స్థితిని దలంచినప్పుడు గుండెలు బ్రద్దలగుచుండును. "ముందునకు బోవ నూయియు వెనుకకు దిరుగ గోయియు" యనుసామెత మమ్ములను బాధించుచున్నది. పదిసంవత్సరములు జరిగినను సాంఘికులకుత్సాహము యభిమానము శ్రద్ధగలుగనందుకు మిక్కిలి వగచుచున్నాము. పత్రికా ప్రచారమునకంటె సంఘాభివృద్ధికి మరొక మార్గము సూచించువారున్నయెడల వారికి నమస్కరించి వారి యాజ్ఞాప్రకారము వర్తించగలమని మనవి చేయుదుము.

## చందా దారులు.

మహానుభావులగు మీరు మీ మీచందాలు బంపునది లేనిది తెలుపవలెనని పలుమార్లు విన్నవించి నిరర్థకులమైతిమి. పత్రిక విషయములో యింతటి మోసము తగదని మనవిచేసితిమి. చందా సగమునకు తగ్గించితిమి. బ్రతిమాలితిమి. విసిగి వేసారి మౌనము వహించితిమి. యిట్లొనరించుట మీకు తగునా? యిది న్యాయమా? మీకు శక్తిలేదా? మీయుద్దేశ్యము మాకు వ్రాయవలయునను మావిన్నపమాలకించి శక్త్యానుసారము వెంటనే సహాయపడగోరుచున్నాము. మాబాధను గమనింప ప్రార్థితులు.

## శ్రీకంఠ శివాచార్యులవారు.

శ్రీవారు శ్రీ శ్రీకంఠాచార్యకృత భగవద్గీతాభాష్యమును ఆంధ్రాక్షరములతో ఆంధ్రతాత్పర్యములతో ప్రకటించుచున్నారు. షుమారు

ఆరు అధ్యాయములు అందినవి. ఇంకను పదిరెండు అధ్యాయములు గలవు. వసూలు అయినద్రవ్యము యిప్పటికే పూర్తి అయినట్లును యింకను రెండురెట్లు ద్రవ్యము ప్రోగుచేయవలెనని శ్రీవారు ఆజ్ఞాపించుచున్నారు. శ్రీవారి సంకల్పానుసారము ఈశ్వరానుగ్రహము. సాంఘీకుల సాహాయముతో పూర్తియగునను విశ్వాసముగలదు. గావున సాంఘిక మహాశయులు శ్రీవారి నాహ్వానించి శక్త్యానుసారముగా పూజించి గీతాభాష్య సహాయకద్రవ్యమును సమర్పింప హెచ్చరించుచున్నాము. శ్రీవారు శరీరారోగ్యమును పాటింపక సంఘోద్ధరణకై పాటుబడుచుండుట సర్వజనవేద్యమే. భాష్యత్రయముద్రణ విషయములు సామాన్యమానవులవలన గానేరవని తెలుసుకోవలెను. శ్రీవారి ఏలూరునుండి చిత్తూరు జిల్లా పర్యటనముగావించి భీమడోలునందు విశ్రాంతిగైకొని కృష్ణాజిల్లా ప్రచారము గావింపగలరని తెలియుచున్నది.

విషాదము.

మాపత్రికోద్ధారకులలో నొకరగు కొల్లిపర పిచ్చయ్య (పెనుమూలి) గారు శివలోక మలంకరించుటవలన మేము మిక్కిలి చింతిల్లుచూ మాసానుభూతిని వారికుటుంబమున కందజేయుచూ శ్రీవారి కాత్మశాంతికొరకు ప్రార్థించుచున్నాము.

సన్మానములు.

శక్త్యానుసారముగా పత్రికాసన్మానము జరిపిన మహాశయుల కనేక వందనములొనరించుచూ హృదయపూర్వకముగా నభినందించుచున్నాము. పరమేశ్వరుడు శ్రీవారల కాయురారోగ్యముల నొసంగుగాత.

## ఈనెలలో చందాలు చెల్లించినవారు

| | | |
|---|---|---|
| ౧. శ్రీమాన్ వలివేటి విశ్వనాథంగారు (భావ) రాజపోషక చందా | | 3-0-0 |
| ౨. ,, చావలి పిచ్చయ్యశర్మగారు | డిటో | 3-0-0 |

కారణోత్తర తంత్రక్రియాపాదము నందొక ఘట్టము గనిపించినదట. అనాదిశైవులు అనగా లింగధారణకొరకై యిరువదియొక్క దీక్షల బొందిన జంగమదేవరలని వ్రాసియున్నదట. అందువలన ఆదిశైవులు అనాదిశైవులైన జంగమదేవర్లచే దీక్షను పొందినవారే గదా యను నుద్ధేశ్యము మనస్సులోనిడికొని అనాదిశైవులకు ఆదిశైవులకు భేదము చాలాయున్నదని ప్రశ్నించుచున్నారు. కారణోత్తర తంత్రము, అష్టావింశత్యాగములోనిది గానేరదు. గావున శంకర సంహితయందు జెప్పిన శైవవిభాగమునందు "అనాద్యాఖ్యమహంశైవో, మత్సుతాగణకాదయః" యను వచనమునందు యిరువదియొక్క దీక్షలను బొందిన జంగమదేవరలను యర్థమువచ్చుటలేదని సర్వులకు విశదమైయున్నది. అనాదిశైవమనగా శివగణము. అట్టిశివునివలన దీక్షనుబొందినవారు ఆదిశైవులు. అంతయేగాని, "శూద్రావై వీరశైవాస్తు" అనెడి ప్రమాణమునకు జెందిన వీరశైవులనే జంగములకు అనాదిశైవమను పేరు గలుగనేరదని దలంతుము.

౨. మాపత్రికయొక్క మూడవసంపుటము మూడవసంచిక యందలి 14 పేజీయందు వ్రాసిర సుప్రభేదాగమము [ 236 పేజీ యందు 74, 75, 76 శ్లోకములతో పూర్తిగావించిన విషయము] లో యింకను కొన్నిశ్లోకములు గలవనియు, అందు లింగధారుల విషయమై యున్నదని వ్రాసియున్నారు. మావద్దగల సుప్రభేదాగము నందా శ్లోకములు లేవనియు, తాము వ్రాసినశ్లోకముల సంఖ్యలుకూడా భేదముగానున్నవనియు దెలుపుచున్నాము. ఆ శ్లోకములు మేమువిడిచి పెట్టినామనేసందేహము నివర్తిచేసుకోవలెనని గోరుచున్నాము. శంకరపూజకులగు ఆదిశైవులకంటె (జంగమదేవరలు) లింగధారణ గావించువారు శ్రేష్ఠులనెడి యుద్దేశ్యము స్వామిగార్కి గలుగుట సహజమే యనియు, ఆ యా మతస్థులు వారివార్కి లభించిన ప్రమాణముల వలన మతసేవజేయుట న్యాయమైనను పూర్వాపరసందర్భములు దెలిసికొని శాస్త్రసమ్మతమైన వాదమునరించుట శ్రేయస్కరమని హెచ్చరించుచున్నాము.

---

చందా రు 1-8-0 లు. Regd. No. M. 2073.

# శ్రీ ఆదిశైవ పత్రిక.

శ్రీ శ్రీకంఠ మఠాధిపతుల యాజ్ఞానుసారముగా, శైవ సంఘాభ్యుదయమునకై శ్రీ గురుకులాశ్రమమునుండి ప్రతిమాసము ప్రకటింపబడును.

సర్వదేవాత్మకో రుద్రస్సర్వే దేవాశ్శివాత్మకాః।
రుద్రస్య దక్షిణేపార్శ్వే రవిర్బ్రహ్మా త్రయోఽగ్నయః।
వామపార్శ్వే ఉమాదేవి విష్ణుస్సోమోపి తేత్రయః॥

(రుద్రహృదయోపనిషత్)

సంపాదకుడు:—చిలుమూరు పురుషోత్తమ గురుక్కల్.

| | | |
|---|---|---|
| సంపుట ౧౦ | చిలుమూరు, కొల్లూరుపోష్టు<br>భావనామ సం॥ర శ్రావణభాద్రపద మా॥లు | సంచిక ౫-౬ |

(విలేఖకుల వ్యాసములకు సంపాదకులు ఉత్తరవాదులు కానేరరు.)



—♦ విషయసూచిక ♦—



భారతీ ప్రెస్, తెనాలి.

# ఉద్ధారకులు

౧ కీ॥ శే॥ చిలుమూరు తీర్థేశ్వరులవారి జ్ఞాపకార్థం కుమాళ్లు ఉమామహేశ్వరం వగైరాలు, చిలుమూరు.

౨ కర్ణాటక రాష్ట్రీయ ఆదిశైవ మహాసంఘమువారు, బెంగుళూరు.

౩ శ్రీమాన్ నడింపల్లి నాగేశ్వరశివాచార్యులుగారు, ఇంటూరు.

౪ ... గూడూరు రాఘవరావుగారు, పోతునూరు.

౫ ... గూడూరు శీతయ్యగారు, శనివారపుపేట.

౬ ... అయలూరు వెంకటసుబ్బయ్యగారు, ఆర్తమూరు.

౭ ... పావులూరు రామచంద్రయ్యగారు, మునికోటిపురం.

౮ ... పావులూరు హనుమంతయ్యగారు, మునికోటిపురం.

౯ ... పెనుమూడి సత్యనారాయణగారు, తూర్పుకూచిపూడి.

౧౦ ... స్వర్ణ వెంకటశివావధానులుగారు, బూతుమల్లి.

౧౧ ... పావులూరు నాగేశ్వరశర్మగారు, అనంతవరం.

౧౨ ... పెనుమూడి హనుమంతరావుగారు, తెనాలి.

౧౩ ... మామిళ్ళపల్లి శంకరమ్మగారి జ్ఞాపకార్థం భర్త శివరామ దీక్షితులుగారు, చుండూరు.

౧౪ ... మామిళ్ళపల్లి సాంబయ్యగారు, చుండూరు.

౧౫ ... పొన్నూరు సుబ్రహ్మణ్య పాకయాజిగారు, దండమూడి.

౧౬ ... వేదూరు శివయ్యగారు, తేలప్రోలు.

౧౭ ... కుందుర్తి ఆనందరావు; B. A., దుగ్గిరాల

౧౮ ... కుందుర్తి పార్వతమ్మగారి జ్ఞాపకార్థం సత్తెనపల్లి వెంకటరామయ్యగారు, ఓవర్ సీయరు, దుగ్గిరాల.

౧౯ ... చావలి రంగయ్యగారి జ్ఞాపకార్థం కుమాళ్లు సుబ్బయ్య వగైరాలు చమడుబాడు.

౨౦ ... సంగాపు పానకాలయ్యగారు, నవులూరు.

౨౧ ... సంగాపు కోటేశ్వర గురుకులుగారు, మంగళగిరి.

౨౨ ... చిలుమూరు వెంకటసుబ్బయ్యగారు, చిలుమూరు.

౨౩ ... చిలుమూరు కుటుంబయ్యగారు, చిలుమూరు.

౨౪ ... శేకూరు రాఘవశర్మగారు, గుడివాడ.

౨౫ ... చావలి సుబ్బయ్య పంతయ్యగార్లు, పినపాడు.

౨౬ ... చావలి లక్ష్మీకాంతయ్యగారు, బాపట్ల.

౨౭ ... కొల్లిపర రామయ్య, పిచ్చయ్యగారు, పెనుమూలి.

౨౮ ... స్వర్ణ చినమల్లయ్యగారి జ్ఞాపకార్థం ధర్మపత్ని బుచ్చమ్మగారు, చీరాల.

౨౯ ... పెనుమూడి శీతమ్మగారు, జొన్నలగడ్డ.

౩౦ ... పసుమర్తి పార్వతమ్మగారు, కూచిపూడి

# శ్రీ ఆదిశైవపత్రిక.

సఘోరరుద్రస్స ఈశానస్సభగవాన్ సమహేశ్వరస్స మహాదేవః ॥
"అధర్వాశిరసి"


పుట | చిలుమూరు, కొల్లూరుపోస్టు. | సంచిక
౧౦ | భావ సం॥ర శ్రావణ, బాద్రపదమాసములు సంచిక ౫-౬ | ౨


"శ్రీ ఆదిశైవాభ్యుదయమ్"

(శ్రీమాన్ రామేశ్వరపు చలమయ్యగారు)

సీ॥ పంచాక్షరీమంత్ర పదిమదెలియనివాడు
మానుషత్వము లేని మహిషిగాడె
శివనామసంకీర్త శీలుగాకున్నచో
నటనావిశేషంబు నడుపగలడె
సాంబమూర్తిని గొల్చి సంసారసాగర
విధినిదాటగ త్రోవ వేరుగలదె
మోక్షనాయకి గౌరిపూజ సేయకయున్న
విద్యావిశేషత వెలయగలరె.

గీ॥ వేరె వర్ణింపనేల యీ విధియటంచు
శివుని ధ్యానంబుకన్నను చిత్తమందు
నిలుపగల మధు పానకంబులు నిజంబు
జగతి వేరొండుకలదొకో శైవులార. ౧

మ॥ మతసంరక్షణయున్ కవిత్వ పటిమా మాధుర్యతన్ రాజకీ
య, తమాషాలు చెలంగు వ్యాసములచే పాలించు యీపత్రికన్
స్తుతియింతున్ మది, నాశైవకుల సుశ్లోక్తిం బ్రసాదించి స
ద్గతికిన్ జూపునుగాదె దైవకృపచే గాంక్షించు నభ్యున్నతిన్. 3

గీ॥ తన్ను ప్రేమించుచుండెడి తల్లిమాడ్కి
తనదు శీలంబుపోషించు తన్విమాడ్కి
ఆదిశైవమటంచు దానవతరించె
పత్రికలయందు మన పత్రికామతల్లి. 3

శ్రీ శ్రీకంఠశివాచార్యకృత భగవద్గీతా భాష్య

## గ్రంథముద్రణ విషయములో

సర్వులు గమనింప వలసిన దేమనగా

ఇప్పటికి యిరువదియొక్క ఫారమును [ఆరవ అధ్యాయము] మాత్రమే తయారై యున్నవి. యింకను షుమారు యేబది ఫారములు కాగలవు ఆంధ్ర తాత్పర్యముతో సహా ముద్రింప బడుచున్నది, గావున సర్వులు శ్రద్ధవహించి మీ మీ శక్త్యానుసారమైన ద్రవ్యము సమర్పించి గీతా భాష్యమును పూర్తిసేయింప ప్రార్థించుచున్నాము. లేనిచో యిది వరకు యీ గ్రంథమునకై ఖర్చుపెట్టిన [300-0-0] మూడు వందల రూపాయీలు నిరర్థకము కాగలదని విన్నవించుచున్నాము.

పత్రికాధిపతి.

# సంపాదకీయములు

సంఘ విషయము

గత్యంతరము లేక తుదకు శ్రావణ భాద్రపదములుగల సంయుక్త సంచికనైనను ప్రకటన చేయగల్గినందులకు సాంఘికులు మా శ్రమను గుర్తించి మా విన్నపములను గమనించి మా ప్రార్థనలచిత్తగించి సంఘాభివృద్ధికై సహాయ మొనరింప గలరని విశ్వసించుచున్నాము. భావసంవత్సరమున సద్భావములు వృద్ధినొంది సాంఘికుల త్యుత్సాహముతో సంఘసేవయొనరింప జాలరా? యను నాశాజ్యోతికి తావులేకుండా వర్తించుటవలన విఫలమనోరథులమై మౌనము వహించి పరమేశ్వరునే నిరంతరము ప్రార్థించుచూ సాంఘి కానుగ్రహమునకై నిరీక్షించుచున్నాము. రాబోవుసంచికలు ప్రతిమాసము వెలువడు నట్లు సహాయ మొనర్పింప ప్రార్థించుచున్నాము.

శ్రీకంఠశివాచార్యులవారు

గోదావరిజిల్లా ఏలూరునందు శ్రీ గీతాభాష్యము ముద్రింపింప దలచుటకై షుమారు రెండు మాసములు మకాముగావించి కార్యక్రమ మారంభించిన పిమ్మట ద్రవ్యాభావముచే గ్రంథము ఆపుదలయగుటచేత శ్రీవారు కాశీక్షేత్రమునకు విజయుం చేసియున్నారు. మహాత్ముల సంకల్పము వ్యర్థముగాక పోయినను కాలానుగుణ్యమగు మార్పులవలన కొంత యాలస్యము సంభవించుచున్నది. సాంఘికులుత్సాహవంతులై శ్రీవారి సంకల్పాను సారముగావర్తించి భాష్యగ్రంథమును పూర్తిగావించి తరింపగలందులకు హెచ్చరించుచున్నాము. కనీసము ఆరు వందల రూపాయలైనను మొత్తముగావించి శ్రీవారిని ఆహ్వానించుట శ్రేయస్కరమని మనవి చేయుచున్నాము.

## బోధాయనసూత్రప్రచారము

గోదావరి గుంటూరు జిల్లాలవారు శ్రద్ధవహించి స్వసూత్ర మగు బోధాయన సూత్రముతో శారీరక సంస్కారములు నెరవేర్చు కొనుచున్నట్లు దెలియుటచే యపరిమితానంద భరితులమై సాంఘికు నభినందించుచున్నాము. మిగతాజిల్లాల వారుగూడ సూత్రగ్రంథము సంపాదించుకొని శ్రద్ధాన్వితులై ఆచరించుటకు ప్రార్థించుచున్నాము పూర్వాపర ప్రయోగ గ్రంథములు ముద్రించుటగూడ యావశ్యకమై యున్నది. అట్టిసంకల్పము గల ప్రయోగ కుశలులగు పండిత వర్యుల తమప్రయత్నములు మాకుదెలియ పరచినచో మేము ఎక్కువగా సహా యపడి వారికోర్కెలు నెరవేర్చుగల మని విన్నవించుచున్నాము.

## చందాదారులు

వీరిసహాయమునే నమ్మి పదిసంవత్సరములనుంచి కష్ట నిష్ఠు ములు సహించి పత్రిక నడపుచున్నాము గాని వీరు ఏకారణమున సు షుమారు రెండువేలరూప్యముల వరకు దిగుబాటు గావించి మౌనము వహించినారు. ఆసహాయమును నమ్మి యింతవరకు పదునాలుగు వందల రూప్యములు ఋణమొనరించి పత్రికను నడిపియున్నాము ఆర్థిక పరిస్తితులు చెడినందున ఒక్కపర్యాయమే చందాసగమునకు తగ్గించి దిగుబాటు వారందరు తామొసంగ వలసిన బాకీని సగమై నను పంపవలె నని యెన్నియో పర్యాయములు పత్రికాముఖము దెలిపి యున్నను, తమ మౌనమును వీడరైరి. కారణము దెలియదు వి. పి. చేస్తే త్రిప్పివైచెదరు. జాబువ్రాస్తే ప్రత్యుత్తర మివ్వరు. స్వయ ముగావెళ్లి దర్శనము చేసినప్పుడు తప్పక వారంరోజులలో పంపుచు న్నామని సెలవిచ్చెదరు. పత్రిక పంపితే పుచ్చుకుంటారు. లేకపోతే ఎందుకు పంపలేదని అడుగరు. యిలాటి సత్పురుషుల నమ్మి పత్రిక నెట్లు ప్రచురింప వలెనో దోచకున్నది.

## మనవిమాటలు

మహానుభావులారా సంఘోద్ధరణకై యవతరించిన నొక మాస పత్రికనైనను పోషింప జాలనంతటి యార్థిక పరిస్థితి మనల నావరించి యుండలేదు. మన స్వంత ఖర్చులు ఏమియు మానుట లేదు. మామూలు వ్యవహారములు సక్రమముగా నడచు చున్నవిగదా. ఆహార నియమములలో గాని నిత్య కృత్యాదులలో గాని మార్పేమియు లేదే ఇట్టి స్థితిలో సంవత్సరమున కొక రూపాయి యెనిమిదణాలు భారమగుచున్నదనుట విచారకరము. అంతటి హీన స్థితి యెప్పుడును రాజాలదని ధైర్యము వహించి కులపత్రికకు సహాయ మొనరించి జాతి మర్యాదల నభివృద్ధి పరచి పూర్వోత్కృష్టతను రక్షించుటకు ప్రార్థించుచున్నాము. పత్రిక వెలువరించుట నిష్ప్రయోజన మని పలకెడి ప్రయోజకులు తాము సంఘాభి వృద్ధికై నిర్మించిన కార్యప్రణాళికను వెలువరించినచో అవకాశము గల్గినంతలో దానిని శిరసావహించి మేముగూడ పాల్గొన గలమని యనేక పర్యాయములు విన్నవించితిమిగదా. పత్రిక మాత్రము వుండాలి? నడిపెడి విషయమే ఆలోచనాంశము ? కార్యస్థానము మార్చుటయా ? నూతన సంపాద కత్వము గావించుటయా ? లేక బాకీలు వసూలు పరచి మామూలుగా జరిగెడి దాని నభివృద్ధి పరచుటయా ? యనెడి సందేహములు బాధించుచున్నవని పలువురు యోజించుచూ పత్రిక స్థితికి వగచుచుండుట సత్యమే. సర్వభారము వహించి పత్రికను నడిపేవారు లభించుటకే మేము నిరీక్షించు చున్నామనుట సర్వజనవేద్యమే. అట్టి మహత్తరుణము లభించేయెడల మేము సంతోషపూర్వకముగా పత్రికా ఆఫీసును సమర్పించి కొంత విశ్రాంతిని గైకొని. మాశక్త్యాను సారముగా సహాయ మొనరింప గలము. పత్రికనుమాత్రము అస్తమింపజేసెడి దుస్సలహాలను దరికి రానీయజాలమని విన్నవించు చున్నాము.

## మహాజనసంఘములు

ప్రతిసంవత్సరము మహాజన సభలుజరిపి తద్వారా సంఘశ్రేయమును దిలకించి యానందించుట సాంఘికలక్షణమని పలువురు దెలుపుచున్నారు. అట్టి యానందము యేస్వల్పకాలమో మనము బొందగలిగితిమేగాని శాశ్వతానందము నొందనేరకపోతిమి. మహాజన సంఘములే నిద్రించుతరుణమున తక్కినవిషయములకై విచారించుట నిష్ప్రయోజనమని మేమనేక పర్యాయములు మనవి చేసియున్నాము. యింతటనైనను త్వరలో మహాజన సభలు జరుపుట శ్రేయస్కరమని విన్నవించుచున్నాము. ఉత్సాహముండిన గాని పనులు నెరవేరవని దెలిసికొని ప్రయత్నించుట ఉత్తమమని పలువురు నాయకులు బలుకుచున్నారు.

## పాఠశాలలు-విద్య

మతవిద్య లభ్యసించుటకై విద్యాశాలలత్యావసరమై యున్నవని సర్వు లెరింగియే యున్నారు ఆదులకై షుమారు పదునైదు వత్సరములనుండి మాజోంట్లు శ్రమ పడుచున్న విషయము సర్వజనవేద్యమై యున్నది. అనేకమంది తగిన వసతులు చిక్కక విఫలమనోరథులగుచున్నారు. మతవిద్యలు పూర్తిగా నభ్యసించినగాని మతము ప్రయోజనకారి కాజాలదు. ఆగమశాస్త్రము స్వసూత్రము ఆయుర్వేదము సంస్కృతము మున్నగు విద్యలు అత్యావసరమై యున్నవని పలువురు ఘోషించుచున్నను తగిన యభిమానము లేక ఉత్సాహముగా పనులు జరుగుటలేదు. యీ విషయములు చాలా అవసరమై యున్నవని విన్నవించుచున్నాము.

## దేవాలయములు-బోర్డు

అర్చక మహాజనులు తమ హక్కులను స్థిరపరచుకొని సదరు మాన్యములు నౌకరీ నిమిత్తం సమర్పించినట్లు పర్యవసానము తేల్చుకొను తరుణమున అర్చకమహాజన సంఘమున భేదాభిప్రాయము గలిగి

నూతన మార్గములు నిర్మించి రాజీపద్ధతి యను నొక సమస్యను సంఘములో ప్రాకించి ధైర్యోత్సాహముల తీవ్రతను మందగింపజేసి వ్యవహారములు కీలాభేలము గావింపబడెను. తుదకు కొందరు పర్యవసానము వరకు బోరాడి విజయమును బొందినను బోర్డువారి వలన ఖర్చులు గైకొనుచున్నను రాజీసమస్యను బురస్కరించుకొని బోర్డువారు పటుత్వమును బొందుచూ జప్తులు వగైరాలతో అర్చకులను వేధించుచున్నారట. మరల వ్యాజ్యములు చెలరేగ గలవు అర్చకులు యిప్పటికే చాలా సొమ్ము వ్రయపడి చాలా ఆయాసము గల్గియున్నారు. యీ వ్యవహారములు ఒక్కవిధముగా సంస్కరింపబడక పోవుటవలన గలిగెడి యిక్కట్లు అంతులేనట్లు తెలియుచున్నది. ఎట్లయిననుఅర్చక సోదరులు అలసత్వము నొందక తమతమ వ్యవహారములు పర్యవసానము దేలువరకు గట్టిగా పోరాడి విజయము నొందునటుల ప్రార్థించుచున్నాము.

## దేవాలయప్రవేశపు బిల్లు

అసెంబ్లియందు లోగడ రంగయ్యరుగారొక బిల్లును ప్రవేశబెట్టి దానిని ప్రజాభిప్రాయమునకంపి సదరు బిల్లును ప్యాసుచేయుట కెంతయో ప్రయత్నించిన విషయము సర్వులకు దెలిసియేయున్నది. సర్వజనులు అనగా హిందువులందరు భగవద్దర్శనార్థమై ఆలయములందు ప్రవేశించుటకు హక్కుగలదు అను విషయమే ఆబిల్లుయొక్క ముఖ్యసారాంశమైయున్నది. దానిని ప్రతిఘటించుటకొక "సనాతన మహామండలి" యను పేరుతో నొకపార్టీవారు అతితీవ్రమైన ప్రచారము గావించినట్లు లోకమేసాక్షి. ఆగమశాస్త్ర ప్రకారము, ఆలయములు నిర్మింపబడెను. ఆగమాచార సాంప్రదాయములతో పూజాదికములు నెరవేర్చబడుచున్నవి. సదరు ఆగమశాస్త్రములలో చెప్పిన ప్రకారము సర్వధర్మములు తిరస్కరించుచూ ఆగమములు అప్రమాణమని వాదించుచూ ఆలయదర్శనమువలన ప్రయోజనములేదని బోధించుచూ అవి అజ్ఞా

నులకొరకై నిర్మించబడినవనియు దేవుని పేరుబెట్టుకొని కొందరు జీవించుటకై మోసగించుటకు నిర్మింపబడిన మందిరములని ఉపన్యాసములు వెల్లడించుచూ ఆగమములు ఆలయములు అర్చనలు తీర్థప్రసాదాదులయందు నైచ్యమును గల్పించి సర్వధర్మనాశనము గావించిన మన మహామండలివారు తమ కపటోపాయములగప్పి పుచ్చి ధర్మమూర్తులవలె రొమ్ములు సాచుకొని ప్రతిఘటించినందుల కభినందింపక తప్పదు. హిందువులే ప్రవేశించుటకు వీలుగాని ఆలయములలో క్రైస్తవ మహమ్మదీయులు నిరాఘాటముగా ప్రవేశించుటకు మన మహామండలి వారు అంగీకరింపక తప్పనిరోజులు సమీపించినవని దెలుసుకొనక తప్పదు. ఆగమశాస్త్ర ప్రకారము ఆలయమునం దెవ్వరెవ్వరేయే స్థానములందుండవలెనో దెలుసుకొని ఆలయమర్యాదల గాపాడి దేశసౌభాగ్యమునకు కారకులగుటకు మన మహామండలి వారిని హెచ్చరించుచున్నాము. సదరుబిల్లు రంగయ్యరుగారే ఉపసంహరించుకొన్నారని దెలియుచున్నది. మన మండలివారిశ్రమ నిరుపయోగమైనది.

విషాదము.

మా పత్రికోద్ధారులును వోవర్సీయరు యుద్యోగము నెరవేర్చుచున్నవారును, యువకులు నగు శ్రీమాన్ సత్తెనపల్లి వెంకటరామయ్యగారికి సంభవించిన కళత్రవియోగమునుగూర్చి మేము మిక్కిలి చింతిల్లుచున్నాము. అనుకూలదాంపత్యముతో మెలంగి సర్వసౌఖ్యములనుభవించి, పుత్రపుత్రికాసంతానమునొంది అల్పకాలముననే భర్తను సంతానమును ముఖ్యబంధువులను దుఃఖాబ్ధిని గూల ద్రోయుట మిక్కిలి విచారకరమైయున్నది. పరమేశ్వరుడీ నారీరత్నమున కాత్మ

శాంతి నొసంగునటుల ప్రార్థింపుచూ శ్రీవారికిమాసానుభూతినందజేయు చున్నాము.

ఆంధ్రసారస్వతపరిషత్పత్రిక.

గుంటూరు మండలమున నర్సారావుపేటనుండి శ్రీయుతులు సాహిత్యవిశారద, కోన వెంకటరాయశర్మగారి యాధిపత్యమున వెలువడు ద్విమాసపత్రిక. ప్రథమ సంచికవందనములతో యందుకొని యమందానంద హృదయులమైతిమి. ఇందలి సద్విషయములు ఆంధ్ర భాషాసంబంధమై సుప్రసిద్ధపండితులచే వ్రాయబడియున్నవి. కొన్ని నూతనాక్షరములుగూడ యావశ్యకమని నిరూపింపబడుచున్నది. భాషా సేవాభిమానులును పండితులుగూడ యీపత్రికను పరిశీలించుటత్యావసరమని మనవి చేయుచున్నాము. సర్వశాస్త్రార్థవేదియగు పరమేశ్వరుని యనుగ్రహమున నీపత్రిక చిరతరస్థాయియై వర్ధిల్లగలదని మావిశ్వాసము. సంవత్సరచందా రెండురూపాయిలు. వలయువారుసంపాదకులకు వ్రాయవలెను.

---

## పత్రికాసన్మానములు

---

౧ శ్రీమాన్ సంగాపువీరయ్యగారు దక్షిణామూర్తిగార్ల తమతండ్రిగారి సాంవత్సరవిమోక శ్రాద్ధతరుణమున పత్రికాసన్మానం నిమిత్తం (పా॥పా॥గారిద్వారా) ౧-౦-౦

౨ శ్రీమాన్ చావలి సుబ్బయ్యగారు తనతల్లిగారి జ్ఞాపకార్థం (పె॥హ॥రావు గారిద్వారా) ౨-౦-౦

## (యీనెలలో చందాలు చెల్లించినవారు)

౧ శ్రీమార్గ బాదంపూడి గవరయ్యగారు (భావ) కందికుప్ప (గో)
౨ శ్రీమార్గ కాళ్లకూరు బాపన్నగారు (భావ) కుండలేశ్వరం (గో)
3 శ్రీమార్గ నందివెలుగు ఆదిశేషయ్యగారు-(లోగడబాకీ) వల్లభాపురం. (గుం)
౪ శ్రీమార్గ లంకా కౌమారస్వామిగారు (భావ) ఆతుకూరు (కృ)
౫ శ్రీమార్గ వడ్లమూడి కోటయ్యగురుకులుగారు. (భావపోషక) వడ్లమూడి (గుం)

## పత్రికాధిపతులకొక మనవి.

అయ్యా మీ పత్రికలపైని మా అడ్రసు సరిగావ్రాయనందున మీరంపుచున్న పత్రికలు సక్రమముగా చేరుటలేదు. యీక్రిందివిధముగా మీ లీస్టునందుసరిచేయించి సక్రమముగా చేరునట్లు చేయగలందులకు ప్రార్థించుచున్నాను.

ఎడిటర్ - ఆదిశైవ.
చిలుమూరు. కొల్లూరు పోస్టు,
తెనాలి తాలూకా.

## ఆశ్రమ నియమములు

( శ్రీమార్గ కొల్లిపర కోటయ్యగురుకులుగారు )

మహాజనులారా! మానవునకు ప్రథమసోపానము బ్రహ్మచర్యము. అద్దానివలన ఆత్మపారిశుధ్యము. శరీర సౌష్ఠవము. మేధా

సంపత్తి. ఆయురారోగ్యములు మున్నగునవి యభివృద్ధినొందగలవని యనేక ధర్మశాస్త్రములు దెలుపుచున్నవి. బాల్యావస్థ మొదలు యౌవనదశవరకు నుండుకాలమే బ్రహ్మచర్యావలంబనమునకు ముఖ్య కాలము. పిమ్మట గృహస్థాశ్రమ మవలంభించి పురుషార్థములు సంపాదించుట విధియై యుండును. అట్టి బ్రహ్మచారి మౌంజీ కౌపీన యజ్ఞోపవీతకృష్ణాజిన పాలాశదండ కమండల భస్మరుద్రాక్షధరుడై సంస్కారహీనశిరోరుహుండై పవిత్రధారియై మౌనియై సంధ్యోపాసనాతత్పరుడై సాయంప్రాతః కాలములం దగ్నికార్యనియతుడై గురుమందిరమున నివసించి సకలామ్నాయ పఠనాసక్తుడై గుర్వాజ్ఞా పరిపాలకుడై విహిత గృహంబుల భిక్షాసంపాదనగావించి గురువునకునివేదించి మితాహారుడై త్రిషవణస్నాయియై ఉపవాసరతుడై అభ్యంజన కేశప్రసాదన మజ్జనాది రహస్యయోగవర్జితుడై జితేంద్రియుడై సూనృతభాషణములతో సత్సాంగత్వము గావించుచుండవలెనని యనేక విధులు ఘంటాపదముగా బల్కుచున్నవి. నైష్ఠికుడనియు ఉపకుర్వాణుడనియు రెండు విధములైన బ్రహ్మచారులుగలరు. ఇట్టి బ్రహ్మచర్యమే ఆయురారోగ్యములకు ప్రధాన సాధనమనియు జన్మరాహిత్యములకు మూలసూత్రమనియు మన మహర్షులు యీమార్గమున వర్తించి త్రికాలవేదులై ధర్మమార్గ ప్రతిష్ఠాపకులై దిగంత యశోవిశాలురై ఆచంద్రార్కస్థాయిగా ప్రకాశించుచున్నటుల మనకు స్పష్టపడుచున్నది.

రెండవది గృహస్థాశ్రమము సమస్తశాస్త్రపారంగతుడై ధర్మశీలయగు ధర్మపత్నినిచేపట్టి సత్సంతానముబడసి షట్కర్మరతుడై బ్రహ్మచర్యమునకు విరుద్ధముగా ప్రవర్తింపక నిరతాన్నదానము గావించుచూ పంచయజ్ఞ పరాయణుడై దీనజన బాంధవుడై ఇంద్రియనిగ్రహుడై దంభమాత్సర్య వర్జితుడై సత్కర్మాచరణ దీక్షాబద్ధుడై వర్తించి అరిషడ్వర్గదూరుడై గురుసేవారతుడై కౌమారదశ పూర్తిగావింపవలెను. గృహస్థాశ్రమము సర్వశ్రేష్ఠమై యున్నదని యనేక ప్రమాణములు గలవు.

మూడవది వానప్రస్థాశ్రమము. దారాపుత్రాదులతో బ్రహ్మచర్యవ్రత మవలంభించి ధర్మజిజ్ఞాసానంతరం బ్రహ్మజిజ్ఞాస నవలంబించి శమదమాది గుణసంపత్తితో కందమూలాదుల భుజించుచూ మహర్షుల సేవించుచూ, తీర్థయాత్రలు గావింపవలెనని దెలియుచున్నది.

నాల్గవది సన్యాశాశ్రమము సర్వసంగ పరిత్యాగియై శిఖాయజ్ఞోపవీత వర్జితుడై ఏకభుక్తుడై సర్వథా ప్రణవమంత్రజప పరాయణుడై ప్రపంచ వ్యతిరిక్తుడై భగవంతునయాజ్ఞకై వేచియుండి జీవబ్రహ్మైక్యసంధానముగావించి తరించుటయే పర్యవసానమనియు జన్మరాహిత్యమగుననియు దెలుసుకోవలెను.

సమస్త ప్రాణులు యీ నాలుగాశ్రమములు విధిగాజరుపుకొని స్వస్థానముజేరుట శ్రేయస్కరము వీటినే బాల్యయావన కౌమార వార్థక్య దశలని పిలువబడుచున్నవి. యీ దశలు పశుపక్ష్యాదులకు సైతము జరుగుచున్నట్లు స్పష్టముగా మనకు గోచరమగుచున్నది. మానవులలో పై ఆశ్రమములు కొందరలవలంబించరాదనియు తరింపక నీచజన్ములై నరకమనుభవింపవలెననియు కఠిన శాసనములు నిర్మింపబడెను. నేటిప్రపంచమునందు నాలుగాశ్రమములు నాలుగుదశలు. సర్వులు అవలంబించుచూ అద్వైత రసాస్వాదనాయత్తచిత్తులై యోగులై వర్థిల్లుచున్నారు. పరిపూర్ణజ్ఞానము గల్గుటయే జన్మరాహిత్య మార్గమనియు సర్వభూతదయాళుత్వమే అద్వైతసిద్ధియనియు అజ్ఞానమే జన్మకు కారణమనియు నిష్కామయోగమే జ్ఞానసాధనమనియు దెలియుచున్నది. లోపములు క్షమింపప్రార్థితులు.

---

## కంట్రిబ్యూషన్ వసూళ్లు

అర్చకుల స్వాధీనములోనున్న భూములు అర్చకత్వపు నౌకరీ నిమిత్తం సమర్పింపబడుటచే అవి అర్చకుల భూములని యర్చకులును దేవునిపేరుతో యున్నందున అవి దేవాలయపుభూములని బోర్డువారును

న్యాయస్థానములందు వ్యాజ్యములు వేసుకొనియున్నారు. న్యాయస్థానముల తీర్పులుగూడ అర్చకుల భూములనియే నిర్ణయించుచున్నవి. ఎవరిభూములైతే మాకేమి నూటికి 1-8-0 లు చొప్పున మాకు కంట్రిబ్యూషన్ యిప్పించవలెనని బోర్డువారు గోరుచున్నారు. కొన్నిచోట్ల అర్చకులకును కొన్నిచోట్ల ట్రస్టీలకును డిమాండు నోటీసులు వచ్చుచున్నవి. ఒక్కదమ్మిడైనను వసూలుగాని స్థితి సంభవింపగా బోర్డువారొక యుక్తిపన్ని సదరు మొత్తములు రివిన్యూ ద్వారా వసూలు చేయునట్లు ఆర్డర్లుపొందిరి. 1931 సంవత్సరమునుండి కంట్రిబ్యూషన్ మొత్తములు రివిన్యూద్వారా వసూలు చేయబడునని ప్రకటనచేసిరి. ఇంతకులోగడ మొత్తము ఎవరు వసూలుచేయవలెనో తెలియుటలేదు. పాతబాకీలుగూడ చుట్టబెట్టి రివిన్యూవారే వసూలుపరచుటకు యత్నించిరి. కొన్నిచోట్ల అర్చకులను బెదిరించి వారి యింటిలోగల ధాన్యమును పాత్రసామగ్రిని జప్తుచేయించి వేలములువేసిరి. యిది ఆక్టునకు విరుద్ధమైయున్నది. దేవుని పూజాసామగ్రిగాని వాహనాదులు గాని అర్చకుల వస్తువులుగాని ఏవియు జప్తుచేయరాదని ఆక్టులోగలదు. కావున అర్చక సోదరులు అధైర్యపడక రివిన్యూవారువచ్చి మీస్వంత ఆస్తిని జప్తువగైరాలు గావించినప్పుడు సదరు నకలుతో సహా జిల్లాకలెక్టరువారికి పిటీషన్ పెట్టిన యెడల వెంటనే విచారించి మీ ఆస్తిని మీకు విడుదలచేయించగలరు. మరియు సదరు కంట్రిబ్యూషన్ విషయమై అర్చకులను ఏమియు అమర్యాదగా మాటలాడరాదు. అట్లు జరిగిన యెడల పరువునష్టము దావా వేసుకొనుటకు అవకాశమున్నది గనుక దేవాదాయపు బోర్డువారుగాని రివిన్యూవారుగాని ట్రస్టీలుగాని అర్చకుల నేమిచేయుటకు అవకాశములులేవు. అట్లు జరిగిన యెడల న్యాయస్థానములే తీర్మానించి శిక్షింపగలవు. అర్చకత్వపు నౌకరీ చేయుచూ వంశపరంపరా అనుభవించుచుండుటయే ప్రబలమైన నిదర్శనమై యున్నది శాస్త్రములందు అర్చకులకొసంగు భూములు దేవుని పేరుతో యివ్వవలెనని యున్నది. ఆచారము అట్లే జరుగుచున్నది.

నూతనాలయములకుగూడ దేవునిపేరుతో సమర్పించుచుండుట సుప్రసిద్ధము. శాస్త్రము, ఆచారము, భుక్తము, అనుభవము. మున్నగునవి విచారించి శ్రీప్రభుత్వమువారు యీదౌర్జన్యమును శాంతింపజేసి అర్చకకుటుంబముల నుద్ధరించునటుల ప్రార్థించుచున్నాము. పరమేశ్వరుడు సత్యమును గమనించుచునే యున్నాడు. అర్చకులు విపరీతపుకోర్కెలు గోరుటలేదు. నౌకరీని చేయుచున్నంతకాలము మాభూములు మాకే సంక్రమించి పూర్వపుమారిదిగా యుండవలెనని గోరుచున్నారు. షుమారు వేయి సంవత్సరములనుంచి కొన్ని అర్చక కుటుంబములు సదరు భూములను సర్వస్వాతంత్ర్యములతో భుక్తపరచుకొనుచున్నట్లు అనేక యాధారములు గలవు. గావున భారతీయసోదరులందరు అర్చకులయందు పరిపూర్ణానుగ్రహముంచి అర్చకసర్వీసు యీనాములను దేవాదాయపు భూములని భ్రమజెందక అర్చకసంఘముల నుద్ధరించి శాశ్వతమైన కీర్తిని గణించుటకు గోరుచున్నాము. "భక్తుల నుద్ధరించుటయే భగవత్సేవయని నమ్ము భారతీయులలోనే డెట్టి విపరీతచర్యలు జరుగుచున్నవో బుద్ధిమంతులు గమనించి పూర్వపుదాతల యుద్దేశ్యములను భంగపరుపక సంరక్షించి హిందూమత ధర్మములుగాపాడునటుల భగవాను డనుగ్రహించునటుల నిరంతరము గోరుచున్నాము. "యతో ధర్మ స్తతో జయః"

చిత్తరంజనాశ్రమము } ఇట్లు,
జి. ఆర్. దాసు

---

## శ్రీబోధాయన సూత్రము

(శ్రీమాన్ బాదంపూడి వీరభద్రశర్మగారు)

శ్రీఆదిశైవమహాజనులారా!

శారీరకాష్టాదశ సూత్రకర్తలలో నగ్రగణ్యులును ప్రథమాచార్యులునగు శ్రీబోధాయన మహర్షులవారు లోకసంరక్షణార్థం కల్ప

సూత్రమును వ్రాసియుండుట సర్వజనవేద్యమైయున్నది. ఆదిశైవవంశో ద్భవులగు శ్రీబోధాయనులవారిచే నిర్మింపబడిన సూత్రముచే శ్రీఆది శైవులు శారీరక సంస్కారములొనరించుట శ్రేయస్కరమనియు అన్య సూత్రాదులచే నాచరించుట నిరర్థకమనియు దెలియుచున్నది. సూత్రాం తరముల వారైనను బోధాయన సూత్రప్రకారం నెరవేర్చుకొనినయడల స్వసూత్రఫలము రాగలదనియు బోధాయన సూత్రమువారు అన్య సూత్రముతో నెరవేర్చుకొన్నయడల కర్మపరిపూర్ణత సిద్ధింప నేరద నియు యనేక ప్రమాణములవలన దెలియుచున్నది. "స్వసూత్రేవిద్య మానేతు పరధర్మేణవర్తతే" బోధాయన మతంకృత్వా స్వసూత్రఫల వాగ్భవేత్, అని పరాశరస్మృతి వచియింపుచున్నది. గావున స్వధర్మా చరణపరాయణులగు ఆదిశైవసోదరులు స్వసూత్రాభివృద్ధి నొనరించి శ్రేయస్కాములగుటకు ప్రార్థించుచున్నాను. మా గోదావరిజిల్లాయందు బోధాయన సూత్రాభివృద్ధి గావింపబడుచున్నదని యానందమును దెలుపుచ్చుచూ మిగతాజిల్లాలయందు గూడ త్వరలో అభివృద్ధినొన ర్పగలందులకు విన్నవించుచున్నాను. శ్రీఆదిశైవ మహాజనసంఘము యొక్క ప్రోత్సాహమువలన శ్రీగురుకులాశ్రమవాసులు బోధాయన మును సమగ్రమముగా బోధించుచున్నారు. ఏతద్గ్రంథములు త్వరలో ముద్రణగావించి సాంఘికు లందరిచేతను సంపాదింపజేయుట శ్రేయస్క రమని విన్నవించుచున్నాను. శ్రీ శ్రీకంఠ మఠాధిపతుల యాజ్ఞాప్రకా రము బోధాయనమునందె మిక్కిలి శ్రమగావించి స్వసూత్రగౌరవము గాపాడుచున్న శ్రీమాన్-అయలూరు కామేశ్వర గురుకులవాకిరిని అయ లూరు రామశాస్త్రులవారికిని సంఘోద్ధరణ దీక్షాదక్షులగు శ్రీఆదిశైవ పత్రికా సంపాదకులకును నిరంతరము నమస్కరించుచూ నాసంతోష మును ప్రకటించుచున్నాను...

---

# వార్తలు

గంగానదీ వరదలు దేశమంతటను వ్యాపించి బీహారురాష్ట్రము నందు చాలాభాగము నష్టపరచినది. ఇదివరలో భూకంపమువలన ప్రజలు చాలా కష్టములజెందియున్నారు. యీ సంవత్సరము మరల వరదలు సంభవించుటవలన అన్నవస్త్రాలకు కూడ కరువుతో అల్లాడు చున్నారని దేశీయ పత్రికలు వ్రాయుచున్నవి.

* * * *

శారదా యాక్టును పూర్తిగా నమలుపరచి శాసనోల్లంఘనము గావించువారిని కఠినముగా శిక్షించుటకై గవర్నమెంటువారాలోచించు తరుణములో రాజాబహదూర్ కృష్ణమాచార్యులుగారొక సవరణ బిల్లు ప్రతిపాదింపగలరనియు శారదా యాక్టు బ్రాహ్మణులకు వర్తింపరాదనియు అథవా పదిరెండు సంవత్సరము గల్గిన బాలికలకు వివాహము జేసినచో శిక్షింపరాదనియు సవరణగావింప గలరని వర్ణాశ్రమధర్మ స్వరాజ్యసంఘమువా రువ్విళ్లూరుచున్నారనియు వారి కోర్కెలు నెరవేరునాయనియు కొందరు పరిహసించుచున్నారట.

* * * *

శైవమతస్థులు శ్రీఉమామహేశ్వర వ్రతమును సక్రమముగా నాచరించి ధన్యులు కాగలందులకు గోరుచూ సదరు వ్రతకల్పము సమగ్రముగా తొమ్మిది అధ్యాయములతో వ్రతకథ గలది ఎచ్చట దొరకగలదో దెలుపవలెనని మాకుపలువురు వ్రాయుచున్నారు. తెలిసినవారు శ్రీఆదిశైవ పత్రికా ఆఫీసునకు వ్రాసిసహాయము నొనరింప గోరుచున్నాము.

* * * *

భీమవరం తాలూకా పెదమెరం గ్రామములో వెంకటేశ్వరస్వామి వారి ఆలయములో అర్చనచేయుచున్న మొవ్వ చంద్రయ్యగారి మీద

పోటీగా తాడేరు గ్రామకాపురస్తులు మొవ్వ శివరామశాస్త్రిగారు సదరు ఆలయములో ప్రవేశించి తక్కువజీతమున కర్చనచేయుచుండగా ఆతక్కువజీతమునకే నేనేచేయుదునని పూర్వపు అర్చకుడుచెప్పినను వినకనూతనముగా వచ్చినవారే బలవంతముగా నివసించుచున్నట్లును. అదిచాలా అన్యాయముగానున్నదని రావూరు నారాణమూర్తిగారు వ్రాయుచున్నారు.

అట్లొనరించుట పౌరపాటనియు విష్ణ్వర్చన వైఖానస బ్రాహ్మణులు గావింప నధికారులనియు పోటీలుపడుట అమర్యాదకర మనియు త్వరలో సర్దుబాటు గావించుట శ్రేయస్కరమనియు హెచ్చ రించు చున్నాము. (సం)

---

## (స్వీకృతి)

భారతవైశ్య

బెజవాడనుండి శ్రీమతులు మానేపల్లి బాపనయ్యగారి సంపా దకత్వమున ప్రచురించెడి వారపత్రిక. ఇయ్యది వైశ్యసంఘమునకే గాక సర్వభారతీయుల స్వతంత్రనుధారాళముగా ప్రచురించుచూ యనేక విషయములతో విరాజిల్లు చున్నది. ప్రథమ సంపుటం పదమూ డవసంచికను వందనములతో యందుకొని యందలి విషయములు పరి శీలించితిమి. బ్రాహ్మణశాఖలో చేరిన వైశ్యసంఘము విద్యాలోప భూయిష్ఠమై నామమాత్రావశిష్టముతో నున్న నీతరుణమున నిట్టి పత్రిక యుద్భవించి సంఘసంస్కరణగావించి స్వమతమును పునీత మొనరించుటకై యత్నించు సంపాదకుల యుద్దేశ్యమును మాహృదయ పూర్వకముగా నభినందించు చున్నాము. వైశ్యసోదరు లీమహత్తరుణ మును వ్యర్థపఱుపక నీపత్రికా సంపాదకులకు సహాయమొనరించి స్వకు లాభిమానముతో స్వసూత్రానుష్ఠానపరులగుటకు హెచ్చరించు చున్నాము. సంవత్సరచందా రు 3-4 0 లు

# చిత్రప్రశ్న

నేనొక ఆయుధమును. నా పేరు నాలుగక్షరములు.

1.4 కలిపిన - తెల్లని వస్తువగుదును.

1-3 కలిపిన - ఇంద్రియములలో నొకటగుదును

1-2 కలిపిన - పశుపతికి ముఖ్యమగుదును

4-2 కలిపిన - దానవుడ నగుదును

నా పేరేమి

(పొన్నూరు బాపయ్య.)

# నేను మళ్లీవచ్చా



ఇదుగో అబ్బాయిల్లారా. నేను ఆఖరుమాట చెప్పేస్తున్నా. తరువాత మీరు నన్నేమన్నాసరె. నాకేమి రోషవేషాలుగాని మానాభి మానాలుగాని లేవు. అవి వదలితేనేగాని శుద్ధచైతన్యము గాదనంటారు గనుక - నేనేగొప్పవాణ్ణి. నాలాటి వాళ్లు సంఘములో దొరకరు సుమా. నేను పది సంవత్సరాల్నుంచి మీతో కలిసి మెలి సేవున్నా. ఏంలాభం. గ్రుడ్డికంటిసామెతైనది గదా. నేను బోధించే ప్రయోజనం లేకపోయిందిగదా. మీరిట్లా శుద్ధ బుద్ధ స్వరూపు లవుతారని నేను ఎరక్కపోతినిగదా ? మీకోసం మీగౌరవంకోసం నేనెంత శ్రమపడ్డానో తెలుసుకో లేక పోయిన తరవాత నేనేంచేసేది: మోసంచెయ్యొద్దయ్యా యని నెత్తినోన్నో రెట్టుక అరుస్తానే గాని లాభం లేక పోయింది. మీసామ్మేంఖర్చంఖుంది. పోతే సంపాదకులే

పేరు వూరు లేకుండా పోతాడుగా ? పత్రిక అక్కర్లేనివారు ఆసంగతి రాస్తేతప్పా ? సహాయం చేస్తేచేసుగూడదా? లేక పోతే మావల్ల కాదనరాదా? యేంరాయకపోతే నేం అంటారా నేనేం చెయ్యాలి : నాప్రచారం వ్యర్థం గావలిసిందేనా? మీకేంశక్తి లేదూ. అభిమానం లేదూ. మాట్లాడరేం. యిదియెవరిపని. పాఠశాలలొద్దూ పత్రికలొద్దూ వ్యాజ్యాలొద్దూ. యింకేంగావాలి. దేవాళాల్లో పులిహోరముద్దలు గావాలన్నా అవి బోర్డువారెత్తుక పోతున్నారే. మీకూట్లో దుమ్మో స్తున్నారే, ముందెలా బతుకుతారు. ఆ ఆలోచనే అక్కర్లేదా. నీవలన సంఘానికేం లాభముందో ఆలోచించుకో. నీ వెంతద్రవ్యం పాడు చేస్తున్నావో లెఖచూసుకో. పత్రికిచ్చే రూపాయిన్నర నీకు భారమైందిగా. మోసుయెన్నాళ్లూరికే పత్రిక సంపాదిస్తారో తెలుసుకోండి- రోజుకెంత దుర్వ్యయంచేస్తున్నారో చూచుకోండి మీ వేషభాష లెట్లున్నాయో, మీప్రయోజకత్వమెట్లుందో మీగౌరవ మర్యాద లెట్లున్నాయో అద్దంబెట్టిచూసుకోండి. మీకంటె నేనేం అందంగా లేక లెండి. నాఅందంతో మీకనవసరం నామాటల్లో వుండే జీవాన్ని ఆకర్షించండి. నన్నుచంపేయకండి. నేన లేకపోతే మీకు దిక్కేలేదన్న మాట. నా కంటె యీ క్షేమం గోరేవారెవరేలేరండి - నామాటి నండి. దబదబా మీ బాకీలు పంపేయండి. అభిమానముంచండి వెళ్లేస్తా. మళ్లొస్తా".

"వెంగళాయ్"

---

# అస్పృశ్యతానివారణము



చం॥ బడులకు నూరి బావులకు బాపలవీధులకున్ దయాత్ములై
యడుగిడనిండు; సత్సభల కాదరణన్, బిలువుండు, శీఘ్రమే,
జడియక; నిమ్నజాతులను, చాలయధోగతి ద్రోసినాము జం,
కుడుగక "యంటరాదనెడి" యుత్త నెపంబాకటుంచి కృతార్థన ౧

చం॥ హరిజనులంచు బేరడిమె, నాదిమజాతుల కాదరంబునన్
సరసుడు, శాంత చిత్తుడును, సర్వసముండు, నరోత్తముండునున్,
కరుణుడు, లోకపూజితుడు, గాంధి మహాత్ముడు, శంకలేల ?
మీ గరువమువీడి, పంచములగణ్యతకున్, దగు దీక్షబూనుడీ! ౨

సీ॥ కడజాతివారని పెడపెడ నెట్టియు,
చెడగొట్టితిమి దేశచెలువ మెల్ల,
పంచములని చాల, కొంచె పుచ్చియు, మేలు
గాంచమైతిమి, రాజ్య గౌరవముల,
అంటరాదని, కడు కంటకమును జూపి,
గెంటితి మదె, దేశకీర్తినెల్ల,
నిమ్న జాతులపైని, నెనరేమి జూపక
స్వాతంత్ర్య రసమును, జంపుకొంటి
తే. గీ. మయ్య! యికనైన తెలివిమై, నాదిమాంధ్ర
సోదరులకున్న, యగచాట్ల బాధలగని,
తీర్పకుండిన, దివ్యుడు, దేవసముడు,
గాంధి మహాత్ము డిడుజుండు, కంటనీరు ౩

ఉ॥ మాలలు మాదిగల్ బయిసిమాలిన వాండ్రని, నీరసంబునన్,
జేరిలుచు, లుబ్ధచిత్తమున, పెద్దరికంబొక సుంతయేని, యీ
జాలక, నుండగూడదిల, క్లిష్టుడు, గాంధి మహాత్ము డల్లదే
"మేలగు జుం, డవర్ణులను, మిక్కిలి జేర్ప, సవర్ణ జాతికిన్,
జాలగనద్దె మోక్షమ" ని జాటుచునుండె వినంగ నెల్లరున్
కాలము నాప నెవ్వరికి, గాదు, సమత్వము నాదరింపుడీ! ౪

తే. గీ. మాల మాదిగలన్నను, మండి పడుచు,
నీచముగ జూచు, మూర్ఖుల పీచమడచి
గారియలు పెట్టు, నిజముగ గడకు, యముడు,

గాన, లోకోత్తరుండగు, గాంధిదేవు
డేది జెప్పునో, యదె సేయు డాంధ్రులార ! గీ

ఇట్లు,
...ండి మెడ } సత్తెనపల్లి హనుమంతరావు.

---

# పాంచజన్యము

ఇదియొక వారపత్రిక. సనాతనధర్మముల నుద్ధరించి వర్ణాశ్రమ ...ర్మ రాజ్య సంఘమువారి యుద్దేశ్యములను ప్రయత్నములను వెలువ ...చుచుండును. ఆంధ్రరాష్ట్రమున కంతటికిని సనాతనపక్షమున ...వాదించు పత్రిక యిదియొకటియే. యిందలి విషయములు సర్వజన ...మ్మతమై యథార్థములై యున్నవి. గాని ప్రస్తుతకాలమున నవనా ...రికతా వ్యామోహ పరవశులైన యువకశిఖామణులకును ...సంస్కరణాభిలాషులకును కొంత వెగటుగా దోచునేమోయని కొందరు ...తలంచుట నిష్ప్రయోజనమనియే మాయభిప్రాయము. గాని వర్ణా...శ్రమ ధర్మపరాయణులు తమతమ శక్త్యానుసారముగా హైందవ ...జ్ఞానమును బోధించుచూ ధర్మశాస్త్రరహస్యముల నుపన్యసించుచూ ...ట్టుబాటు చేయుట ముఖ్యావశ్యకము. అంతియేగాని పేరునకు పండిత ...బిరుదములు దగిలించుకొని శాల్వలు కుండలములు అలంకరించు ...కొనిన ప్రయోజనములేదు. తమ తమ పుత్రులను వైదిక ధర్మమార్గ ప్రవర్తకులుగా నొనరించి వర్ణాశ్రమ ధర్మముల నిలువబెట్టి ప్రాచీనా...చారముల సంరక్షించుకొనుటకై ప్రయత్నములొనరించుట శ్రేయ...స్కరము. శారదాచట్టము ఆలయప్రవేశచట్టము మున్నగువాటిని ...తిరస్కరించుటకు మాత్రమే డాంబికబూటకములతో చిలుకపలుకులు ...పలుకుచున్నయెడల హాస్యాస్పదమగునేమోయని భయపడుచున్నాము. ...సంపాదకులకు శ్రీయుతులు వేమూరు సుబ్రహ్మణ్యంగారీ తరుణమును

నీ పత్రికను స్థాపించినందులకు మాహృదయపూర్వకముగా నభినందిచు చున్నాము. సారాంశము లోకమే గ్రహింపగలదు. ప్రథమసంపుట పదిరెండవ సంచిక మాకార్యాలయ మలంకరించినది. పరమేశ్వరా నుగ్రహమున నీ పత్రిక చిరతరస్థాయియై వర్థిల్లగలదని మా విశ్వా సము. సంవత్సరచందా మూడురూపాయిలు. వలయువారు సంపాద కునిపేర బెజవాడకు వ్రాసుకోవచ్చును.

♦ ♦ ♦ ♦ ♦

శ్రీయుతులు మురికిపూడి వెంకటేశ్వర్లు (వల్లభాపురం) గారి శ్రీముఖ సంవత్సర బాపతు పోషకచందాను వందనములతో స్వీకరించు చున్నాము.

---

## సుభాషిత వాక్యములు

[శ్రీయుత కే. తిమ్మారెడ్డిగారు, వకీలు, గుత్తి]

1. అహింసకన్నను శ్రేష్ఠమయిన ధర్మములేదు. 2. ఆత్మా నాత్మ విచారము తెలిసిన వాడే జ్ఞాని. 3. అబద్ధమాడు వానికంటె పాపము చేసినవాడు, నిజమాడు వానికంటె పుణ్యము చేసినవాడు, మూడు లోకంబులలో వెదకిచూచినను లేడు. 4. దేహము నీటిమీది బుగ్గవంటిది 5 సంపదలు మెరుపుల వంటివి. 6. సుఖమన్న అణు మాత్రము. 7. దుఃఖమన్న పర్వతమువంటిది. 8. పరోపకారముకన్న యెక్కువయిన ధర్మములేదు. 9. పరుల హింసింపరాదు. 10. పరుల ద్రవ్యమును అపహరించరాదు. 11. పరదారల పొందు కోరరాదు. 12. ఆకలిగొన్నవానికి అన్నము పెట్టుము 13. ద్రవ్యదానము యుక్తా యుక్తమెరిగి చేయవలయును. 14. ఆయువు మృత్యువు ప్రేరితమయి కాలచక్రముచేత ఘూర్ణింపబడి క్షీణించుచున్నది. 15. మన సంశయము

కేక యదార్థ జ్ఞానము కలుగదు. 16. సాధుసేవ వలన బుద్ధి అభివృ ద్ధిపొందును. 17. సాధుసేవ వలన నిష్కళంకమగు భక్తిజ్ఞానములు కలుగును. 18 భక్తిజ్ఞానము కలిగినవారికి మోక్షము కరచేత నుండును. 19. సాధుసేవ వలన బహువిధ జన్మ సమార్జితమయిన పాపములు నశించును. 20 భోజనకాలమందు వచ్చిన యతిథిని నిరాకరించి నీరు త్రావిన యది సురాపానము చేసినట్లును, భుజించిన గోమాంసభక్షణ చేసినట్లును అగునని ధర్మశాస్త్రముల యందు చెప్పగడినది 21. ఆప దల కన్నిటికి మూల మవివేకమే. 22. వివేకము లేనివాడు పశువుతో సమానుడు. 23. తల తగిలినప్పుడు తడవి చూచుకొనును. 24 అనృ తముకంటె దురితము లేదు. 25. కష్టము లేక సుఖము కలుగదు. 26. నష్టము లేక లాభము కలుగదు. 27. నిష్ఠలేక నిత్యానందము కలుగదు. 28. కలిమి లేములు కావడి కుండలు. 29. సద్విషయము నెదెప్పటికిని ఐశ్వర్య గర్వము చూపరాదు. 30 ఎవ్వరియందును అసూయత పనికిరాదు.

(సశేషము)

(భక్తిప్రబోధిని)

---

## శ్రీస్వాములవారి రాక

శ్రీ బోధానందమహర్షులవారు యీ భాద్రపదపూర్ణిమ రోజున కాశీక్షేత్రమునుండి బయలుదేరి ఏలూరునకు వచ్చుచున్నారు. గీతా భాష్యము విషయములో మరల పని ప్రారంభము చేయదలచినారు. కావున ఆదిశైవసోదరులు యీ మహద్గ్రంథమునకు శక్త్యానుసార ముగా సహాయమొనరించి పూర్తిచేయ ప్రార్థించుచున్నాము. తక్కిన విషయములు శ్రీవారు దయచేసిన పిమ్మట తెలుపబడును.

ఇట్లు,
పత్రికాధిపతి.

సం॥ చందా రు 1-8-0 లు. Regd. No. M. 2073.

# శ్రీ ఆదిశైవపత్రిక.

శ్రీ శ్రీకంఠ మఠాధిపతుల యాజ్ఞానుసారముగా, శైవ సంఘాభ్యుదయమునకై శ్రీ గురుకులాశ్రమమునుండి ప్రతిమాసము ప్రకటింపబడును.

సర్వదేవాత్మకో రుద్రస్సర్వే దేవాశ్శివాత్మకాః ।
రుద్రస్య దక్షిణేపార్శ్వే రవిర్బ్రహ్మా త్రయోగ్నయః ।
వామపార్శ్వే ఉమాదేవి విష్ణుస్సోమోపి తేత్రయః ।

(రుద్రహృదయోపనిషత్)

సంపాదకుడు:—చిలుమూరు పురుషోత్తమ గురుక్కళ్.

సంపుట ౧౦ } చిలుమూరు, కొల్లూరుపోష్టు భావనామ సం॥ర ఆశ్వయుజ కార్తీక మా॥లు { సంచిక ౭-౮

(విలేఖకుల వ్యాసములకు సంపాదకులు ఉత్తరవాదులు కానేరరు.)



## —విషయసూచిక—



భారతీ ప్రెస్, తెనాలి.

# ఉద్ధారకులు

౧ కీ॥ శే॥ చిలుమూరు తీర్థేశ్వరులవారి జ్ఞాపకార్థం కుమాళ్లు ఉమామహేశ్వరం వగైరాలు, చిలుమూరు

౨ కర్ణాటక రాష్ట్రీయ ఆదిశైవ మహాసంఘమువారు, బెంగుళూరు.

౩ శ్రీమాన్ నడింపల్లి నాగేశ్వరశివాచార్యులువారు, ఇంటూరు.

౪ ... గూడూరు రాఘవరావుగారు, పోతునూరు.

౫ ... గూడూరు శీతయ్యగారు, శనివారపుపేట.

౬ ... అయలూరు వెంకటసుబ్బయ్యగారు, అత్తమూరు.

౭ ... పావులూరు రామచంద్రయ్యగారు, మునికోటిపురం.

౮ ... పావులూరి హనుమంతయ్యగారు, మునికోటిపురం.

౯ ... పెనుమూడి సత్యనారాయణగారు, తూర్పుకూచిపూడి.

౧౦ ... స్వర్ణ వెంకటశివావధానులుగారు, బూతుమల్లి.

౧౧ ... పావులూరు నాగేశ్వరశర్మగారు, అనంతవరం.

౧౨ ... పెనుమూడి హనుమంతరావుగారు, తెనాలి.

౧౩ ... మామిళ్లపల్లి శంకరమ్మగారి జ్ఞాపకార్థం భర్త శివరామదీక్షితులుగారు, చుండూరు.

౧౪ ... మామిళ్ళపల్లి సాంబయ్యగారు, చుండూరు.

౧౫ ... పొన్నూరు సుబ్రహ్మణ్య పాకయాజిగారు, దండమూడి.

౧౬ ... మేడూరు శివయ్యగారు, తెలప్రోలు.

౧౭ ... కుందుర్తి ఆనందరావుగారు B. A- దుగ్గిరాల.

౧౮ ... ,, పార్వతమ్మగారి జ్ఞాపకార్థం సత్తెనపల్లి వెంకటరామయ్యగారు, ఓవర్‌సీయరు, దుగ్గిరాల.

౧౯ ... చావలిగంగయ్యగారి జ్ఞాపకార్థం కుమాళ్లు సుబ్బయ్య వగైరాలు. చముడుపాడు.

౨౦ ... సంగాపు పానకాలయ్యగారి జ్ఞాపకార్థం కుమాళ్లు వీరయ్య గురుకులు వగైరాలు, నవులూరు

౨౧ ... సంగాపు కోటీశ్వర గురుకులుగారు, మంగళగిరి.

౨౨ ... చిలుమూరు వెంకటసుబ్బయ్యగారు, చిలుమూరు.

౨౩ ... చిలుమూరు కుటుంబయ్యగారు, చిలుమూరు.

౨౪ ... శేకూరు రాఘవశర్మగారు, గుడివాడ.

౨౫ ... చావలి సుబ్బయ్య పంతయ్యగార్లు, పినపాడు.

౨౬ ... చావలి లక్ష్మీకాంతయ్యగారు, బాపట్ల.

౨౭ ... కొల్లిపర రామయ్య, పిచ్చయ్యగార్లు, పెనుమూలి.

౨౮ ... స్వర్ణ చినమల్లయ్యగారి జ్ఞాపకార్థం ధర్మపత్ని బుచ్చమ్మగార్లు, చీరాల.

౨౯ ... పెనుమూడి శీతమ్మగారు, జొన్నలగడ్డ.

౩౦ ... పసుమర్తి పార్వతమ్మగారు, కోచిపూడి.

# శ్రీ ఆది శైవ పత్రిక.



సపకోరుద్రస్స ఈశానస్స భగవాన్ సమహేశ్వరస్స మహాదేవః॥
"అధర్వశిరసి."


సంపుట ౧౦ | చిలుమూరు. శ్రీ భావ సం॥ ఆశ్వయుజ కార్తీకమాసములు. | సంచిక ౭-౮


## అవతార పురుషుడు


(శ్రీయుతులు శ్రీపాద లక్ష్మీనారాయణమూర్తిగారు. B. A.)


సీ॥ భరతావనీకృత ప్రాక్తన పుణ్యపుం।జంబె రూపముగాంచి జన్మమందె
నఖిలహైందవ కృత యజ్ఞయాగాద్యను।ష్ఠాన సత్ఫలమిట్లు సంభవించె
నకలంకశాంతి సత్యప్రేమ ముఖసర్వ।సద్గుణంబులె యిట్లు జన్మమందె
ధర్మసంస్థాపనార్థము పుట్టుచుండు నా।భగవంతుడేయిట్లు ప్రభవమందె

గీ॥ ననుచు జనములు గొనియాడ నతిపవిత్ర
మైన భారతవర్షంబునందు బుట్టె
నఖిలజనసౌఖ్య సంపాదనానవరత
దీక్షితాత్ముడు శ్రీ గాంధిదేవుడిలను.

(గృహలక్ష్మినుండి)

# శ్రీ శ్రీకంఠశివాచార్యకృత భగవద్గీతాభాష్యము

ఆంధ్రతాత్పర్యముతో సహా భాష్యము తయారగుచున్నది. "బ్రహ్మసూత్రభాష్యము" మాదిరిగానే సర్వులకు ఉచితముగా సప్లయిచేయగలరు. గావున ఆదిశైవ మతోద్ధారకుడును. శ్రీ శ్రీకంఠమఠాధిపతులును, జగద్గురువులునగు శ్రీ శ్రీకంఠశివాచార్య స్వాముల వారి యాజ్ఞానుసారముగా సాంఘికులు ద్రవ్యసహాయముగావించి ఏతద్భాష్యగ్రంథములను ప్రపంచమున ప్రకాశింపజేయుటకు నమస్కార పురస్సరముగా ప్రార్థించుచున్నాము. (శ్రీ గురుకులాశ్రమము.)

## సంపాదకీయములు

**స్వవిషయము**

పత్రికాభివృద్ధికై క్రొత్తగా దెలుపవలసిన యంశములులేవు. మామూలుకు భిన్నమురాకుండా సాంఘికులు వర్తించుచున్నారని మాత్రమే దెలుపక తప్పుటలేదు. ఈశ్వరానుగ్రహ మిట్లున్నదని దలంచి మిన్నకుండుటయే, శరణ్యము. దిగుబాటు గావించినవారు తమ బాకీలను బంపి తమ యభిప్రాయమును దెలుపుటకు గూడ అగౌరమని దలంచెడి వారి నేమనగలము. మేమెన్ని గ్రామములకు రాగలము. వ్రయప్రయాసలకు లోనై నాల్గుపర్యాయములు దర్శించితేమ యుంటెమిగాని ఫలితము శూన్యమగుటవలన మాకు గత్యంతరము గన్పట్టుటలేదు. ముందెట్లు జరుగునో తెలియకున్నది.

శ్రీ శ్రీకంఠ శివాచార్యులవారు.

కాశీక్షేత్రమునుండి భాద్రపద బహుళమున ఆంధ్రదేశమునకు విజయంచేసి పిఠాపురము మున్నగు గ్రామాదులవారికి దర్శనమిచ్చి "గీతాభాష్య" గ్రంథముద్రణ విషయమై (మరల ఏలూరు, భీమడోలు) విజయముజేసినట్లు తెలుపుట కానందించుచున్నాము. సాంఘికులు గీతాభాష్యమునకు సహాయమొనరించి శ్రీవారి సంకల్పము సార్థకమగు టకై యత్నించునటుల ప్రార్థించుచున్నాము. సర్వసంగపరిత్యాగులై యను స్వజాత్యుద్ధరణకై శ్రీవారు గావించుచున్న మహత్ప్రయత్నములు మున్ముందు మహోపకారము కాగలవని విన్నవించుచున్నాము. సాంఘికు లుత్సాహపూరితులై మతభాష్యముల నుద్ధరించుకొనుట శ్రేయస్కరమై యుండునని మనవిచేయుచున్నాము.

ఆగ్రహము.

పత్రికలోని విషయములు కఠించిన వారిలోకొందరు తమకు సంబంధించినట్లుగా భావించి "గుమ్మడికాయల దొంగవలె" తమ తప్పి దముల మరగుపరచుటకై మమ్ములను నిష్కారణముగా దూషించు చున్నటుల దెలిసి మేమానందించు చున్నాము. స్వప్నమందైనను సాంఘికుల యందు మాకు ద్వేషములేదని పలుమార్లు విన్నవించియే యున్నాము. పరమేశ్వరునిపై భారమిడి సంఘసేవజేయుచున్నామే కాని ఒకరి మెప్పునకుగాదు. దూషణ భూషణ తిరస్కారములు మేము గ్రహించుటలేదు. అట్లున్నను సాంఘికులు మాపై యాగ్రహించి పత్రి కను తిరస్కరించి తూలనాడుట పాడిగాదని ప్రార్థించు చున్నాము.

విషాదము

తెనాలి తాలూకా పినపాడు గ్రామవాస్తవ్యుడును సుప్రసిద్ధ సంఘాభిమానియు మాపత్రికోద్ధారకులలో నొకరగు శ్రీమార్గ చాపలి

సుబ్బయ్యగారు అకాలమృత్యువు వాతపడి బంధువులను ప్రాయమున నున్న యర్ధాంగిని దుఃఖాబ్ధిని ముంచివైచెనని దెలుపుటకు చింతిల్లుచూ శ్రీవారి యాత్మశాంతినిగోరుచూ మాసానుభూతి నందచేయుచున్నాము.

మ న వి

సాంఘికులు సక్రమముగా సహాయపడనందున జ్యేష్ఠమాసము మొదలు రెండు నెలల కొకతూరి ప్రకటింపవలసి వచ్చెను. షుమారు రెండువేల రూక్యములవరకు దిగుబాటు గావించుటచేతను పదిరెండు వందలవరకు ఋణముగావించి పత్రిక నడిపియున్నందువల్లను గత్యంతరము చిక్కుటలేదు. మా మనవి చిత్తగించి తమ తమ బాకీలను శక్త్యానుసారముగా సంతోష పూర్వకముగా బంపి పత్రికను రక్షించుటకు మిక్కిలిగా ప్రార్థించుచున్నాము. పత్రికా ప్రచారము మతసంరక్షణకు ప్రధానసోపానమని దెలుపుకొనుచున్నాము. తుదకు మీ మీయభిప్రాయములైనను కల్మషరహితముగా దెలుపవచ్చును గదా?

## ఈ నెలలో చందాలు చెల్లించినవారు.

౧ శ్రీమాన్ కొండవీటి శ్రీశైలంగారు (భావ) కొలూరు. (కృ)
౨ శ్రీమాన్ క్రొత్తలంక విస్సన్నగారు(భావ)గొల్లలమామిడాడ (గో)
౩ శ్రీమాన్ అయలూరు కామేశ్వరగురుకులుగారు (భావ) ముంజవరపుకొట్టు. (గో)
౪ శ్రీమాన్ నందివెలుగు కాశీవిశ్వనాథశాస్త్రి గారు తనతండ్రిగారి జ్ఞాపకార్థం పోషకచందా } భావ వోలేరు (గుం)

## పత్రికా సన్మానములు

౧ శ్రీమాన్ చావలి శివరామపాకయాజిగారు. మహాలయ పక్షారంభమున కృష్ణానదీస్నాన తరుణమున. పత్రికా సన్మానం ౧-౪-౦

౨ శ్రీమాన్ చిలుమూరు సుబ్బరాయశర్మ (పిడపర్రు) తన కుమారుని నామకరణమహోత్సవ తరుణమున పత్రికాసన్మానం ౨-౦-౦

(స వ ర ణ)

గుంటూరుజిల్లా వడ్లమూడి గ్రామవాస్తవ్యులగు శ్రీమాన్ వడ్లమూడి కోటయ్యగురుకులుగారు. పోషక స్థానమునుంచి. తగ్గింపు చందా ననుసరించి మహారాజ పోషకులుగా చందా నాలుగు రూపాయీలు సమర్పించి, తమ యభిమానమును వెల్లడించిరి. లోగడ సంచికయందు పొరపాటున పోషకులని ప్రకటించితిమి పాఠకులు క్షమింతురు గాక. (సం)

---

# స్వీకృతి

## పట్టుశాలి

గంజాంజిల్లా శ్రీకాకుళంపోస్టు యిలాకా బొంతలకోడూరు నుండి శ్రీయుతులు యం. వి. సీతారామరావుగారి యాధిపత్యమున సాంఘికాభివృద్ధికై నెలకొల్పబడిన మాసపత్రిక. ఇందలి విషయములు సంఘ సంబంధమైనవి గాక విద్యా సంబంధమైన యుపన్యాసములు గలవు పట్టుశాలి సోదరులు ముఖ్యముగా చదువ తగినదని హెచ్చరించు చున్నాము. సం॥చందా ౧-౮-౦ మాత్రమే. వలయువారు సంపాదకులకు వ్రాయవలెను.

## యుగంధర

ఏలూరునుండి శ్రీయుతులు కే. కుమారస్వామిగారి సంపాదకత్వమున సనాతన ధర్మోద్ధరణకై స్థాపించిన వారపత్రిక. ఇందలి విషయములు సత్యమై, సనాతనములై యున్నవి. వైదిక ధర్మముల

నుద్ధరించి వేదమత సంరక్షణార్థమై నెలకొల్పుట ముదావహమే. పర మేశ్వరుడీ యుగంధరను శాశ్వతముగా సంరక్షించుగాత యని మా యాశయము. (ఈ మధ్య ఎసెంబ్లీ అభ్యర్థుల ప్రచారమునకై దిన పత్రికగా వెలువడినది) వలయువారు సంపాదకులకు వ్రాయవలెను. సం॥చందా రు 3-౮-౦ లు

## గ్రంథాలయసర్వస్వము

బెజవాడనుంచి శ్రీయుతులు అయ్యంకి వెంకటరమణయ్య పంతులుగారి యాధిపత్యమున వెలువడుచున్న తొమ్మిదవ సంపుటం రెండవ సంచిక మా కార్యస్థాన మలంకరించినది. ఆ కృతి గొప్ప సైజున, పుస్తకరూపమున నున్నది. మామూలుగా గ్రంథాలయసేవ యొనరించి దేశ భాషాభివృద్ధి యొనరించి శాశ్వతకీర్తి నొందగలదని మా విశ్వాసము. సంవత్సర చందా 5-0-0 లు వలయువారు సంపా దకులకు వ్రాయవలెను.

## జమీన్ రైతు

నెల్లూరునుండి సుప్రసిద్ధ దేశభక్తుడగు నెల్లూరు వెంకటరామా నాయుడుగారి యాధిపత్యమున ప్రతి శుక్రవారము వెలువడు చున్నది. ఇందలి విషయములు రైతుసోదరులకు యథార్థమును విప్పి చెప్పు చున్నవి. చక్కని గ్రామ్యభాషతో ఉత్సాహజనకమైన విశేషాలతో విరాజిల్లుచున్నది. సంపాదకుల శక్తిసామర్థ్యములు గొనియాడ దగి యున్నవి. 4 వ సంపుటం 7 వ సంచిక మా కార్యాలయ మలంక రించినది. సంవత్సరచందా ౪-౦-౦

---

# 7 సూత్రములు

1. ధనమునందలి కోరికయే మానవునకు పిచ్చియెత్తించును. ఇక నది లభించెనా వాని యవస్థ చెప్పనక్కరలేదు. అపుడు ధనమదాంధుడై యితరుల విషయమునే గమనింపడు. ఎవరెటుబోయిన నాతనికేమి? అట్టివాడు బీదల బీడింప నణుమాత్రమును వెనుకాడడు. తన వాంఛా సంతృప్తికై వారి సర్వస్వమును హరించుటన్న లేశమాత్రము. గుడిమ్రింగువానికి దలుపులప్పడము లేకదా! 2. నీవు దేహమును విడిపోవునపుడు పుచ్చిన వక్కయైనను నీవెంట రాదను విషయమును మరువకుము. అట్లగుటచే ధనమును ప్రోగుచేయ నెంచకుము. నీయాశకై బీదలెందరో తమ కొంపగోడుల బాయవలెను. నీవు వారి జీవనాధారముల హరింపవలెను. వారి సంతానము నిరాధారము కావలెను. అపుడే నీవద్ద ధనరాశి చేరును. కాని యది నిలువదు. ఏలనన అంతయు పాపసమూహమే కదా. పదికొంపలు చెడిననేగాని యొక మేడ యేర్పడదు. ఎన్నటికైనను పాపము బ్రద్దలు కాక తప్పదు. ఈదీనుల పరివేదనలు, బీదల యేడ్పులు, నిరాధారుల యవస్థ లొకనాడు భగ్గునమండి నీసుఖమంతటిని భస్మమొనర్చుట యథార్థము. 3. ఈయార్తులను, అనాథలను, యీబీదలను, యీదరిద్రులను నారాయణ స్వరూపులుగ భావింపుము. వారి యావశ్యకతల గనుగొని వానిని సవరింపుము. వారికి వలయు సేవ యొనర్పుము. మనోవాక్కాయ కర్మల వారిని ప్రేమింపుము. అటు లొనర్చితివేని నీకు భగవదనుగ్రహము తప్పక చేకూరును. 4. పరులకుపకార మొనర్పనున్నమానే, అపకారము మాత్రము చేయకుము. భూభార మడంపలేనిచో దానికి మరొక భారమును మాత్రము చేర్పకుము. నీపాపమయజీవితమే భారము. కాన నీజీవితమును సంస్కరించుకొని పవిత్రమును, నిర్మలమును, ఉదారమును, ధ్యానపూరితమగు జీవితమును గడపుచు యుక్తాయుక్త వివేచనతో మెలంగుము. 5. ఇంద్రి

యములను, చిత్తమును వశమొనర్చుకొనుము. నీలోపముల నెఱింగి మిగులనోర్పుతోను, అచంచలమగు భక్తితోను విషయములనుండి చిత్తమును మరలింపుము. అట్లు మరల్చిన దానిని నిరంతర భగవచ్చింతనమునందో లేక ఉన్నత భావములందో నియోగింపుము. 6. చిత్త సమత్వము నెన్నడు బోనాడకుము. ఊరక చీకాకుపడి కోపగింపకుము. నీపై నితరులు నిందలుమోపి దూషించినను వేగిరపడక వినుచుండుము. అట్టి నిందలకేమైన నీలో నవకాశమున్నదేమో ఆత్మపరీక్ష గావించుకొనుము. సత్యము గోచరించును. నూటికి తొంబది తొమ్మిది పాళ్ళు నీలోనేదియో లోపముండియేతీరును దానిని వెంటనే సవరించుకొని నిందించి దారి జూపిన వానికి నమస్కరించుము. 7. ఇతరులు నిన్ను స్తుతించునపుడు పొంగిపోయి నీలోపముల మరువకుము. నీవేమో ఘనుడవనుకొని కీర్తి ప్రతిష్ఠల కాశించి విఱ్ఱవీగకుము. ఆ కార్యనిర్వహణమునకు నిన్నొక పరికరముగ నొనర్చినందులకు భగవంతుని గొనియాడుము. స్తుతిపరులకు దోసిలొగ్గుము. అట్టి స్తోత్రమునకు పాత్రుడవు గాకుండునట్లు భగవంతుని వేడుకొనుము. భూషణ కానంద పడకుము. మొదట వినుటకు సొంపుగనున్నను పిదప దుఃఖమే దాని ఫలితము. కాన దాని నెల్లప్పుడును వర్జింపుము. భూషణ కెన్నడు పొంగకుము. దూషణకు లొంగకుము.

యోగీశ్వరానందస్వామి,
స్వర్గద్వార్ ఆశ్రమము,
హిమవత్పర్వతము.

(భక్తి ప్రబోధిని)

---

# ఆ హా ర ము.

(డాక్టర్ యన్. కే. విశ్వనాథశాస్త్రిగారు)

రోగము భగవంతునిచేతబంపబడు శుద్ధకర్మావకాశము. మానవ జాతి ఆరోగ్యవిషయములలో నక్రమముగా వర్తించునపుడు ఆ దోషము శరీరబాధవలన తొలఁగిపోయి అంతరాత్మ వికాసమునకు మరల నవ కాశము నొసగుటకొరకే దేవుడు రోగముల బంపుచున్నాడు. ఈ అక్రమవర్తనములలో ముఖ్యమగునది మితిమీరి దినుట. ఆహారము శరీరమును పెంచుచున్నది. అది సరిగా నుపయోగింపబడి నపుడే యాదేహము పవిత్రవంతమయి, బుద్ధి వశించుట కర్హమనదగును.

శ్రీకృష్ణభగవానునిచే యనుగ్రహింపబడిన భగవద్గీతలో విశ దీకరింప బడినటుల ఆహారము, సాత్విక, రాజసిక, తామసికములని త్రివిధములు.

పరిశుభ్రమగు ప్రాకృతికాహారము సాత్వికము. కాయలు, పండ్లు చమురుగల గింజలు, ధాన్యములు ఇట్టివానిలో చేరును వీనిని సహజ స్థితిలో గాని, వంటచేసిగాని తినవచ్చును. ఇట్టి ఆహార మారోగ్య ప్రదాయినియై బుద్ధి వికాసమునకు తోడ్పడును. ఆధ్యాత్మిక తేజ మును వృద్ధిచేయును.

రాజసాహారము ఆత్మవికాసమునకు భంగకరము. పురోభి వృద్ధినరికట్టును. బుద్ధికి చంచలతను గలిగించును. శరీరమునకును నారోగ్యప్రదముకాదు. మసాలాలు, తమలపాకులు, ఆవ, మాంసము మొదలగునవి.

పులియబెట్టిన ఆహారపదార్థములు తామసములు. కల్లు, సారాయి, టీ, కాఫీ, పెరుగు మొదలగునవి ఈజాతిలోచేరును. ఆకలి పుట్టించు కొరకును, నోరూరజేయు కొరకును వాడబడు మసాలాలు, ఉల్లి, వెల్లుడి, యింగువ, యిట్టివే.

సాత్వికాహారముగూడ పులియబెట్టినను మసాలాలతో చేర్చినను అతిశయముగాగాని, వేగిరముగాగాని తినిననూ తామసికాహారమగునని తెలియవలెను.

పరా:—ఇందుగల విషయము గ్రహించి ఆరోగ్యమున దేహానిలేండా వర్తింతురని యాశయము.

"ఆరోగ్యమే మహాభాగ్యము"

ఓ లే రు,
14—11—34.

ఇట్లు సుజనవిధేయుడు,
న॥ కా॥ వి॥ శాస్త్రి

---

# భారతీయ బ్రాహ్మణులకొక విజ్ఞప్తి.

సోదరులారా! మన బ్రాహ్మణశాఖలో కొందరు హెచ్చువారనియు, కొందరు తక్కువవారనియు కలహములు పెంచుకొని అజ్ఞానులై సంకుచితదృష్టితో సంచరించుచూ కల్మషహృదయులై మహర్షులనైతము తూలనాడుచున్నారు. రాష్ట్రభేదముచే వింధ్యకు దక్షిణదేశమున నివసించువారు ద్రావిడులనియు, ఆంధ్రులనియు, కర్ణాటులనియు, ఘూర్జరులనియు మహారాష్ట్రులనియు పంచవర్గములుగా నియమింపబడిరి. ద్రావిడులఅవమును, ఆంధ్రులు తెలుగును, కర్ణాటులు కన్నడమును.ఘూర్జరులు ఘూర్జరభాషను, మహారాష్ట్రులు మహారాష్ట్రమును అభ్యసించి ఆయారాష్ట్రములందే సంబంధబాంధవ్యము లొనరించుకొనుచు విలసిల్లుచుండిరి. గాని బ్రాహ్మణ శాఖా ధర్మములు బ్రాహ్మణ స్వరూపము నొక్కటిగనే వ్యవహరింపబడుచుండెను. అందు శివ కేశవాది దేవతల నుపాసించుటవలన శైవులనియు వైష్ణవులనియు బిలువబడుచుండిరి. శైవులు అయిదు విధములుగా విభజింప

బడిరి. అనాదిశైవము ఆదిశైవము మహాశైవము అను శైవము వీర శైవము అను పేర్లతో వర్తించుచుండిరి. ఈశ్వర కుటుంబమునకు అనాదిశైవమనిన్ని ఈశ్వర వంశమువారై. తదారాధనలు జరుపు చున్న వారు ఆదిశైవమనిన్ని స్మార్త బ్రాహ్మణులు శైవదీక్షనుబొంది విభూతి రుద్రాక్షలు శివపూజ మున్నగు శైవాచారరతు లగుటవలన మహాశైవమనిన్నీ, క్షత్రియ వైశ్యులు శైవదీక్షాపరులగు వారు అను శైవులనిన్నీ, శైవదీక్షతో గూడిన శూద్రులు వీరశైవులని శైవాగమ ములు దెలుపుచున్నవి. ఆదిశైవులు శివవిశిష్టాద్వైత భాష్యమగు శ్రీకంఠభాష్యమును వైష్ణవులు శ్రీవిశిష్టాద్వైత భాష్యమగు రామానుజ భాష్యమును ద్వైతులు మధ్వ భాష్యమును స్మార్తులు. శంకరభాష్యమగు అద్వైతమతమును అవలంబించియున్నారు. మధ్వ భాష్యము ద్వైతమతమును బోధించును. ఈ ద్వైతాద్వైత విశిష్టాద్వైతములు జ్ఞానమార్గమును బోధించుచున్నవి.

అందువలన ఒకటి యెక్కువ మరియొకటి తక్కువ యనుటకు వీలులేదు. స్మార్తులలో కొన్ని తెగలుగలవు వెలినాడు, వేగినాడు, మురికినాడు, కాసలనాడు, తెలఘునాడు మున్నగు నాడీ భేదము. పూర్వము ఏలేశ్వరోపాధ్యాయపండితులవారిచే ఏర్పాటు చేయబడెను. అన్యోన్యసంబంధబాంధవ్యము లిప్పటికినిలేవు భోజన మర్యాదలు మాత్రమే జరుపుకొనుచున్నారు. భారతదేశము వేదభూమి యనుట సుప్రసిద్ధము. అందువలన వేదోక్తవిధుల నాచరించుటచే మన భారతీయులకు వైదికులని పేరు గల్గుచున్నది. ఈ ధర్మమునందు అన్ని జాతులు సమానహక్కుతో వర్తింపగలరు ఇట్లే వింధ్య పర్వతమునకు ఉత్తరమున నివసించువారు గౌడులనబడుచున్నారు. వారిలో గూడ పంచ భేదములు గలవు. ద్రావిడులుగాని గౌడులుగాని అష్టాదశ కల్పసూత్రాచారపరాయణులై వైదిక ధర్మాసక్తచిత్తులై సర్వాధికృతల నొందుచున్నారు. బ్రాహ్మణ శాఖయందిసుమంతయు

భేదములేదు. ముక్తి కొరకు యత్నించువారు పై భాష్య చతుష్టయము నాశ్రయింపక తప్పదు. సగుణారాధన సర్వులకు శరణ్యము. బ్రాహ్మణ ధర్మ వ్యతిరేకుడు దేవలకు డనంబడును. అట్టి దేవలకుడు పంక్తి బాహ్యత్వము నొందక తప్పదు. ప్రస్తుత కాలమున బ్రాహ్మణ శాఖా ధర్మముల పరిత్యజించి శుద్ధదేవ లకత్వదోషముతో ప్రకాశించుచున్న మన బ్రాహ్మణ శాఖను సంస్కరించి పూర్వోత్కృష్టతను బొందుటకై యనేక మహామహులు యత్నించు టత్యవసరమైయున్నది. పూర్వపు మహత్తును గోల్పోవుటచే ఇతరశాఖీయులగు బ్రాహ్మణేతరులు మనపై దండెత్తి మన గొప్పతనమును నిర్మూలించుచున్నారు. మన హృదయములు కల్మషముతో నిండి యుండి అన్యోన్య సహనము లేక వ్యర్థ క్రియా సంభావణలతో దూష్యులమై పోవుచున్నామే గాని సర్వ మత సంరక్షణులమనియు భూతభవిష్య ద్వర్తమాన గ్రాహకులమనియు రాజాధిరాజసేవితులమనియు దలంపక అజ్ఞానమున మునింగి పార తంత్ర్య జీవితులమై యల్లాడు చుండుట విషాదకరమని పలువురు పండిత శిఖామణులు యెలుగెత్తి చాటుచున్నారు గావున మాయందసూయ జెందక బ్రాహ్మణశాఖా సంరక్షణ దీక్షాదక్షులై, అసహన పిశాచముల నావల బారద్రోలి హృదయ పరివర్తనులై, వైదికశాఖా ధర్మముల నుద్ధరించి, శాంత శమదమాది సద్గుణముల స్థాపించి లోకసంరక్షణ గావించుటకు పండిత బృందము వారిని వినయ విధేయతలతో ప్రార్థించుచున్నాము.

ఇట్లు సేవకులు,

| | |
|---|---|
| శృంగారపురము<br>గుంటూరు మండలము | పుచ్చా సత్యనారాయణశాస్త్రి<br>నాగేశ్వరము గోపాలకృష్ణమూర్తి<br>వేలమూరి వేంకటేశ్వరశర్మ |

## పులిమీదపుట్ర

అర్చక మహాజనులారా మేల్కొనుడు !

బోర్డువారి కంట్రిబ్యూషనుకే వాదోపవాదములు దావాలు జరుగుచుండగా జిల్లా కమిటీలవారు తమ కమిటీ సంరక్షణ నిమిత్తం నూటికి రూపాయిన్నర పంపవలసి యున్న దనియు, అలా పంపనియెడల కలెక్టరుగారి ద్వారా జప్తులు జరుగునని, డిమాండు నోటీసులు ప్రతివారికి వచ్చుచున్నవి. అర్చకులు నిద్రించిన కొలది మారణశక్తులు ప్రయోగింపబడు చున్నవి. వెంటనే సదరు కమిటీ సూపరెండెంటుగారి పేర సరి యైన సమాధానములు వ్రాయనియెడల మోసము జరుగ గలదు. జప్తులు జరిగినచోట్ల వెంటనే మునసబుకోర్టులలో పదిహేను రూపాయిల స్టాంపుతో దావా వేయవలెను. "మూలలింగం మూలుగుతుంటె ఉత్సవవిగ్రహాలు, దధ్యోజనం కావలెనన్నట్లు" గా పరిణమించినది. అర్చకసంఘాలు నాశన మొనరించు కొనుటచే, శల్య సారథ్యములైన రాజీలు పడు టచే, యీ స్థితి గల్గినది. ఇకనైన మేల్కొని వ్యవహారాలు సక్రమముగా నడుపుకో గలందులకు హెచ్చరించు చున్నాము.

(పత్రికాధిపతి)

## వార్తలు

ది 27-10-34 తేదీన తాడేపల్లిగూడెం తాలూకా అర్ధవరం, వల్లూరు గ్రామములలో కంట్రిబ్యూషను విషయమై బోర్డువారి జప్తు లను ఇంజక్షన్ చేయించుటకై మ. రా. శ్రీ మాదిరెడ్డి పురుషోత్తమ నాయుడుగారి ద్వారా భీమవరం కోర్టులో 15-0-0 స్టాంపు చాలునని ఆర్గ్యుమెంటు చేయించి అంగీకరింప జేసిరి.

ది 29-10-34 తేదిన బోర్డు యినస్పెక్టరుగారు అర్చకులే ట్రస్టీలుగా భావించి, భీమవరం క్యాంపునందు భీమవరం, గుమ్మపూడి, తాడేరు మొదలయిన అర్చకసోదరులను విచారించినారట. కంట్రిబ్యూషను విషయమై మరల వాయిదా వేసినారట.

రాజమండ్రి కోర్టులోను, హైకోర్టులోను అర్చకులు కంట్రిబ్యూషను రద్దు నిమిత్తమై దావాలు దాఖలు చేసినట్లు దెలియుచున్నది.

గుంటూరు కృష్ణాజిల్లాల వారుగూడ కొన్ని తాలూకాలయందు కంట్రిబ్యూషన్ రద్దు నిమిత్తము దావాలు దాఖలు చేసినట్లును విచారణ పూర్తి యైనట్లును దెలియుచున్నది.

(రావూరి నారాయణమూర్తి)

శృంగారపురమున నెలకొల్పిన ఉమామహేశ్వర భక్తజన సమాజమునందు శ్రీమాన్ కొండవీటి విశ్వనాథగురుకులవారున్నూ మజుందారు నరసింహారావు పంతులుగారున్నూ, భక్తి, జ్ఞాన, వైరాగ్య విషయముల గురించి ఉపన్యసించి సామాజికుల నానందమున నోలలాడించి యున్నారు. (పుచ్చా సత్యనారాయణ)

48-వ దేశీయ మహాజనసభ శ్రీయుతులు రాజేంద్రప్రసాదు బాబుగారి యధ్యక్షతతో బొంబాయియందు 23-10-34 తేది లగాయతు 28-10-34 తేది రాత్రి 12 గంటల వరకు జయప్రదముగా జరిగి దేశాభివృద్ధి కనుకూలమగు తీర్మానములు గావించి యానందించిరి. గాంధిమహాత్ముని సవరణలన్నియు కాంగ్రెసు వారామోదించి మహాత్మునిపట్ల తమ విశ్వాసభక్తులను వెలువరించి కృతజ్ఞతను లోకమున చాటిరి. సుమారు పదిహేనుసంవత్సరముల నుంచి కాంగ్రెసును నూతన విధానములతో నడపిన మహాత్ముడు తన నాయకత్వమును వదలుకొని తాను సాక్షీభూతుడుగా నిలచి కాంగ్రెస్సును నడుపదలచినట్లు దేశీయపత్రికలు దెలుపు చున్నవి.

## విజయ

ఇయ్యది విజయనగరమునుండి శ్రీయుతులు కాకులపాటి కృష్ణ మూర్తిగారి సంపాదకత్వమున వెలువడుచున్న సచిత్ర మాసపత్రిక. రెండవసంచికను వందనములతో గ్రహించి యందలి వ్యాసరాజము లను చిత్రములను పరిశీలించి యానందించితిమి. ముఖపత్రమునందలి విజయ చిత్రము మనోహరముగా నున్నది.

సంవత్సర చందా 1—0—0 మాత్రమే.

వలయువారు: సంపాదకులపేర వ్రాయవలెను.

## గృహాలక్ష్మి (దసరా సంచిక)

మామూలుగా ప్రకటించు సంచికలకన్న మిన్నయగు వ్యాస రాజ, చిత్రములతో దసరాసంచికగా ప్రచురించి మా కార్యాలయ మలంకరింప జేసిన సంపాదకుల నభినందించుచున్నాము. స్త్రీలపాలిటి కల్పతరువై యాచంద్రార్క స్థాయిగా నీ గృహాలక్ష్మి వర్ధిల్లుగాత యని మా యాశీస్సులు... (సంపాదకులు)

---

## నేత్రామృతము [NETRAMRUTA]

(సమస్త నేత్రవ్యాధులకు పరమౌషధము.)

(Best remedy for all kinds of eye deceases)

దీనిని ఉదయ సాయంత్రముల యందు కంటియందు రెండుబొట్లు వేసికొన్నచో కండ్లుమంటలు, తిమిరములు, పటములు, చిన్నపూవులు, దురదలు, నీరుగ్రమ్మట మొ॥ అన్నియు నివారణ మగును.

వెల సీసా 1కి పెద్దది 0—6—0

" 0—3—0

వివరములకు:— డా. యన్. కే. విశ్వనాథశాస్త్రి ప్రొప్రయిటరు.

ఆరోగ్య ఫార్మసీ, ఓలేరు (via) రేపల్లె.

ఆంధ్రరాష్ట్రీయ-ఆదిశైవ యువజన సంఘ

# కార్యదర్శి నివేదిక (1933—34)

ఈ సంఘపు ప్రథమసమావేశము (1-1-1933 తేదిన) నంది వెలుగు గ్రామమునందు జయప్రదముగ జరుపబడినది. మన యాది శైవసంఘమునకు మాంగళ్యమును చేకూర్చుటయే ఈ సంఘస్థాపనకు ప్రధానహేతువు. ఆదిశైవసంఘమునందు నూతనోజ్జీవనమును, నవ్య సంచలనమునుఁ గల్గించి ప్రస్తుతపరిస్థితుల కనుగుణముగ, జీవితమును చక్కదిద్దుటయును, సాంఘికసారస్వతార్థికాభివృద్ధుల సంతరించుటకు ప్రబోధము నొనర్చుటయు సమావేశములు కూర్చుటయు, గ్రంథముల వెల్వరచుటయు, పరిశోధనలు గావించుటయు, నీసంఘ ప్రధానాశయ ములు. ఈయాశయసాఫల్యమునకై సర్వోత్తమములగు పథముల నవలంబింపఁ దలంచియే, ఆంధ్రరాష్ట్రీయాదిశైవ, యువజనసంఘము పరిణమించినది. ప్రథమమున పాఠశాలల స్థాపించుటయు, విద్యార్థి వసతిగృహముల నిర్మించుటయు, పత్రికల ప్రచురించుటయు గూడ నీసంఘభావము లుగ పరిగణింపఁబడినవి. కాని సంఘముయొక్క ప్రకృత స్థితిగతుల ననుసరించి పరిశీలించినచో, నట్టి మహత్తర కార్యసాఫల్యము దుస్సాధ్య మేమో యని సందియ ముదయించు చున్నది. యువజనసంఘము నెల కొల్పబడి ఒక్క సంవత్సరము మాత్రమే యైయుండుటచే సంఘాశయ ముల సాకల్యముగ విజయవంతములు కావలయుననిన, వాతావరణాను కూల్యమును నిరీక్షించవలయునని తోచుచున్నది. సంఘసంస్థాపనా నంతరము రెండు కార్యనిర్వాహకవర్గ సమావేశములు జరిగినవి; అందు మొదటిది ( తే 29-1-33 దిన ) పొన్నూరునందు సమావేశ మైనది. రెండవది ( తే 5-11-33 దిన ) అమృతలూరు గ్రామము నందు కూడినది. ప్రథమకార్యనిర్వాహకవర్గపు తీర్మానముల ననుస రించి ప్రచారము గావించుటకు నిర్ణయింపబడినది. ఈ యువజనసంఘ మునందు సభ్యులను చేర్చుటయే ప్రచారప్రధానోద్దేశ్యము. యువకు

లను యువతులను సభ్యులనుగా ప్రబోధించి, చేర్పించుటకు ప్రచారకులు నిర్ణయింపబడిరి. యువకులకు 8 అణాలు మాత్రమును, యువతులకు 4 అణాలు మాత్రమును సభ్యత్వచందా నిర్ణయించిరి. ప్రచారకులందరును విద్యార్థులే. అందుచే వారలు సంపూర్ణముగ ప్రచారమందు పాల్గొనలేకపోయిరి. అయినను ప్రచారమక్కడక్కడ జరిగి సభ్యులు చేర్చుకొనబడిరి. బాపట్ల, ఒంగోలు, గుంటూరు తాలూకాలందు సంపూర్ణముగ కాకపోయినను ప్రచారము జరిగినది. సభ్యత్వచందాల విషయమై పెక్కుమంది సరస్వతీప్రసన్నమునేగాని లక్ష్మీప్రసన్నము గావింపరైరి. ప్రస్తుతము సభ్యులసంఖ్య 98 మాత్రమే. వీరిలో చాలమంది చందాలు చెల్లించనివారే. ఆదాయము బహుస్వల్పము. ప్రచారకులనుండి వచ్చిన చందాల రూపమైన యాదాయము రు 26-8-0 లు ధర్మములు రు 31-4-0 లు మొత్తము ఆదాయము రు 57-12-0 లు. ఇందులకు ఖర్చు ప్రింటింగు చార్జీలు రు 9-0-0 లు. ప్రయాణపు ఖర్చులు రు 5-13-6 లు. పోష్టల్ ఖర్చులు రు 7-6-3 లు. భోజనపుఖర్చులు రు 0-10-0 లు. తీర్మానముల పుస్తకము 5 అణాలు మొత్తము వ్యయము రు 33-2-9 లు నిలువయున్న మొత్తము రు 24 9-3 మాత్రమే.

షరా:—ఈ కార్యదర్శి నివేదిక ఉపాధ్యక్షులవద్ద నుండుటచేతను, వారు నాకు యిటీవలనే యిచ్చుటచే పత్రికయందు ఇంతకు పూర్వము ప్రకటించుటకు వీలులేక యీ నెల పత్రికయందు ప్రచురింపవలసి వచ్చినది. కార్యదర్శి-

☞ గాఢమైన దీక్షతో అత్యుత్తమమైన పట్టుదలతో సభ్యులను చేర్పించి సంఘాభివృద్ధి నొనరింప గలందులకు హెచ్చరించుచున్నాము. (పత్రికాధిపతి)

---

ం చందా రు 1-8-0 లు. Regd. No. M. 207.

# శ్రీ ఆదిశైవపత్రిక.

శ్రీ శ్రీకంఠ మఠాధిపతుల యాజ్ఞానుసారముగా, శైవ సంఘాభ్యుదయమునకై శ్రీ గురుకులాశ్రమమునుండి ప్రతిమాసము ప్రకటింపబడును.

సర్వదేవాత్మకో రుద్రస్సర్వే దేవాశ్శివాత్మకాః।
రుద్రస్య దక్షిణేపార్శ్వే రవిర్బ్రహ్మా త్రయోగ్నయః।
వామపార్శ్వే ఉమాదేవీ విష్ణుస్సోమోపి తేత్రయః।

(రుద్రహృదయోపనిషత్)

సంపాదకుడు:—చిలుమూరు పురుషోత్తమ గురుక్కళ్.

సంపుట ౧౦ } చిలుమూరు : కొల్లూరుపోష్టు
భావనామ సం॥ర మార్గశిర పుష్య మా॥లు. { సంచిక ౯-౧౦

(వి లేఖకుల వ్యాసములకు సంపాదకులు ఉత్తరవాదులు కానేరరు.)



—• విషయసూచిక •—



భారతీ ప్రెస్, తెనాలి.

# ఉద్ధారకులు

౧ కీ॥ శే॥ చిలుమూరు తీర్థేశ్వరులవారి జ్ఞాపకార్థం కుమార్లు ఉమామహేశ్వరం వగైరాలు, చిలుమూరు.

౨ కర్ణాటక రాష్ట్రీయ ఆదిశైవ మహాసంఘమువారు, బెంగుళూరు

౩ శ్రీమాన్ నడింపల్లి నాగేశ్వరశివాచార్యులువారు, ఇంటూరు.

౪ ... గూడూరు రాఘవరావుగారు, పోతునూరు

౫ ... గూడూరు శీతయ్యగారు, శనివారపుపేట

౬ ... అయలూరు వెంకటసుబ్బయ్యగారు, అర్తమూరు.

౭ ... పావులూరు రామచంద్రయ్యగారు, మునికోటిపురం.

౮ ... పావులూరి హనుమంతయ్యగారు మునికోటిపురం.

౯ ... వెనుమూడి సత్యనారాయణగారు, తూర్పుకూచిపూడి

౧౦ ... స్వర్గస్థ వెంకటశివావధానులుగారు, బూతుమల్లి.

౧౧ ... పావులూరు నాగేశ్వరశర్మగారు, అనంతవరం.

౧౨ ... వెనుమూడి హనుమంతరావుగారు, తెనాలి.

౧౩ ... మామిళ్లపల్లి శంకరమ్మగారి జ్ఞాపకార్థం భర్త శివరామదీక్షితులుగారు, చుండూరు.

౧౪ ... మామిళ్ళపల్లి సాంబయ్యగారు, చుండూరు.

౧౫ ... పొన్నూరు సుబ్రహ్మణ్య పాకయాజిగారు, దండమూడి.

౧౬ ... మేడూరు శివయ్యగారు, తేలప్రోలు.

౧౭ ... కుందుర్తి ఆనందరావుగారు B. A- దుగ్గిరాల.

౧౮ ... " పార్వతమ్మగారి జ్ఞాపకార్థం సత్తెనపల్లి వెంకటరామయ్యగారు, ఓవర్‌సీయరు, దుగ్గిరాల.

౧౯ ... చావలి గంగయ్యగారి జ్ఞాపకార్థం కుమార్లు సుబ్బయ్య వగైరాలు. చెముడుపాడు.

౨౦ ... సంగాపు పానకాలయ్యగారి జ్ఞాపకార్థం కుమార్లు వీరయ్య గురుకుల వగైరాలు, నవులూరు

౨౧ ... సంగాపు కోటేశ్వర గురుకులుగారు, మంగళగిరి.

౨౨ ... చిలుమూరు వెంకటసుబ్బయ్యగారు, చిలుమూరు

౨౩ ... చిలుమూరు కుటుంబయ్యగారు, చిలుమూరు.

౨౪ ... శేకూరు రాఘవశర్మగారు, గుడివాడ.

౨౫ ... చావలి సుబ్బయ్య పంతయ్యగార్లు, పినపాడు.

౨౬ ... చావలి లక్ష్మీకాంతయ్యగారు, బాపట్ల.

౨౭ ... కొల్లిపర రామయ్య, పిచ్చయ్యగార్లు, వెనుమూలి.

౨౮ ... స్వర్గస్థ చినమల్లయ్యగారి జ్ఞాపకార్థం ధర్మపత్ని బుచ్చమ్మగారు, చీరాల

౨౯ ... వెనుమూడి శీతమ్మగారు, జొన్నలగడ్డ.

౩౦ ... పసుమర్తి పార్వతమ్మగారు, కూచిపూడి

# శ్రీ ఆదిశైవపత్రిక.

సపకోరుద్రస్స ఈశానస్స భగవాన్ సమహేశ్వరస్స మహాదేవః॥
"అధర్వశిరసి:"


| సంపుట ౧౦ | చిలుమూరు<br>భావ సం॥ర మార్గశిర, పుష్యమాసములు. | సంచిక ౯-౧౦ |
| --- | --- | --- |


## మహాత్మా గాంధి

(శ్రీమతి కనుపర్తి వర్లక్ష్మమ్మగారు)

సీ॥ దేశజనని దాస్యపాశంబు ఛేదింప
విహగేంద్రుడయ్యెనే వీరవరుడు
అనుగు సోదరుల మహార్తి నున్మూలింప
వామనుండయ్యెనే ప్రేమమూర్తి
పేదల దారిద్ర్యపీడను భంజింప
నల చక్రియయ్యెనే యనఘయశుడు
అస్పృశ్య జాతుల యాపన్నతనుదీర్ప
కాశికుండయ్యెనే ఘనగుణుండు

గీ॥ సత్యమెవ్వాని జీవితసారమగునో
హింస కెవ్వడు సర్వదా విముఖుడగునో
అట్టి మా మహాత్మాగాంధి హనుమవోలె
ధర చిరంజీవియై సదా వరలుగాత॥

(ఆంధ్రవిద్యార్థి)

## మాతృపూజ

సీ॥ తన గర్భకుహరంబునను మోసి నవమాస
మ్ములు నోముపంటగాలున మొసంగి
కంటికి రెప్పగాగను గాచుచనిశంబు
వలయు పదార్థముల్ గలుగనిచ్చి
ఆయురారోగ్య భాగ్యములు చేపడ సర్వ
దైవతమ్ములకు ప్రార్థనలసలిపి
వ్యాధిబాధలచేత వసటబొందెడు వేళ
సకలోపచారముల్ సంతరించి

గీ॥ కష్టసుఖముల కయ్యెడు కరుణమూర్తి
మాతృదేవతగాక యేకరుణమూర్తి
నన్యమున్న దేతన్మాత కనవరతము
వాఙ్మనః క్రియలను జేయు మాతృపూజ॥

(సుదర్శిని)

## గాంధీమహాత్ముడు

(శ్రీమతి గార్లపాటి లక్ష్మీనరసమ్మగారు)

సీ॥ భారతావని కెల్ల బానిసత్వముదీర్ప
బూనినయట్టి సత్పురుషుడితడు
తా కష్టములకోర్చి తన ధనంబంతయు
ధారబోసినయట్టి త్యాగియితడు
పాండవాగ్రజుబోలు పావనచరితుండు
సత్యంబుదప్పని చతురుడితడు
హరిజనసేవయే హరిసేవయనిజేసి
పడరానిపాట్లను బడియె నితడు

గీ॥ సరసగంభీర హృదయుండు శాంతమూర్తి
కర్మఫల వర్జితుండు నిష్కపటి యితడు
దేశసేవాభిలాషి. గాంధిమహాత్ము
డాయురారోగ్యవంతుడై యలరుగాక॥

# సంపాదకీయములు

స్వవిషయము:—సాంఘికుల యభిమానాదరములు పూర్తిగా సన్నగిల్లినవని చెప్పకతప్పదు. పత్రికాప్రచారమునకంటె సంఘాభివృద్ధి కనువగుమార్గము మరియొకటి లేదని పలువురు నాయకులు నిష్కర్షగా చెప్పుచుండుటవలన నాయుపదేశమును శిరసావహించి పదిసంవత్సరములనుంచి యనేక వ్యయప్రయాసల భరించి "ఆదిశైవ" మతసేవ గావించితిమి. గాని మాశ్రమ నానాటికి నిరర్థకమై నిరుత్సాహమునకు ప్రబలహేతువై మా యత్నమును యరికట్టుచున్నప్పుడింకేమి చేయవలెనో దెలియుటలేదు. ఇట్లని ప్రతిసంచిక యందును విలపించుచున్నామని పలువురు ప్రసంగించినట్లు దెలిసి ఆమాత్రపుసందడినిగూడ విరమించితిమి. ఈశ్వరానుగ్రహంబున యభిమానుల కటాక్షంబున రెండుమాసముల కొక్క సంచికమైనను ప్రకటన చేయగల్గితిమి. అదియుగూడ రాబోవు సంచికతో పూర్తికానున్నది. సాంఘికులు తమదిగుబాటు ద్రవ్యముల నొసంగునటుల ప్రార్థించి విఫలమనోరథులమైతిమి. చందా సగమువరకు తగ్గించి తాముదయతో పంపగల్గిన సహాయమే గోరియున్నను అదియు శూన్యమైనది. వృధాగా రైలుఖర్చులు వ్యయపరచి యెన్ని పర్యాయములు తమదర్శనము చేయగలము? తా మొసంగు ద్రవ్యము రైలుఖర్చులకే సరిపోయినచో ఎట్లు జరుగగలదు. అని బహుభంగుల విన్నవించుకొన్నను ప్రయోజనము లేకపోయెను గావున సాంఘికులు - యీమాకడసారి ప్రార్థన గమనించి పత్రికను రక్షింప గోరుచున్నాము. తరువాత తమదయ.

శ్రీశ్రీకంఠశివాచార్యుల పర్యటనము:—శ్రీవారు భీమడోలు మఠాంనుంచి కృష్ణాజిల్లా పర్యటనముగావించి శ్రీగురుకులాశ్రమమునకు విజయంచేసి మూడు దినములుండి పిమ్మట గుంటూరుజిల్లాయందు కొంత ప్రచారముగావించి మరల భీమడోలునకు దయచేసి "శ్రీగీతాభాష్యము"ను పూర్తిచేయుచుండిరి. శ్రీవారి సంకల్పాను

గ్రహమువలన శ్రీకంఠశివాచార్యమతము, బ్రహ్మసూత్రభాష్యము, గీతాభాష్యము లోకములో ప్రకాశింప జేయబడెను. మతోద్ధరణార్థై యవతరించిన మహానుభావులు జేయవలసిన మహత్కార్యము లింత కంటె నేమియు లేవు. శ్రీవారి యోగమహిమాపిశేషములు సర్వు లకు విశదమయ్యే యున్నవి.

భారతశాసన సభాభ్యర్థులు:— ఆంధ్రరాష్ట్రముతరపున విజ యమునొందిన కాంగ్రెస్సుపక్ష సభ్యులును నిరంతర దేశోద్ధరణదీక్షా విశ్వదాత శ్రీకాశీనాథుని నాగేశ్వరరావుపంతులు గారికిని, ఆచార్య రంగనాయకులుగారికిని, వి. వి గిరిగారికిని, అనంతశయనం అయ్యం గారికిని, సత్యమూర్తిగారికిని, సామి వెంకటాచలంశ్రేష్ఠిగారికిని, మా హృదయపూర్వక అభివందనము సమర్పించుకొనుచున్నాము. శ్రీవారి కృపివలన భారతమాత యానందించి ప్రజలు సౌఖ్యవం తులై యలరారగలరని మా నిండువిశ్వాసము. పరమేశ్వరుడీసభ్యుల కాయురారోగ్యములొసంగి సంరక్షించునటుల ప్రార్థించుచున్నాము.

ఆయుర్వేదవైద్యశాల:—గుంటూరుజిల్లా మడనూరుగ్రామము నందు శ్రీమాన్ మడనూరు సుందరయ్య గురుకులుగారిచే స్థాపింప బడి గ్రామస్థులచే యభిమానింపబడి పోషింపబడుచున్న "శ్రీధన్వంతరీ ప్రసాద" ఆయుర్వేదవైద్యశాల దినదినాభివృద్ధియై లోకోపకారమొన ర్పబడుచూ శాస్త్రీయౌషధములతో విరాజిల్లుచున్నటుల దెలిసి యానందించుచున్నాము. ధన్వంతరీ యనుగ్రహము వలన నీ వైద్య శాల ఆచంద్రార్క స్థాయిగా వర్థిల్లుగాత!

దేవీయజ్ఞము:— బెంగుళూరుజిల్లా గంగపరం గ్రామవాస్తవ్యు లును దేవీప్రసాదలబ్ధ సంతోషామృతచిత్తులునగు శ్రీమాన్ నంజుండ దీక్షితులవారు. శ్రీకాంచీపురమునందు దేవీత్రిశతి సువాసిన్యర్చనాది

మహాయజ్ఞము మాఘశుద్ధ విదియలకు ప్రారంభించి యిరువదియొక్క రోజులు గావింపనున్నారు. అందులకై షుమారు యేబదివేలరూప్యములు గావలసివున్నవట. మైసూరుమహారాజా మున్నగు ధనాఢ్యులు యీయజ్ఞమును నెరవేర్ప సహాయమొనరించి యున్నారట. ఆంధ్రదేశమున కొందరు చందాలువేసియున్నారు. సర్వులు తమతమ శక్త్యానుసారముగా సహాయమొనరించి దేవీయజ్ఞమునకు దయచేసి ఆనందింపవలెనని శ్రీదీక్షితులవారు ఆహ్వానించుచున్నారు.

శ్రీ శ్రీకంఠజయంతి:— ఫాల్గుణ శుద్ధ పంచమీలలరోజున శ్రీకంఠజయంతి యని పండితవర్గమువారు నిర్ణయించియుండుటచే సదరు విషయములు లోగడపత్రికయందు ప్రకటనచేసియున్నాము. గావున మఠనిర్మాణము అయిన పిమ్మట యిదే ప్రథమవార్షికజయంతి గనుక స్వమతాభిలాషులైన ఆదిశైవ మహాజనులు శ్రద్ధతో ప్రధానస్థానమగు శ్రీకంఠమఠమునకు (కోటిఫలి) దయచేసి జయింతి మహోత్సవము నెరవేర్చుకొని ఆచార్యప్రసాద స్వీకరణ మొనరించి ధన్యులగుటకు హెచ్చరించుచున్నాము. మఠమునకు వెళ్లుటకు సందర్భము గానివారు ఆచార్య పటమును స్వగృహమునందు నెలకొలిపి గురుపూజ నొనరించుకొని ఆనందింప గోరుచున్నాము. పూజాకల్పము గావలసిన వారు 0-2-0 లు చీట్లు పంపినయడల ఒక్కప్రతి సప్లయిచేయబడును. దానియందు "గురుపూజా విధానము" గలదు. వలయువారు శ్రీగురుకులాశ్రమమునకు వ్రాసుకోవలెను.

అర్చకదావాలు:—దేవాదాయపుబోర్డువారు తమనిరంకుశత్వమును ప్రకాశింపజేయుటకై యనేకమార్గములు త్రొక్కుచున్నారు. అసలు పరిపాలనావిధానమే యింతవరకు గోచరము గానందువలన గత్యంతరము జిక్కక పరిపరిమార్గముల నన్వేషించి "అర్చకాదాయ" భక్షణ మొనరించుటకై యత్నించుచున్నారు. అంతియేగాని దేవునకును

అర్చకునకుగల సంబంధముగాని ఆచారఅనుభవ హక్కులుగాని శాస్త్రశాసన ప్రమాణములుగాని పరిశీలింపక ఏఅనామకునకో ట్రస్టీ ఆర్డరుపంపించి కంట్రిబ్యూషన్ వసూలుపరచుటకై అర్చక ఆస్తిని జప్తుచేయించి రసాభాస మొనరించుచున్నారు. ప్రభుత్వమువారు సైతము ఒక మార్గమును నిర్ణయింపక తటస్థముగా యుండి యీ వినోదము చూచుచున్నారు. యేల యిట్లొనరించు చుండిరో కారణము తెలియదు. గవర్నమెంటు ఆర్డరుకు ప్రతికూలముండ నేరదు. దేవాలయ పరిపాలన గవర్నమెంటువారు గావించుచున్నచో యీ యిక్కట్లు సంభవింపనేరవు. యీ బోర్డువలన దేవాలయముల గౌరవమునశించి గ్రామములో ఐకమత్యతలేక అర్చకవృత్తికి భంగముగల్గి దాతల యుద్దేశ్యము నిరర్థకము కాగలదు గావున పరిపాలకులగు శ్రీ ప్రభుత్వమువారు యీ దేవాలయ సమస్యను పరిశీలించి సక్రమపద్ధతి నెలకొల్పి. ధర్మోద్ధరణ మొనరింప ప్రార్థించుచున్నాము. ఏపార్టీవారైనను దేవాలయ విషయములలో టీపార్టీ చేయుచున్నారేగాని దేవాలయ గౌరవములు, దాతల యుద్దేశ్యములు, అర్చక జీవనములు, మున్నగు విషయములు గమనింపక తమతమ పాండిత్యముల ప్రకాశింపజేయుచూ ఏదోవిధముగా బోర్డుతరఫున జేరి ఉదరపోషణకై యత్నించుచున్నారు. యీ సద్విషయము శాశ్వతముగా నెరవేర్చుటకు సంకల్పము నొనరించుటలేదు. అర్చకునియందు ద్వేషమువహించి జీవనభంగము నొనరించుటకు బయలుదేరుచున్నారు. తక్కిన నౌకరీలవిషయముగాని ఆ ఆదాయముల విషయముగాని తలపెట్టక అర్చకుని జీవితమున కొసంగిన భూమిపై బోర్డువారు అమలు జరుపుచున్నారు. గవర్నమెంటువారు సహాయ మొనరించుచున్నారు. అమాయికులగు నో అర్చకసోదరులారా! మీరు అధైర్యపడక శక్తియున్నచో వ్యవహార మొనరించి మీహక్కుభుక్తముల స్థిరపరచుకొనుడు. అందులకనేక మార్గములుగలవు. యీ బోర్డువారు మిమ్ములనేమియు చేయజాలరు. వారికి అట్టిశక్తిలేదు వారికంటె అశక్తులై నిలువజాలకున్నచో పాతాళమున కణచివైచి మీ స్వత్వము

లపహరించి మీకు గోదావరీ స్నానమునకు మార్గముజూపింపనున్నారు. గనుక ఆలసింపక త్వరగా మీమీ తాలూకా డిస్ట్రిక్టుకోర్టులలో పది హేనురూపాయిల స్టాంపుతో మీ హక్కులు స్థిరపరచే నిమిత్తం దావాదాఖలుచేసి, బోర్డువారి కంట్రిబ్యూషన్ జప్తులను ఇంజక్షన్ చేయించినచో మీకు ముస్ముందు చక్కని మార్గము గోచరము కాగలదు. గావున త్వరపడి రాజీపద్ధతి ననుసరించుటవలన మీ దొంగ తనము వెల్లడియై భగవదపచారమునకు హేతువగును. వేలసంవత్సరము లాదిగా నిన్ను పోషించిన మహాదేవుని నిట్టి సందిగ్ధావస్థ కుంచు స్వార్థ పరుడవై ద్రోహముజెసిన దానికన్న మిత్రద్రోహము మరొకటి గలదా? నీ జీవితము పోయిననేమి బిచ్చమెత్తి భగవంతుని పోషింపలేవా? సత్యము నేనమ్మి భగవంతుని సేవించలేవా? అర్చకత్వమువలన నీకు అవమానముగల్గినచో యెంగిలికూటికి ఆశపడి దొంగమార్గ మవలం బించి జీవించుట నీ గౌరవమునకు హానియనిదలంచి వెంటనే మరియొక వృత్తి నవలంబించినచో ఒకపక్షములో అధిమైన గౌరవమేగాని రాజీ పడుట సర్వానర్థకమని దలంచి వ్యవహరించుము. లేదా త్యజించుము. ఉభయభ్రష్టుడవు మాత్రము కావలదని మా హెచ్చరిక. నీ స్వశక్తిపై నీ వాధారపడి నీ మార్గము నీవునిశ్చయించుకొని నీ యిష్టమొచ్చి నట్లుగా వ్యవహరించుకొనుము.

## స్వీకృతి

(౧) శుష్క-వేదాంత తమోభాస్కరము  వెల రు. ౧-౪-౦
(౨) శ్రీ స్వబోధసుధాకరము  ౧-౨-౦
(3) ఓంకారము  ౧-౦-౦

పైమూడు గ్రంథములు శ్రీవ్యాసాశ్రమ (ఏర్పేడు) స్థాపకు లును, పరిపూర్ణ బోధకులును, విజ్ఞాన స్వరూపులు యథార్థభారతీ పత్రికా సంపాదకులునగు, సద్గురు, మళయాళస్వాములవారిచే వ్రాయ

బడి లోకోపకారముగా యనేక ప్రకరణములతో వచనరూపకమున ప్రకటించబడియున్నవి. యిందలి విషయములు శ్రద్ధాభక్తులతో ఆమూలాగ్రముగా పఠించువారును, వినువారును, నిష్కళంక హృదయులై, వేదాంత శాస్త్రసారమును గ్రోలుటయేగాక జన్మరాహిత్యులై ఆనందసాగరమున నోలలాడుదురనుట సత్యేతరముగా నేరదు. శ్రీవారి పవిత్రనామము నెరుంగని భారతీయుడుండనేరడు. లోకో ద్ధరణకొరకు యవతరించిన యవతారపురుషుడై ప్రకాశించు చున్నాడు. శ్రీవారి దర్శనభాగ్యము నొందువారే ధన్యులు. గావున ప్రతివారును, సదరు పుస్తకములు గైకొనియందలి, అమృతమును గ్రోలి తరింపగోరుచున్నాము. వలయువారు శ్రీవ్యాసాశ్రమము, ఏర్పేడు, చిత్తూరుజిల్లా అని వ్రాసిన బడయగలరు......

సుదర్శని:—గోదావరిజిల్లా రాజోలునుండి శ్రీయుతులు దెంతుకూరి నరసింహరాజుగారి సంపాదకత్వమున ప్రతియింగ్లీషు నెలలలో 1,15 తేదీలయందు వెలువడుచున్న పక్షపత్రిక, ప్రథమసంపుటం. 3వ సంచిక నుండి వందనములతో స్వీకరించితిమి. ఇందలి సద్విషయములు పరిశీ లించి యానందించితిమి. చక్కనికథలతోడను, ఆర్థిక నైతికాది సద్విషయ పరిశీలనలతోడను ప్రకటన యగుచూ తన నామమును సార్థక పరచుకొనుచున్నది. సన్మార్గదర్శినియగు నీసుదర్శని చిరతర స్థాయియై వర్ధిల్లుగాతయని మా నిండు విశ్వాసము. సం॥ చందా రు ౨-౦-౦ లు. వలయువారు సంపాదకులపేర వ్రాయగోరుదుము.

ఆంధ్రవిద్యార్థి—తెనాలినుండి సుందర రాం అండు కోవారి ప్రోత్సాహముతో శ్రీయుతులు మహావాది వేంకటరత్నం బి. ఏ., రాయసం వేంకటసుబ్బారావుగార్ల సంపాదకత్వమున వెలువడుచున్న మాసపత్రికయొక్క ప్రథమసంపుటం నాల్గవ సంచికను నమస్కార పురస్సరముగా స్వీకరించి పరిశీలించి యానందించితిమి. సమస్తవిషయ

ములతో యలరారుచు కావ్యవిమర్శనలు సాంఘిక విషయములు మున్నగాగల వ్యాసరాజములు పెక్కుగలవు. ప్రతివారును పరిశీలింప దగియున్నది. విద్యాస్వరూపుడగు పరమేశ్వరుని యనుగ్రహమున నిప్పత్రికా రాజము వర్ధిల్లుననుటయే మాయాశయము. సంవత్సర చందా రు 1-8-0 లు. వలయువారు సంపాదకులపేర-క్రొత్తపేట, గుంటూరు అని వ్రాయవలయును......

౧ చెన్నబసవపురాణము ౨. బ్రహ్మోత్తరఖండము ౩ షట్స్థల శివపూజావిధానము ౦-౮-౦.

పైమూడు గ్రంథములు వందనములతో స్వీకరించి పరిశీలించి యానందించితిమి. శైవమతాభిమానులెల్లరు తప్పక పరిశీలించవలసి యున్నది. సత్యమైనమతములు ధ్వంసమై శూన్యవాదు లభివృద్ధిజెంది ప్రపంచాందోళనము గావించుచున్న నీతరుణమున శైవగ్రంథమండలిని నెలకొల్పి, శైవమతసేవగావించుచుచున్న శ్రీయుతులు కాళహస్తి తమ్మయ్యదేవరగారి నెంతయో హృదయపూర్వకముగా నభినందించు చున్నాము. పరమేశ్వరానుగ్రహమున నీగ్రంథమండలి యాచంద్రతారార్కముగా యభివృద్ధి నొందగలదని మావిశ్వాసము. వలయువారు శైవగ్రంథమండలి. రాజమండ్రికి సంపాదకుల పేరవ్రాయవలెను.

సులభ్యవస్తు వైద్యబోధిని:—సుచిలీపట్నమునుండి శ్రీయుతులు సరసచతుర్విధకవితాసామ్రాజ్యధురంధరులగు నాదెళ్ల పురుషోత్తమకవివర్యులచే రచింపబడి మాకార్యస్థాన మలంకరించినది. అందువిషయములు, సులభముగా లభించు వస్తువులచే నిండియున్నది. రసవిషగంధకాదులు సేవించి శరీరతత్వముల గమనింప నేరక. వ్యాధిగ్రస్తులగుచున్న నీవిపత్తరుణమున, మహోపకారము గావించునటులు నీగ్రంథమును వెలువరించిన, కవివరులను హృదయ పూర్వకముగా నభినందించుచున్నాము.

ప్రతిగృహమునందును నిట్టియుత్తమ గ్రంథముండుట యావశ్యకమై యున్నది. స్త్రీలుసైతము యీ యోగములను సులభముగా గ్రహించి గృహవైద్యము చేయుట కనుకూలించుచున్నది. గ్రంథము వెల ఆరు అణాలు మాత్రమే. వలయువారు గ్రంథకర్తగారి పేర వ్రాయవలెను. ఆలసించిన ప్రతులు లభించ నేరవు.

కిగ్సులావర్తమాని:—విశాఖపట్టమునుండి శ్రీయుతులు పుల్లేపు వెంకట్రావుపంతులుగారి (ప్లీడరు.) సంపాదకత్వమున సర్వ విషయములుగల హైకోర్టులతీర్పులతో తేటతెల్లముగా, ప్రకటించు వారపత్రిక. నాల్గవసంపుటం 4 6 సంచికనుండి వందనములతో స్వీకరించి యానందించితిమి. దీనిప్రకటనస్థలాంతరమునగలదు. నీపత్రిక చిర కాల స్థాయియై వర్ధిల్లగలదని మాకోరిక. చందా రు3-0-0లు మాత్రమే. వలయువారు సంపాదకులపేర వ్రాయవలెను.

హిందూలా:—గోదావరిజిల్లా, కపిలేశ్వరపురమునుండి "లోకల్ బోర్డు పత్రికా సంపాదకులును సుప్రసిద్ధరాజకీయ వేత్తయునగు శ్రీయుతులు చాగంటి శేషయ్యగారిచే రచింపబడి విమర్శనార్థము మాకార్యాలయమలంకరింప జేయుటచే వందనములతో యందుకొని యందలి సమష్టికుటుంబములకు సంబంధించిన సర్వవిషయములు పరిశీలించి యానందించితిమి. నిష్కారణ వైరములకు లోనై తెన్నుగానక తమ తమ ద్రవ్యములను కోర్టులపాలుగావించి నిరర్థకులగుచూ పరితపించు ఈలోకమున ప్రతిగృహమునందును, కనీసము ప్రతిగ్రామమునందును ఒక్కప్రతిని సంపాదించుకొని సర్వవిషయములు పరిహారము గావించు కొనుటకు ఉపయోగించులాగున స్వల్పమూల్యముతో సప్లయిగావించు చున్న గ్రంథకర్తగారి పరిశ్రమను మాహృదయపూర్వకముగా నభినందించుచున్నాము. ప్రతివారును సదరు గ్రంథమును సంపాదించు టవశ్యకర్తవ్యమైయున్నది. పరమేశ్వరుడీ హిందూ ధర్మశాస్త్రగ్రంథనిల

యమును ఆచంద్రతారార్కముగా వర్ధిల్ల జేయునని మానిండు విశ్వా
సము. వెల మూడురూపాయీలు. తగ్గింపువెల రు 2-0-0లు. వలయు
వారు గ్రంథకర్తగారికి వ్రాయగోరుచున్నాము.

ప్రకృతి:—పదునేడవ సంపుటమారంభించి, నూతనాకృతితో
సచిత్రముగా నడుపుచున్న సంపాదకులగు డాక్టర్, పుచ్చావెంకట
రామయ్యగారి సంకల్పవిశేషము నెంతయు నభినందించుచున్నాము.
నేటిప్రకృతి కన్యప్రౌఢవయస్కురాలై సర్వాలంకారభూషితమై
విరాజిల్లుచుండుటలోకకల్యాణమనదగియున్నది. పరమేశ్వరుని యాశీ
ర్వచన ప్రభావమమోఘమై చిరతరస్థాయిగావర్ధిల్లునని మాయాశయము.

యీ నెలలో చందాలు చెల్లించినవారు

౧. శ్రీమాన్ వెలవలపల్లి వెంకటేశ్వర దీక్షితులుగారు (భావమహా
రాజపోషక) సాలూరు. (వి)
౨. అర్చకంకాళప్ప దీక్షితులుగారు. (భావ) గూళూరు. (బెం)
3. చంద్రమౌళి సూర్యనారాయణశాస్త్రిగారు. (శ్రీముఖ-భావ)
కస్తూరివారి పాలగుమ్మి (గో)
౪. పూజ్యంనారాయణమూర్తిగారు (శ్రీముఖ-భావ) జువ్వల
పాలెం (గో)
౫. చావలి వాలయ్యగారు (లోగడ ప్రెస్సులోయిచ్చినది)
పెదరావూరు ౫-౦-౦
౬. నూతలపాటి వెంకటసుబ్బయ్య (భావ-యువసంవత్సరముల చందా)
చినకొండ్రుపాడు (గుం)

# సన్మానములు

౧. మంగళగిరి నివాసులును శివభక్తప్రతిష్ఠా నిర్మాణులును సుప్రసిద్ధ సంఘాభిమానులునగు శ్రీమార్గ సంగాపు కోటయ్యగారు ఉమా మహేశ్వర వ్రతమహోత్సవ తరుణమున పత్రికాసన్మానం నిమిత్తం సమర్పించినది ౧-౦-౦

౨. గూళూరు నివాసులును శైవమత నిర్మాణప్రోత్సాహకులునగు శ్రీమార్గ అర్చకంకాళప్ప దీక్షితులవారు శ్రీస్వాములవారి పాద కానుక నిమిత్తం ౧-౪-౦

౩. గుంటూరుజిల్లా చిలువూరు తుమ్మలపూడి గ్రామ వాస్తవ్యులు. స్వర్ణ సుబ్బయ్యచిలువూరుసుబ్బయ్యగార్ల పత్రికాసన్మానం౧-౮-౦

౪. మంగళగిరి నివాసులును సుప్రసిద్ధ సంఘాభిమానులునగు శ్రీమార్గ సంగాపు హనుమంతరావు పంతులుగారు తమగృహమందు గావించిన హనుమజ్జయంతీ మహోత్సవ తరుణమున పత్రికాసన్మానం నిమిత్తం సమర్పించినది ౧-౦-౦



నాయనలారా ?

నామీదకోప్పడితేం లాభమయ్యా. నేను గట్టిగామాట్లాడుతున్నానని చాలామంది నన్నంటున్నారని తెలుస్తుంది. నేను మీ శాకోసం మీమర్యాదలకొసం పది సంవత్సరాల్నుంచి శ్రమపడుతున్నా. అది మీరు తెల్సుకోక నేనేమోమిమ్మల్ని నష్టపరుస్తున్నానని అంటేంలాభం. అట్లనుకోటం యెంతమాత్రం బాగుండ్లేదు. మీ కక్కర్లేదంటే నేను బలవంతాన పత్రిక చందాలు యివ్వండని యెప్పుడన్నా చెప్తున్నానా? పత్రికక్కరలేనివారు ఒక్కార్డ్రాస్తే సరిపోదూ. లేకపోతే పత్రిక తిప్పేస్తేపోదా.

పాపం సంపాదకుడింకెంతకాలమోపికపట్తాడు. పాపంపదేళ్లలో పండు తుందన్నారుగా. అయిందిపదేళ్లు యిక ముందెలాజరగాలో మీరే తెల్పండి. యేమేమి ప్లానులు వేస్తారో చెప్పండి. రెండు వేలకు పైగా మనం గుక్కమెలాయించాంగాని సంపాదకుని కష్టనష్టాలు ఆలోచించక్కర్లా? పాపం మన్నిగురించి మనసంఘాభివృద్ధికోసం చాలాతంటాలు పడ్డాడు. పదిహేను సంవత్సరాల్నుంచి దేశదేశాల్లో విద్యార్థుల్ని తయారు చేస్తున్నాడు. బోధాయనసూత్రం నాలుగు పక్కలాపరిచేశాడు. వున్న పిత్రార్జితానికిస్వస్తిచెప్పదలిచాడు. పదేళ్లనుంచి పత్రికలుచ్చుకుంటున్నా పైసఖర్చుపెట్టని మహానుభావుల్నేమనాలో మీరే ఆలోచించి పత్రిక పడిపోకుండావుండే పద్ధతిమాత్రం తెలపండి. దయుంచండి.

"లోకసంచారి"

# వివిధజన్మలు

సోదరులారా?

పూర్వజన్మకర్మాను భవరూపతారతమ్యమువలన జన్మలు కల్గుచున్నవనియనేక శృతిస్మృతేతిహాసములు దెలుపుటయేగాక యనేక దృష్టాంతరములుగల చరిత్రలవలన దెలియుచున్నది. (1) స్వామిద్రోహము (పోషణజేసినవారిని మోసగించుట) జేయువారు కోడివై పుట్టుదురు. (2) ఇతరులకు ధర్మముచేయకుండా భుజించు వాడు పాముగాపుట్టును. (3) మిత్రద్రోహము (నమ్మినవారిని మోసగించుట) గావించువాడు చేపయైపుట్టును. (4) అపరిమితమైన యాచనచేసి జీవించువాడు గాడిదయైపుట్టును. (5) పిలువకయేవెళ్లి జీవించువాడు కాకియైపుట్టును. (6) బ్రహ్మహత్యలు మున్నగు పాతకములు జేయువారు కల్పాంతమువరకు గడ్డిపోచలు, పొదలు, తీగెలు, వృక్షములుగా జన్మించుచుందురు. రెండవకల్పములోనేలపై ప్రాకెడి రూపములతో పుట్టుదురు. మూడవకల్పములో మృగములుగా

పుట్టుదురు. నాల్గవకల్పములో పశువులు (గోవులు)గా పుట్టుదురు. అయిదవ కల్పములో మానవజన్మనొందుదురు. కొన్ని సత్కర్మ లొనరించుట వలన బ్రాహ్మణజన్మ గల్గును. దుష్కర్మలొనరించినయడల మరల పశుపక్ష్యాదుల జన్మగాని అంతకు తక్కువ జన్మగాగాని పుట్టు చుందురు దేవబ్రాహ్మణ గవాదుల కుపయోగించెడి జన్మలవలన మోక్షము గల్గుచుండును. హింసలవలన గాని హంతకులకు సహాయ పడుటవలనగాని లేక ప్రోత్సహించుటవలనగాని నరకములు సంభ వించును పిమ్మట నీచ జన్మలెత్తుదురు. గావున. ప్రతిజీవియు తనజీవి తమును సార్థక మొనరించి యుత్తమ ప్రాప్తికై ప్రయత్నించుట శ్రేయ స్కరము. దేవబ్రాహ్మణభక్తి, పెద్దలను శేవించుబుద్ధి, ఆశాపాశ విచ్ఛేదనాసక్తి, నిష్కామయోగాభ్యాస ముక్తివిగోరుచూ, నిత్యా నందసముగ్నుడై భగవత్సన్నిధి నపేక్షించువాడే ముక్తుడని, మోక్షాధి కారియని, జన్మరాహిత్యుడని; యనేక ప్రమాణములు దెలుపు చున్నవి. భగవన్నామస్మరణగావించుటకంటె నింకొకమార్గము వలన ముక్తిరానేరదని పలువురు పెద్దలు బోధించుచున్నారు. పవిత్రహృదయ ముతో, అకుంఠితమైన భక్తితో నిశ్చలమైన మనస్సుతో, తదేకదీక్షతో భగవదారాధన గావించి, ఏతన్మహిమా విశేష ప్రభావముచే పరమే శ్వరునితో లీలావినోదములనుభవించిన మహాభక్తశిఖామణు లెందరో గలరు. ఈశ్వరానుగ్రహావేశముచే లోకమును లోకాంతరమునుగూడ తల్లిబిల్లిగా నాడించిన ధన్యాత్మ లెందరోగలరు. అట్టిపుణ్యాత్మలేగిన మార్గములు నేటికిని చెక్కుచేదరకనిలచియున్నవి. ఏరీఆమార్గమునుదిల కించువారు. వివిధమార్గములకులోనై దూషణభూషణ తిరస్కారము లతో, ఆత్మవంచకులై అన్యోన్యానురాగ దూరులై, జ్ఞానశూన్యులై దుర్గతుల నొందుయత్నములకు గురియగుచుండుట శోచనీయము. అహంకారమమకారముల వలన యనేకజన్మలకు హేతుభూతమని గ్రహించిన పెద్దలు. మానవ సేవయే భగవత్సేవయనియు, మానవుని

హింసించుట మహాపాతకమనియు, భూతదయ వలన ఆత్మవికాసముగల్గు ననియు యనేక హితవాక్యములు బల్కుచున్నారు. వాటిని గమనించి యనుసరించుట ముఖ్యధర్మమని విన్నవించుచున్నాము......

(భక్త సమాజము.)

## సంఘము—దానిపోషణ

ఆదిశైవమహాజనులారా?:—కలియుగమునందు సంఘశక్తి కి మించినబలమింకొకటిగన్పట్టుట లేదని గ్రహించి ప్రతి వారును తమమతాభివృద్ధికై నొక్కొక్క పేరుతో నొక్కొక్క సంఘమేర్పరచుకొని తద్వారా సంఘాభివృద్ధికిపాటుబడుచూ, విద్య, ఐకమత్యత, ఉత్సాహము, ఉత్కృష్టత, స్వాతంత్ర్యము మున్నగు లాభములనొందుచూ సాటిమానవులతో ఆనందమనుభవించుచున్నారు. అట్లే మనవారుగూడ రాష్ట్రసంఘములు మండలసంఘములు, తాలూకా సంఘములు నెలకొల్పి మహాజనసభలు జరిపి అవసరమైన తీర్మానములుగావించి సాంఘికులకు కొంత అలజడిని గలుగజేసి కొంతకాలమువరకు ఆరంభ శూరత్వముగా కార్యక్రమము నెరవేర్చియున్నారు. క్రమక్రమముగా ఆయుత్సాహము సన్నగిల్లి సాంఘికులనునిద్రాముద్రితము గావించినది. తత్కారణమున కార్యక్రమమంతయుబీటువారిభిన్నభిన్నములైస్వరూపజ్ఞానమునుగోల్పోవును. పిమ్మట సంఘమంతయు చెల్లాచెదరై "యెవరికివారే. యమునాతీరే" యను సామ్యతకు గురియైయున్నది. యింతవరకు సంఘముగావించిన మహోత్కృష్టతను స్మరించి కర్తవ్యమును నిశ్చయింప ప్రార్థితులు. ఆదిశైవమతస్వరూపమును గుర్తించుటయు ఆదిశైవాధి కారములు వారిఉన్నతాశయములు వారివృత్తి గౌరవము మున్నగు సద్విషయములు లోకములో స్థాపించుటచే సర్వులు దెలుసుకొనుటయు ప్రతికక్షుల హృదయములు గగ్గోలుపడునట్లు శాస్త్రవాదములు, చర్చలు, గావించుటయు కోల్పో

యిన మతనిర్మాణాచారములు స్థాపించుటయు, ప్రసిద్ధమైనభాష్య గ్రంథములు ముద్రించుటయు, స్వసూత్రాచరణము గావించుటయు విద్యార్థులు మతవిద్యాలయందు త్తీర్ణులగుటయు దేవాలయ ప్రతిష్ఠోత్సవములందగ్రగణ్యత వహించుటయు. మున్నగు విషయములు సంఘాభిమానముచే సంఘసేవకుల ప్రబోధము వలనజరిగి యున్నవా? లేక మన స్వార్థపరాయణుల మహిమావిశేషములవలన జరిగినవా? యని కొంచము విశాలహృదయముతో విచారించిన సత్యము గోచరింపగలదు. గాన సాంఘికులు పూర్తియభిమానము జూపవలసిన విషయములో సంకుచిత దృష్టినవలంబించి అసృతమహాదీక్షతో సత్యదూరులై నిరసనభావములుకు దాసులై సంఘసంరక్షణకై ఏర్పడిన పత్రికను తిరస్కరించుట మహాపచారమై యున్నదని విన్నవింపవలసి నందుకు విచారించుచున్నాము. మహాశయులారా? సంవత్సరమున కొక రూపాయి మెనమిదణాలు త్యాగము చేయజాలరా? లేనిచో పత్రిక యవసరము లేదని తెలుపగూడదా? కార్డువ్రాయుటగూడ తప్పనితోచినచో పత్రిక త్రిప్పివేసినచో దమ్మిడిఖర్చు లేకుండా మీ యభిప్రాయము ధారాళముగా తెలిపినవారయ్యెదరే? యీ విషయములో యిట్లొనరించుట ధర్మము గా యుండలేదు. సంఘాభివృద్ధికి ప్రధానము పత్రికాప్రచారమేయని దెలుసుకొనవలెను.

సంఘపోషణ విషయములో శాఖోపశాఖలుగా ద్రవ్యము నొసంగుచూ విద్యాశాలల నేర్పరచుటయు పండితపరిషత్తు నెలకొల్పుటయు గ్రంథాలయములు స్థాపించుటయు, పరీక్షాలయములు బహుమతులు మతచర్చలు మున్నగునవి గావించుటయు యింకను జరుగవలసియున్నవి. యిదివరకు గావించిన పనులు పునాదిలోనే యిమిడిపోయినవని తెలుసుకోవలెను. రాష్ట్రసభలు మండలసభలు తప్పక ప్రతి సంవత్సరము జరుగవలసియున్నవి. శ్రీకంఠ జయంతి పాల్గుణశుద్ధ పంచమినాలరోజున. ప్రతివారును తమతమ గృహమునందు యథాశక్త్యాను

సారముగా గురుపూజ నొనరింపవలెను. ఆతరుణమున సంవత్సరసభలు జరుపుకొనవచ్చును. సంవత్సరమున కొక్కొక్క గ్రామము వారాహ్వా నింపగలరు. విశేషద్రవ్యము ఖర్చు లేకుండా కార్యక్రమముజరుగ గలమార్గ ములుగలవు. గావున సాంఘికులు సంఘాభిమానముతో పైకార్యక్రమ మందు తమతమ యభిప్రాయములు వెంటనే పత్రికా ముఖమున చర్చించి సంఘమును ప్రకాశవంత మొనరించుటకు ఆంధ్రరాష్ట్ర ఆదిశైవమహాజనులను నమస్కార పురస్సరముగా ప్రార్థించుచున్నాము.

స్వామి సద్యోజాత శివాచార్య.

## జిల్లేడుచెట్టు

యిదిరెండురకములు. తెల్లది, నల్లది. తెల్లదే శ్రేష్ఠము.

(౧) దీనిఆకులు (లేతవి) కాచి రసముతీసి చెవిలో పోయుచుండిన యెడల చెవుడునివృత్తియగును.

(౨) దీనిఆకులపై గల తెల్లనిపిండినిగీచి జిల్లేడుపాలతోడనే నూరి గోలికాయలంత మాత్రలుచేసి పాముకరచినవానికి తమలపాకులతో చుట్టినమిలించిన యెడల విషముహరించును. (దేహమున తిమ్మిరి పుట్టువరకు అరగంటకొకటిచొప్పున తొమ్మిదిమాత్రలవరకు యివ్వ వచ్చును.) స్మృతిలేనివానికి యీమాత్రసీళ్లలో కలిపిత్రాగించవలెను. విషము హరించినపిమ్మట విరోచనసాధిక చేయవలెను. తేలికఆహారము యివ్వవలెను. కొన్నిదినములవరకు మత్తువస్తువులు తినగూడదు. మాత్రలు మింగునప్పుడు వమనము అయితే త్వరగా గుణము గల్గును.

(3) దీనిపాలు నువ్వులనూనె, నూవులపిండి బెల్లము సమముగా కలిపి తినిన యెడల పిచ్చికుక్క కాటు హరించును.

(౮) దీనిపాలు బెండకాయచిప్పలోపోసి సైంధవలవణము వేసి
పూరబెట్టి నూరిచేసిన కణికలను, కలితో అరగదీసి కుట్టినచోట రాచిన
యడల తేలుబాధహరించును.

(౯) దీనిఆకులునమిలి దీనివేరుతో గంధముతీసి కరచినచోట
పూసి ఆగంధమే కనులలోకూడా కలికము వేస్తే పాముకాటు హరిం
చును. యీగంధమే తేలుబాధ నివారించును

(౬) దీనిపండుటాకులు వెచ్చజేసి రసముదీసి చెవిలోపోసిన
యడల చీముకారుట ఆగును.

(౭) పచ్చిపూవులు నూరికట్టిన యడల మడమశూలహరించును.

(౮) కాయల చూర్ణము 12 వడ్లగింజలమెత్తు 12 మిరియాలు
వేసి నూరి తినినయడల పాండువ్రు నివర్తియగును.

(౯) జిల్లేడుపాలు ఎండబెట్టినయడల చూర్ణముఅగును. అది
పదుమూడు వడ్లగింజలమెత్తు రెండుపూటలు సేవించితే జ్వరములు
ట్టును క్రమముగా కుష్ఠుహరించును.

(౧౦) దీనిపూవులు మిరియాలతో నూరిమాత్రలుకట్టి సేవించిన
యడల ఉబ్బసము, మూర్ఛ, వగైరాలు నిమ్మళించును.

(౧౧) ఎండు పువ్వులచూర్ణము 3 వడ్లగింజలమెత్తున గంటకొక
సారియిచ్చిన యడల కలరాకట్టును.

(౧౨) యీచూర్ణములో చక్కెర కలిపిసేవించితే శగరోగ
ములు మానును. కుష్ఠు నిమ్మళించును

(౧౩) పచ్చి యాకులరసము ముక్కులోపిండితే చిన్నబిడ్డ
నొప్పులు హరించును. (యీరసముకండ్లకు తగులరాదు)

(సులభ్యవస్తువైద్యబోధిని)

# వార్తలు

## ఆంధ్రరాష్ట్రమహాసభలు.

విశాఖపట్టణమునందు డిశంబరు 29-30-31 తేదీలయందు ఆంధ్రమహాజనులందరు సమావేశమై ఆంధ్రరాష్ట్రజమిన్దార్ రైతుసభ రైతుసభ మహిళాసభ అవసర ఆంధ్రసభ, రాష్ట్రీయమహాసభలు మున్నగు సభలు జరిపి అత్యవసరమగు తీర్మానములు గావించియున్నారు అధ్యక్షతవహించిన మహానుభావులు విషయములను విపులముగా విమర్శించి దేశసౌభాగ్యమును స్మరించి రైతులయిక్కట్లను పరిశీలించి, స్త్రీలయాందోళనములను గమనించి. జాయంటు పార్లమెంటరీ కమిటీ రిపోర్టును చర్చించియున్నారు. ప్రత్యేకాంధ్రరాష్ట్రనిర్మాణావశ్యకతను గోరుచున్న ఆంధ్రులు తమకోర్కెలు నెరవేరువరకు ప్రయత్నమును విరమింపక అన్యోన్యకలహములకు గురియై కక్షలతో నిరర్థకులుగాక సార్థకత్వముగొంది సఫలమనోరథులగుటకు భగీరథ ప్రయత్నము లొనరింపగలరని నమ్ముచున్నాము. ఆంధ్రరాష్ట్ర గ్రామపరిశ్రమల సంఘము నెలకొల్పి ఆంధ్రుల బుద్ధికౌశల్యమును ప్రదర్శించుటకు గూడ సహాయపడగలరని యాశించుచున్నాము. సర్వేశ్వరు డీ యాంధ్రసోదరుల యౌన్నత్యమును నెరవేర్చి రక్షించుగాత.

(పత్రికాధిపతి.)

భారతశాసన సభాప్రవేశమునకై యభ్యర్థులలో కాంగ్రెస్సు వారికే యెక్కువవోట్లు వచ్చినందున దేశీయులు నేటికి కాంగ్రెసు యొక్క నిజతత్వమును గ్రహింపగల్గిరనియు దేశోద్ధరణకై యవతరించిన మహాత్ముని సంకల్ప బలవిశేషములు సార్థకమగుచున్నవనియు పలువురు యానందించుచుండుటచే ప్రతికక్షుల యసూయవృద్ధియై సరసమును విడనాడి కాంగ్రెసువారిని శ్రీకృష్ణ జన్మస్థానముల కంపునటుల

ప్రభుత్వమువారిని ప్రోత్సహించుట వైరితనమని తెలియకుండుట పూర్వజన్మ సంస్కారఫలితమేమో.

గాంధిమహాత్ముడు కాంగ్రెసు మహాసభనుండి నిష్క్రమించినది మొదలు అఖిలభారత గ్రామోద్ధరణ సంఘమును నెలకొల్పి యెవ రెవరు యే యే చేతిపనులయందు సమర్థులో యే యేవృత్తులు నశించినవో యేవిధమున వాటిని వృద్ధిచేయవలెనో దేశములో అవసరమై, దీనజనుల జీవనోపాధికి హేతువై, నిరుద్యోగసమస్య నివారణమగు పరిశ్రమల పరిశీలించి యోచించి వాట్లను స్థాపించుటకు ఎక్కువగా కృషిసల్పుచూ ప్రతిపల్లెకును స్వయముగా బయలుదేరుదురని దెలియుటచే సంతోషించని మానవుడు లేడనుటలో ఆశ్చర్యమేమున్నది.

చిరకాలమునుండి స్వాతంత్ర్యసంపాదనార్థమై యాందోళన గావించుచున్న మన దేశీయులను సంతృప్తిపరచుటకై "జాయింటుపార్లమెంటరీరిపోర్టు" అనునొక ప్రణాళికను శ్రీప్రభుత్వమువారు ప్రకటించి అందరు పరిశీలించుటకై 0-8-0 లు ఖరీదుతో యిరువదివేల ప్రతులను మనదేశములోనికి పంపియుండుటచే సదరు ప్రతులు అధికారానధికారేతర ప్రముఖులు పరిశీలించి చప్పడించి పెదములు విరుచుచూ అసంతృప్తిని వెలువరించుటవలన యిదివరకు గావించిన వివిధ రిపోర్టులతోబాటు దీనినిబుట్టదాఖలుచేయుట శ్రేయస్కరమేయని యనేకులు వెల్లడించుట గమనించి మితవాదశిఖామణులు త్రొక్కిళ్ళాడుటకు కారణము లేకపోలేదు.

అసెంబ్లీ యభ్యర్థులలో కొందరికి ధరావతుకూడా నష్టము గల్గినందున "రెంటికి జెడిన రేవడిని" స్మరించుచూ గుటకలు మ్రింగుచూ అవమానమును భరింపలేక వైస్రాయిగారి భవనముల చుట్టూ ప్రదక్షిణము లొనరించుటవలన ఏజన్మలోని దేవాలయముల కడుగిడని ఫలితము సమకూరుటచే కంసుని యవసానరంగము ప్రదర్శిస్తున్నారట.

ఇంగ్లీషుచదువులవలన యిల్లువాకిళ్లు పూసాబుట్రా మొదలగు ఆస్తి నంతయు రామార్పితముగావించి పరీక్షలలో పరాజయము నొందిన ప్రతిభాశాలురు మోమాటపడక యింతటనైనను తమబుద్ధినైపుణ్యతను ప్రదర్శించి దేశీయపరిశ్రమ సంఘములందు జేరి క్రమక్రమముగా తమ్మా నావేశించిన పాశ్చాత్యవ్యామోహపిశాచమును బారద్రోలుట కింకొక మార్గము లేదని మహాత్ముని తిరుమంత్రప్రభావమువలన యనుభవము గల్గిన మహనీయులు చెలుపుట లోకోపకారముగాదా.

యే చదువులు చదివినను భారతీయులు వేషభాషలను మార్చుట వలన పరదేశీయులు హేళనచేయుచుండుట నెరుగక యింకను బంగాళాక్రాపులు, కలకత్తా స్లిప్పర్సు, తంజావూరు ఫలహారములు, బొంబాయి స్వెటికల్సు, జర్మనీసైకిల్సు మున్నగు కలాపముల వలన ఆంధ్రదేశ భాష పరిశ్రమలు పాతాళహోమము గావింపబడు చున్నవని చింతిల్లుచూ గత్యంతరము గాన్పింపక సభలపై సభలు జరిపినను చక్కబడకుండుట స్వస్వరూపజ్ఞానము నశించినట్లేకదా యని పలువురు శంకించు చున్నారు.

క్రిస్టమస్ శెలవులలో చౌకటిక్కెట్లు లభించుటవలన చాలా మంది మదరాసు వేడుకలకు బయలుదేరుట యలవాటైనందున యీ సంవత్సరము మరికొన్ని రైళ్లకుగూడా రిటర్న చౌకటిక్కెట్లు నెల కొల్పినందువలన విశేషజనులు ఎక్కువప్రదేశములు చూడగల్గిరి. దేనికైనను ద్రవ్యమే ప్రధానము. ఆర్థిక పరిస్థితులు సర్దుబాటుజేయు టకు పలువురు యత్నించుచున్నారు.

కాంగ్రెస్సువలన లోకము పాడైపోవు చున్నదని హితోప దేశము గావించి పండితులమనిచెప్పి లోకవంచనలతో మోసకృత్యము లతో పొట్టపోసుకొనుచూ జస్టీసు—స్వతంత్రపార్టీలను దిగద్రొక్కి తన ప్రతిభను ప్రకాశింపజేయుచూ నూతనయన్వన మవలంబించిన వృద్ధునిమాడ్కి గాంధిమహాత్మునితో ప్రతిఘటించుటకై యత్నించి

తమ స్వరూపమునుగాంచి లోలోన తత్తరపడుచూ బయటికి ప్రగల్భములు బలుకుచూయున్న మన "సనాతనమహామండలి" వారికోర్కెలు నెరవేరకపోయినను అవమానమని దలంచనందులకు లోకులు పరిహసించుచున్నను మానావమానముల లెక్కజేయక శృతిస్మృతేతిహాసములందలి ధర్మముల కపార్థములు గల్పించి వర్ణాశ్రమధర్మములు సంకరమగు చున్నవనియు కాంగ్రెస్సును బహిష్కరించి సనాతనసంఘముల నెలకొల్పుడని గొప్ప ప్రచారము జేయుచూ మహాత్ముని గ్రామోద్ధరణ సంఘమునందు జేరుటకు తీర్మానించుటవలన లోకులేమనుచున్నారోయని దలంచనేరకపోవుట అజ్ఞానమో? జ్ఞానమో? దిలకింపుడు.

# ప్రకటనలు

## "కింగ్సులా వర్తమాని"

(ఇది ఒక వారపత్రిక.)

సంవత్సరచందా పోస్టేజీతోసహా రు 3 లు
మాత్రము అయియున్నది.

ఇందు దేశవార్తలున్ను, ఇండియాదేశములో యుండు 7 హైకోర్టుల తాలూకున్ను, ప్రీవీ కౌన్సిలువారి తాలూకున్ను, ముఖ్యమైనటువంటిన్ని, ఇంగ్లీషు భాష రానివారికి తెలియతగ్గటువంటిన్ని, శివిలు, క్రిమినలు, రవిన్యూతీర్పులయొక్క సారము బాలురకుకూడ అర్థమగునటుల వ్యాకరణ సూత్రములు విసర్జించి సులభశైలిని దేశరివాజు మాటలతో, యీపత్రిక ప్రచురించబడును. మద్రాసు యిస్టేట్లలేండు ఆక్టుపయినిన్ని, గ్రాముఉద్యోగస్థుల ఆక్టుపయినిన్ని. విలేజి పంచాయితీ కోర్టు ఆక్టుపయినిన్ని జారికాబడు అన్ని తీర్పులయొక్క సారము విధిగ ప్రచురించబడును. ఒక తీర్పుఅయినను మినహాయించబడదు. వలయువారు చందా పైకము యీ దిగువవ్రాయబడు చిరునామాకు మనీ

ఆర్డరు మూలముగ పంపవలెను. వి. పి. పద్ధతిని సొమ్ము వసూలు చేయబడ నేరదు.

కింగ్ అండు కో., లా పబ్లిషర్లు,
3 వ నంబరు టపాపెట్టె, Post Box No. 3.
విశాఖపట్టణము.
VIZAGAPATAM.

# చక్కని వేదాంత గ్రంథములు

| | |
|---|---|
| ౧. శుష్క వేదాంత తమోభాస్కరం | ౧-౪-౦ |
| ౨. స్వబోధసుధాకరము | ౧-౨-౦ |
| 3. ఓంకారము | ౧-౦-౦ |

సర్వులకు తెలియులాగున సులభపద్ధతిని (తాత్పర్యముతో సహా) వ్రాయబడియున్నవి. ఆలసించిన దొరక నేరవు.

అడ్రస్. శ్రీవ్యాసాశ్రమము
ఏర్పేడు P. చిత్తూరుజిల్లా.

శ్రీ

# ధన్వంతరీ ప్రసాద ఆయుర్వేద వైద్యశాల

యిచ్చట సమస్తమైన వ్యాధులను శాస్త్రోక్తముగా పరీక్షించి సరియైన ఔషధములొసంగబడును. వలయువారు మాకువ్రాసినయడల వెంటనేజబాబు రాగలదు.

ఇట్లు మేనేజరు
యం. సుందరయ్య గురుకులు
మడనూరు ఈతముక్కల పోష్టు,
వంగోలు (Via)

## (హిందూలా)

ఇందుసముష్టికుటుంబములకు సంబంధించిన సర్వవిషయములు తీర్పులతోసహా యున్నవి. ఆలసించిన ప్రతులుదొరకవు.

పోస్టేజీగాక అసలు వెల 3-0-0

తగ్గింపు వెల 2-0-0

వలయువారు మేనేజరు హిందూధర్మశాస్త్రనిలయం.
కపిలేశ్వరపురం.
గోదావరిజిల్లా.

# శ్రీ శైవ గ్రంథమండలి నిబంధనలు



(1) మా గ్రంథమండలిలో సంవత్సరమునకు 4 గ్రంథములు 3మాసముల కొకటి చొప్పున వెలువడును.

(2) సంవత్సర చందా 1—8—0 పోస్టు ఖర్చులు 0—8—0 మొత్తం 2—0—0 మణియార్డరుగా పంపిగాని, మా ప్రతినిధి వద్ద యిచ్చి రశీదు పొందిగాని చేరవచ్చును.

(3) అభిమానులు 5/—రూ. ప్రధాన పోషకులు 10/—రూ. రాజపోషకులు 25/—రూ. వీరి పవిత్రనామములు ప్రతిగ్రంథమందు ముద్రించబడును.

(4) ఒకేగ్రామమున 10 మంది చందాదార్లు యున్నట్టివారు చందా 1—8—0 చెల్లించిన చాలును.

(5) ఇందు వేయబడు అనుబంధములు తక్కువ వెలవేసి పంపుచుందుము.

(6) అభిమాన పోషకవర్గమువారికి అనుబంధ గ్రంథము ఉచితముగా పంపబడును.

ఇందు పవిత్రమైన శివపురాణ కథలు, శైవభక్తుల యమానుష దైవిక చరిత్రలు, పురాతన శైవాచారములు మున్నగు సకల విషయములతో సంవత్సరమునకు నాలుగు గ్రంథములు వెలువడును. మూడు మాసముల కొకటివంతున మందారమధుర వచనరూపమున 200 పేజీలతో నలరారు శ్రీ శైవ గ్రంథమండలి యిదియే.

కాళహస్తి తమ్మయ్యదేవర

శ్రీ శైవ గ్రంథమండలి,

రాజమహేంద్రవరము.

---

ుదా రు 1-8-0 లు. Regd. No. M. 207.

# శ్రీ ఆదిశైవపత్రిక.

శ్రీ శ్రీకంఠ మఠాధిపతుల యాజ్ఞానుసారముగా, శైవ సంఘాభ్యుదయమునకై శ్రీ గురుకులాశ్రమమునుండి ప్రతిమాసము ప్రకటింపబడును.

సర్వదేవాత్మకో రుద్రస్సర్వే దేవాశ్శివాత్మకాః ।
రుద్రస్య దక్షిణేపార్శ్వే రవిర్బ్రహ్మా త్రయోగ్నయః ।
వామపార్శ్వే ఉమాదేవి విష్ణుస్సోమోపి తేత్రయః ।
(రుద్రహృదయోపనిషత్)

సంపాదకుడు:—చిలుమూరు పురుషోత్తమ గురుక్కళ్.

| | | |
|---|---|---|
| సంపుట ౧౦ | చిలుమూరు, కొల్లూరుపోష్టు<br>భావనామ సం॥ర మాఘ ఫాల్గుణ మాసములు. | సంచిక ౧౧-౧౨ |

[విలేఖకుల వ్యాసములకు సంపాదకులు ఉత్తరవాదులు కానేరరు.]



—♦ విషయసూచిక ♦—



భారతీ ముద్రాక్షరశాల, తెనాలి.

# ఉద్ధారకులు

౧ కీ॥ శే॥ చిలుమూరు తీర్థేశ్వరులవారి జ్ఞాపకార్థం కుమాళ్లు ఉమామహేశ్వరం వగైరాలు, చిలుమూరు.
౨ కర్ణాటక రాష్ట్రీయ ఆదిశైవ మహాసంఘమువారు, బెంగుళూరు.
3 శ్రీమాన్ నడింపల్లి నాగేశ్వరశివాచార్యులవారు, ఇంటూరు.
౪ ... గూడూరు రాఘవరావుగారు, పోతునూరు.
౫ ... గూడూరు శీతయ్యగారు, శనివారపుపేట.
౬ ... అయలూరు వెంకటసుబ్బయ్యగారు, అర్తమూరు.
౭ ... పావులూరు రామచంద్రయ్యగారు, మునికోటిపురం.
౮ ... పావులూరు హనుమంతయ్యగారు, మునికోటిపురం.
౯ ... పెనుమూడి సత్యనారాయణగారు, తూర్పుకూచిపూడి.
౧౦ ... స్వర్ణ వెంకటశివావధానులుగారు, బూతుమల్లి.
౧౧ ... పావులూరు నాగేశ్వరశర్మగారు, అనంతపురం.
౧౨ ... పెనుమూడి హనుమంతరావుగారు, తెనాలి.
౧3 ... మామిళ్ళపల్లి శంకరమ్మగారి జ్ఞాపకార్థం భర్త శివరామదీక్షితులుగారు, చుండూరు.
౧౪ ... మామిళ్ళపల్లి సాంబయ్యగారు, చుండూరు.
౧౫ ... పొన్నూరు సుబ్రహ్మణ్య పాకయాజిగారు, దండమూడి.
౧౬ ... మేడూరు శివయ్యగారు, తేలప్రోలు.
౧౭ ... కుందుర్తి ఆనందరావుగారు B. A. దుగ్గిరాల.
౧౮ ... పార్వతమ్మగారి జ్ఞాపకార్థం సత్తెనపల్లి వెంకటరామయ్యగారు, వోవర్ సీయరు, దుగ్గిరాల.
౧౯ ... చావలి గంగయ్యగారి జ్ఞాపకార్థం కుమాళ్ళు సుబ్బయ్య వగైరాలు. చముడుపాడు.
౨౦ ... సంగాపు పానకాలయ్యగారి జ్ఞాపకార్థం కుమాళ్ళు వీరయ్య గురుకులు వగైరాలు, నవులూరు.
౨౧ ... సంగాపు కోటీశ్వర గురుకులుగారు, మంగళగిరి.
౨౨ ... చిలుమూరు వెంకటసుబ్బయ్యగారు, చిలుమూరు.
౨3 ... చిలుమూరు కుటుంబయ్యగారు, చిలుమూరు.
౨౪ ... శేకూరు రాఘవశర్మగారు, గుడివాడ.
౨౫ ... చావలి సుబ్బయ్య పంతయ్యగార్లు, పినపాడు.
౨౬ ... చావలి లక్ష్మీకాంతయ్యగారు, బాపట్ల.
౨౭ ... కొల్లిపర రామయ్య, పిచ్చయ్యగార్లు, పెనుమూలి.
౨౮ ... స్వర్ణ చినమల్లయ్యగారి జ్ఞాపకార్థం ధర్మపత్ని బుచ్చమ్మగారు, చీరాల
౨౯ ... పెనుమూడి సీతమ్మగారు, జొన్నలగడ్డ.
3౦ ... పసుమర్తి పార్వతీమ్మగారు, కూచిపూడి.

# శ్రీ ఆదిశైవపత్రిక.

సఏకోరుద్రస్స ఈశానస్స భగవాన్ సమహేశ్వరస్స మహాదేవః॥

"అధర్వశిరసి."


| సంపుట | చిలుమూరు | సంచిక |
|---|---|---|
| ౧౦ | భావ సం॥ర మాఘ, ఫాల్గుణమాసములు. | ౧౧-౧౨ |


## హరిహర ధ్యానం

శ్లో॥ యాతౌ, శంఖ-కపాలభూషితకరౌ, హారు-స్థిమాలాధరౌ,
దేవౌ, ద్వారవతీ శ్మశాననిలయా-నాగారి గోవాహనౌ,
ద్వి త్ర్యక్షౌ బలి-దక్షయజ్ఞమధనౌ శ్రీ శైలజావల్లభౌ,
పాపఘ్నౌహరతాం, సదా, హరిహరౌ, శ్రీవత్స గంగాధరౌ॥

---

## శ్రీ హర స్తుతి

[ఆంధ్రవ్యాసనిపుణ, అవ్వారి సుబ్రహ్మణ్య శర్మగారు, వంగిపురము.]

సీ. మురమర్దనుండైన, మురళీవినోదుండు,
మురజాదివాద్యంబు మ్రోదిసూప,
వేళను గమనించి నాళీకపీఠుండు
తాళంబుఁ దగినట్టు మేళవింప
ఆనందదాయి శతానంద సుందరి
వీణానినాదంబుఁ బూనిజేయ
తానంబునకు సమానంబుగా లక్ష్మి
గాన ప్రచారంబు గానుపింప

గీ. మున్ను నుతియింప ముప్పదిమూఁడుకోట్ల
దేవతలు రజతాద్రిపై దేవిఁగూడి సం
ధ్యవేళను తాండవోత్సవముఁజూపి
సాంబ! నాహృదయమునన్మదయనిమ్ము.
[ నా 'హంసవింశతి ప్రశంస' వ్యాసమునుండి ]

# పండితాభిప్రాయము

శ్రీమదాదిశైవపత్రికా సంపాదకులకు సవినయ విజ్ఞప్తి:— మీ సంఘోపకారాత్మకమగు సత్సహానమునకు పరమేశ్వరుడు శుభాశీర్వాదముల నొసంగుట నిక్కవము తాము కడుంగడు శ్రద్ధమైబంపిన ఆదిశైవ పత్రికయొక్క పదిసంపుటములను శ్రీ శ్రీకంఠ భాష్యాది గ్రంథములును నంది యమందానందమయ్యె. పది సంవత్సరములనుండి చిన్న చేతులతో మీరొనర్చిన పెద్దపనులు అభిరూపులకు సైత మాశ్చర్యము గలిగింప జాలియున్నవనిన సత్యదూరముగాదు.

తమ సాంఘికుల సముచిత సాహాయ్యము మొదలుగాగల సౌకర్యములే తోడుపడుచో నింక నత్యద్భుత కార్యములు జరిగియుండు నని తోచెడిని. శ్రీబోధానందులవారు పరివ్రాట్టయ్యును గృహమేధి కంటె నెక్కువగాను మీరు గృహస్థులై యతి కంటె నధికముగను స్వసంఘాభ్యుదయమునకై పాటుబడుచుండిరని మీ దీర్ఘ ప్రయత్నములు, స్వార్థత్యాగములు స్పష్టముగ జెప్పుచున్నవి. మానవ సామాన్యములగు దోషసందోహములు దొరలినను నిర్మలమగు మీసదుద్దేశము లెన్నటికేని తప్పక సఫలముగాగలవు. ఆత్మీయు లికమీదనేని మేలుకొని నెక్కువగ జేయూతనొసంగుదురుగాక! యథావకాశము మీపత్రికకు వ్యాసములను బంపగలను.

ఇట్లు,

జంగంవాడి మఠం,
బెనారెస్.

శ్రీ మజ్జగద్గురు రేణుకాచార్య భగవత్పాద పాదానుధ్యాత శివైక పథపథిక వేదకావ్య స్మృతితీర్థ ధర్మాచార్య సాహిత్య విశారద పండిత చిః మః వీరభద్రశాస్త్రి, శ్రీశైవభారతీభవనం, కాశీ.

 శ్రీవారు కాశీక్షేత్రమున శైవభారతీభవనమను నొక గొప్ప సంస్థనేర్పరచి సమస్తభాషలయందలి శైవగ్రంథములు సేకరించి శైవమతసేవగావించుచున్నారు. అనేకగ్రంథములు రచించి వన్నెకెక్కిరి. శ్రీవారి కోర్కెలు నెరవేరినపిమ్మట సికింద్రాబాదుకు రాగలరట. యిట్టి మహనీయుల యనుగ్రహముచే శైవమతము పూర్వోత్కృష్టతను బడయగలదనుట నిస్సందేహము. పరమేశ్వరు డీ మహామహుని కాయురారోగ్యముల నొసంగుగాక. [సంపాదకుడు.]

---

# సంపాదకీయములు

స్వవిషయము.

యీ సంచికతో పదవసంపుటము పూర్తిచేయగల్గితిమి. దైవానుగ్రహమువలన పది సంవత్సరములు సంఘసేవగావించుటచే ధన్యులమైతిమి. మా యీ ప్రయత్నమునకు సహాయపడునటుల నింతదనుక యనుగ్రహించిన సోదర సోదరీమణులను మా హృదయపూర్వకముగా నభినందించుచున్నాము. సత్యమునకు తావులేకుండా కపటవినయములతో, మమ్ములను అశాపాశబద్ధులుగా నొనరించి శ్రమబెట్టిన మహానుభావులను మే మెన్నటికిని మరువజాలము. మే మొనరించిన సంఘసేవను గొనియాడకపోయినను, నిష్కారణముగా పత్రిక కంతరాయము వాటిల్ల జేయక సహాయము గావించిన సోదరులు, మాకృతజ్ఞతకు పాత్రులైరి. దిగుబాటు గావించినవారి ద్రవ్యము మేము నిర్బంధముగా గైకొన జాలనందున వారి పెట్టెలయందే నిర్విచారముగా నిలువ గలిగినందుకు మహదానందముతో నున్నాము. భగవానుని యనుగ్రహమువలన సంఘమందలి విభేదము లస్తమించిప్రకాశవంతమగుటకు ప్రార్థించుచున్నాము. ఏకాదశ సంపుట మారంభింప జేయునటుల పరమేశ్వరుని ధ్యానించుచూ సాంఘికులను బ్రతిమాలుచున్నాము. పత్రికను రక్షింప గోరుచున్నాము.

## శ్రీ శ్రీ కంఠజయంతి.

గోదావరిజిల్లా కోటిఫలియందు శ్రీకంఠమఠాధిపులును, శ్రీ చంద్రమౌళీశ్వర పీఠాధిపతులును నగు శ్రీజగద్గురు బోధానందులవారి యాజ్ఞానుసారముగా ప్రథమ జయంతి నిర్విఘ్నముగా జరిగినదని దెలుపుట కానందించుచున్నాము. శ్రీవారి జయంతి జయప్రదముగా సప్త దిన దీక్షతో భగవద్భక్త సమాజములతో వేదపారాయణ కథాకాలక్షేపములతో సక్రమముగా జరిగి యున్నది. శ్రీకంఠుని జీవితచరిత్ర భాష్యవిషయములు విపులముగా శ్రీవారిచే మహోపన్యాసములు గావింపబడెను. ప్రతిశైవభక్తుడును శక్త్యానుసారముగా తమ తమ గృహములందు శ్రీకంఠజయంతిని గావించి తరించి యున్నారని దెలియుచున్నది. ఇట్లే ప్రతిసంవత్సరము శ్రీజయంత్యుత్సవము నెరవేరునటుల పరమేశ్వరుని ప్రార్థించుచున్నాము.

## దేవీయజ్ఞము.

శ్రీకాంచీపురమునందు శ్రీమాన్ గంగవరం నంజుండ దీక్షితులవారిచే యువసంవత్సర వైశాఖ బహుళ పంచమి మొదలు జ్యేష్ఠ శుద్ధ పూర్ణిమవరకు యిరువదియొక్క రోజులు దేవీ సంబంధమైన మహాయజ్ఞము జరుగగలదని శ్రీవారు ఆహ్వాన పత్రికలు బంపియున్నారు. గావున, ఏతద్యజ్ఞమునకు సర్వులు సహాయము చేయుటకును దేవీప్రసాద లబ్ధచిత్తులగుటకును ప్రార్థించి హెచ్చరించుచున్నాము. చందాలు వేసినవారు వారి యేజంట్లద్వారా సమర్పించగోరుచున్నాము.

## శ్రీ బోధానందులవారు.

శ్రీ చంద్రమౌళీశ్వర పీఠాధిపతులగు శ్రీవారు కృష్ణా, గుంటూరుమండలములందు పర్యటనముగావించి, శ్రీకంఠజయంతిని నెరవేర్పించియున్నారు. త్వరలో కాశ్మీరదేశమునకు విజయముజేయును

రని దెలియుచున్నది. అచ్చట శ్రీకంఠశివాచార్య విరచిత ఉపనిష ద్భాష్యము గలదట. దానిని త్వరలో ఆంధ్రాక్షరములతో ప్రకటింప నున్నారు. శ్రీవారి మహత్ప్రయత్నమువలన శైవమత ప్రస్థాన త్రయ భాష్యములు ప్రపంచమున ప్రకాశింప నవకాశము గల్గియున్నది. గావున సాంఘికులీ మహత్తరుణమును వ్యర్థపరుపక శ్రీవారి యాజ్ఞాను సారముగా వర్తించి ధన్యులగుటకు ప్రార్థించుచున్నాము. కాశ్మీరామ్నా యములని పిలువబడు శైవాగమశాస్త్రములుగూడ శ్రీవారు పూర్తిగా పరిశీలించి వివరములు పర్యటనానంతరము దెలుపగలరని విన్నవించు చున్నాము.

---

## స్వీకృతి

1 నవ్వగలవా? 2 దీనిపేరేమిటి? 3 పెళ్ళాన్ని మెలాపిలవటం? పై మూడుపుస్తకములు బరహంపురమునందు నెలకొల్పిన నవ్వుల తీవ కార్యాలయాధిపతులగు శ్రీయుతులు కాంచనపల్లి వెంకట్రావుగారు మా కార్యస్థాన మలంకరింప జేసియున్నారు. చిన్న పుస్తకములయ్యును చదివినకొలది నవ్వుగలిగించి తనివితీరని రుచినొసంగుచున్నవి. వలయు వారు మూడుఅణాల చీట్లను గ్రంథకర్తగారిపేర బంపవలెను.

హరశతకము.

గుంటూరు జిల్లా బాపట్లతాలూకా అన్నపర్రు గ్రామవాస్తవ్యులు శ్రీయుతులు కవిరాట్టు హనుమత్కవిగారిచే రచింపబడి "వంగిపురం" వాస్తవ్యులు బాలకవి సింహ్వ[illegible]వ్యాసనిపుణేత్యాది బిరుదాంకితులగు అవ్వారి సుబ్రహ్మణ్యశర్మగారిచే ప్రకటింపబడినది. యందలి యమృతమును గ్రోలి యానందించుచున్నాము. ప్రతిపద్యము పురాణ గాథలను జ్ఞాపకము జేయుచున్నది. వెల నాలుగణాలు. వలయువారు, ప్రకాశకులకు వ్రాయవలెను.

హరిజనపత్రిక.

గోదావరిజిల్లా పొన్నమండ వాస్తవ్యులు శ్రీయుతులు ఉండ్రు సుబ్బారావుగారి సంపాదకత్వమున వెలువడు మాసపత్రిక వందనములతో యందుకొని యందలి విషయములు గమనించి యానందించితిమి. ప్రస్తుత కాలమున నీ పత్రిక వెలువడుట మహాత్ముని సంకల్పవిశేషమని యానందించుచున్నాము. నిర్విఘ్నముగా నభివృద్ధి జెందగలదని మా విశ్వాసము చందా 1-0-0 మాత్రమే.

వాసవి.

మదరాసునుండి శ్రీయుతులు, తుం॥ భగవంతం గుప్తగారి సంపాదకత్వమున వెలువడు మాసపత్రికను వందనములతో స్వీకరించితిమి. యిది వైశ్యసంఘాభివృద్ధికై నెలకొల్పబడినది. యిందనేక ధర్మశాస్త్ర ప్రసంగములు గలవు గావున సాంఘికు లీ పత్రిక నాదరించి యభివృద్ధి నొనరించుట శ్రేయస్కరము. చందా రెండు రూపాయిలుమాత్రమే.

కాశీపీఠాచే, ప్రాచనత్వ.

మహారాష్ట్రభాషలో పండితేత్యాది బిరుదాంకితులగు చి॥ మ॥ వీరభద్రశాస్త్రి [కాశీ] గారిచే ప్రకటింపబడినది. వీరశైవాచార్య పీఠ విషయములు మున్నగు శైవ సాంప్రదాయము వివరముగా వ్రాసి యున్నారు. వలయువారు శ్రీవారికి వ్రాయగోరుచున్నాము.

పూలదండ.

యిదియొక సచిత్రమాసపత్రిక. రాజమండ్రినుండి శ్రీయుతులు కాళహస్తి పాపయ్య లింగంగారి సంపాదకత్వమున వెలువడిన రెండవ సంచిక మాకార్యాలయ మలంకరించినది. ప్రస్తుతకాలమునకు దగిన సంస్కరణ సంబంధమైన కథలతో వినోదినివలె వెలువరించిన సంపాద

కుల నభినందించుచున్నాము. చిరతరస్థాయియై వర్థిల్లునని మానిందు విశ్వాసము. చందా 1-0-0 మాత్రమే.

---

# యీనెలలో చందాలు చెల్లించినవారు

౧ శ్రీమాన్ మురికిపూడి వెంకటేశ్వర్లుగారు (భావపోషక) వల్లభాపురం (గుం)
౨ ,, సంగాపు వెంకటప్పయ్యగారు (శ్రీముఖ-భావ చందా) మంగళగిరి ,,
3 ,, బాలసంఘంవారు (భావచందా) మరంపరియాపల్లి (గంజాం)
౪ ,, పొన్నూరు కామయ్యగారు (అంగీరస-శ్రీముఖ-చందా) తోట్లవల్లూరు (కృ)
౫ ,, రుద్రపాక రాఘవరావుగారు (లోగడబాకీ) ఉప్పలకల్వగుంట ,,
౬ ,, లంకసుబ్బయ్యగారు (లోగడబాకీ) గొడవర్రు ,,
౭ ,, అయనవిల్లి నాగేశ్వరదీక్షితులుగారు (శ్రీముఖ-చందా) అయినాపురం (గో)
౮ ,, పణతుల వెంకటప్పయ్యగారు (భావచందా) మాచవరం (నె)
౯ ,, గూడూరు కుటుంబయ్య గురుకులుగారు (భావ-పోషక) మండవల్లి (కృ)
౧౦ ,, నాదెండ్ల రామేశ్వరగురుకులుగారు (భావ-పోషక) నాదెండ్ల (గుం)
౧౧ ,, అయిలూరు వెంకటసుబ్బయ్యగారు (లోగడబాకి) అర్తమూరు (కృ)
౧౨ ,, మడనూరు సుబ్బారాయగురుకులుగారు (భావపోషక) మడనూరు (గుం)
౧3 ,, ఆగమిక నంజుండదీక్షితులుగారు(శ్రీముఖ-భావ)రా॥పో॥ రామసముద్రం(చి

# బోర్డువారి యుదంతము

సోదరులారా !

న్యాయాన్యాయ విమర్శనలేక దేవాదాయపుబోర్డువారు తమ నిరంకుశత్వమును చలాయించుచుండుట శోచనీయమైయున్నది. ఆలయమునకును అర్చకునకుగల సంబంధము విచారించరైరి. అర్చకసర్వీసును స్మరించరైరి. దానపత్రములు పరిశీలించరైరి. అనుభవము, భుక్తము, యోచింపరైరి. శాస్త్రములు శాసనములు తిలకింపరైరి. యిక యీ వ్యవహారములో చిక్కులు పరిష్కారమగుటెట్లు? యీసమస్య చాలా మందిని తుదకు న్యాయస్థానములనుగూడా కలవరపెట్టుచున్నది. కొన్ని చోట్ల పరిశీలనచేసి చక్కని తీర్పులు యిచ్చుచున్నారు. మరికొన్ని చోట్ల పరిశీలింపక బోర్డువారి తియ్యనిమాటల నమ్మి అర్చకుల కన్యాయము గలుగజేయుచున్నారు. గవర్నమెంటువారి కత్తికి ఎదురులేదని సర్వులెరింగియే యుందురు. మధ్య యీబోర్డువారి కమీషనెందుకు కమిటీలెందుకు? యీ గంద్రగోళముదేనికి? ట్రస్టీల నియమించుట చేటలో తవుడు కుక్కలకయ్యాటమునకు దిగుచున్నదని పలువురు పెద్దలు ఘోషించుచున్నారే? షుమారు తొమ్మిది సంవత్సరములనుంచి ప్రతిగ్రామములోను వ్యర్థమైన కలహములతో యీ ట్రస్టీపదవులకు ఎంతెంత ధనము దుర్వ్యయము చేయవలసివచ్చెనో గమనించుడు. అర్చక సంఘములు ఎన్నివేలరూపాయీలు వ్రయపడిరో దెలుసుకొనుడు. యీ బోర్డు ఏర్పడిన పిమ్మట గవర్నమెంటువారు ఎన్నిలక్షల రూపాయీలు గ్రాంటుగా యిచ్చిరో పరిశీలింపుడు. ఎందులకీ వ్రయము? ఏల యీ తగాదాలు అని గమనించిన బుద్ధిమంతులు పరితపించుటలేదా? యీబోర్డు అనవసరమని అనేకులు బల్కుటలేదా? దేవాలయములున్నవి. వాటినిస్థాపించినదాతలున్నారు? లేక పరిపాలించెడి భక్తులున్నారు? పరిశీలించెడి కోర్టులున్నాయి, యిన్నియుండగా బోర్డుఏర్పరుచుట తగవులు బెంచుట, వృథావ్రయబడుట, కోర్టులకు లేని పనిగల్పించుటప్లీడర్ల

ఫీజుకొరకై పెనుగులాడుట, దప్ప యే ప్రయోజనము గన్పించుటలేదని యెందరు తపించుచున్నారో విచారించుడు. ఇట్లుండ, బోర్డువారు, తమ కేమో గొప్ప పదవి లభించినట్లుగా, మదరాసునుండి (పల్లెటూళ్ళరైతుల తెలివి గన్పెట్టినవారగుటవలన) ఫలానా తేదీనాటికి మదరాసుకు హాజరుకావలెనని తాకీదులు జమాయించుతారు. ఇది గనినవారికి హాస్యముగా నుండునేగాని ఎవ్వరైనా మదరాసువెళ్ళి వారియాజ్ఞలను శిరసావహించి యున్నటుల గన్పించుటలేదు. ఏలననగా వారి ఆర్డరుల మహాత్మ్య మటువంటిదని ప్రత్యేకముగా చెప్పనక్కరలేదు. వారి అధికారములు కోర్టులయందే ప్రకాశించుచున్నవి. గావున, దేవాలయాభివృద్ధికై ఏర్పడిన బోర్డువారు, దేవాలయ నిర్మూలన జేయుచున్నటుల పలువురు గగ్గోలుపెట్టుచున్నారు.

గ్రామములలో పార్టీలు గలుగజేసుకొనుటవలన బోర్డువారు తమనైపుణ్యతను గన్పరచుచున్నారేగాని, రైతులందరు ఏకీభవించిన గ్రామములందు వీని పేరుగూడ స్మరించుట కవకాశము చిక్కనేరదని గట్టిగా దెలియుచున్నది, గావున అమాయికులగు నో సోదరులారా? మన తాతముత్తాతలు గట్టించిన దేవాలయములు ఇతరుల స్వాధీనములోనికి బోవుచున్నవి. దేవాలయహక్కులు నశించి పోవుచున్నవి. ధర్మములు తారుమారగుచున్నవి. కైంకర్యములు, తరిగిపోవుచున్నవి. కాళహస్తిదేవాలయ పరిపాలనమే ప్రబల తార్కాణము. క్రమక్రమముగా మసిబూసిన నేరేడుకాయమాదిరిగా జరుగగలదు. హిందూమతోద్ధారకులైన మీరందరు యీబోర్డువారి చర్యలగమనించి, కోర్టువారి తీర్పుల పరిశీలించి, హిందూమతధర్మముల నుద్ధరించి, ఆగమశాస్త్రముల దిలకించి, పూజాకైంకర్యముల గమనించి, అర్చకజీవనముల నుద్ధరించుటకు, దేవాలయ సంరక్షణ గావించుటకు, ప్రార్థించుచున్నాము. తాను స్థాపించుటకన్న ఇతరుల స్థాపించిన ధర్మముల గాపాడుట మహాత్తరకార్యమని పురాణములు వాకొనుచున్నవి. ఇతరులు

గావించిన ధర్మముల నుద్ధరించుట- ద్విగుణీకృతమైన ఫలితము గలదని ఆగమములు బల్కుచున్నవి. గావున సదయహృదయులరగు తాము యీ దేవాలయ సమస్యను బరిశీలించి, ధర్మసంరక్షణ గావింప బహు విధముల ప్రార్థించుచున్నాము.

అశ్రద్ధగావించినచో, దేవాలయములందలి వస్తుసామగ్రియు, నగలు, భూములుగూడ, క్రమక్రమముగా జప్తులోనరింపబడి నశింప గలవు. "దిక్కులేనిచోట దెయ్యాలసభ" వలె పరిణమించి హిందూ మత చిహ్నములైన దేవాలయములు నశించిపోగలవని పలువురు భక్తులు పరితపించుచున్నారు. యిప్పటికే చాలా కాలయాపనజరిగి వ్యవహారములు విషమించియున్నవి. త్వరపడి, రైతుమహాజనులు, అర్చకసంఘములు తమతమహక్కులను సంరక్షించుకొనుట అవశ్యకర్తవ్యమై యుండునని విన్నవించుచున్నాము. (శ్రీగురుకులాశ్రమము)

---

# విమర్శలు.

దేవాలయములు అర్చకులు.

విగ్రహారాధనము కొందఱిచే నిరసింపఁబడుచు వచ్చినను దానికి హిందూమతాచారముల ననుసరించి శాశ్వతమగు స్థానము కలదు; విగ్రహములను దేవాలయములను నిర్మూలింపఁ గలుగుట యసంభవము. అవి కలుషితములైన చోట వానిని పునీతములు చేయ యత్నించుటే శ్లాఘనీయము. ఈకార్యము పూర్వము గ్రామపరిషత్తులు, బ్రాహ్మణులు, చేయుచుండెడివారు ఇప్పుడు హరిజన ప్రవేశమున కాక్షేపణ చేయు సనాతనులు ఇవ్విషయమున తాటస్థ్యము వహించియుండిరి. ప్రభుత్వమువారేర్పాటుచేసిన ఎండోమెంట్సుబోర్డు వలన వ్యవహార విషయముల నించుక కట్టుదిట్టము లేర్పడినను ప్రధాన విషయములలో ప్రయోజన మెంతమాత్రము కలుగ లేదు. అర్చకులకు ధర్మకర్తలకు

దావాలు జరుగుచుండినను, ఇంకను దావాలు చేయవలసినదని ఆదిశైవ పత్రిక అర్చకులకు బోధించుటయు, బోర్డువారు ధనము సంపాదింప సర్వవిధముల యత్నించుటయుఁ గలుగుచున్నది. బోర్డువారు గాని మఱి యెవ్వరుగాని అర్చకులు తమ విధుల నెంతవఱకు విధ్యుక్తముగ నొనరించుచున్నారను విషయము విమర్శించుట గానము. పెక్కుచోట్ల బోర్డువారేర్పాటు చేసిన ధర్మకర్తలు, బ్రాహ్మణేతరులు; వీరుండరాదని మేమొక్క నాటికనము, కాని ధర్మకర్తలుగ నెవరుండెదరో వారు, అర్చకు లేయే వేళల నేయేయుపచారములు చేయవలసియున్నారో, ఏయే మంత్రముల పఠించి యుండవలసి యున్నదో, యెఱిగి యుండవలయు. వారు లోప మొనర్చిరేని దాని గనిపెట్టఁ గల్గినవారుగ నుండవలయు ప్రతిదేవాలయమునను తగిన సంపత్తిగలవారే యర్చకులుగ నుండుటకై, ఆగమములను ఆచారములను అనుసరించి గ్రంథ మొకటేర్పరచి దానిలో పరీక్ష చేయుచు ఆపరీక్షలో, దేలినవారే అర్చకులుగ నుండవచ్చునని బోర్డువారు శాసించిరేని మేలు కలుగునని మాయభిప్రాయము.

(దివ్యజ్ఞానదీపిక)

☞ ధర్మకర్తలుగాని బోర్డువారుగాని ఇతరులుగాని అర్చకుల యొక్క వివరములు సందర్భములు ఆచారములు శాస్త్రములు శాసనములు మున్నగునవి సమగ్రమముగా పరిశీలించి ధర్మసంరక్షణ గావింపుడనియే చిరకాలమునుంచి అర్చక సంఘములు గోరుచున్నవి. అట్టి ప్రార్థనలన్నియు పెడచెవినిద్రోసి బోర్డువారు ద్రవ్యమే ప్రధానముగా నెంచి అర్చక జీవనముల ధ్వంస మొనరించుటకై గావించిన పనులు అక్రమమై యున్నవని పలువురు దెలుపుచున్నారు. పై విమర్శన గావించిన సదయహృదయులరగు సంపాదకుల నభినందించుచున్నాము.

(సంపాదకుడు)

---

# ఈషణత్రయము

దారేషణ, ధనేషణ, పుత్రేషణ, ఈ మూడును ఈషణత్రయమనంబడును

౧ దారేషణ:—కామధర్మాది సకలసుఖములు, భార్యగలిగిన గలుగునని, భార్యయందాసక్తి కలిగియుండుట, దారేషణ యనబడును.

దీనికి నివృత్తి:—తాను దరిద్రుడైయుండినను, లేక దీర్ఘవ్యాధులచేత తపింపుచుండినను, యెల్లప్పుడు భార్య తనను దూషించుచుండునని, విచారించినట్లయితే, దారేషణబోవును.

౨. ధనేషణ:—ధనముగలిగియుండిన, యజ్ఞదానాది సత్కర్మములు జేసి స్వర్గాదిసుఖము లనుభవింపవచ్చునని, ధనము గోరుచుండుట ధనేషణ యనంబడును.

దీనికి నివృత్తి:—ధనము సంపాదించుట యందు దుఃఖమనిన్ని, దాని సంరక్షణయున్న దుఃఖమనిన్ని, కర్మవశముచే నాధనముపోయినచో మిగుల దుఃఖమనిన్ని, స్వర్గాది భోగములుగలిసను, పునర్జన్మకారణమనిన్ని, విచారించినట్లయితే ధనేషణబోవును.

3. పుత్రేషణ:—పుత్రులులేనిది నరకవిముక్తిన్నీ, స్వర్గాది భోగములున్ను, యిహమందు కీర్తియు గలుగనేరదని పుత్రులను గోరుచుండుట పుత్రేషణ యనంబడును.

దీనికి నివృత్తి:—పుత్రులు గలుగకమునుపు, తపోదానతీర్థయాత్రాదిక్లేశములున్ను, దైవవశంబున పుత్రుడుగల్గినను, వినయవివేకంబులులేని మూఢుడైయున్నచో అపకీర్త్యాది దుఃఖంబులును, కాలవశంబున నతడు గతించిన, సకలదుఃఖములును, గలుగగలవని విచారించినట్లయితే పుత్రేషణబోవును. అని పెద్దలు జెలుపుచున్నారు.

శృంగారపురము
శ్రీఉమామహేశ్వర భక్తసమాజము } పుచ్చా సత్యనారాయణ



# ముఖ్యగమనింపు

సోదరులారా సంఘాభివృద్ధికై పదిసంవత్సరముల క్రిత మేర్పడి నేటిదనుక నిర్విఘ్నముగా సంఘసేవ జేయు చున్న మత పత్రిక నుద్ధరించుట సాంఘికుల ముఖ్యధర్మమై యున్నది.

సంవత్సరమున కొక రూపాయి యెనిమిదణాలు చెల్లించుట సులభమేగాని కష్టముగాదుగదా? వ్యాసములు వ్రాయుచూ చందాదార్లను జేర్పించుచూ, ప్రతికను గాపాడుట యొకలెక్కలోనిది గాదని తెలుసుకోవలెను

పత్రికవలన సర్వవిషయములు చర్చించవచ్చును. పురోభివృద్ధి మార్గము లరయవచ్చును. దేశ దేశములలోని సంగతులు దెలుసుకొనవచ్చును అందువల్లనే లోకములో లెక్కలేని పత్రికలు వెలువడుచున్నవి.

మన పత్రిక ద్రవ్యాభావమువలన నిరుత్సాహముగా నడచు చున్నదని మనవిచేయుచున్నాము. శాశ్వతప్రోత్సాహ సహాయములు ముఖ్యముగా గోరుచున్నాము. పూర్తిసహాయము లభించినచో సచిత్ర మాసపత్రికగా నడువగలదు.

రాబోవు యువ సంవత్సరమున యువజన సంఘమువారి సహాయముతో నత్యంత మనోహరముగా, పత్రిక నడుపగలమని విన్నవించు చున్నాము.

చందాదారులు తమద్రవ్యమును మనిఆర్డరు చేయుటయు నూతన చందాదార్లను చేర్పించుటయు త్వరగా జరుపవలెనని అతివినయమున ప్రార్థించుచున్నాను.

(సంపాదకుడు)

---

# అర్చకసంఘ విశేషములు

[1] కం‌ట్రిబ్యూషను నిమిత్తము, తూర్పుగోదావరి జిల్లాకోర్టులో, హిందూమత ధర్మాదాయముల బోర్డువారు 1929 సంవత్సరములో, అర్చకులమీద కొన్ని పిటీషనులు, 70 [2] సబుశెక్షను ప్రకారం దాఖలుచేసియుండిరి. ఆ పిటీషనుల విషయమై ఆక్టుదేవాలయములకు వర్తించదనిన్ని, దేవాలయములు, ప్రయివేటు దేవాలయములనిన్ని, అర్చకులచే వాదింపబడెను ఈ వాదము పరిష్కరింపబడువరకును కంట్రిబ్యూషను పిటీషనులు చెల్లనేరవని, జిల్లాకోర్టువారు, బోర్డువారి పిటీషనులు కొట్టివేసిరి. అందుపైన, హైకోర్టులో, బోర్డువారు రివిజనులు దాఖలుచేసిరి. సదరు పిటీషనులు గూడ హైకోర్టులో, త్రోసివేయబడి ఖర్చులతోసహా అర్చకుల పక్షమున తీర్పుచెప్పబడెను.

[2] తూర్పుగోదావరిజిల్లాకోర్టులో బోర్డువారుచేసిన స్కీములు చెల్లకూడదని, అర్చకులు సుమారు 40 దావాలు చేసియున్నారు అందులో, 4 దావాలు, బోర్డువారు చట్టనిబంధనలకు వ్యతిరేకముగ స్కీములుచేసినందున, చెల్లవని పూర్తిగ రద్దుచేయుచు దావాలు ఖర్చులతో అర్చకుల పక్షమున తీర్పుచెప్పిరి. మిగతా దావాలలో కొన్ని సారాంశముల మీద కోర్టువారు తీర్మానములు (Findings) చెప్పినారు అర్చకుల స్వాధీనములోనున్నట్టిన్ని, అర్చకులు తమకు హక్కుగలదనిన్ని, వాదించుచున్నట్టి, భూములమీద, బోర్డువారు చేసినస్కీములు, అర్చకుల మీద బైండింగు కాజాలవనిన్ని, భూమి హక్కు, బేహక్కులు, తీర్మానించుటకు బోర్డువారికి, అధికారము లేదనిన్ని, వివాదగలఆస్తి, ట్రస్టీలకు సంక్రమించనేరదనిన్ని, అట్టిఆస్తులయందు, ట్రస్టీలకు హక్కు కలుగజేయుటకు, బోర్డువారికి అధికారము లేదనిన్ని, సారాంశములపై తీర్మానములుచేసిరి. మిగిలియున్న కొద్దిసారాంశములపై ఆర్గ్యుమెంటులు జరుగుచున్నవి.

[3] పశ్చిమగోదావరిజిల్లా యలమంచిలిగ్రామంలోని, విష్ణ్వాలయము నకు బోర్డువారు ట్రస్టీలను అపాయంటుమెంటుచేయగా, వారు అర్చకుల స్వాధీనములో దేవునిపేరుతోనున్న భూములు, తమకు వప్పగింత చేయించవలసినదని, 78 వ శెక్షనుక్రింద పశ్చిమగోదావరిజిల్లాకోర్టులో, పిటీషనుపెట్టిరి. కోర్టువారు అర్చకులయొక్క వాదన, ఉన్నప్పుడు ఆస్తి వప్పగింతచేయుటకు వీలులేదని పిటీషను కొట్టివేసిరి. అందుపైని హైకోర్టుకు, ట్రస్టీఅప్పీలుచేయగా న్యాయమూర్తి స్టోనుగారిచేత, క్రిందికోర్టు తీర్పు ఖాయపరుపబడి అప్పీలు త్రోసివేయబడినది.

| | | |
|---|---|---|
| వెదురుపాక | } | యలమంచిలి సుబ్రహ్మణ్యం |
| గోదావరిజిల్లా. | } | 5-2-25. |

శ్రీకాళహస్తి దేవాలయమునకు, కంట్రిబ్యూషన్ నిమిత్తం బోర్డువారు షుమారు రు 600-0-0 లు విలువగల శ్రీ జ్ఞానప్రసూనాంబికాదేవి మెడయందలి బంగారు వస్తువును జప్తుచేయగా, దేవాలయ గురుకులు సదరు వస్తువనొసంగి రసీదుతీసుకొని యున్నారట, గ్రామస్తులు బోర్డువారిపై ఆగ్ర[illegible]వేశపరులై హైకోర్టులో దావా దాఖలు చేయనున్నట్లు తెలియుచున్నదని దీనబంధుపత్రిక తెలుపుచున్నది.

గుంటూరుజిల్లా యందలి కొందరు అర్చకులు తమకు కంట్రిబ్యూషన్ నిమిత్తమై, కలెక్టరుగారిద్వారా పంపబడిన నోటీసులకు సమాధానములిచ్చుచూ, డిస్ట్రిక్టుమునసబుకోర్టులో 2-3-0 లు స్టాంపు మీద ఇంజక్షన్ దావాలువేసియున్నారు. తక్కిన దావాలన్నియు, వాయిదాలపై యున్నవి.

# త్వరలో వెలువడనున్నది.

## ఆంధ్రపరిషత్పత్రిక [సచిత్రమాసపత్రిక]

ఇందు రాజకీయ, మత, సాంఘిక, ఆర్థిక, నైతిక, పారిశ్రామికాది సర్వవిషయములు, శాస్త్రపరిశోధనలు గద్య పద్యవ్యాసములచే శోభిల్లుచుండును. యువనామసంవత్సర ఆషాఢమాసమున వెలువడగలదు. వ్యాసములు, కథలు, మొదలగునవి బంపువారు వైశాఖ బహుళ అమావాస్యకే బంప ప్రార్థితులు. మాపత్రిక నమ్ముటకు ఏజంట్లు కావలెను మంచికమీషన్ యివ్వబడును.

ఇట్లు విధేయుడు,

ఆంధ్రపరిషత్పత్రికా కార్యాలయము } అవ్వారి సుబ్రహ్మణ్య శర్మ. వంగిపురం. ప్రత్తిపాడుపోస్టు; గుంటూరుజిల్లా.

---

## కీ॥ శే॥ శ్రీమాన్ సంగాపు పానకాలయ్య గురుకులుగారి జీవితసంగ్రహము.

శ్రీ మదఖండ భూమండలమండనంబగు భరతఖండంబునం ప్రశస్తంబైన మంగళాద్రి క్షేత్రంబునందు వేంచేసియున్న శ్రీ భ్రమరాంబా మల్లేశ్వరస్వామివారి యర్చకస్వాములును, ఆదిశైవ వంశోద్భవులును, నగు సంగాపు పానకాలయ్య గురుకులుగారి నెఱుంగనివారెవరును లేరు! ఉత్తమపురుషులలో నొకరగు, వీరిజీవితమును గుఱించి సంగ్రహముగా విశదీకరింప నెంచితిని. చిత్తగింతురుగాత.

శ్రీవారి ద్వితీయ వర్షప్రాయ బాల్యదశయందే తల్లియగు వెంకటసుబ్బమ్మగారు మరణించిరి. సప్తవర్షప్రాయమునఁ దండ్రియగు వీరేశ్వర శివాచార్యులుగారు శివసాయుజ్యసిద్ధినొందిరి. మఱియు

కనిష్ఠసోదరియును, వివాహితయునగు భాగీరథమ్మ కన్యాప్రాయమునం దే పరలోకమునుబొందెను. తదుపరి వీరిసోదరులగు సాంబయ్యగురుకులు గారు ఆంధ్రగీర్వాణ సాహితీ తత్పరులును, గానవిద్యావిశారదులును, ఆధ్యాత్మిక తత్వవేత్తలును, విశేషించి, విద్యాప్రఖ్యాత పురుషులుగాఁ బరిణమించుచు, విరాగత్వముచే దేశాంతర వాసులయిరి. ఇట్టి యసా కర్యముల కాలవాలమై యొప్పుచున్న గృహము నందలి, సప్తవర్ష ప్రాయులగు, శ్రీపానకాలయ్యగారినిఁ బోషించువారెవరును లేనికతమున వీరిపెద్దఅక్కయును, క్షీరపురిగ్రామ నివాసినియు, గర్భవతియునగు లక్ష్మమ్మగా రచ్చటకువచ్చి, సంభవించిన దుస్థితికై వగచి, తమ్ముని యందుఁ దనకుంగల గాఢానురాగము పెంపున మైమరచి, కొంతసేపటికిఁ దెలివొంది, విచారసాగర నిమగ్నయై, శ్రీపానకాలయ్య గురుకులుగారి కున్న యర్చకత్వపు మిరాసీభాగమును దాయాదీయార్చకభాగ స్వాములకు నొప్పగింతఁ బెట్టి, పిల్లవానినిఁ దీసికొని, చీరాలలోఁ బ్రవే శించిరి. తరువాత! లక్ష్మమ్మగారు కుమారునిఁగనిరి. తదుపరి! తమ్ముఁడగు పానకాలయ్య గురుకులుగారును, కుమారుఁడగు మల్లేశ్వర దీక్షితులు గారును, లక్ష్మమ్మగారికి కవలసుతులవలెఁ బెరుగుచు, విద్యాభ్యాసముల నొనర్చుచు, ఉపనయన సంస్కారములను బడసి, యన్యోన్య మైత్రితో మెలంగుచు, బాల్యచాపల్యమును దీరినవెంటనే చెన్నపట్నమునకేగి, ఆయుర్వేద గానవిద్యల నభ్యసించిరి. మల్లేశ్వరదీక్షితులుగా రాంగ్లాయు ర్వేద వైద్యములయం దుత్తీర్ణులయిరి. శ్రీపానకాలయ్య గురుకులుగారు! చెన్నపట్నము, తంజావూరు, మొదలగు పట్నములయందుఁ గొంత కాలముండి, గానవిద్యాపరిశ్రమ మొనర్చి, విద్వాంసులయి, ద్రావిడము మున్నగు దేశభాషల నభ్యసించిరి. పట్నములోనుండు తరుణమున, మైలాపూరునందలి గణపతిగురుకులుగారు! తలిదండ్రులులేని వీరి యందుఁ బ్రేమగలవారై, మోహదత్తస్వీకారమునకై, కొన్నిమాసములు! శ్రీగణపతిగురుకులుగారిచేఁ బెంచబడిరి. అనంతరము! శ్రీపానకాలయ్య గురుకులుగారీ పెంపకమును నంగీకరించక, నాజన్మస్థానమగు మంగళగిరి

యుండే నాజీవితమును గడుపఁగలవాఁడను గాని నిచ్చ లెంతమాత్ర ముండనని గాఢదీక్షాపరవశుఁడై మేనల్లునిం గలిసికొని, చీరాలకుఁ బ్రవేశించిన, కొలఁదిదినములలో స్వస్థానమగు మంగళగిరికి, రానుద్య మించిన, శ్రీపానకాలయ్య గురుకులుగారిని, అప్పగారగు లక్ష్మమ్మ గారును, మేనల్లుఁడగు మల్లేశ్వరదీక్షితులుగారును, నెంతవారించినను వినక, మంగళగిరిఁ బ్రవేశించి, దాయాదులహస్తగతమైన తనపిత్రార్జితపు అర్చకత్వపు మిరాసీ భాగమునకై యారుమాసములు కృషిసలిపి, పలుకష్టములకు లోనై పడరాని యిక్కట్టులనొంది, తుదకు శ్రీవారి గానవిద్యాప్రతిభా ప్రకాశములచే, మంగళగిరి డెప్యూటీ తహశ్శీలు దారు ! మ॥రా॥శ్రీ రాజనాల నాగభూషణరావు! గారి యభిమానా దరణలచేతను! కొందఱు స్నేహితుల యభిమానము చేతను, తన పిత్రార్జితభాగమును దాయాదులవద్దనుండి తీసికొని, స్వార్జితముగా మంగళగిరికి 1 మైలు సమీపమునయుండు, నవులూరు శ్రీనాగేశ్వర స్వామివారి యాలయార్చకత్వపు మిరాసీ స్వాస్త్వమునుఁగూడ సంపా దించి, వివాహితులై, శ్రీమాన్ సంగాపు వీరయ్యగురుకులు గారాదిగాఁ గల నలుగురు పుత్రులను, ఇద్దఱు పుత్రికలనుబడసి, వివాహాది కార్య ములను దీర్చినవారై, భార్యయగు మహాలక్ష్మమ్మగారితో నతిథియభ్యా గతుల సత్కారణలచేఁ గాలమును గడుపుచుండిరి.

శ్రీపానకాలయ్య గురుకులుగారు ! సంగీత విద్వాంసులును, సగుణోపాసనానిష్ఠాగరిష్ఠులును, ఆధ్యాత్మికతత్వవేత్తలును, విశేషించి సంఘాభిమానులును, ఆదిశైవ పత్రికోద్ధారకులగుచు, శాశ్వతధనము నొసంగినవారై, పత్రికాసన్మానముల నొనర్చుచు, (72) డెబ్బదిరెండు సంవత్సరములు జీవించినవారైరి.

ఇట్లుండ, శ్రీముఖనామసం॥ ఆషాఢ శుద్ధ ౨ ఆదివారపు రాత్రి 7 గంటలకు శ్రీనాగేశ్వరస్వామివారి దేవాలయమునకరిగి, నారికేళ పుష్పాదుల నర్పించి, 8 గంటలకు గృహముఖద్వారమునకు వెలుపలి భాగమునఁ బ్రవేశించి, వేదాంతగ్రంథకాలక్షేపణ మొనర్చుచు, ప్రాపంచిక

విషయవిరాగులై, పరమేశ్వర ధ్యానవిమగ్నులగుచు, ననాయాసముగా రాత్రి9 గంటలకు భౌతికదేహమునుఁ బరిత్యజించి, ఈశ్వరసాయుజ్యముం జెందిరి. మరునాడు 11 గంటలకు ఛాయాపటమునుదీసిరి. నవులూరు గ్రామవాస్తవ్యులగు నాబాలవృద్ధపర్యంతమును, శ్రీవారి బంధుమిత్ర పుత్రకళత్రాదులాదిగాఁ గలవారలెల్లరును జూచుచుండ, ప్రసిద్ధవాద్యములతో, జయజయ ధ్యానములతో, నగ్నిసంస్కారమొనర్చిరి. శ్రీవారి కుమారులు ! తండ్రిగారియుత్తరక్రియల నత్యంతశ్రద్ధాభక్తి సమన్వితులై నెరవేర్చి, యంత్యమున పత్రికాసన్మాన మొసంగి కృతకృత్యులైరి. సద్గుణసంపన్నులును, నిష్కల్మషహృదయులునగు, శ్రీపాన కాలయ్య గురుకులుగారి యాత్మశాంతికై, శ్రీవారి కుటుంబసాను భూతికై, శ్రీగిరిజావల్లభుకృపాకటాక్షములకై, సర్వదాయభ్యర్థించుచున్నారము. పత్రికాధిపతి.

---

# వార్తలు

రాయలసీమ (అనగా కడప, కర్నూలు, బళ్ళారి అనంతపురం, చిత్తూరు జిల్లాల) యందు అమితమైన క్షామము సంభవించినది. వర్షములు లేవు. పంటలు శూన్యము. పశువులకు సైతము ఆహారము లేక చెప్ప జాలని కష్టములలోనున్నారు ధర్మాత్ములు, సహాయమొనరించుచున్నారు. గవర్నమెంటువారు శిస్తును తగ్గించియున్నారు. ఎప్పుడో రాగల ధాతకరువు యిప్పుడే వచ్చినట్లున్నదని పలువురు విచారపడుచున్నారు భగవానుడు రాయలసీమ సోదరులను రక్షించుగాత యని పలువురు ప్రార్థించుచున్నారు.

* * * *

ధరలు పడిపోవుటవలన మనదేశపు రైతులు చాలా యిబ్బంది పడుచున్నారనియు, ఆర్థికపరిస్థితులు తారుమారైనవని గవర్నమెంటు వారిని ప్రార్థించగా రూపాయకు అణాకానులు శిస్తు తగ్గించియున్నారు.

గావున రైతు సోదరులు యీయవకాశమును గమనింపకోరుచున్నాము. శ్రీ ప్రభుత్వమువారు రైతుల క్షేమమే యెక్కువగా పరిశీలింప ప్రార్థించుచున్నాము.

*  *  *  *

తిరుపతికొండమీదకు రైలు నడపుటకు ఆలోచనలు స్థిరపడినట్లు దెలియుచున్నది. యిక యాత్రీకులు వెంకటేశ్వరస్వామి సన్నిధివరకు రైలుమీదనే యాత్రజేయవచ్చును. భక్తులు శ్రమపడనక్కరలేదు. డోలీల కూలీలు బిచ్చగాండ్రు మొదలగువారికి ఏడుకొండలవాడి స్మరణ లేకుండా పోగలదు.

*  *  *  *

గాంధిమహాత్ముని గ్రామపునరుద్ధరణ ప్రయత్నము దినదినాభివృద్ధి నొందుచున్నది. క్రమముగా దేశమంతయు నావరించి చేతిపరిశ్రమ లభివృద్ధి యగుటవలన బీదలకు మంచియవకాశము గల్గినదని సంతోషించని మానవుడే లేడనిన ఆశ్చర్యముగాదు.

## ప్రకటనలు

### చక్కని వేదాంతగ్రంథములు

| | |
|---|---|
| ౧ శుష్కవేదాంత తమోభాస్కరం | ౧—౪—౦ |
| ౨ స్వబోధ సుధాకరము | ౧—౨—౦ |
| 3 ఓంకారము | ౧—౦—౦ |

వలయువారు— శ్రీవ్యాసాశ్రమము ఏర్పేడు, చిత్తూరుజిల్లా.

హిదూలా. సమష్టికుటుంబములకు సంబంధించిన సర్వవిషయములు. తీర్పులతో సహాయున్నది. ఆలసించిన ప్రతులు దొరకవు.

వెల ౨—౦—౦ లు

మానేజరు. హిందూధర్మశాస్త్ర నిలయం
కపిలేశ్వరపురం. గోదావరిజిల్లా.

సులభ్యవస్తువైద్యబోధిని. ౦-౬-౦ (నాదెళ్లపురుషోత్తమకవి)
మచిలీపట్నం.

## ☞ మా కార్యాలయ మలంకరించెడి పత్రికలు

| | | |
|---|---|---|
| 1 కృష్ణాపత్రిక | 16 భారతవైశ్య | 31 వినోదిని |
| 2 భారతి | 17 భక్తిప్రబోధినీ | 32 విజయ |
| 3 ఆంధ్రభూమి | 18 ప్రారంభవిద్య | 33 చంద్రిక |
| 4 గృహలక్ష్మి | 19 మాధురి | 34 అభినవసరస్వతి |
| 5 త్రిలిఙ్గ | 20 పూలదండ | 35 శ్రీ వైఖానస |
| 6 ఆంధ్రసాహిత్యపరిషత్పత్రిక | 21 వైద్యప్రదీపిక | 36 శ్రీ వైష్ణవ |
| 7 హరిజన ,, | 22 జమీన్ రైతు | 37 జ్ఞానవాహినీ |
| 8 సుదర్శిని ,, | 23 ప్రబుద్ధాంధ్ర | 38 విశ్వకళ |
| 9 కింగ్సు లా వర్తమాని | 24 గ్రంథాలయసర్వస్వము | 39 శశి |
| 10 యుగంధర | 25 సత్యవాణి | 40 పశుసంరక్షణ |
| 11 దేవాంగ | 26 సరస్వతి | 41 ఆంధ్రవిద్యార్థి |
| 12 పట్టుశాలి | 27 లోకల్ బోర్డు | 42 ఆయుర్వేదచంద్రిక |
| 13 పాంచజన్యము | 28 యథార్థభారతి | 43 అగ్నికులప్రబోధినీ |
| 14 ప్రాథమిక పాఠశాల | 29 రెడ్డిరాణి | 44 ప్రకృతి |
| 15 దివ్యజ్ఞానదీపిక | 30 పంచానన | 45 దీనబంధు |

పై పత్రికా సంపాదకులను హృదయ పూర్వకముగా నభినందిం చుమా మా పత్రికను బంపుకొనుచున్నాము. (సంపాదకుడు)

---

## ఆఖరుమాట

నాయనలారా, పదిసంవత్సరాల్నుంచీ అరిచీఅరిచీ నా నోరు నొప్పెత్తినా, ఎట్లాగో ఓపికపెట్టుకొని ఆఖరుమాట చెప్తున్నా. నా మీద మీ కందరికీ ఆగ్రహంవచ్చినా మీ అనుగ్రహం కోసం బ్రతిమాల్తున్నా. చందాలు తగ్గించినా, మీ ఉత్సాహం కనపడట్లేదు. షుమారు మూడు వేల రూపాయీలదాకా తోడుకొని గడ్డకట్టిపోయినందుకు చింతలేదుగాని పత్రికెట్లా నడచునాయని రాత్రింబగళ్ళూ కలవరింతలోగూడా అదేచింత. పత్రికవల్ల ఏంలాభం లేదని నా బోటికుర్రాళ్లు తలుస్తున్నా, యోగ్యులైన పెద్దలు మాత్రం వుండితీరాలనీ, పడిపోనివ్వద్దనీ, ఆజ్ఞాపిస్తున్నారు.

ఏంచేదామంటారు. రెండువేలరూపాయిలు సంఘపత్రికకు సమర్పించి మన దయదాక్షిణ్యాలకై ఎదురుచూస్తూ, ఆగ్రహానుగ్రాలకి పాత్రుడై యున్న సంపాదకుల్ని కష్టపెట్టడం మనకు న్యాయంగాదని మనవి చేస్తున్నా! గబాగబా చందాలు పంపేసి పదకొండో సంవత్సరం ఆరంభించే టట్లుచెయ్యటమే మనవంతు. ఆరంభించిన తరువాత మానడని మనమెరిగేవుంటెంగా. సంఘానికంతకు కావలసిన సంపాదకుడు అందర్ని సంతోషపెట్టి అనుగ్రహాన్ని సంపాయించు కోవాలిగా. అందుచేత తొందరపడి ఆయన్ని విషపరీక్షచేయింటం కఠినంగావుంటుం దేమోనని నా ఉద్దేశం. నేనెన్నిసార్లు మీ వూళ్ళకి వచ్చానో మరిచిపోయినారా? నన్నిట్లు తిప్పటంవల్ల ఏలాభం. మీరిచ్చేదేదో పంపేస్తే బలవంతం లేదుగా. పత్రికక్కర్లేకపోతే చెప్పెయ్యొచ్చుగా? ఆశపెట్టటం పదిసార్లు తిప్పటం, చెయ్యిల్లికలెయ్యటం, చాటునఅనటం, మనకొద్దు. అంతామనయిష్టం, అరవంలో, కన్నడంలో, తెలుగులోగాని యేకాలంలో నైనా యెవరైనా కులపత్రిక వేశారూ? ఎందుకు మనకుమాటదక్కిందో. పత్రికవల్ల లోకం యేగ్రహించిందో, బాగా ఆలోచిస్తే తెలుస్తుంది. యెన్ని తగాదాలు, చర్చలు, సిద్ధాంతాలు, రాజకీయాలు, మాట్లాడిందో వెనకటి పత్రికలు తిరగేస్తే, పరిశీలిస్తే, తెలుస్తుంది. పంపిన పేకెట్టేచింపకపోతే, సంగతులేలా తెలుస్తాయి. డబ్బుయివ్వాలిసొస్తుందని కక్కూర్తిగా మాట్లాడటం న్యాయమా! జయమా! చూడండి. లోకంలో రోజు కొక పత్రిక బయల్దేరుతుందే. వాటివల్ల ఏంలాభం అని కొనక మానున్నామా. బేడిచ్చి వినోదినీ కొని హస్తారపదంగా ట్రంకు పెట్టెలలో దాయటంలా. తీరిగ్గా కూచుని పురాణంచదివినట్టుగా ఒక్కొక్కక్షరం పదిసార్లు తిప్పితిప్పి చదవటంలా. యింతకూ కులపత్రిక ఏంద్రోహంచేసింది. సంవత్సరానికి రూపాయిన్నర కోరిందని, వెనకాముందాలోచనెందుకు? ధర్మానికైనా, అభిమానముంచైనా, పారెయ్యొచ్చే. శక్తిలేకపోతే బలవంతంలేదే? మోసమెందుకు చెయ్యాలో మీరేఆలోచించి, పత్రికనడిచే మార్గం తెలిపితే నేను మీ యిష్టానుసారం ప్రచారంచేస్తా. అంతేగాని

ముందు పొమ్మని చెప్పి వెనక కొంకులూడగొట్టటంవల్ల ప్రచారం చేయ టానికి సంతోషమెలావస్తుంది. చందాభారమైతే, యింకాతగ్గిద్దాం. నష్టాలాట పత్రిగ్గా. చేద్దామంటారా? అంతా మంచేతులో నేవుంది. ప్రపంచకంలో కల్లా గొప్పమతమనీ, మంచి కులమనీ, లోకసంరక్షణకై ఏర్పడిన వృత్తనీ శాస్త్రాలు శాసనాలున్నాయని పదిమంది మెచ్చుకునే సంఘంమీదికి వస్తూన్న దెబ్బలట్టుకోవడం కోసమైనా, పత్రికవుండొద్దూ యీ పదేళ్ళనుంచి యెంతచిత్రంజరిగిందో ఆలోచించండి. మీకందరికి యిష్టమైతేనే పత్రిక సాగిద్దాం. లేకపోతే మానేద్దాం. జరిగిందేమో జరి గింది. వచ్చిన లోటు చచ్చేదాక తీర్చుకోమని సంపాదకునికి ఎర్రజెండా చూపిద్దాం తెలుగుజిల్లాలలో ప్రచారంచేస్తే వేల సంఖ్యగా చందా దార్లు దొరకరూ? ఏమంటారో చెప్పండి. వృధాగాతిరిగే నా సోదరులం దరూ, కలసి ప్రచారంచేద్దామ్మటారా? నేను తయార్. మీకయ్యే కర్చులుగూడ నేనే భరిస్తా. రండి. బయలుదేరండి. కులసేవకు మించి నది మరొకట్లేదని గాంధి మొదలగు మహానాయకులు శంఖారావం చేస్తున్నారు. కలికాలంలో దుర్బలమై పోతూన్న కులాల్లో మనంకూడ లీనమైపోదామంటారా! మన కర్మం ఎలావుందో అలాజరుగుతుంది. క్షమించండి - సెలవు.

(ప్రచారకుడు)

సం॥ చందారు 1-8-0 లు. Regd. No. M. 207

# శ్రీ ఆదిశైవపత్రిక.

శ్రీ శ్రీకంఠ మఠాధిపతుల యాజ్ఞానుసారముగా శైవ సంఘాభ్యుదయమునకై శ్రీ గురుకులాశ్రమమునుండి ప్రతిమాసము ప్రకటింపఁ బడును.

సర్వదేవాత్మకో రుద్రస్సర్వే దేవాశ్శివాత్మకాః ।
రుద్రస్య దక్షిణేపార్శ్వే రవిర్బ్రహ్మా త్రయోఽగ్నయః ।
వామపార్శ్వే ఉమాదేవి విష్ణుస్సోమోఽపి తేత్రయః ॥
(రుద్రహృదయోపనిషత్)

సంపాదకుఁడు:—చిలుమూరు పురుషోత్తమ గురుక్కళ్.

సంపుట. ౧౧ } చిలుమూరు, కొల్లూరు పోష్టు
యువనామ సం॥ర చైత్ర-వైశాఖ మాసములు { సంచిక ౧-౨

[విలేఖకుల వ్యాసములకు సంపాదకులు ఉత్తరవాదులు కానేరరు.]



—విషయసూచిక—



భారతీ ముద్రాక్షరశాల, తెనాలి.

# ఉద్ధారకులు

౧ కీ॥ శే॥ చిలుమూరు తీర్థేశ్వరులవారి జ్ఞాపకార్థం కుమాళ్లు ఉమామహేశ్వరం
(౬౧౦) వగైరాలు, చిలుమూరు.

౨ కర్ణాటక రాష్ట్రీయ ఆదిశైవ మహాసంఘమువారు, బెంగుళూరు.

3 శ్రీమాన్ నడింపల్లి నాగేశ్వరశివాచార్యులవారు. ఇంటూరు.

౪ ... గూడూరు రాఘవరావుగారు, పోతునూరు.

౫ ... గూడూరు శీతయ్యగారు, శనివారపుపేట.

౬ ... అయలూరు వెంకటసుబ్బయగారు, అర్తమూరు.

౭ ... పావులూరు రామచంద్రయ్యగారు, మునికోటిపురం.

౮ ... పావులూరు హనుమంతయ్యగారు, మునికోటిపురం.

౯ ... పెనుమూడి సత్యనారాయణగారు, తూర్పుకూచిపూడి.

౧౦ ... స్వర్ణ వెంకటశివావధానులుగారు, బూతుమల్లి.

౧౧ ... పావులూరు నాగేశ్వరశర్మగారు, అనంతపురం.

౧౨ ... పెనుమూడి హనుమంతరావుగారు, తెనాలి.

౧3 ... మామిళ్ళపల్లి శంకరమ్మగారి జ్ఞాపకార్థం భర్త
శివరామదీక్షితులుగారు, చుండూరు.

౧౪ ... మామిళ్ళపల్లి సాంబయ్యగారు, చుండూరు.

౧౫ ... పొన్నూరు సుబ్రహ్మణ్య పాకయాజిగారు, దండమూడి.

౧౬ ... మేడూరి శివయ్యగారు, తేలప్రోలు.

౧౭ ... కుందుర్తి ఆనందరావుగారు బి. ఏ. దుగ్గిరాల.

౧౮ ... పార్వతమ్మగారి జ్ఞాపకార్థం సత్తెనపల్లి వెంకటరామయ్యగారు,
వోవర్ శీయరు, దుగ్గిరాల.

౧౯ ... చావలి గంగయ్యగారి జ్ఞాపకార్థం కుమాళ్లు సుబ్బయ్య వగైరాలు.
చముదుపాడు.

౨౦ ... సంగాపు పానకాలయ్యగారి జ్ఞాపకార్థం కుమాళ్ళు వీరయ్య గురుకులు
వగైరాలు, నవులూరు

౨౧ ... సంగాపు కోటీశ్వర గురుకులుగారు, మంగళగిరి.

౨౨ ... చిలుమూరు వెంకటసుబ్బయ్యగారు, చిలుమూరు.

౨3 ... చిలుమూరు కుటుంబయ్యగారు, చిలుమూరు.

౨౪ ... శేకూరు రాఘవశర్మగారు, గుడివాడ.

౨౫ ... చావలి సుబ్బయ పంతయ్యగార్లు, పినపాడు.

౨౬ ... చావలి లక్ష్మీకాంతయ్యగారు. బాపట్ల.

౨౭ ... కొల్లిపర రామయ్య, పిచ్చయ్యగార్లు, పెనుమూలి.

౨౮ ... స్వర్ణ చినమల్లయ్యగారి జ్ఞాపకార్థం ధర్మపత్ని బుచ్చమ్మగారు, చీరాల.

౨౯ ... పెనుమూడి సీతమ్మగారు, జొన్నలగడ్డ.

3౦ ... పసుమర్తి పార్వతమ్మగారు, కూచిపూడి.

# శ్రీ ఆదిశైవపత్రిక.

సప ఏకోరుద్రస్స ఈశానస్స భగవాన్ సమహేశ్వరస్స మహాదేవః॥
"అథర్వశిరసి."


| సంపుట ౧౧ | చిలుమూరు యువనామ సం॥ర చైత్ర వైశాఖ మాసములు. | సంచిక ౧-౨ |
| --- | --- | --- |


## ప్రార్థన


(శ్రీమాన్ పొన్నూరు బాపయ్యగారు)


సీ॥ మహితస్వరూపాయ మధురస్వభావాయ
మంత్రాత్మకాయ నమశ్శివాయ
మానితాకారాయ మామకాభీష్టాయ
మారహరాయ నమశ్శివాయ
మానిసుతనుతాయ మధుసూదనసఖాయ
మాయాపహాయ నమశ్శివాయ
మదదైత్యహరణాయ మాదేవదేవాయ
మంత్రఫలాయ నమశ్శివాయ
గీ॥ మానిజనసేవితాయ నమశ్శివాయ
యనుచు నిను జింతనము జేయు నార్యజనము
బుధజనోల్లాస కైలాసకుధరవాస
భక్తహృదయేశ పరమేశ పార్వతీశ॥

# యువ వత్సరము

కం॥ యువరాజ్యముకై వడి నీ
యువరాజ్యము వెలయుగాత యుత్సాహముగన్
యువయగుచును నన్నింటను
యువనామము సార్థకమున నొప్పెడిగాతన్॥

## ఆశీస్సు

సీ॥ పల్కుపల్కున తేనెలొల్కు పల్కులుపల్కి
పల్కుచేడియ కూర్మిబడయుమమ్మ
కలి, పండిత, విమర్శగణంబు మెచ్చగా
శాస్త్రీయచర్చల జరుపుమమ్మ
తోడిపత్రికలతో నీడుజోడైయుండ
నందమౌరూపు నలరుమమ్మ
పదునొకండవయేడు ప్రారంభమాయె నీ
తెల్వితేటలు వృద్ధిదేగదమ్మ

గీ॥ చూడు నీతోడిపడుచుల చులుకుదనము
జనవశీకరణము నేర్పుదనము ఘనము
గాన నీకేమియింక ప్రకాశముగను
లోకమున వెల్గుమో పత్రికాకుమారి॥

# పత్రికా ప్రబోధము (కాదు మనవి)

(శ్రీయుతులు పి. సి. హెచ్. రావుగారు)

సీ॥ వెచ్చించుచున్నారు వేలకువేలు మీ
నిత్యఖర్చులకొరకు నియతిలేక
పెట్టుచునున్నారు పేరూరు లేనట్టి
ఖర్చులనెన్నియో క్రమమెఱుగక
వ్యయమొనర్చుచునుండు వ్యవధలేక సతమ్ము
దుర్వ్యయంబులనెన్నొ దోసమనక
డ్రామాలకంచు, సినిమాలకంచును
చెల్లింతురెంతయో చింతలేక

గీ॥ గాని యొక చిన్నపత్రికన్ క్రమముగాను
నడచునట్లుగ సాయమొనర్పలేని సాంఘికులు,
మీరలనుమాట సార్థకంబు జేయగా పూనవద్దు
చేజేతమీరు సరసగుణులార యో యాదిశైవులార॥ ౧

ఉ॥ సాయము జేయుడంచు పలు ♦ సారులు మెంతగ విన్నవించినన్
సాయము జేయకుండుట విచార్యము ♦ మీరలు యెన్నిఖర్చులో
జేయుచు సంఘపత్రికకు జీవము ♦ బోసియు బెంప "నర్థ రూ
పాయలు మూటికే" వెడగుభావము ♦ బూనుట లార్యధర్మమే॥ ౨

కం॥ యేపత్రికలో జూచిన
పాపము సంపాదకుని యపారంబౌ వి
జ్ఞాపనములె చందాకొఱకై
పెరపత్రికల కిట్టియార్భటి గలదె॥ 3

(సశేషము)

## మనవి

సోదరులారా! సంఘాభిమానముతో కష్టనష్టముల గమనించక ఏకాదశసంపుట మారంభించితిమి. సాంఘికులెంతటి నిరుత్సాహము జూపినను, ఎంతటి నిరాదరణము గావించినను "మర్కటకిశోరన్యాయమున" పత్రికను వెలువరింప సాహసించిన మా దౌర్జన్యమును క్షమింప ప్రార్థితులు. పత్రికాప్రచారము చాలా ముఖ్యమైనదనియు దీనికంటె మించిన సులభసాధనము మరొకటి లేదనియు అట్టి పత్రికను సలక్షణముగా నడపుట శ్రేయస్కరమనియు యనేక పర్యాయములు విన్నవించిన మా ప్రార్థనల నికనైన గమనించి సహాయ మొనరింపగలరని పరిపూర్ణవిశ్వాసముతో మీయనుగ్రహమునకై వేచియున్నాము.

(పత్రికాధిపతి)

## భక్తియోగము

ఆంధ్రవ్యాసనిపుణ, ఆవ్వారి-సుబ్రహ్మణ్యశర్మ
(అఖిలాంధ్రదేశీయ పండితపరిషత్సభ్యుఁడు)
(సారస్వతసమితి) వంగిపురము.

ఉ. ఎవ్వనిచేజనించుఁ జగమెవ్వనిలోపలనుండు లీనమై
యెవ్వనియందుడిందుఁ బరమేశ్వరుఁ డెవ్వఁడు మూలకారణం
బెవ్వఁడనాదిమధ్యలయుఁ డెవ్వఁడు సర్వముతానయైన వాఁ
డెవ్వఁడు వానినాత్మభవు నీశ్వరు నేశరణంబు వేఁడెదన్.

"ఆంధ్రభాగవతము"

భక్తాగ్రేసరులారా !

భక్తినిగుఱించి నాలుగు మాటలువ్రాయ సంకల్పించుకొంటిని-ఈనాసంకల్పము వికల్పముగాక సకల్పముగా నీవ్రాఁతరూపముఁ గాంచు చున్నదిగదా యని కరమానందించుచున్నాఁడను పరమేశ్వరస్వరూపుల రగు తామీవ్యాసమును సావధానముగఁబఠించి నాశ్రమను సార్థకముఁ జేసి నన్నాశీర్వదింతురని, వారక వేడువాఁడ.

"శ్రవణం కీర్తనం శంభోస్స్మరణం పాదసేవనం
అర్చనం వందనందాస్యంసఖ్యమాత్మనివేదనమ్ ।
ఇతిపుంసార్పితా శంభోర్భక్తిశ్చేన్నవలక్షణాః॥"

అని భక్తి నవవిధములుగాఁ జెప్పఁబడినది. శ్రవణము, కీర్తనము స్మరణము, పాదసేవనము, అర్చనము, వందనము, దాస్యము, సఖ్యము, ఆత్మనివేదనము. అను వానిలో నెద్దానినైన ననుసరించి తరింపవచ్చును. "కలౌస్మరణాన్ముక్తిః" అను న్యాయముననుసరించి, కలిప్రభుత్వమున స్మరణముచేతనే తరింపవచ్చును. కాని, స్మరణమునకుగాని, శ్రవణమునకు గాని, కీర్తనము, పాదసేవనము, అర్చనము, వందనము, దాస్యము, సఖ్యము, ఆత్మనివేదనమునకుఁ గాఁగలవానికి భక్తి యత్యావశ్యకము. భక్తియన విశ్వాసమనియు, లక్ష్యముంచుటయని యర్థములు. లక్ష్య శుద్ధియే భక్తియని జెప్పంబడు. భక్తులలో కపటభక్తులు, దొంగభక్తులు మాయాభక్తులు, శిశ్నోదరపరాయణాయత్తచిత్తభక్తులుఁ గలరు.

ఒక వ్యక్తి భక్తిభావముతోఁ బరమేశ్వరుని కీర్తించుచుండిన నింకొక వ్యక్తి తానును పరమేశ్వరుని భజింపకుండిన నితరు లేమను కొందురో యని కీర్తించుచు 'నేనును భక్తిగలవాఁడనైతిన'ని బీరములు వల్కు కపటవ్యక్తినే, కపటభక్తుఁడు, అని వాడుదురు. ఇట్టివారు కొంద రున్న, వారందఱుఁ గపటభక్తులనంబడుదురు. దొంగభక్తులు, మాయా భక్తులు, శిశ్నోదరపరాయణాయత్తచిత్తభక్తులు, నిట్టితెగయందుఁ జేరిన

వారలే. మఱియు, తామసభక్తులనియు, సగుణభక్తులనియు, నిర్గుణభక్తులనియు, మూఁడు తెగలవారలుఁ గలరు.

తామసభక్తులు మతతత్త్వములను తెలుసుకొనఁ జాలక మతములను దూషింతురు. దైవతత్త్వమును గ్రహింపఁజాలక దేవతా దూషణముఁ జేతురు. తాఁ బట్టిన కుందేటికి మూఁడే కాళ్ళనునట్లు తమ వాదనసౌకర్యమునకు, గెలుచుటకు ననేక మాయోపాయములఁ బన్ని ప్రజలను మోసపుచ్చుచుందురు. సాత్త్వికభక్తియన నెట్టిదియో నెఱుఁగజాలక "హరేరామ హరేరామ, రామరామ హరేహరే" యని బాహ్యాపటాటోపములకైఁ గూకలిడుచు, నగరసంకీర్తనమనియు, ప్రాతఃకాలకీర్తనయనియు, సాయంకాలకీర్తన, ఆదివారపు సంకీర్తన, సోమవారపు సంకీర్తన, ఏకాదశి సంకీర్తన, ద్వాదశి సంకీర్తన, యను పేరులతోఁ బూటకపు భజనలుచేయుచు, ధనమార్జించి, యాలిబిడ్డలతో సుఖముగా సంసారసౌఖ్యము లనుభవించుచుందురు.

ఇఁక సగుణభక్తులఁగాంచిన దేవతలకు నిర్గుణత్వములేదనియు, అనిమిషులుఁగారనియు, పురుషుఁ డొక్కండెయనియు, ప్రకృతిపురుషుల కవినాభావసంబంధములేదనియు, పాషాణవిగ్రహములే ముక్తినిచ్చునవియు, వాదింతురు. ఏకాదశిపూజ, ద్వాదశిపూజ, శుక్రవారపుపూజ శనివారపుపూజ, దీపావళిపూజ యను నెపములచే పాషాణాది విగ్రహములకుఁ బూజచేసిన, ముక్తినరచేతియందుండునని నిక్కమైన పరమేశ్వరతత్త్వమును మఱుఁగుపరచి, త్రిమూర్తులు వేరవేరని పామర జనులకుఁ బోధించి, వారివలన ద్రవ్యమార్జించి దేవతాద్రవ్యములవలన నిర్విచారమునఁ గాలమును వేగించుచుందురు.

(కలదింకను)

---

## ద్వాదశవిధ వైష్ణవులు.

అయ్యా శైవపత్రికయందు వైష్ణవవిధానము వ్రాయుటేలయని సందేహింపక నాయందనుగ్రహముంచి వైష్ణవమతభేదములను లోకులు

దెలుసుకొనుటకై తప్పక ప్రకటించి మహోపకారమొనరింప ప్రార్థించు చున్నాను.

1. యామునేయులు, బ్రాహ్మణులు వైష్ణవమతమవలంభించిన యడల శ్రీవైష్ణవులు యామునేయు లనబడుదురు.

2. కులశేఖరులు, క్షత్రియులు వైష్ణవమతము గైకొన్నయడల కుల శేఖరు లనంబడుదురు.

3. త్రైవర్ణికులు, వైశ్యులు వైష్ణవమతమవలంబించిన యడల గలుగు పేరు.

4. చాత్తానులు, శూద్రులు వైష్ణవమతమవలంబించిన యడల, గలుగు పేరు.

5. నంబిళ్లు, కాపులు వైష్ణవమతము గైకొన్నయడల గలుగు పేరు.

6. నంజయర్లు, సాలెలు వైష్ణవము గైకొన్నయడల గలుగు పేరు.

7. తళఘులు, భట్రాజులు వైష్ణవమతమవలంబించిన గలుగు పేరు.

8. గౌణులు, ముతరాజులు వైష్ణవమతము గైకొన్నయడల గలుగు పేరు.

9. కైవర్తులు, వడ్డె ఉప్పర్లు వైష్ణవమును పుచ్చుకొన్నయడల గలుగు పేరు.

10. వాచ్చాంబిళ్లు, మంగలి కుమ్మర గొల్ల మొదలగువారు వైష్ణవము గైకొన్నయడల గల్గుపేరు.

11. తిరుపణ్యులు, వైష్ణవమతమవలంబించిన పంచములు. (హరిజనులు)

12. పెరియసంబంధులు, వైష్ణవముగైకొన్న షష్టములు. (మాతంగులు)

పూర్వకాలమునుంచియు వైష్ణవమతప్రచారము యిట్లే శైవ మతప్రచారముగావించి లోకమునంతయు ఏకచ్ఛత్రాధిపత్యము వహించిన, విశిష్టాద్వైతము నేటికాలమున నెట్టెయిక్కట్లగుచున్నదియు నెట్టి గౌరవము నొందుచున్నదియు గమనింప ప్రార్థితులు.

శైవమునకును వైష్ణవమునకును మూర్తిభేదము గల్గుచున్నదే గాని సిద్ధాంతమునం దిసుమంతయు భేదములేదు. శైవవిశిష్టాద్వైతము వైష్ణవవిశిష్టాద్వైతము. అని ఆయామతస్తులు చెప్పుచున్నారు.

మధ్వశ్రీ ముజుందారు నరశింహారావు పంతులు.

---

# భగవద్గీత.

హే ఆదిశైవ ద్రావిడ బ్రాహ్మణాః ! కొంచెమిటు పరికించుడు !

భగవద్గీతపై శ్రీకంఠ శివాచార్యులవారు గాయత్రీ మంత్రార్థమే గీత యని శివపరముగా భాష్యమును కల్యాది ౧౬ వ శతాబ్దమున రచియించిరి. ఇందు పరశివుడె పరబ్రహ్మమని ప్రతిపాదింపబడినది. ॥రుద్రస్త్వాత్మా శరీరిణాం॥ ప్రతిశరీరమందును రుద్రుడే ఆత్మగానుండెను. 'ఈశావాస్య మిదం సర్వం' అను శృతి ప్రకారము, ఈసర్వప్రపంచము ఈశ్వరుని స్థూలశరీర మనిన్నీ ఇందున్నవాడు నిర్గుణ పరశివుడె, యని సిద్ధాంతము. 'ఈశం తం జ్ఞాత్వా అమృతాభవతి' అను శృతి ప్రకారము ఆ పరశివుని తెలిసినవారు ముక్తులగుదురు. ముక్తియనగా, పరమానంద రూపమైన శివత్వము లభించుట, అట్టి శివరూపము పశుత్వము (జీవత్వము) నివృత్తిగాక రాజాలదు, అట్టి నివృత్తి, నిరంతర భావనలేక సిద్ధించదు. గనుక నిరంతరము శివోహం భావన చేయుట వలన పాశము వదలుటచే పశుత్వముపోయి భ్రమర కీటన్యాయముగా శివుండగుచున్నాడు. కృష్ణు డర్జునున కుపదేశించిన సిద్ధాంతవచనమున్నూ ఇదియె. 'ఈశ్వర స్సర్వభూతానాం హృద్దేశేఽర్జున తిష్ఠతి' అనిన్నీ, 'తమేవ శరణంగచ్ఛ సర్వభావేనభారత' అనిన్నీ 18 వ అధ్యాయం మోక్షసన్యాసయోగములో నున్నది. ఓయర్జున ? ఈశ్వరుడే సర్వభూతములయొక్క హృదయమందున్నాడు. సర్వప్రపంచము శివుడేయని అన్నివిధముల నతనినే శరణుబొందు మనియును ఉపదేశించెను. నేనును శివునివలన యనేక వరములనున్నూ శివప్రసాదము వలన

శివజ్ఞానమున్నూ పొందినాను, నాకును పరమపదము, సాంబశివుడే యని యుపదేశించెను. ఇంతేగాక కర్మ, భక్తి, జ్ఞానములతో వేదాంత శాస్త్రమును సందర్భానుసారముగా వెదజల్లెను. ఇంతేగాక సనాతనమైనశివకులముయొక్క ఉత్పత్తినివృత్తిని ముక్తినిన్నీ జూపెట్టెను "ఆదిత్యపురాణే। ఉత్కృష్టాధ్యాయే। శ్లో॥ శివసృష్టి సముద్భూతా జాయంతే బ్రాహ్మణోత్తమాః। తేషోడశకళాయుక్తా స్త్వన్యేవిప్రాస్తు షట్కళాః। షడాధార యుతావిప్రాస్స్వార్థకృత్యేషుయోగ్యకాః। షోడశాధార సంయుక్తా స్త్వాదిశైవాః పరార్థకే। యోగ్యా ఏవ సదా కాలం తేషాందోషో నవిద్యతే॥ "శృతి" "షోడశకలోవై పురుషః। యావానేవ పురుషః। తస్మిన్ వీర్యం దధాతి॥ కణ్వస్మృతి॥ యః పరార్థీయ పూజాయాశ్చాత్మార్థస్య తు యోగ్యకః। తస్య దేవలకత్వం హి నాస్త్యేవ హి కదాచన॥ శివరహస్యఖండే॥ శివప్రసాదేన హిభుక్తిరుత్తమా శివప్రసాదేనహి ముక్తిరుక్తమా। శివప్రసాదేన వినా నభుక్తయ శ్శివప్రసాదేన వినానముక్తయః" ఇత్యాది శృతి, స్మృతి పురాణములయందు ఆదిశైవులయొక్క ఉత్పత్తి శివునియొక్క ముఖమువలన గలిగినదిగాన బ్రాహ్మణులలో ఉత్తములు, వీరికి షోడశ కళలు గలవు. బ్రహ్మసృష్టిలోని త్రైలింగ బ్రాహ్మణులకు ఆరుకళలే గలవు. షట్కళలు గలవారు స్వార్థపూజయం దధికారులు. షోడశ కళలు గల అదిశైవ ద్రావిడ బ్రాహ్మణులు స్వార్థపరార్థ పూజాధికారులు. వీరికి పదార్థపూజయందు దేవలకత్వ దోషములేదు. స్వార్థ యజనముచేయు స్మార్తులు పరార్థపూజ జేసినయెడల దేవలకత్వమాపాదించును. ఆదిశైవులు శివారాధనను మానరాదు. అన్యవిప్రుల యిండ్లయందు భుజింపరాదు. దుర్దాన దురాన్నములు గ్రహింపరాదు. పురజనులకు గురువుగానుండి శివజ్ఞానమును బోధించుచు తాను తరించి పరులను తరింపజేయవలెనని సంగతులనేకస్థలముల యందీ భాష్యమున గలవు. ఇంతయుత్కృష్టమైన జాతి, జగద్గురుత్వమును వహించి ప్రస్థాన త్రయమునకు భాష్యములు వ్రాసి పీఠాధిపత్యము

గావించిన యాచార్య పురుషులు గల మతము, నానాటికి క్షీణించి గురుపీఠము లన్యాక్రాంతములైన తర్వాత, మతబోధకులు లేక, నానా మతముల లోనికి ప్రవేశించి పతనము నొందుచున్న సంఘమును జూచి విచారపడుటకు మా హృదయము చాలకున్నది. 'స్వధర్మేని ధనః శ్రేయః పరధర్మో భయావహః' తనమతములో తాను ముక్తినొంద వలెను. అన్యధర్మముల నవలంబించి నరకమునకు బోకుడు, భగవద్గీతను (రెండువేల జేజీలుగలది.) జూడుడు. భూయాద్భవ్యం.

చంద్రమౌళీశ్వర పీఠాధిపతి,
శ్రీ కంఠ మఠం. } బోధానంద మహర్షి.

---

# లోకద్రోహులు

సర్వశక్తియుతుండును సంకల్పమాత్రమున సృష్టి స్థితిసంహారాది పంచకృత్య పరాయణుఁడును, నిత్యుడును, అనంతుడును, సర్వదేవతా స్వరూపుండునునగు పరమేశ్వరుని లీలలనంతములు ఆయన నిష్పక్షపాతి. జీవుల పూర్వకర్మాను సారముగా ఫలితము లొసంగుచుండును. లోకసంరక్షణార్థము సగుణమూర్తియై యవతరించి భక్తుల నుద్ధరించి నిగమాగమాది సర్వశాస్త్రములు బోధించి తత్వజ్ఞానమును ప్రకాశింపజేసియుండెె. యవతారభేదములచే కాలానుగుణ్యమైన క్రియాకలాపములు స్థాపించియుండెె. జీవరూపభేదములచే భక్తులు తమతమశక్త్యానుసారముగా భగవద్య జనాది సత్క్రియ లొనరించుచూ సేవించుచుండుట సృష్ట్యాదినుండి జరుగుచున్న విషయమే. రాను రాను కలికాలవశమున దుర్మతములు ప్రబలి పరిశుద్ధ సనాతనమైన విశిష్టాద్వైతమతమును వంచనజేసి నాస్తికాది సిద్ధాంతముల ప్రచారము లోనికి దెచ్చుచున్నను, నిష్కళంకమై నిరాక్షేపణీయమై సులభసాధ్యమై వేదరూపమైన విశిష్టాద్వైతమతమును ఒక్కపీసమైనను కదిలింపలేక

తమతమ దుష్కృత్యములకు కొందఱు పశ్చాత్తాపము నొందుచుండిరి. "జ్ఞానినాము పకారాయ త్రిధారూపం ప్రభుర్వ్యహాత్, సగుణం నిర్గుణం చేతి తస్మాత్సగుణనిర్గుణం"అను సూతసంహితా వచనమును కాలదన్ని నైచి. నేనే బ్రహ్మను. నాకంటె అన్యములేదు. యీ దృశ్యప్రపంచ మంతయు శూన్యమని యేవేవో వారిచిత్తాను సారముగా ప్రచారము చేయుచున్నారు. అట్లొనరించుట నిరాక్షేపణీయమైనను "యినుమును కరించి అగ్నికి సమ్మెటపో"ట్లన్నట్లు. భగవద్దూషణకు గురియై నరక మార్గములకు బోవుట కడుంగడు విచారణీయము. ప్రపంచమంతయు భగవత్స్వరూపమైయుండ ఆయనసృష్టిలోని శిలామృద్దారు లోహాదుల యందు భగవత్కళలుండవనియు అట్టిపూజలు వ్యర్థమనియు అన్య చింతనలేక నిరాకారనిరంజనమై నామరూపక్రియా రహితమైన దేనినో సేవించి జన్మరాహిత్యులగుడని నిరంతరము ప్రచారముచేయుచున్న యోగులు యీ ప్రపంచమున పడుపాట్లు దిలకించి హాస్యముచేయని వ్యక్తియే లేడని దలంచుడు. యిట్లొనరించుట లోకద్రోహముగాదా? పరమేశ్వరుని దివ్యలీలలసందర్శించి పూజించి తరించిన మహానుభావులు లేరా? సగుణోపాసనా మార్గముల భేదించి భక్తులను సంకరము గావించుచున్న దుర్మార్గుల నేరీతిగా భగవంతుడు శిక్షింప నుండెనో భగవద్వాక్యములు గమనించిన భక్తులు ఘంటాపథముగా దెలుపు చున్నారు. భగవంతునే విమర్శింప బయలుదేరిన నీ పరమయోగులకు భక్తులను దూషించుటాక లెక్కయా? దుర్బోధ లొనరించుటకు సమయా? ఆహా పరమేశ్వరా! నేటికాలమున నీ సగుణావతారముల కిట్టి యవమానము సంభవించుచున్నది. నీ పూజలు నీ కైంకర్యములు భక్తులు, నీ శాస్త్రములు, మున్నగునవి నిర్మూలనమగు నంతటి ద్రోహములొనరింప బడుచున్నవిగదా? యీ దురంతములన్నిటిని దిలకించి నవ్వుచున్నావా? లోకులే తార్కాణమని దలంచుచున్నావా? పర్యవసానము గమనించి వారివారి కర్మలే యధోగతికి ద్రోయగలవని దెలుపుచుంటివా? "సత్యము సత్యము" మహానుభావా నీ సృష్టి రహ

స్యము మాకెట్లు తెలియును. నిన్నేమి యడుగగలము. నీ యనుగ్రహ మెట్లు విని యోగపరచ దలంచితివో అట్లేగానిమ్ము. మేము నీ సగుణా రాధనలు విడువక నీపవిత్రనామముల స్మరించుకొనుచూ నిన్నే ధ్యాని చుచుండ గలము. అంతకంటె మా కేమియు నవసరములేదు. మా యం దనుగ్రహమున్నచో నీ దివ్యమూర్తి నిగన్పఱచి నేత్రానంద మొన రింపుము...... ( శ్రీ గురుకులాశ్రమము )

---

# సంపాదకీయములు.

## స్వవిషయము

పరమేశ్వరానుగ్రహమున ఏకాదశ (పదునొకండవ) సంపుటము వెలువరించునంతటి మహాభాగ్యము సంప్రాప్తమైనందుల కెంతయో సంతసించుచున్నాము. మమ్ములను ప్రోత్సాహపరచిన సోదరమహా శయుల కభివాదములొనరించుచూ శ్రీవారి సహాయములకు నిరీ క్షించుచున్నాము. సాంఘికసోదరులింతటనైనను సంఘాభివృద్ధికై వెలు వడుచున్న నీమాసాపత్రికను సార్థకపరచి సలక్షణముగా నియమితకాల మున ప్రకటన యగునటుల సహాయమొనరింప గలరని దలంచుట కవ కాశములేదని యనుభవమున దెలుసుకొన్నను సంఘసేవాఫలితము మమ్ములను పాతాళమున కణగద్రొక్కుచున్నను విషపరీక్షలలో మునింగి తెన్నుగానక విలపించుచున్నను మాపూర్వపుణ్య సుకృతవిశే షముమాత్రము మమ్ములగాపాడుచూ, మాసంఘసేవను నిరంతరాయ ముగా సాగునటుల కార్యకలాపనిమగ్నుల జేయుచున్నది. దైవానుగ్ర హమెట్లాడించిన నట్లు ప్రవర్తింపక తప్పదుగదా, గావున సాంఘిక సోద రులు మాప్రార్థనలగమనించి సక్రమముగా ప్రతిమాసము వెలువడునట్లు సహాయమొనరింప నిరంతరము ప్రార్థించుచున్నాము.

## శ్రీశ్రీకంఠశివాచార్యస్వాములు

శ్రీ చంద్రమౌళీశ్వర పీఠాధిపతులును శ్రీశ్రీకంఠమఠాధ్యక్షులును జగద్గురు శ్రీకంఠశివాచార్యస్వాములవారు శ్రీకంఠజయంతిని నెరవేర్చినపిమ్మట ఆంధ్రదేశపర్యటనము గావించి మదరాసునకు విజయంచేసి మైసూరు రాజధానియందు పర్యటనమొనరించుచూ, కాశీక్షేత్రమునకు జేరినట్లు దెలియుచున్నది. శ్రీవారు త్వరలో కాశ్మీరదేశమునకరిగి, శ్రీఉపనిషద్భాష్యమును సంపాదించుకొని ఆంధ్రాక్షరములలో ప్రకటింప నిశ్చయించిరని దెలుపుట కానందించు చున్నాము.

## దేవీయజ్ఞము

శ్రీమార్గ గంగవరంనంజుండ దీక్షితులవారు కాంచీనగరమున వైశాఖ బహుళ దశమీ ప్రభృతి జ్యేష్ఠ పూర్ణిమవరకు యిరువదియొక్క రోజు త్రిశతీసువాసిన్యర్చనలతో ఆరంభింపనున్నారు చందాలు వేసిన మహానుభావులు తమతమ శక్త్యానుసారముగా సహాయమొనరించి యాగము పూర్తి చేయింప ప్రార్థించుచున్నాము. నిర్విఘ్నముగా దేవీ యజ్ఞముపూర్తియై లోకసంరక్షణ గావించునటుల యనుగ్రహించుటకు పరమేశ్వరుని ప్రార్థించు చున్నాము.

## చందాదారులు

పత్రికచందాలనుగురించి పదేపదేవ్రాసి మిమ్ములను కష్టపరచుచున్నామని పలువురు ఘోషిల్లుటచే మాప్రకటన మానితిమి. చందాదారులు నిర్విచారముగా పత్రిక గైకొనుచున్నారేగాని చందా మాట ఎత్తుటలేదు. ఇదెట్టి న్యాయమో- గమనించుడు. అడిగినచో ఆవేశము ఉడిగినచో మౌనము ఇది విషపరీక్షగాదా? లేనిచో రెండువేలరూపాయీలవరకు చందాధనము దిగ్రమింగి సర్వజ్ఞులుగా నుండుటెట్లు సమకూరగలదు? మీదుమిక్కిలి పత్రికను నిరసించుట- సంపాదకుని దూషించుట సంఘమును తిరస్కరించుట మున్నగువాటిలో సాంఘి

కులు గడితేరి స్వేచ్ఛాప్రవర్తకులైయున్నారు. అట్టి మహనీయుల యనుగ్రహముగూడ గోరుచున్నాము.

## విషాదవార్త

శ్రీ గురుకులాశ్రమనివాసియు వైదికశారీరక సూత్రములను పూర్తిగానధ్యయన మొనరించి ప్రచారము గావించుచున్న యిరువదేండ్ల ప్రాయముగల రామలింగేశ్వరుడను యువకుని, విద్యార్థిని, సంస్కారప్రియుని- సంఘసేవాభిలాషిని- యీ- యువ సంవత్సర చైత్రశుద్ధ త్రయోదశీ సోమవారమను పర్వ దివసమున శివాజ్ఞానువర్తియై, నొక్క కబళముగానైకొని జీర్ణించుకొని- మాతాపితరులను బంధుమిత్రాదులను భర్తృసేవా సంసిద్ధురాలగు కళత్రమును- మితిలేని దుఃఖాబ్ధిని ముంచి శివ లోకమలంకరింపజేసినట్లు దెలుపుటకు మిక్కిలి చింతిల్లు చున్నాము. యీ యువకుని ఆత్మశాంతిని గోరుచూ వారికుటుం బమునకు భూతిని దెలుపుచున్నాము. (సంపాదకుడు)

## స్వీకృతి.

కాకినాడ హోమోపతీ పత్రిక

కాకినాడ టవున్ డాక్టరు యనమండ్ర గణపతిరావుగారి సంపాద కత్వమున వెలువడిన మాసపత్రిక మూడవ సంచిక మా కార్యాలయ మలంకరించెను. స్వల్పవ్యయముతో గొప్పగొప్పవ్యాధులు రహితమగు యౌషధములతో నిమిడ్చిన పెట్టెలయందీ వైద్యప్రచారము సాగు చున్నది. సంవత్సరచందా, ౧—౮—౦ లు

అనుమానాలు

బరహాంపురమునుండి శ్రీయుతులు కాంచనపల్లి వెంకటరంగా రావుగారి సంపాదకత్వమున నెలకొల్పిన నవ్వులతీవకార్యాలయము నందలి చతుర్థ కుసుమముపై పేరుగలది మేము స్వీకరించి చదివి యానందించితిమి. పోష్టు ఖర్చులు కొరకు 0-4-9 లు చీట్లు పంపిన యడల వారి నాల్గు పుస్తకములు పంపగలరు. కడుపుబ్బ నవ్వుపుట్టించు హాస్యగ్రంథములు. ఆలసించిన ప్రతులు దొరక నేరవు.

శ్రీశ్రీకంఠజయంతి

శ్రీశ్రీకంఠశివాచార్యజయంతి మహోత్సవము. పలుతావుల గావింపబడినట్లు దెలిసి యానందించుచున్నాము. వంగోలు తాలూకా మడనూరునందు శ్రీమాన్ మడనూరు సుబ్బరాయ, సుందర చెంచు సుబ్బయ్య గురుకులుగార్లు, అత్యంతవైభముతో జరిపి తమకుగల గురుభక్తిని వెల్లడించియున్నారు. ఆదిశైవ సమూహామును సమావేశపరచి ఆచార్య జీవితము ఆచార్యవిజయము మున్నగు మహోపన్యాసములు గావించి తీర్థప్రసాదాదులతో గ్రామప్రజలనానందపరచియున్నారు. గ్రామోత్సవము గావించి ఆచార్యానుగ్రహముతో జయజయధ్వానములతో జయంతి వ్రతము పూర్తి గావించినారని గుడ్లూరు రామలింగేశ్వర గురుకులుగారు దెలుపుచున్నారు

సవరణ

గతసంచికయందు ప్రకటన చేయవలసిన ఆదాయవ్యయ పట్టికను పొరబాటున ప్రకటించలేకపోతిమి. సదరు ఆదాయవ్యయములను గమనింప ప్రార్థితులు సహాయ మొనరింపగోరుచున్నాము.

---

## యీ నెలలో చందాలు చెల్లించినవారు

౧ శ్రీమాన్ మామిళ్లపల్లి శివయ్యగారు (లోగడ) ధూళిపూడి గుం॥

౨ ,, చావలి మల్లయ్యగారు (లోగడ) ధూళిపూడి (గుం)

౩ ,, వల్లూరు లక్ష్మీనారాయణగారు (ఆంగీరస-శ్రీముఖ)
చిక్కవరం (కృ)
౪ ,, పొత్తూరు సుబ్బారాయుడుగారు (శ్రీముఖ-భావ)
కంతేరు (గుం)
౫ ,, మానేపల్లి శివన్నారాయణమూర్తిగారు (భావ)
మోడేకురు (గో)
౬ ,, టంగుటూరు మల్లయ్యశర్మగారు (భావ) సంగం (నె)
౭ ,, పొన్నూరు దుర్గయ్యగారు (శ్రీముఖ-భావ)
దొప్పలపూడి (గుం)
౮ ,, అయలూరు మల్లయ్యగారు (యువ) మొయిద (వి)
౯ ,, యలమంచిలి సుబ్రహ్మణ్యంగారు (భావ-మ॥ రా॥ పోషక)
వెదురుపాక (గో)
౧౦ ,, రామేశ్వరపు చలమయ్యగారు (భావ-పోషక) నగరం (గో)
౧౧ ,, పొత్తూరు పానకాలయ్యగారు (యువ-పోషక)
పెనుమాక (గుం)
౧౨ ,, సత్తెనపల్లి హనుమంతరావుగారు (యువ- పోషక)
గుండెమెడ (గుం)
౧౩ ,, కొండవీటి సుబ్బయ్యగారు (యువ-పోషక) కొండపల్లి (కృ)

---

# సంఘ సన్మానములు

౧ శ్రీమాన్ వెలవలపల్లి దీర్ఘాయువుగారు (అయినాపురం) పుత్రో దయమహోత్సవ తరుణమున పత్రికాసన్మానము ౨-౦-౦

౨ శ్రీమాన్ చావలివాలయ్య గురుకులుగారు (క్రాప) కుమారుని ఉపనయనమహోత్సవ తరుణమున పత్రికాసన్మానం ౧-౦-౦

౩ శ్రీమాన్ చిలుమూరు రామయ్యగారు (పిడపర్రు) కుమారుని ఉపనయనమహోత్సవ తరుణమున పత్రికాసన్మానం ౧-౦-౦

౪ శ్రీమాన్ చిలుమూరు కుటుంబయ్యగారు (చిలుమూరు)
కుమారుని జ్ఞాపకార్థం పత్రికాసన్మానం. ౨-౦-౦

---

# వార్తలు

భారతభూమియందన్ని ప్రదేశములందును మేనెల 6 వ తేదీన శ్రీజార్జిచక్రవర్తిగారి సిల్వర్ జూబిలీ మహోత్సవము జయప్రదముగా గావింపబడెను. యిరువదియైదు సంవత్సరములు నిర్విఘ్నముగా రాజ్యపాలనమొనరించుటచే నీ యుత్సవము గావింపబడెను. పేరెన్నికగన్న శ్రీవిక్టోరియామహారాణీగారీ యుత్సవముల నెన్నిటినో గావించుకొనియున్నదట. అట్లే ఆమె పౌత్రుండగు శ్రీజార్జి సార్వభౌముడుగూడ చిరకాలాయురారోగ్యైశ్వర్యవంతుడై మహోత్సవముల బడయునటుల ప్రజలు పరమేశ్వరుని ధ్యానించుచున్నారు.

♦ ♦ ♦ ♦ ♦

రాయలసీమయందంతటను క్షామపిశాచమావరించి మితిలేని కష్టములు గల్గించి, మనుష్యులను పశువులను పీడించుచున్నది. తుదకు త్రాగుటకైనను నీరు దొరుకుటలేదట. యిట్టి మహావిపత్తును శమింపజేయుటకై అన్ని జిల్లాలనుండియు ద్రవ్యసహాయ మొనరించుచున్నారు. గాని అట్టిసహాయము సహస్రాంశమునకైనను చాలుటలేదని నాయకులు ఘోషపెట్టుచున్నారు. సాటిసోదరుల కష్టములను పరమేశ్వరుడు త్వరలో విముక్తినొందించుగాతయని నిండు విశ్వాసము.

♦ ♦ ♦ ♦ ♦

బందరునందలి ఫ్రెంచిపేటలోను ఇతర ప్రదేశములందును గావింపబడిన వివాహముల విషయములో శారదాకమిటీవారు జోక్యము కలుగజేసుకొని శారదాశాసనమునకు వ్యతిరేకముగా చేసినట్లు కేసులు పెట్టుచున్నారట. అందువలన సనాతనులు నైజాంరాజ్యములో వివాహములు జేయుచుండుటచే అట్లొనరించుటకుగూడ వీలులేనట్లు శాస

నము సవరించబడుచున్నదట. ముందెట్లు జరుగనున్నదో ఈశ్వరుని కెరుకయని పలువురు విలపించుచున్నారు.

♦ ♦ ♦ ♦ ♦

హిందూమత ధర్మాదాయములబోర్డునకు నూతనకమీషనరులు ముగ్గురు నియమింపబడిరి. ప్రెసిడెంటుగూడ నూతనముగా రానున్నాడు. క్రొత్తబోర్డు ఏర్పడినపిమ్మట దేవాదాయశాసన మేవిధముగా పరిణమించునో దెలియదు. గాని యిప్పటికి బోర్డువారు గావించిన ఘనకార్యము పీసమైనను లేదు. మీదుమిక్కిలి గ్రామములలో లేనిపోని తగవులు బెట్టి ద్రవ్యమును వ్యర్థపరుచుటతప్ప నిసుమంతయు ప్రయోజనములేక పోయెనని యనేకులు దెలుపుటవలన యీ బోర్డునకేమియు దార్ఢ్యత లేదనియు, నామకః ఏర్పరచుటచే కొంతమందికి జీవనాధారము గలిగి కోర్టులకు చేతినిండ పనిగల్పించుటకై గవర్నమెంటువారు షుమారు ఏడులక్షల రూపాయీలు పెట్టుబడిపెట్టినట్లు గల్లంతు బయలుదేరినది. వ్యాజ్యములు చెలరేగినవి. కల్లోలములు జాస్తియైనవి. భక్తి నశించినది. హక్కులు గలించుచున్నవని దేవాదాయశాసనమును దీవించుచున్నారు.

♦ ♦ ♦ ♦ ♦

ఇటీవల కొన్ని ప్రాంతములందు వడగండ్లవాన, గాలివాన మున్నగునవి సంభవించి పైరులను నష్టపరచినట్లును ప్రజలకు పశువులకు ప్రమాదము గల్గినట్లును వార్తలు దెలియుచున్నవి.

♦ ♦ ♦ ♦ ♦

గుంటూరుజిల్లా నిడుబ్రోలునందు రైతాంగవిద్యాలయము నెల కొల్పి రైతులకు సలహాలు యివ్వబడుచుండును. మహామహులగు పలువురు నాయకులచే ప్రతిదినము ఉపన్యసింపబడుచుండును. రైతుల ఋణవిముక్తి సాధనముగూడ యోచింపబడుచున్నది.

———

భావసంవత్సర ఆదాయవ్యయపట్టిక — (దశమసంపుటం బాపతు)

జ మ ల వి వ రం

| | |
|---|---|
| 8—0—0 | మహారాజ పోషకులవల్ల |
| 15—0—0 | రాజ పోషకులవల్ల |
| 20—0—0 | పోషకులవల్ల |
| 64—0—0 | చందాదారులవల్ల |
| 12—8—0 | సన్మానములవల్ల |
| 6—0—0 | ధర్మములు |
| 125—8—0 | మొత్తం జమ |

ఖ ర్చు ల వి వ ర ము

| | |
|---|---|
| పోష్టల్ ఖాతా | 37—9—0 |
| సాదరు ఖాతా | 44—9—6 |
| ముద్రణఖాతా | 111—9—6 |
| పత్రికలఖాతా | 6—2—0 |
| ధర్మఖాతా | 1—14—0 |
| ప్రయాణంఖాతా | 4—8—0 |
| స్టేషనరీఖాతా | 0—12—0 |
| | 207—0—0 |
| జమ మొత్తం | 125—8—0 |
| సంపాదకుని పెట్టుబడి | 81—8—0 |
| లోగడపెట్టుబడి | 717—7—3 |
| | 798—15—3 |

పత్రిక ఆరంభించినది మొదలు దశమసంపుటం ఆఖరువరకు సంపాదకునకు గలిగిన నష్టం యేడువందల తొంభైయెనిదిరూపాయిల పదిహేను అణాల మూడు పైసలు మాత్రం.

☞ సోదరులారా! ఆదాయవ్యయపట్టిక గమనించి పత్రికను సంరక్షింపగోరుచున్నాను. క్రమక్రమముగా నష్టము హెచ్చుచున్నందున సాంఘికుల సహాయము ఎక్కువగా గోరవలసివచ్చినది. కులపత్రికయందు అభిమానముంచుట శ్రేయస్కరము. నేటి కాలమున సంఘాభివృద్ధికి పత్రికాప్రచారమునకంటె మించిన మార్గము గన్పట్టుటలేదు. గావున పదిసంవత్సరములనుంచి కులసేవగావించిన పత్రికను రక్షింప ప్రార్థించుచున్నాము. రెండు మాసముల కొకతూరి మాత్రమే ప్రకటనచేయ వలసివచ్చెను. ద్రవ్యాభావమువలననట్లు జరిగెను. కాలపరిస్థితినిబట్టి అట్టి క్రమముగా ప్రతిమాసము ప్రకటనచేయునట్లు సహాయపడ గోరుచున్నాము.

(సంపాదకుడు)

---

# ప్రకటనలు.

ఉచితము. ఉచితము.

కొలది ప్రతులేగలవు? కొలదికాలము మాత్రమే?

కడుపుబ్బ నవ్వించు హాస్యగ్రంథములు.

౧ నవ్వగలవా. ౨ పెండ్లాన్ని యేలాపిలవడం. 3 దీనిపేరేమిటి. ౪ అనుమానాలు. యీనాలుగు గ్రంథములకు పోస్టేజిఖర్చులనిమిత్తం 0-4-9 లు చీట్లు పంపినయడల ఉచితముగా పంపగలము. ఒక్కపుస్తకము కొరకు 0-1-9 చీట్లు పంపవలెను. ఆలసించిన దొరుకనేరవు. మొత్తముగా కొనువారికి కమీషన్ యివ్వబడును.

అడ్రస్:—కాంచనపల్లి వెంకటరంగారావు,

నవ్వుల తీవకార్యాలయం బరంపురం (గంజాం జిల్లా)

♦ ♦ ♦ ♦ ♦

# భక్తహృదయము.

భగవంతుని స్తుతించుటకేర్పడిన భక్తుని నిజహృదయము విస్తరింపబడియున్నది. సత్యమైన భక్తులు పఠింపదగిన పురాణగాథలతో నిండియున్నది. సర్వులు పరిశీలింపదగియున్నది.
వివరముల కిట్లు వ్రాయవలెను.

పొన్నూరు బాపయ్య,
దొప్పలపూడి, పొన్నూరు పోష్టు
గుంటూరు జిల్లా,

# హిందూ లా

సమిష్టి కుటుంబములకు సంబంధించిన సర్వవిషయము తీర్పులతో సహాగలదు. ఆలసించిన ప్రతులు దొరకనేరవు.

వెల రు ౨-౦-౦ లు

మానేజరు హిందూ ధర్మశాస్త్రనిలయం కపిలేశ్వరపురం,
గోదావరి జిల్లా.

# చక్కని వేదాంత గ్రంథములు.

౧ శుష్కవేదాంత తమోభాస్కరం ౨ స్వబోధసుధాకరము 3 ఓంకారము.

శ్రీవ్యాసాశ్రమం. ఏర్పేడు చిత్తూరు జిల్లా.

సం॥ చందా రు 1-8-0 లు. Regd. No. M. 207.

# శ్రీ ఆదిశైవపత్రిక.

శ్రీ శ్రీకంఠ మఠాధిపతుల యాజ్ఞానుసారముగా శైవ సంఘాభ్యుదయమునకై శ్రీ గురుకులాశ్రమము నుండి ప్రతిమాసము ప్రకటింపఁబడును.

సర్వదేవాత్మకో రుద్రస్సర్వే దేవాశ్శివాత్మకాః ।
రుద్రస్య దక్షిణేపార్శ్వే రవిర్బ్రహ్మ త్రయోగ్నయః ।
వామపార్శ్వే ఉమాదేవి విష్ణుస్సోమోపి తేత్రయః ॥
(రుద్రహృదయోపనిషత్)

సంపాదకుడు:—చిలుమూరు పురుషోత్తమ గురుక్కళ్.

సంపుట ౧౧ | చిలుమూరు, కొల్లూరు పోష్టు
యువనామ సం॥ర జ్యేష్ఠ, ఆషాఢ మాసములు | సంచిక 3-౪

[వి లేఖకుల వ్యాసములకు సంపాదకులు ఉత్తరవాదులు కానేరరు.]



—• విషయసూచిక •—



భారతీ ముద్రాక్షరశాల, తెనాలి.

# ఉద్ధారకులు

౧ కీ॥ శే॥ చిలుమూరు తీర్థేశ్వరులవారి జ్ఞాపకార్థం కుమాళ్లు ఉమామహేశ్వరం వగైరాలు, చిలుమూరు.
౨ కర్ణాటక రాష్ట్రీయ ఆదిశైవ మహాసంఘమువారు, బెంగుళూరు.
౩ శ్రీమాన్ నడింపల్లి నాగేశ్వరశివాచార్యులవారు, ఇంటూరు.
౪ ... గూడూరు రాఘవరావుగారు, పోతునూరు.
౫ ... గూడూరు శీతయ్యగారు, శనివారపుపేట.
౬ ... అయలూరు వెంకటసుబ్బయ్యగారు, అర్తమూరు.
౭ ... పావులూరు రామచంద్రయ్యగారు, మునికోటిపురం.
౮ ... పావులూరు హనుమంతయ్యగారు, మునికోటిపురం.
౯ ... పెనుమూడి సత్యనారాయణగారు, తూర్పుకూచిపూడి.
౧౦ ... స్వర్ణ వెంకటశివావధానులుగారు, బూతుమల్లి.
౧౧ ... పావులూరు నాగేశ్వరశర్మగారు, అనంతపురం.
౧౨ ... పెనుమూడి హనుమంతరావుగారు, తెనాలి.
౧౩ ... మామిళ్ళపల్లి శంకరమ్మగారి జ్ఞాపకార్థం భర్త శివరామదీక్షితులుగారు, చుండూరు.
౧౪ ... మామిళ్ళపల్లి సాంబయ్యగారు, చుండూరు.
౧౫ ... పొన్నూరు సుబ్రహ్మణ్య పాకయాజిగారు, దండమూడి.
౧౬ ... మేడూరి శివయ్యగారు, తేలప్రోలు.
౧౭ ... కుందుర్తి ఆనందరావుగారు బి. ఏ., దుగ్గిరాల.
౧౮ ... పార్వతమ్మగారి జ్ఞాపకార్థం సత్తెనపల్లి వెంకటరామయ్యగారు, ఓవర్‌శీయరు, దుగ్గిరాల.
౧౯ ... చావలి గంగయ్యగారి జ్ఞాపకార్థం కుమాళ్లు సుబ్బయ్య వగైరాలు, చముడుపాడు.
౨౦ ... సంగాపు పానకాలయ్యగారి జ్ఞాపకార్థం కుమాళ్లు వీరయ్య గురుకులు వగైరాలు, నవులూరు.
౨౧ ... సంగాపు కోటీశ్వర గురుకులుగారు, మంగళగిరి.
౨౨ ... చిలుమూరు వెంకటసుబ్బయ్యగారు, చిలుమూరు.
౨౩ ... చిలుమూరు కుటుంబయ్యగారు, చిలుమూరు.
౨౪ ... శేకూరు రాఘవశర్మగారు, గుడివాడ.
౨౫ ... చావలి సుబ్బయ్య పంతయ్యగార్లు, పినపాడు.
౨౬ ... చావలి లక్ష్మీకాంతయ్యగారు, బాపట్ల.
౨౭ ... కొల్లిపర రామయ్య, పిచ్చయ్యగార్లు, పెనుమూలి.
౨౮ ... స్వర్ణ చినమల్లయ్యగారి జ్ఞాపకార్థం ధర్మపత్ని బుచ్చమ్మగారు, చీరాల.
౨౯ ... పెనుమూడి సీతమ్మగారు, జొన్నలగడ్డ.
౩౦ ... పసుమర్తి పార్వతమ్మగారు, కూచిపూడి.

# శ్రీ ఆదిశైవపత్రిక.

సర్వోరుద్రస్స ఈశానస్స భగవాన్ సమహేశ్వరస్స మహాదేవః॥

"అధర్వశిరసి."

| | | |
|---|---|---|
| సంపుట | చిలుమూరు | సంచిక |
| ౧౧ | యువనామ సం॥ర జ్యేష్ఠ ఆషాఢ మాసములు. | 3-౪ |



## ప్రార్థన.

సీ॥ శూలంబు గీలంబు కేల ఫాలంబున
లీలగాదాల్చిన మూలపురుష
హారిజను గిరిజను శిరమందు బరమందు
ధరియించి భరియించి పరగువరద
కరిరాజు గిరిరాజు నరిశరాసనములై
మెరయుచు దిరిగెడి యురగభూష
రారాజు గీరాజు గారాజునెరకాడు
సారథివై గేరు మేరుధీర

గీ॥ ఈశ భూతేశ సర్వేశ పాశనాశ
రక్షణవిచక్ష రుద్రాక్షపక్ష దక్ష
బుధజనోల్లాస కైలాస కుధరవాస
భక్తహృదయేశ పరమేశ పార్వతీశ॥

(చిట్టికవి)

# ఆ శీ స్సు.

గీ॥ పెద్దవారల నిక్కంపు ప్రేమచేత
చిన్నవారల లలితంపు చెలిమిచేత
భువిని సర్వాంగ సుందరముగను నీవు
తేజరిల్లుచు సత్కీర్తి దెచ్చుకొనుము॥

గీ. వేల్పులకునెల్ల వేల్పయి వెలయునెవడు
వెలుగులకునెల్ల వెలుగయి వెలుగునెవడు
అట్టి శ్రీవిశ్వనాధుని యతులకరుణ
చేత వర్ధిల్లు వేయేండ్లు చిత్తములర
లోకమున చక్కగా పత్రికాకుమారి॥

(చిట్టికవి)

కం॥ మీసాయ మపేక్షించియు
జేసితి మరి జేయుచుంటి జేయుదునిక నే
నీ సంఘసేవ శ్రద్ధతో
ఓసాంఘికులార మీర లుత్సాహింపన్॥

(సంపాదకుడు)

# మ న వి.

సోదరులారా!

శ్రీమత్పరమహంస పరివ్రాజకాచార్యేత్యాది జగద్గురు శ్రీ శ్రీకంఠ శివాచార్యస్వాములవారు రెండుమాసములనుంచి కాశ్మీర దేశములో శ్రీనగరునందు విజయముచేసినారు. శ్రీవారు ఉపనిషద్భా

ష్యమును ఆంధ్రాక్షరములలో వ్రాయించుచున్నారు. శ్రీవారు స్వ సంఘోద్ధరణకై యవతరించిన మహానుభావులు. భాష్యత్రయమును లోకములో ప్రకాశింపజేసిన దివ్యులు. నాలుగువేల సంవత్సరములకు పూర్వము యీ శ్రీకంఠభాష్యత్రయము కాశ్మీరాదిదేశములందు విశేష ప్రచారముగావించి యచ్చటనే నిలచిపోయినందున వాటిని మరల నుద్ధరించిన మహానుభావులు. శ్రీవారు త్వరలో రాగలరు.

(సంపాదకుడు)

---

# సంపాదకీయములు.

స్వవిషయము.

ద్రవ్యాభావముతో నున్నందున రెండుమాసముల కొకతూరి యైనను పత్రికను వెలువరించుచుంటిమి. శ్రీస్వాములవారి యాజ్ఞా ప్రకారం జ్యేష్ఠాషాఢసంచిక మున్ముందుగా వెలువరించుచున్నాము. యిందలి విషయములు అత్యవసరములగుటచే యిట్లొనరింపవలసి యుండెను. పత్రికను సంరక్షించుడనియే మామనవి. విశేషించి వ్రాయుటవలన సాంఘికు లాగ్రహించుదురని విరమించితిమి.

అభివందనము.

పత్రికయందు అభిమానముంచి సన్మానము లొసంగిన సోదరులను, చందాలుబంపి సహాయపడిన మహానుభావులను హృదయపూర్వకముగా నభినందించుచున్నాము. పరమేశ్వరు డీ మహానుభావుల కాయురారోగ్యము లొసంగుగాతయని మాయాశయము.

మహాభాగ్యము.

కాశ్మీరదేశమునందు ఉపనిషద్భాష్యముగూడ లభించినందుల కెంతయో సంతసముగల్గుచున్నది. దశోపనిషత్తులకుగూడ శ్రీకంఠ శివాచార్యులవారు భాష్యము వ్రాసియున్నారట. ఆ గ్రంథమంతయు

ఆంధ్రాక్షరములతో వ్రాయించుటకై శ్రీ శ్రీకంఠమఠాధిపతులును చంద్రమౌళీశ్వరపీఠాధిపతులు నగు శ్రీ బోధానంద మహర్షులవారు వ్రయప్రయాసలకు గురియై సంఘోద్ధరణకై పాటుబడుచుండుట ఆదిశైవ సాంఘికుల సుకృత మనకతప్పదు. త్వరలో ఉపనిషద్భాష్యముగూడ ముద్రణభారముదీర్చుట మనవిధియై యున్నది. ప్రస్థానత్రయమును లోకములో ప్రకాశింపజేసి శైవమతోద్ధరణగావించిన మహర్షులవారిని ఆదిశైవలోకము మరువగలదా? వారిని పూజించి సేవించుటయే మనవిధి.

---

# అభిప్రాయము

శ్రీమాన్ ఆదిశైవపత్రికా సంపాదకులగు పురుషోత్తమ గురుక్కళ్ గారు నాయందు మిత్రప్రేమచే నాకుబంపిన శ్రీకంఠాచార్య విరచిత బ్రహ్మసూత్ర భాష్యమును నమస్కారపూర్వకముగా హస్తద్వయముతో చేకొని శిరసావహించి పరిశీలించితిని. యోగ్యతములగు శ్రీపురుషోత్తమునకు సర్వేశ్వరుడాయురారోగ్యైశ్వర్యాదుల ననుగ్రహింప ప్రార్థించుచున్నాను.

ఈ శ్రీకంఠభాష్యము భక్తినినిర్వచించెడి భాష్యమని పరమతాచార్యులే యీభాష్యనామమును తమతమ గ్రంథములందు వాడి యున్నారు. శ్రీయుతులు ఓమందూరు దొరస్వామయ్య మొదలగు చరిత్రకారులు సకలార్థసాగరము మొదలగు చరిత్రములయందు సిద్ధాంతయుతముగా శ్రీకంఠమతము ఆదిశైవము మున్నగు సద్విషయములు వ్రాసి యున్నారు. గావున యీశ్రీకంఠ శివాచార్యులవారిని (యిప్పటికుల బంధుజన ఓట్లతో బ్రహ్మసూత్ర గీతాదులకు భాష్యములు వ్రాసెడి) ఓట్లభాష్యకారులుగా లోకము తలంపరాదు. జగత్ప్రసిద్ధ పండితులగు అప్పయ్య దీక్షితులుగారు మహామహుడగు శ్రీకంఠుని భాష్యము శిరసావహించి, శివార్కమణి దీపిక యను వ్యాఖ్యను వ్రాసి యున్నారు. గాన దీక్షితులవారు శైవమతస్థు లని తేట తెల్లముగా

గన్పట్టు చుండును. సర్వోపనిషత్సారభూతములైన మహావాక్యములే బ్రహ్మసూత్రములని బిలువబడుచున్నవి. సర్వేశ్వరుండగు (పరబ్రహ్మమును) నిర్వచించునవి గాన యీ పేరు గల్గినది. యీ బ్రహ్మసూత్ర రచయిత వ్యాసుడు. యీసూత్రములకు బోధాయన మహర్షి వృత్తియను వ్యాఖ్య రచించెను. తరువాత కపర్ది, ద్రమిణాచార్యులు మున్నగువారు టీకలను వ్రాసిరి. అద్వైతమునకు వ్యతిరేకమగుటచే అవన్నియు భరతఖండమువీడి, జర్మనీదేశమునకు చేరియున్నవి. ప్రస్తుతమున కాశీయందలి చౌకాంబా ప్రెస్సువారు; జర్మనీయందలి బోధాయన వృత్తిని తెప్పించి సచిత్రముగా ప్రచురించుచున్నారు. యీ బోధాయనవృత్తి, విశిష్టాద్వైత మగుటచే రామానుజ భాష్యమునకు శ్రీకంఠ భాష్యము చాలా సహకారిగా నుండును. వ్యాసాభిప్రాయమును దెల్పెడి బోధాయన వృత్తిచే శంకరభాష్యమునకు గౌరవము లోపించుచున్నందువలన, అద్వైతులు యీ వృత్తిని చేతపట్టనేరరు. యీ బోధాయన వృత్తినే మాతృకగా గైకొని, రామానుజాచార్యులు భాష్యమును వ్రాసియున్నారు. యీబోధాయనవృత్తి రామానుజాచార్యుల వారికి, యీ దేశమున లభింపక, కాశ్మీరదేశములో శ్రీనగరు మహారాజావారి గ్రంథాలయమున లభించినట్లు దెలియుచున్నది. వైష్ణవులు, రామానుజ భాష్యముతోనే తృప్తిపడుటవలనను, యీ బోధాయన వృత్తిని జూడనందువల్లను, జర్మనీదేశమునకు చేరుట సంభవించినది. ఈ శ్రీకంఠ శివాచార్యులవారు క్రీస్తుశకము పదునొకండవ శతాబ్దముననను, పదునారవ శతాబ్దమున శంకరాచార్యులును, పదునేడవ శతాబ్దమున రామానుజాచార్యులును అవతరించినటుల సకలార్థసాగరమున వారివారి చరిత్రలకడ వ్రాసియున్నది. శ్రీకంఠుడు శైవ విశిష్టాద్వైతమునకును, రామానుజుడు వైష్ణవ విశిష్టాద్వైతమునకును. శంకరుడు వైష్ణవ అద్వైతమునకును భాష్యములు వ్రాసియున్నారు. శంకర పీఠాధిపతులలో నొకరగు విద్యారణ్యులను పేరు గల మాధ

వాచార్యుడు శంకరమతమును కొంతకాలమునకు శివాద్వైతముగా మార్చియున్నాడు.

సృష్టిస్థితిలయాది సర్వాధికారములతో (అంతవాడు మరొకడు లేడని) ఈశ్వరుడు గలడనియెడి అద్వైతులు, బ్రహ్మవిష్ణుమహేశ్వరులలో ఒకనిని సర్వేశ్వరునిగా చెప్పగల వైదిక మతవిధులుండుట వలన బ్రహ్మమతము శంకరునికి పూర్వమే ఆలయ సహితముగా అంతరించినట్లు చదువరు లూహింపవలెను. శంకరాద్వైతులు విష్ణ్వాలయములను స్వాధీనపఱచుకొనుటలో మతబలము నిరర్థకమైనను, వైష్ణవులకే ఎక్కువగౌరవము లొనరింపబడుచున్నవని దలంచి వెంటనే విద్యారణ్య మత మవలంబించి పురోహితాధికారముతో శివాద్వైతులు తమబోధకు వశులైన జమీందారులు మున్నగు జన సహాయముతో శైవాధికారమునందలి శివాలయములలో యాధిపత్యము వహించుటకు ప్రయత్నించిరి. నిర్గుణసగుణసిద్ధాంతములలో శివాచార్యులయిన శుద్ధశైవులతో వివాదములు సంభవింప పరబ్రహ్మమగు సర్వేశ్వరుడు విష్ణువుగాదు. శివుడుగాదు, నామరూపక్రియారహితమైన బ్రహ్మమని కొన్ని కొన్ని గ్రంథములు రచించి వైష్ణవులకు శైవులకుగూడ ప్రతికక్షులై, ఆలయగౌరవాదులను బోగొట్టుచూ అర్చనాదితంత్రములాచరించుచూ శైవచిహ్నములు ధరించి శైవులముకామనియు వైష్ణవచిహ్నములుధరించి వైష్ణవులముకామనియు ప్రతీకోపాసన గావించుచూ శివకేశవద్వేషకులై అద్వైతులమని ప్రచారముగావించుటవలన, లోకములో శైవ వైష్ణవ గౌరవములు నశించుటచే క్షీణవిద్యాపరులై స్వస్వరూపజ్ఞానమును దెలుసుకొనుటకైనను యోగ్యత లేనివారై యల్లాడుచుండిరి. యిట్టిదుర్భరస్థితిలో అనాథకమైన స్వసంఘోద్ధరణ మొనరించుటకై చిరకాలమునుండి పత్రికామూలమున ప్రబోధించుచున్న పురుషోత్తముడును, బోధాయనవృత్తివలె భరతఖండమును వీడుటకు సిద్ధమైయుండి గృహమందలిపేటికలలో బంధింపబడి క్రిముల బాధలను భవించుచున్న శ్రీకంఠాచార్య కృతసూత్ర-గీతాభాష్యములను ముద్రిం

చుటకై పలుశ్రమలునొందుచూ పూర్తిగావించిన మహాత్ములగు శ్రీ బోధానంద మహర్షుల వారును, సాంఘికులకును అకుటిలురగు మిత్రులకును అభినందన పాత్రులయిరి. వీరి యుద్యమము నిర్విఘ్నముగా నడచునటుల సర్వేశ్వరుని ప్రార్థించుచున్నాడ.

మరా:—శైవులనుపేరు నీచముగను, శివుడు సర్వేశ్వరుడు కాడని చెప్పెడి వారలు, శివప్రతిష్ఠార్చనాదు లొనరించుచూ స్థానాధిపతులుగా నుండుటయు విష్ణువు సర్వేశ్వరుడు గాడనియు వైష్ణవులు నీచులని దెల్పుచూ విష్ణ్వాలయాధిపతులై అర్చకులై యాజ్ఞికులై యుండుటవలన శైవ వైష్ణవ ఆలయ మతములు నాశనమగుటయేగాక లోకములో భక్తి మతము అస్తమింపజేయగల దుష్కృత్యములగు చున్నవని చదువరు లూహించెదరుగాక.

మకాం చిలుమూరు,
యువ వైశాఖ శుక్లపక్షము.

ఇట్లు విబుధజన సేవకుడు,
పండిత భట్టర్ అప్పలాచార్యుడు.

---

## ఇంద్ర నారద సంవాదము—స్వర్గము.

ఇం॥ సకలలోకకల్యాణ కార్యప్రచారకులును భక్తిప్రబోధనాచార్యులును నగు దేవరవారు చేతన జనోద్ధరణ కార్యముల విరమించి దేవలోకముననే స్వాశ్రమమున భగవధ్యానపరులై యుండుటకు దగిన కారణము విననర్హమేని దాసునకు దెలుపవేడుదును.

నా॥ నీబోటి భాగ్యసంపన్నుడుగాని, ఖడ్గధారిగాని సహాయమొనరింపనిచో భూలోకమున చరించుటవలన మానప్రాణములు దక్కునా?

ఇం॥ మాయాకుతంత్ర నిపుణులును, పరాన్నత్యతా సహిష్టులును, నిర్దయాత్ములునగు హిరణ్యాక్ష రావణాది, అసురులచేత జిక్కి మహా

ర్షులవలెగాక చక్కగా గౌరవమునొంది ప్రాణులయుద్ధరించియున్న తమరిని భూలోకవాసులు కృతఘ్నులై అగౌరవపరచుదురాస్వామి!

నా॥ సర్వేశ్వరుని అంతర్యామి త్వరూపము నైనను గ్రహింప వచ్చునుగాని, ప్రస్తుత మానవమనోగమన విధులను గ్రహింపశక్యము గానేరదు. కల్ల విధివిషయములే వర్తనగాగల్గి మహాపురుషుడై ప్రఖ్యాతిగాంచుచున్న కవిపురుషునకు దాసులై యున్నారు.

ఇం॥ ఏమీ యిప్పుడు భూలోకమున అధర్మని ప్రభుత్వము నిరంకుశముగా సాగుచున్నదా?

నా॥ ఓహో యింద్రా! నీ వేయికన్నులు నొక్కమారే తెరచి తివే. నీవుగాదు ఆ పరమేశ్వరుడైనను మానవుని హృదయము, ద్రిప్ప జాలరు. ఏలనన అందరూ శంబరులే, అందరూ రావణులే, అందరూ హిరణ్యాక్షులే, బలి తన పరిజనులకేమని చెల్పెనో జ్ఞాపకము దెచ్చు కొనుము.

ఇం॥ అవును. దేవతలకే మంచికాలము గనుక రాక్షసులకు మంచికాలము వచ్చిన పిమ్మట యుద్ధము సేయుదమని త్రివిక్రమ యుద్ధ మున పోరాటము నిలిపినాడు. అయితే యిప్పుడు అధర్మని కాలమా?

నా॥ శీత వాతాతపకాలములవలె సత్వరజోగుణములు నొకదాని వెంట నొకటి వరుసగా నుంగును. సత్వప్రచురణకాలమున అందరూ ఆస్తిక హృదయులై ఆర్యగురుజన సేవకులై సాధు సజ్జన వర్తనులై సూనృతాహింస బ్రహ్మచర్య నియమబద్ధులై యుండుటయు రజోప్రచురణకాలమున మూఢులు-అజ్ఞానులు అసమర్థులు దరిద్రులు తరించుటకుగాను పూర్వులచే నిర్మింపబడిన మార్గములనియు తెలివిగలవారికి ఈశ్వరునివలన ప్రయోజనము లేదనియు అసమర్థులకే పై నియమములు వర్తించుననియు సమర్థులామార్గమును వర్జింపవచ్చు ననియు నాభినుండి దిగువభాగము ప్రజాసృష్టికారి గనుక, బ్రహ్మ స్వరూపమనియు, స్వసుఖవిధివిషయ విచారయుతమైనదిగనుక నాభి

నుండి కంఠమువరకు విష్ణుస్వరూపమనియు, సకలవ్యవహార విధివిధాన ములకు శిరస్సు ప్రధానముగనుక శివస్వరూపమనియు, త్రిమూర్త్యాత్మక స్వరూపము తానేననియు తనకంటె భగవంతుడు వేరేలేడనియు సర్వ కార్య స్వతంత్రులై స్వాతిశయులై యుండుటయు, తమోప్రచురణ కాలమున స్వాతిశయులు అధిభూత, అధిదైవతములచే నశించుట జరుగుచుండును. మరల సత్వప్రచురణకాలము వచ్చుట సహజవిధి. ప్రస్తుతమున, రజోప్రచురణకాలము జరుగుచున్నది. గనుక నీవేమి చేయగలవు.

ఇం॥ స్వామీ, భూప్రజలింత అసురమత ప్రవిష్టులైరిగా, భగ వద్గీతయందలి అసురలక్షణములను రామాయణమందలి రావణునకు మాల్యవంతుని సందేశములను చదివినచో వారేమనగలరు.

నా॥ ఇంద్రా, తల్లిని తన్నువానికి పినతల్లియొకలెక్కయా, వేద ములే, అసత్యములనువారికి గీతలు రామాయణము పురాణములు, సత్యములగునా ? మూఢులకును-అజ్ఞానులకును మానవుల కట్టుబాట్ల కొరకును వ్రాసి యుందురని వారి నమ్మకము.

ఇం॥ సరే, వారి సంపాదితఫలము వారే యనుభవించగలరు. మీ సంచారమున కేమిలోపము సంభవించినది.

నా॥ చంటిపాపలు మొదలు శతవృద్ధపర్యంతము సకల మాన వులు నన్ను కలహాభోజనుడను బిరుదుతో బిలుచుదురు. నేను కల హములు పెట్టుదునట, లేని యెడల నాకు అజీర్తి చేయునట. కడుపు ఉబ్బుటవలన వారికి వీరికి తంపులు పెట్టుచుందునని వారు రచించిన గ్రంథములు వేలకువేలుగలవు.

ఇం॥ భక్తిమతాచార్యా, వారేయాధారములతో నీకీ బిరుద మిచ్చియుండిరి ?

నా॥ రావణుని యమునిపైకిని యవనుని కృష్ణుపైకిని దండయాత్రలు, పురిగొల్పితిననియు, కృష్ణుడు దేవకీ పుత్రుడని, కంసునితో చెప్పితిననియు యిటువంటి కారణములే.

ఇం॥ అల్పబలులను అసమర్థులను, బాధించెడి ధర్మేతరులగు నిర్దయులను, సమర్థులపైకి బొమ్మని చెప్పుట, విషయమెరుంగని సమర్థులకు విషయము దెలియచెప్పుట మొదలగునవి స్వార్థకృత్యములనదగునా, స్వసుఖస్వాతిశయములకై కుటిల దౌర్జన్యకృత్యములుగల అసురవర్తనులు, మడియుటచే ధర్మము నిలచుట లోకక్షేమమేగదా, అట్టి ధర్మరక్షకుడవగు నిన్ను కలహాశనుడనుటకంటె కుటిలవర్తనము మరొకటి గలదా.

నా॥ నేను లక్ష్మీసరస్వతులను వంచించుటకై అనసూయచే ఇనుప శనగలు వండించినట్లును, శచీ సత్యభామల వంచించుటకై పారిజాత పుష్పము రుక్మిణికి నొసంగినట్లును, కృష్ణార్జునులయుద్ధము మున్నగు కారణములకు నేనే గురియైతినని, కలహాశనబిరుదము, మరింతవృద్ధి చేయుచున్నారు.

ఇం॥ స్వోత్కృష్టతతో దురభిమానముతోనిండి, ధర్మనిర్ణయతికి నిలువజాలని పురాణములందీబిరుదము నెక్కించిన మాత్రమున ప్రయోజనములేదు. యిట్లొనరించుట అనాలోచితము, దోసముకూడను, యీ కథలుగల పురాణములందు కలహాశననామ మెచ్చటను లేదని వారికేల తోచలేదో పరవంచనతో వర్తించువానికి మునిఋషి యని పిలుచుట తగదే. పరవంచనతో స్వాతిశయముతో నున్నవానికి కలియుగమున జరుగు మర్యాదవలెనే గతయుగమున మాత్రము జరుగదా. త్రిలోక పూజ్యులగు మీగౌరవము వారికేల స్ఫురింపరాలేదో తెలియదు.

నా॥ ఇదంతయు యుగరాజు ప్రభావము.

ఇం॥ పురాణములు వ్రాసిన మహాఋషులే పెట్టని యీకలహాశననామ మెవరు ప్రసాదించిరి.

నా॥ కలిరాజు అభిషిక్తుడైన పిదప సంస్కృత నాటకములు రచించువారు యీనామకరణ మొనరించిరి.

ఇం॥ ప్రస్తుత తరుణమున మీవిషయ మెట్లున్నది.

నా॥ ఆధివ్యాధులతో పీడింపబడు మానవవ్యక్తినిగాని అరూపుడును అనామకుడగు వంధ్యాసుతునిగాని కథకు ప్రేరేపించి లక్ష్మీ సరస్వతుల, హరిహర బ్రహ్మల, నవమానపరచినటుల విచిత్రకల్పనలతో గద్య పద్య గేయ గ్రంథముల వ్రాసి ఉల్లిగడ్డలు — గుమ్మడికాయలు — చల్లనీళ్లు నొసంగువారలకు గూడ కృతుల నొసంగుచూ, అట్టి గ్రంథములే ఆబాలవృద్ధులు స్త్రీలు పఠించుటయు సంతసించుటయు జరుగుచున్నది. వేయేల నాప్రచారనామములేని గ్రంథమేలేదు. కొండెములు జెప్పు వ్రాత్యులనుగూడ నారదుడవే యని పరిహాసము లాడుచుందురు. నాబిరుదము పొందనివారు నూటికి పదిమందియైనా యుందురేమో, హాస్యములందు నాపేరే. సభలందు నాపేరే. కలహములందు నాపేరే ఉచ్చరించుచుందురు. యిట్టి మానవలోకమునకు నేబోయినచో బకములు హంసను హేళనచేసినట్లుగా నుండునుగదా. ఈశ్వరుని అనామకవంధ్యాసుతునిగా నొనరించి వేదశాస్త్రములు వీడిన వ్రాత్యులకడకు నేబోయిన ప్రయోజనము లేదు.

ఇం॥ భార్యా భర్తృత్వము, రాజా రాష్ట్రిత్వము, గురు శిష్యత్వము, న్యాయ నిర్ణయత్వము నామమాత్రములై వాగ్రూపముగా నుండవచ్చునని తలంచెదను.

నా॥ అవియు అంతంతమాత్రముగానే యున్నవి. గుడిని మ్రింగువానికి గుడిలోని లింగమొక లెక్కయా? సృష్టిస్థితిలయాధికారి యగు సర్వేశ్వరుని గురించి, లక్ష్యము, భీతిలేనపుడు ధర్మములకు తావెక్కడిది. ఈశ్వరచింతనులు, అసత్యభీతులు అచ్చటచ్చట యున్నను వారి

జీవితములు దుర్భరమైయున్నవి. మందభాగ్యులయిన ప్రజలను భగవంతుడే కరుణాదృష్టితో రక్షింపవలెగాని నాబోంట్లవలన గానేరదు. యీలోకమునకు ఆవిద్య రాకుండా గాపాడు భారము నీయందే యున్నది.

ఇం॥ వారిలో యెవ్వరైనా యీలోకమునకు వచ్చినప్పుడు గదా. ఆవిద్య యిచ్చట వ్యాపించుట. కానిందు భగవత్సంకల్పమునకు నాలు చేయి అడ్డమగునా? నేటికి తమ దర్శనమువలన మానవలోక వార్తలు పూర్తిగా దెలిసికొనగల్గితిని. అప్పుడప్పుడు యీదాసునకు దర్శనమొసంగి విశేషములు దెలుపగోరుచున్నాను.

నా॥ నాకును అనుష్టానపు వేళయైనది. కలియుగ వార్తలు క్రమక్రమముగా దెలుపగలను. (నారదుడు)

# గమనింపు.

మన ఆదిశైవ పత్రికయందు మున్ముందు అనేక సద్విషయములు ప్రకటించుటకున్నూ శైవవిశిష్టాద్వైతవ్యాసములు వెలువరించుటకున్నూ, ఆగమశాస్త్ర చర్చలు ఆయుర్వేద విషయములు శివభక్తుల చరిత్రములు మున్నగు వ్యాసరాజములు ప్రచురించుటకు ప్రయత్నములు జర్గుచున్నవి. గావున ప్రతివారును 1-8-0 లు లెక్కచేయక చందాదార్లుగా జేరి ద్రవ్యసహాయమొనరించి మాకు సంతోషమును గలుగజేయ గోరుచున్నాము. (సంపాదకుడు)

# ఉపదేశము.

యేడుజానలు పొడవుగలిగి మలమూత్రపు బొమ్మయైన మానవ శరీరము, నీయాత్మగాజాలదు, ఇది నశించునది, నీవు అవినాశివి, దేహమునకు జననమరణములు గలవు. నీకెప్పుడును జన్మలేదు. మొదట నున్నా నీవు దేహముతో నున్నవాడవె. దేహము చనిపోవును. నీవెల్లపుడు జననమరణములేక నుండువాడవు. నేను దేహమునుగాను, దేహమునకంటె వేరుగానుంటినని నిశ్చయించుకొనుము. దేహమునకును నాకును యేమియు సంబంధములేదు. ఇది దృశ్యము, నేనుద్రష్టను. దేహము చిన్నది. నేను సర్వవ్యాపకుడను. సంసారముయొక్క స్వరూపము చిత్తమునకంటె మరియొకటిగాదు. చిత్తమే సంసారమని వేదాంతశాస్త్రము దండోరా వేయుచున్నది. జడమైన యనాత్మభావనతో మనుజుడు దుఃఖియగుచున్నాడు. ఈ సంకల్పరూపమైన తుచ్ఛ ప్రపంచముకంటె అన్నివిధముల నేనతిరిక్తుడనని జ్ఞాపకముంచుకొనుము. ఈ మలినభావన అసంగను, శుద్ధమునైన నా యాత్మను స్పృశింపజాలదు.

ప్రతివస్తువునందును, నీ వ్యాపకమైన యాత్మస్వరూపము, ననుసంధానము జేసికొనుము. పాదమందు గ్రుచ్చుకొనిన ముల్లు, ముల్లుచేతనే యెట్లు తీయబడునో ఆవిధముగా, పరిశుద్ధమైన సచ్చిదానంద భావనవలన తుచ్ఛభావన నివృత్తియగుచున్నది. కాలినుంచి తీసిన ముల్లున్నూ అది తీయుట కుపయోగించిన ముల్లున్నూ యెట్లు పారవేయబడుచున్నవో, అట్లే శుద్ధభావనతో గూడి మలినభావన నివృత్తి యయినపిమ్మట, శుద్ధభావనకూడా తనంతట తానే పోవుచున్నది. మిగిలినది అద్వితీయమై పరిశుద్ధమైన స్వయంజ్యోతియగు నీ యాత్మ యొక్కటియే ఉంటున్నది.

ఇంద్రియ నిగ్రహమే పరమతపస్సు. ఇంద్రియనిగ్రహమువల్లనంచే శంకరుడు ప్రసన్నమై భుక్తిముక్తుల నిచ్చును. అర్జునునకు శ్రీ

కృష్ణుడుపదేశించినదిదియె. ఇంద్రియనిగ్రహమే పరమార్థముయొక్క ఉన్నతికొరకగుచున్నది. ఇంతియే కాదు- వ్యవహారోన్నతికి గూడ ఇంద్రియనిగ్రహము ముఖ్యముగా జేయవలయును. మోటారు, రైలు, వాయువిమానము మొదలయిన సమస్త కలలయొక్క నిర్మాణము కూడ ఇంద్రియనిగ్రహముయొక్క ఫలమే. ప్రపంచమందు యెవనికి ప్రతిష్ఠగలుగుచున్నదో దాని కంతయు కారణము ఇంద్రియనిగ్రహమే. బహిర్ముఖుడైన మనుజుడు ఇంద్రియ నిగ్రహము లేక వ్యావహారికమునందే ఉన్నతినొందజాలడు. పారమార్థికమునం దాశయేల!

ఇంద్రియనిగ్రహమనగా ఇంద్రియములను నాశనము చేయుట గాదు. ఇంద్రియములను మంచి మార్గమందు నడిపించుట, చెడుత్రోవను బోనీయక శాస్త్రవిహిత మార్గమునందు నడిపించుట. మార్కండేయుడు ఉపమన్యుప్రభృతులు నేత్రేంద్రియము మొదలయిన ఇంద్రియములచే సాకారరూపుడైన భగవంతుని దర్శనముచేసిరి.

బోధానందమహర్షి

మకాం- శ్రీనగరు-కాశ్మీరస్టేటు.

---

## యీ నెలలో చందాలు చెల్లించినవారు

౧ శ్రీమాన్ ముంగమూరు శంకరయ్యగారు (శ్రీముఖ-భావ) ముంగమూరు (నె)

౨ ,, చావలి వెంకటసుబ్బయ్యగారు (శ్రీ-భావ) కాపవరం (కృ)

3 ,, మాచరి సత్యనారాయణగారు (యువ) మాచవరం (గో)

౪ ,, కొల్లిపర వెంకటశేషయ్య గురుకులుగారు (యువపోషక) అమ్మనబ్రోలు (గుం)

౫ ,, కురుచేటి సుబ్బరాయ గురుకులుగారు (యువపోషక) వుప్పుగుండూరు (గుం)

౬ ,, పొన్నూరు కామయ్యగారు (అనంతవరం) పదిరూపాయలు
౭ ,, అయలూరు కామేశ్వర గురుకులుగారు (యువ)
ముంజవరపుకొట్టు (గో)
౮ ,, అయలూరు నీలకంఠంగారు (యువ) ఖండివరం (విశా)

## ప్రతికౌసన్మానములు

| | | |
|---|---|---|
| ౧ శ్రీమాన్ | కొండపీటి వీరభద్రయ్యగారు వెలగపూడి | ౧-౦-౦ |
| ౨ ,, | చాగంటిపాటి శేషయ్యగారు తోటవల్లూరు | ౧-౦-౦ |
| ౩ ,, | సంగాపు వీరయ్య గురుకులుగారు నవులూరు | ౧-౦-౦ |
| ౪ ,, | కొల్లిపర లక్ష్మీనారాయణగారు పెనుమూలి | ౦-౮-౦ |
| ౫ ,, | నూతలపాటి భద్రయ్యగారు మర్రిపూడి | ౧-౦-౦ |
| ౬ ,, | మామిళ్లపల్లి గురుమూర్తిగారు ఆలపాడు | ౧-౦-౦ |

## శ్రీ ము ఖ ము.

శైవవిశిష్టాద్వైత మత ప్రవర్తకులగు నోయాదిశైవ సోదరులారా !

మేము షుమారు రెండు నెలల క్రితం బయలుదేరి బెంగుళూరు వగైరాలు పర్యటనము గావించి కాశ్మీరస్టేటునందలి శ్రీనగరునకు 16-5-35 తేది రాత్రి 8 ఘంటలకు ప్రవేశించియున్నాము. తదాది ఉపనిషద్భాష్య విషయమై పరికించుచున్నాము. ఈశ్వరానుగ్రహము వలన శ్రీకంఠాచార్యకృత ఉపనిషద్భాష్యము లభించినది. దానిని ఆంధ్రాక్షరములలో వ్రాయించుచున్నాము. షుమారు రెండు నెలలు పట్టునని తోచుచున్నది. యింకను అనేక శైవమత గ్రంథములు యున్నగునవి సేకరించుచున్నాము. యీ భాష్యగ్రంథములు ఆగమ సంహితలు యిచ్చట చెక్కుచెదరక నిలిచియున్నవి. కాశ్మీరామ్నా యము లని పిలువబడును. ప్రస్తుతము మాకు నిత్యకృత్యములకు

షుమారు రూ 300-0-0 లు గావలసియుండును. పరదేశవాసము బహు కష్టము గావున యీ శ్రీముఖము గమనించు వారందరు తమ తమ శక్త్యానుసారముగా సహాయ మొనరించి మమ్మును స్వదేశమునకు రప్పించగోరుచున్నాము. మిమ్ములను కష్టపెట్టినట్లు దలంచరాదు. ఈ భాగ్యమంతయు సంఘమునకేగాని మాకు లాభములేదు. ఈశ్వరానుగ్రహమువల్ల యిట్టి దుర్భర ప్రయత్నములు గన్గొనుచున్నాము. మిగతా విషయములు సమక్షమున దెలుపగలవారము. ద్రవ్యసహాయ మత్యవసరము. ద్రవ్యము త్వరగా శ్రీ ఆదిశైవ పత్రికా ఆఫీసునకు బంపగోరుచున్నాము. ఈ విషయములో అశ్రద్ధచేయక వాక్సహాయములతో సహాయపడగోరుచున్నాము. శ్రీ బోధానందమహర్షి.

☞ మహాశయులారా! శ్రీవారి పరిశ్రమ వర్ణనాతీతము. సర్వసంగపరిత్యాగులై మఠాధిపతులై జగద్గురు పీఠాధ్యక్షులైనను శ్రీవారికి గ్రంథ సంపాదనాభారము తప్పనందున స్వయముగా కృషి యొనరించి ప్రస్థానత్రయము పూర్తి చేయుచున్నారు. కాశ్మీరము చాలాదూరమున నున్నది. శీతవాతాతపముల బాధమెండు. యిట్టి స్థితిలో యింతవరకు రెండు వందలు పంపియున్నాము. వారి బృందమునకు గ్రంథసంపాదనకు యింకా మూడు వందలు కావలసియున్నవి. గనుక త్వరలో శ్రీవారికి బంపి గ్రంథము పూర్తిగా ఆంధ్రదేశమునకు రప్పించు భారము సాంఘికులపై గలదు. త్వరగా తమ తమ సహాయములను మాకు జేర్పప్రార్థించు చున్నాను. (పత్రికాధిపతి)

---

# వార్తలు.

బ్రిటీషు ప్రభుత్వమునకు ప్రధానమైన బెలూచిస్థానమున క్వెట్టా నగరమున 30—5—35 తేదీ రాత్రి 3గంటల (తెల్లవారుఝామున) వేళ రెండుగంటలకాలము భూమి కంపించి మేడలు గృహములు నేల మట్టమై నిద్రించుచున్న అరువదివేల మానవులు ఒక్కపెట్టున మృతి

జెందినట్లు వార్తలు దెలియుచున్నవి. యిట్టి విపత్తువలన క్వెట్టానగరము మట్టి దిబ్బమైపోయినది. గవర్నమెంటువారు ఆనగరములోనికి యెవ్వ రిని పోనిచ్చుటలేదు. గోడలక్రింద కొనయూపిరితో నున్నవారిని బయ టికిలాగి ఆస్పత్రులలో జేర్చుచున్నారు. చావగా మిగిలినవారికి అన్న వస్త్రములొసంగి యిల్లువాకిళ్ళు నేర్పాటుజేయుటకై వైస్రాయిగారు ఒక నిధిని ఏర్పాటుచేసినారు. యిప్పటికి పదహారు లక్షల రూప్యములు ఏర్పడియున్నవి కాంగ్రెసువారుగూడ నిధిని ప్రోగుచేసి సహాయమొనరించుచున్నారు. దైవబలమునకు మించినబలము లేదు. మానవులు తమ దుర్బలత్వమును దెలుసుకొనుట కిదియే తార్కా ణము. పాపము శమించుగాక.

*　　*　　*　　*　　*

దేవాదాయబోర్డువారి క్రొత్తఎలెక్షన్ జరిగినపిమ్మట నూతన కమీషనర్లు, ప్రెసిడెంటుగారు కార్యక్రమమున పాల్గొనిరి. కమిటీలకు 1—8—0ల కొరకు డిమేండునోటీసులు పంపుచున్నారు. బోర్డువారు 1—8—0ల కొరకు నోటీసులు పంపి పంపి విసుగుజనించి కలెక్టరకు ట్రాన్సుఫరుచేసి రివిన్యూద్వారా రాబట్టుకొనవలెనని ప్రయత్నించిరి. గాని అదియు వ్యర్థమైపోయెను. అర్చకులు కలెక్టరుగార్కి సమాధాన ములు బంపుటచే న్యాయాధికారులగు జిల్లాయధికారులు బోర్డువారికి దెలియపర్చియున్నారు. ఇట్టి స్థితిలో కమిటీలవారు అర్చకులను వేధిం చుట బాగుండలేదు. జబాబులుయిస్తే బుట్టదాఖలు చేస్తున్నారు. వ్యాజ్యములువేసి తీర్పులుబొందినను వారి అల్లరి మానుటలేదు. వ్యాజ్యపర్యవసానమువరకు ఆగుటలేదు. లెఖ్ఖలలో పొరబాట్లున్న వనియు సరిచేసుకొన్నమీదట కంట్రిబ్యూషన్ చెల్లించగలమన్నను వినుటలేదు. సూపర్వైజరుగారి నోటీసులు ఇనస్పెక్టరుగారి సంచారము కమిటీవారి హడావుడి బోర్డువారి అధికారము, కోర్టుల తీర్పులు ప్లీడర్ల వాదములు అర్చకుల రోదనములు ధర్మకర్తల యాక్రందనములు ప్రజలహృదయములు సర్వము భగవంతుడే

పరిపాలించవలెనేగాని మెవరివల్లను దీరేటట్టులేదు. ఏల యింతటి విచిత్రము సంభవించెనో దెలియుటలేదు. గవర్నమెంటువారి కత్తికి ఎదురు కత్తి లేదే. ఒక్కపెట్టున యీ రాజధానియందలి దేవాలయములు స్వాధీనపరచుకొనుటయో, లేక అర్చకుల భూములకు పన్నువిధించుటయో, లేక వాటిని లాగుకొని శేరీ శిస్తువిధించుటయో ఏదోయొక నిర్ణయముచేయక షుమారు పదిసంవత్సరాలనుంచి యీ విచిత్రనాటకము ప్రదర్శింపబడుటవలన హాస్యాస్పదమై అలక్ష్యమునకు తావగుచున్నది. గావున యీ సంవత్సరము శ్రీగవర్నమెంటువారు సరియైన విచారణ జరిపించి అర్చకుల హక్కులను దేవాలయ సంరక్షణయు పరిశీలించి సక్రమ మార్గము నెలకొల్పుటకు పరమేశ్వరుని ధ్యానించుచున్నాము. హైందవమతమంతయు దేవాలయములపై ఆధారపడియున్నదని దెలుసుకోవలెను.

---

# స్వీకృతి-విమర్శనలు

## వీరశైవరత్నము

పండిత కాశీనాధశాస్త్రిలవారిచే రచియింపబడిన కాశీనాధ గ్రంధమాల యందలిత్రయోదశపుష్పము విజయనగరవాస్తవ్యులు శ్రీయుతులు బిక్కవలి స్వామిగారిచే మా ఆఫీసునకు బంపబడినందున సదరు గ్రంధమును పూర్తిగా పరిశీలించి యానందించితిమి. వీరశైవులయిన లింగధారుల సాంప్రదాయము పూర్వపుపరిస్థితులు మఠములు మున్నగు సర్వవిషయములు విపులముగా చర్చించబడియున్నది. వీరశైవమతస్తులకిది మహోపకారిగా నున్నది. వెల 0-8-0లు మాత్రమే వలయువారు పంచాచార్య ప్రభాఆఫీసు మైసూరు.

## భక్తిసంజీవనీ

భగవదంశ సంభూతులును ఆంధ్రవాల్మీకేత్యాది బిరుదాంకితులును సుప్రసిద్ధపండితులును వాసుదాసను మహాభక్తశిఖామణియు

నగు శ్రీయుతులు వావిలికొలను సుబ్బారావుగారి యాధిపత్యమున వెలువడుచున్న పై పత్రికా రాజమును వందనపురస్సరముగా ప్రతిమాసము నందుకొని యందలి మహోపదేశములను తనివిదీర పఠించి యానందించి తరించుచున్నాము. శ్రీ వారు గావించుచున్న బోధలు భక్తసమాజములు మున్నగునవి దేశీయులకు చిరపరచితమై యున్నందున విశేషించి వ్రాయనవసరముండ నేరదు. చందా 2-0-0లు వలయువారు శ్రీరామజయమందిరం నె 21 రు రాజా హనుమంతలాలా వీథి, తిరువళ్ళిక్కేణి మదరాసు.

ప్రభ

మచిలీపట్టణమునుండి శ్రీ యుతులు గద్దె లింగయ్యగారి సంపాదక కత్వమున వెలువడుచున్న మాసపత్రిక ఆరంభమునుంచి మా కార్యాలయ మలంకరించుచున్నది. అందలి విషయములు రసవత్తరములై ఆనందమును గలిగించుచు దేశోపకార మొనరించుటకు తగి యున్నవి. విడిసంచిక 0-1-6 వలయువారు సంపాదకులకు వ్రాయవలెను.

చంద్రిక

మదరాసునుండి సర్వాంగ సుందరముగా ప్రతిమాసము వెలువడు చున్నది. సంపాదకులు శ్రేష్ఠమైన కృషియొనర్చి సచిత్రముగా నడపుట శ్లాఘనీయము. సర్వులు పరిశీలించుట ముఖ్యము. సంవత్సర చందా 3-0-0 లు మాత్రమే వలయువారు మానేజరు చంద్రికా ఆఫీసు లోన్ స్క్వేర్ మదరాసు అని వ్రాయవలెను. (సశేషము)

# దేవాదాయపు బోర్డువారి కార్యక్రమ వివరం

1. ప్రెసిడెంటు—ఏ. కొండప్పగారు గుంటూరు - నెల్లూరు-కడప-బళ్ళారి-అనంతపురం-కర్నూలు-చిత్తూరు-నీలగిరి జిల్లాలు వీరి స్వాధీనములో నుండును.
2. డి. కృష్ణమూర్తిగారు—ప్రథమ కమీషనర్ గంజాం-విశాఖపట్ణం-తూర్పు, పశ్చిమ గోదావర్లు-కృష్ణా జిల్లాలు.
3. ఇ. వి. సుందరరెడ్డిగారు—ద్వితీయ కమీషనర్ తిరుచునాపల్లి-మధుర-రామనాధపురం-తిరునెల్వేలి జిల్లాలు.
4. టి. జి. శృంగారవేలుగారు—తృతీయ కమీషనర్ చంగల్పట్టు-దక్షిణ, ఉత్తర ఆర్కాట్లు-తంజావూరు జిల్లాలు.
5. ........................చతుర్థ కమీషనర్ సేలం-కోయంబత్తూరు-మలబారు-దక్షిణకనరా జిల్లాలు.

పై విధముగా వీరు సంచారముచేసి, ఆయా దేవాలయముల పరిశీలించిలోకసంరక్షణ గావింతురని దెలుపుటకు సంతసించుచుచున్నాము.

శ్రీబోర్డు కార్యనిర్వాహకవర్గమువారు ఆయురారోగ్యైశ్వర్యవంతులై పరిపాలనగావించుటకు పరమేశ్వరుని ధ్యానించుచున్నాము.

ఇట్లు,
ఆదిశైవ మహాజనసంఘము.

---

## భక్తియోగము

(గతసంచిక తరువాయి)

ఆంధ్రవ్యాసనిపుణ అవ్వారి సుబ్రహ్మణ్యశర్మగారు, వంగిపురము.
అఖిలాంధ్రదేశీయ పండిత పరిషత్సభ్యులు.

ఇఁక నిర్గుణ భక్తులఁగాంచిన, భక్తులసంరక్షణార్థమై యొకానొకప్పుడు పరమేశ్వరుఁడు లీలామానుష దేహుఁడై జన్మించి దుష్ట

శిష్టణ శిష్టరక్షణములాచరించి యవతారము చాలించును. ఇంతమాత్ర ముచేతనే దేవాదిదేవుఁడీ మానిసియేయని తలఁచుట వెఱ్ఱితనమనియు, నట్లుతలంచుట భగవత్తత్వముఁ గ్రహింపఁజాలక పోవుటయేయనియు తలఁతురు. సృష్టిస్థితిలయకారణ స్వరూపుఁడైనవాఁడే భగవంతుఁ డనియు, సర్వదిక్కు లనున్నవాఁడే విష్ణువనియు, త్రిమూర్త్యాత్మక స్వరూపుఁడైనవాఁడే జ్యోతిర్మయ లింగస్వరూపుఁడగు నారాయణ మూర్తియనియు, ప్రకృతిపురుషుల కవినాభావసంబంధముఁ గలదనియు జెప్పుచు, ప్రప్రధమమున విగ్రహారాధనము యక్షరాభ్యాసమువలె లక్ష్యశుద్ధి నిలుపుట కనుకూలంబనియు, నాపైని యనఁగాలక్ష్యము కుదిరిన తరువాత నామూర్తిని సర్వలోకాధ్యక్షునిగా హృత్కమలము నని లిపిభజించిన, నిర్గుణయుపాసన యలవడియోగియై, తదుపరి పరమ హంసయై, సాలోక్య సామీప్య సాయుజ్యసారూప్యములుఁ గలుగు ననియుఁ జెప్పుదురు. నిర్గుణోపాసకులలోఁ గొందరు పై విధమునఁ జెప్పక సర్వము మిథ్య, నీవుమిథ్య; నేనుమిథ్య, అసలీ ప్రపంచమే శూన్యము. ఆకాశమెటుల నిరాకారమై శూన్యముఁ గన్పట్టుచున్న యదో, యటులే నీ యఖిల ప్రపంచము, జీవరాసులన్నియు శూన్య ములు: అని చెప్పుచుందురు. ఈ రెండవతరగతి నిర్గుణోపాసకుల వలన ప్రపంచమునందెన్ని హేయకార్యములు జరుగుచున్నవో లెక్క లేదు. నేను వర్ణింపనురాదు. కాని, వితంతువులకీ శూన్యవాదతత్వ ముందెలియునని మాత్రము చెప్పగలను. శూన్యవాదులు వీరితో గల సిన వితంతువులు యభినవసృష్టికర్తలుగా మారుచున్నారనియుఁ జెప్ప గలను. పై యుత్తెఱంగుల భక్తులఁగూర్చి విపులముగా ముందు ముందు సందర్భానుసారముగా వ్రాయగలను.

శ్రీ పరమేశ్వరుండు నిరుపమాన ప్రజ్ఞావంతుఁడని, ఘటనాఘ టన సమర్థుఁడని, సర్వసాక్షియని, సర్వాంతర్యామియని, సచ్చిదా నంద పరబ్రహ్మమని, అద్వితీయుఁడని, అనిత్యుఁడని, నిత్యుఁడని, అంగుష్ఠపరిమాణదేహుఁడని విశ్వమంతనిండియున్నవాఁడని వేదములు

మొదలుకొని చిట్టిబొట్టి కల్పనాకథల వలెఁగాఁ జాటిచెప్పుచున్నయవి. పెద్దలును, పరమేశ్వరుని యజుఁడని, అమృతమూర్తియని, తేజో రూపుఁడని, ఆనందమయుఁడని సర్వశబ్దవాచ్యుఁడని, అణువులలో నణువని యెత్తెలెత్తి చాటిచెప్పిరి. ఉపనిషత్తులు స్థావరజంగమాత్మక ప్రపంచమంతయుఁ బరమాత్మరూపమేయని బోధించును. సర్వశబ్దము లాపరబ్రహ్మమునకే చెల్లును. ఆద్యంతములు లేక నిర్గుణమై యెల్లచో టుల ప్రకాశించి రూపవంతము లేని యాబ్రహ్మమునకే చెల్లును. ఏ కాలమునందైనను నిర్గుణస్వరూపుఁడగు నారాయణుఁడే పనిచేయ నున్నను సాకారుండై ప్రకృతిఁగూడి సేయనున్న కార్య మవలీలఁ జేసి యంతర్హితుఁ డగుచుండును. నారాయణమూర్తి ప్రకృతిలేనిది, నేకార్య మును చేయలేడు, ప్రకృతియున్న నే, పురుషుడుండు నది ప్రకృతి పురు షుల కవి నాభావసంబంధముం గలదని శ్రీకృష్ణభగవానుఁడు

"ప్రకృతిం పురుషం చైవ విద్ధ్యనాదీ ఉభావపి,

వికారాంశ్చగుణాంశ్చైవ విద్ధి ప్రకృతిసంభవాన్" (త-౧3అధ్యా) అని తెలిపియున్నాడు.' (సశేషము)

---

# కడపటి వార్తలు

శ్రీ శ్రీకంఠ శివాచార్యస్వాములవారు కాశ్మీరదేశమునుండి మదరాసునకు 27-6-35 తేదీన చేరిరి. మదరాసు ప్రముఖులలో కొందరు శ్రీవారికి నాల్గు టెలిగ్రాములు అత్యవసరముగా పంపినందున భక్తుల యిష్టానుసారముగా మదరాసునకు దయచేసియున్నారు. శ్రీ వారి కాశ్మీరప్రచారమువలన శ్రీకంఠాచార్యకృత ఉపనిషద్భాష్యము పూర్తిగా లభించినటుల దెలియుచున్నది. దానిని ఆంధ్రాక్షర ఆంధ్ర తాత్పర్యములతో ప్రకటింప యత్నించుచున్నారని దెలుపుటకు సంత సించుచున్నాము. శ్రీవారి కృషినిగురించి బ్రహ్మానంద మొందని సాంఘి

కుడు లేడని నిక్కముగా వచించునటుల వర్తించుట శ్రేయస్కరమై యుండును.

♦ ♦ ♦ ♦ ♦

దేవాదాయపు బోర్డువారు ప్రభుత్వమువారివద్ద అప్పు పుచ్చుకున్న 7 లక్షలపై చిల్లరబాకీకిగాను వడ్డీలేకుండా నలభై వాయిదాల (ఆరునెలలకొకతూరి) మీద సదరు మొత్తం చెల్లించగలందులకు గవర్నమెంటువారు అంగీకరించుట బోర్డువారి దురదృష్టములో కొంత మేలని సంతసించనివారుండరు. కంట్రిబ్యూషను సొమ్మును వసూలు చేసికొనుటలో వారు బడెడిపాట్లు వర్ణనాతీతమై లోకములో ప్రకాశించుట గొప్ప యదృష్టమనక తప్పదు.

♦ ♦ ♦ ♦ ♦

గుంటూరు జిల్లాబోర్డును రెండుభాగములుగా విభజించుటవలన రెండుబోర్డులు ఏర్పడినవి. మొదటిబోర్డునందు గుంటూరు, తెనాలి, రేపల్లె, సత్తెనపల్లి తాలూకాలు చేరినవి. రెండవబోర్డునందు బాపట్ల, వంగవోలు, పల్నాడు, నర్సారావుపేట, వినుకొండ తాలూకాలు చేరినవి. జస్టీసుపార్టీవారి పలుకుబడి యికనైనను దినదినాభివృద్ధి జెందగలదని యెవరు సాహసించి పలుకగలరో తెలియదు.

♦ ♦ ♦ ♦ ♦

మహాప్రవాహముగానుండి వరదలు రాగలిగెడి యీరోజులలో వేసవికాలముకన్న హీనముగా కృష్ణానదిలో నీరు లేకపోయినందులకు తత్పరిసరప్రాంతీయులు మిగుల భీతిల్లుచున్నారనియు మాగానీ పైరులు యింతవరకు ఆరంభింపకపోవుటకు వర్షాటంకమే ప్రధానమైయున్నదనియు పరమేశ్వరుడు త్వరలో వర్షమును ప్రసాదింపనియెడల ధాతకరువు నిశ్చయముగా రాగలదని వాదించువారుకూడ కలరని నమ్మవలసి వచ్చుచున్నది. గవర్నమెంటువారి శిస్తులగతి తదనంతర కర్తవ్యమై యుండక తప్ప దేమోనని తలంచుట పొరపాటెప్పుడును గాదు.

---

# అందుకున్నాం.

బెజవాడనుండి నూతనముగా వెలువడుచున్న "దేవాలయ ప్రతిభ" యను మాసపత్రిక ప్రథమసంచికను నమస్కార పురస్సరముగా నందుకొని యందలి యమూల్య వ్యాసరాజములను పఠించి యానందించితిమి. సర్వసమర్థులును, అర్చకసంఘ శ్రేయోభిలాషులును సర్వమతోద్ధారకులు నగు శ్రీమాన్ వేదాంతం శ్రీనివాసాచార్యవర్యులవారి గాడాభిమానము పాఠకు లెరింగియుండుట చే విశేషముగా వ్రాయనవసరము లేదయ్యె. యిందలి విషయములు దేవాలయప్రతిభను ప్రకాశింప జేయుచున్నవి. భక్తజనాగ్రగణ్యులును ముఖ్యముగా అర్చకమహాజనములును, సనాతన ధర్మానుయాయులును యీ పత్రికను పరిశీలించుట ముఖ్యమని హెచ్చరించుచున్నాము భగవదనుగ్రహమున నీపత్రిక తనప్రతిభను దినదినాభివృద్ధితో లోకమున ప్రకాశింపజేయ గలదని నిండువిశ్వాసముతోనున్నారము. సంవత్సర చందా రూ2-0-0. వలయువారు:—(గాంధినగరం) బెజవాడలో సంపాదకులపేర వ్రాసుకోవలెను.

---

# భక్తహృదయము.

గుంటూరుజిల్లా పొన్నూరుపోస్టుయిలాకా దొప్పలపూడి గ్రామవాసియు ఆదిశైవకులోద్భవుడును భక్తజన సేవితుండునునగుచి॥పొన్నూరు బాపయ్యచే శ్రీమల్లేశ్వరున కంకితమిడిన సీసమాలికా స్తవముగల చిన్ని గ్రంథమునుస్వీకరించి యానందించితిమి. యిందనేక పురాణగాధలు గలవు. అష్టోత్తర శతపుష్పములతో యీస్తోత్రమాలను పరమేశ్వరున కలంకరించిన గ్రంథకర్తను ఆశీర్వదించుచూ మా యానందమును వెలువరించుచున్నాము

వలయువారు గ్రంథకర్తకువ్రాసిన బడయగలరు.

---

# శ్రీ నవ్యులతోట పత్రికాధిపతిగారికి

## బహిరంగలేఖ.

మహాశయా! తమరు సదుద్దేశ్యముతో, పత్రికను స్థాపించితిరి. సంతసము. పత్రిక బహుళవ్యాప్తినందవలెనన్న పలుకుబడి యావశ్యకము. అట్టి పలుకుబడి, మీవద్ద పూజ్యము. తమ 1934 సెప్టెంబరు సంచికలోని "పజిలు"ను పూరించిన వారిలో నేనొకడను. అందులకు రు 1-8-0 బహుమాన మీయబడునని నవంబరు సంచికయందు ప్రకటించితిరి. పాపము! యెట్టి కష్టపరంపరలకు లోనైతిరోగాని యింతవరకు, రు 1-8-0 పంపుటకు తమకు శక్తి చాలదయ్యెను. మీరేమి చేయగలరు? విధికృతము. పాపము తామెట్టి యుద్దేశమును వహించియుండిరో గాని దైవము మాత్రము చిన్నచూపు చూచెను. పక్షపత్రిక మూలబడి మరల తెప్పించుకొని మాసపత్రికయైనది. కనుపించినదా! లోకులసొమ్ము మెగవేసినందులకు ప్రతిఫలము. ఇంత ఆశ మీకేల? ప్రవేశరుసుముల దిగమ్రింగుటకే "పజిలు"ను ప్రకటించితిరి గాబోలు! ఒకటికి రెండు మూడు పర్యాయము లుత్తరములు వ్రాసితినే! రిజిష్టరు నోటీసిచ్చినను తీసుకొని యూరకుంటిరే! పత్రికైనా పంపగూడదా? ధనాభావము తటస్థించిన మీబోంట్లెందరిట్లు చేయుచుండుటలేదు? యిటువంటివారికి పత్రికానిర్వాహణము మాత్రము సాధ్యమని తలంపవీలులేదు. సందైన మెగవేయ ప్రయత్నించు నిట్టి పత్రికాధిపతులు దేశమునకు చేయునదేమి? పత్రికలు మాత్రము దేశమును పీడించుకొని బ్రతుకు కాకులవలె నిష్ప్రయోజనమేగదా! మీదుమిక్కిలిట్టి దరిద్రంపుగొట్టు పత్రికలవల్ల యెంతో హాని యేర్పడుచున్నది. "సోలెడు గింజలు ఆదా చేయబోవ తవ్వెడు గింజల దూడతినినట్లు" జరుగక పోదు. యిందులకు పక్షపత్రిక మాసపత్రిక యగుటయే నిదర్శనము. యిట్టి మీచేతులవల్ల పత్రికలు వృద్ధిలోనికి రాగలవా? యిక

నైన తాము తమ తప్పిదమును గ్రహించి దారికివచ్చెదరని నమ్ముచున్న
మీనిరంతర శ్రేయోభిలాషి,

(పై లేఖకు మాజబాబుదారీ లేదు.)

సంపాదకుడు.

వంగిపురము.
19-6-1935.

సందెపూడి నరసింహారావు,

## గమనింపు.



నాయనలారా! రెండుమాసముల కొకతూరి మాసపత్రికను ప్రకటింపరాదని గవర్నమెంటువారి ఆర్డరువచ్చినది. గావున ప్రతిమాసం (30 రోజులలో) మాసపత్రిక వెలువడవలసియున్నది. యింతటనుంచి ప్రతిమాసం పత్రిక వెలువడునట్లు తాము సహాయ మొనరింపక తప్పదు. లేకున్న పత్రిక నిలచిపోవును. రెండు మాసముల కొకతూరి ప్రకటన చేయవీలు లేదు. చందాదార్లను జేర్పించియు దిగుబాటు ద్రవ్యము తమ యిష్టానుసారముగానైనను బంపి మా ప్రయత్నమును సఫలీకృత మొనరింప సాంఘికులను ప్రార్థించుచున్నాము. చందాదారుల సంఖ్య (500) వృద్ధియైనచో చందా తగ్గించుటకు ఆలోచింపబడును. ఉత్సాహముజూపి సంఘాభివృద్ధికై ప్రయత్నించుట శ్రేయస్కరము.

(సంపాదకుడు)

సం॥ చందా రు 1-8-0 లు. Regd. No. M. 207.

# శ్రీ ఆదిశైవపత్రిక.

శ్రీ శ్రీకంఠ మఠాధిపతుల యాజ్ఞానుసారముగా శైవ
సంఘాభ్యుదయమునకై శ్రీ గురుకులాశ్రమమునుండి
ప్రతిమాసము ప్రకటింపబడును.

సర్వదేవాత్మకో రుద్రస్సర్వే దేవాశ్శివాత్మకాః ।
రుద్రస్య దక్షిణేపార్శ్వే రవిర్బ్రహ్మ త్రయోగ్నయః ।
వామపార్శ్వే ఉమాదేవి విష్ణుస్సోమోపి తేత్రయః ॥
(రుద్రహృదయోపనిషత్)

సంపాదకుడు:— చిలుమూరు పురుషోత్తమ గురుక్కళ్.

సంపుట ౧౧ { చిలుమూరు, పోష్టు / యువనామ సం॥ర శ్రావణ-భాద్రపద మాసములు. } సంచిక ౫-౬

[విలేఖకుల వ్యాసములకు సంపాదకులు ఉత్తరవాదులు కానేరరు.]



—♦ విషయసూచిక ♦—



భారతీ ముద్రాక్షరశాల, తెనాలి.

# ఉద్ధారకులు

౧ కీ॥ శే॥ చిలుమూరు తీర్థేశ్వరులవారి జ్ఞాపకార్థం కుమాళ్లు ఉమామహేశ్వరం వగైరాలు, చిలుమూరు.

౨ కర్ణాటక రాష్ట్రీయ ఆదిశైవ మహాసంఘమువారు, బెంగుళూరు.

౩ శ్రీమాన్ నడింపల్లి నాగేశ్వరశివాచార్యులవారు, ఇంటూరు.

౪ ... గూడూరు రాఘవరావుగారు, పోతునూరు.

౫ ... గూడూరు శీతయ్యగారు, శనివారపుపేట.

౬ ... అయలూరు వెంకటసుబ్బయ్యగారు, అర్తమూరు.

౭ ... పావులూరు రామచంద్రయ్యగారు, మునికోటిపురం.

౮ ... పావులూరు హనుమంతయ్యగారు, మునికోటిపురం.

౯ ... పెనుమూడి సత్యనారాయణగారు, కూచిపూడి.

౧౦ ... [illegible] వెంకటశివావధానులుగారు, బూతుమల్లి.

౧౧ ... పావులూరు నాగేశ్వరశర్మగారు, అనంతపురం.

౧౨ ... పెనుమూడి హనుమంతరావుగారు, తెనాలి.

౧౩ ... మామిళ్ళపల్లి శంకరమ్మగారి జ్ఞాపకార్థం భర్త శివరామదీక్షితులుగారు, చుండూరు.

౧౪ ... మామిళ్ళపల్లి సాంబయ్యగారు, చుండూరు.

౧౫ ... పొన్నూరు సుబ్రహ్మణ్య పాకయాజిగారు, [illegible]మూడి.

౧౬ ... మేడూరి శివయ్యగారు, తేలప్రోలు.

౧౭ ... కుందుర్తి ఆనందరావుగారు, బి. ఏ., దుగ్గిరాల.

౧౮ ... పార్వతమ్మగారి జ్ఞాపకార్థం సత్తెనపల్లి వెంకటరామయ్యగారు, ఓవర్‌శీయరు, దుగ్గిరాల.

౧౯ ... చావలి గంగయ్యగారి జ్ఞాపకార్థం కుమాళ్లు సుబ్బయ్య వగైరాలు, చేముడుపాడు.

౨౦ ... సంగాపు పానకాలయ్యగారి జ్ఞాపకార్థం కుమాళ్లు వీరయ్య గురుకులు వగైరాలు, నవులూరు.

౨౧ ... సంగాపు కోటీశ్వర గురుకులుగారు, మంగళగిరి.

౨౨ ... చిలుమూరు వెంకటసుబ్బయ్యగారు, చిలుమూరు.

౨౩ ... చిలుమూరు కుటుంబయ్యగారు, చిలుమూరు.

౨౪ ... శేకూరు రాఘవశర్మగారు, గుడివాడ.

౨౫ ... చావలి సుబ్బయ్య పంతయ్యగార్లు, పినపాడు.

౨౬ ... చావలి లక్ష్మీకాంతయ్యగారు, బాపట్ల.

౨౭ ... కొల్లిపర రామయ్య, పిచ్చయ్యగార్లు, పెనుమూలి.

౨౮ ... స్వర్ణ చినమల్లయ్యగారి జ్ఞాపకార్థం ధర్మపత్ని బుచ్చమ్మగారు, చీరాల.

౨౯ ... పెనుమూడి సీతమ్మగారు, జొన్నలగడ్డ.

౩౦ ... పసుమర్తి పార్వతమ్మగారు, కూచిపూడి.

# శ్రీ ఆదిశైవపత్రిక.

సపకోరుద్రస్స ఈశానస్స భగవాన్ సమహేశ్వరస్స మహాదేవః॥
"అథర్వశిరసి."


| సంపుట ౧౧ | చిలుమూరు<br>యువనామ సం॥ర శ్రావణ-భాద్రపద మాసములు. | సంచిక ౫-౬ |
| --- | --- | --- |


## ప్రార్థన.

(శ్రీమాన్. పూజ్యం విశ్వనాథశాస్త్రిగారు)

(శ్రీకంఠమతం)

శ్లో॥ అంభోధిస్థలతాం జలధితాం ధూళీలవశ్శైలతాం।
మేరుర్మృత్కణతాం తృణం కులిశతాం వజ్రం తృణప్రాయతాం।
వహ్నిశ్శీతలతాం హిమం దహనతామాయాతియ స్యేచ్ఛయా।
లీలా దుర్లలితాద్భుతవ్య సనినేదేవాయతస్మైనమః॥

---

## దుష్టకవి.

(శ్రీయుతులు బుడమగుంట వెంకట సుబ్రహ్మణ్యంగారు)

శా॥ కవిరాజా నినుబోలునిర్దయుని నెక్కాలంబునఁగాన మెం
దులకోనీవుకసాయిబుద్ధి మముగొంతుల్ గోయగా లేక క
క్షుల మాలోన రగుల్పజేసి పర హస్తాలందు, మావంశహ
క్కుల జిక్కించి, దురంత తాపములఁ మాకుంగూర్చినావక్కటా॥.

---

# శ్రీ శ్రీ కంఠ శివాచార్య ప్రతిష్ఠ

గుంటూరు మండలాంతర్గత నందీశ్వరక్షేత్రో పరినామక్. "నంది వెలుగు" గ్రామమునందు, శైవభక్త సమాజమువారి ప్రోత్సాహముతో శ్రీ శ్రీకంఠ యోగిప్రబోధముతో, ఉత్తరాయణ మహాపర్వణి దినములలో, ఆచార్యప్రతిష్ట జరుగగలదని దెలుపుటకు బ్రహ్మానంద మొందుచున్నాము. కార్యక్రమమంతయు మున్ముందు దెలుపగలము. (ఆది శైవసభవారు నందివెలుగు)

---

# సంపాదకీయములు

## స్వవిషయము

పత్రికాప్రచారమునకంటే ప్రబోధ మొనరించెడి సాధనమరియొకటి లేదని సర్వులు తెలుసుకొనుటమంచిది. అందులకే పదునొకండువత్సరములనుంచి మేముపలుశ్రమలకోర్చి పత్రికంతరాయము గలుగనీయక వెలువరించుచున్నాము. నవనాగరికతావ్యామోహాముగు నీకాలమున మన పత్రిక జనాకర్షణీయముగా లేదని మేమును తెలిసికొనియున్నను ద్రవ్యాభావముచే మిన్నకుండక తప్పదయ్యె. ధనవంతులసహాయము, పండితుల యాదరణ, సాంఘికులయభిమానము చాలతక్కువయగుటచే కులపత్రికయిట్లు సంకటములచిక్కుకొనవలసివచ్చెను. సర్వులుయభిమానించి లోగడదిగుబాటు ద్రవ్యమైనను (షుమారు రెండువేలు) మాకొసంగినచో, సంతోషదాయకముగా పత్రిక వెలువడగలదు. లేనిచో బహుబీద అరపులతో, వ్యాధిగ్రస్తమగు జీవచ్ఛవమువలె యిల్లే, మీకు యిష్టములేకున్నను మీగృహములకుజేరి, మీకు ఆనందముగల్గించుటకు బదులు విచారమైనను గల్గించుచుండగలదు. (కొందరు యీపత్రికను కన్నులతో జూచుటకైనను యిష్టపడుటలేదనే అపఖ్యాతి)

## శ్రీస్వాములవారు.

జగద్గురు శ్రీకంఠ శివాచార్య మహర్షులవారు, మదరాసునుండి గుంటూరుమండలమునందు పర్యటనమొనరించుచున్నారు. శ్రీవారు కాశ్మీరమునకేగి (ఉపనిషద్భాష్యము) శ్రీకంఠవిరచితమగు భాష్యమును సమగ్రముగా సంపాదించి, ఆంధ్రాక్షరములతో ప్రతిని వ్రాయించి యున్నారు. త్వరలో ముద్రణ ప్రయత్నములొనరింపగలరు. శ్రీవారు, సంఘోద్ధరణకై యవతరించిన పరశివమూర్తులని సాంఘికులకు విశేషించి ప్రభోధచేయుట చర్వితచర్వణమైయుండును. శ్రీవారు సమస్తదేశములలో శైవమత ప్రచారముగావించి స్వమతోద్ధరణ గావించుట సాంఘికులయదృష్టమైయున్నదని బ్రహ్మానందముగా విన్నవించుచున్నాము.

## కృతజ్ఞత

యీసంచికకై సహాయమొనరించిన మహానుభావులను ప్రతికా సన్మానము లొనరించిన ఉదారులను మాహృదయపూర్వకముగా నభినందించుచూ మాకృతజ్ఞతను వెలువరించుచున్నాము. ఏసహాయము లేక, మాశ్రమను స్మరింపక మాకు ప్రత్యుపకారముచేయక పత్రికను గైకొనుచున్న మహానుభావుల యందుగూడ కృతజ్ఞులమైయున్నాము. దిగుబాటుగావించినసోదరులుగూడ పత్రికను స్వీకరించుటయే, మాకానందదాయకమైయున్నదని విన్నవించుచున్నాము.

## సంతోషవార్త

శ్రీపోస్టల్ గవర్నమెంటువారు మాప్రార్థన యాలకించి, మాగ్రామములో, బ్రాంచిపోస్టాఫీసును (1-9-35 స్థాపించి) రెండుమూడు గ్రామముల ప్రజలయిష్టానుసారముగా, పోస్టుమాష్టర్ పదవినిగూడ, శ్రీ ఆదిశైవపత్రికాసంపాదకులకే యొసంగియున్నారని దెలుపుటకానందించుచున్నాము.

బోధాయనసూత్రము

స్వసూత్రమగు, బోధాయన, పూర్వాపరములు, త్వరలో అచ్చువేయుంచుటముఖ్యమనియు తద్గ్రంథములద్వారా విశేషప్రచారము కాగలదనియు, పలువురు మాకువ్రాయుచున్నారు. ద్రవ్యాభావముచే మిన్నకుండవలసి వచ్చెననియు, అభిమానులెవరైనా తత్ప్రయత్నము సంకల్పించినచో, వారికి మాశక్త్యానుసారము సహాయమొనరించి, గ్రంథముద్రణకు విశేషముగా సహాయపడగలమని మాత్రమే విన్నవించుకొనుచున్నాము. మాకువ్రాసిన మహాశయుల కందరికిని పత్రికాముఖమున మావుద్దేశ్యము తెలుపబడినందునక్షమింప ప్రార్థితులు.

---

## యీనెలలో చందాలు చెల్లించినవారు.

౧ బాదంపూడి వెంకటరత్నం గారు (యువ) రామవరము (గో)
౨ బిక్కావలి స్వామిగారు (యువ) విజయనగరము (వి)
3 కొండవీటి శ్రీశైలంగారు (యువ) కొలూరు (కృ)
౪ పోగుల వీరభద్రయ్యగారు (భవ-యువ) తుర్లపాడు (గుం)
౫ తులగాపు నరసింహంగారు (యువ) విజయనగరము (వి)
౬ కొండవీటి శేషయ్యగారు (భవ) మందడం (గుం)
౭ చావలి వాలయ్యగారు (భవ-యువ) చావలి (గుం)
౮ చావలి చంద్రయ్యగారు (భవ) పెరవలి (గుం)
౯ అర్చకం కాళప్పదీక్షితులుగారు (భవ-యువ)గూఛూరు (బెం)
౧౦ పోగుల శివానందంగారు (భవ) వల్లభరావుపాలెం (గుం)
౧౧ నాగేశ్వరంసుందరశర్మగారు (యువరాజపోషకచందా) శృంగారపురం (గుం)
౧౨ వడ్లమూడికోటయ్య గురుకులుగారు (యువ) మహారాజపోషక్ వడ్లమూడి (గుం)
౧3 ఆగమిక కైలాస సుందరశర్మగారు (యువ) పల్లపట్టు (చి)

---

# పత్రికా సన్మానములు.

౧ గుంటూరుజిల్లా చుండూరు వాస్తవ్యులు మామిళ్లపల్లి కోటయ్యగారి జ్ఞాపకార్థం పత్రికాసన్మానం (మా॥ శి॥ రా॥ ద్వారా) ౧—౦—౦

౨ అనంతవరం గ్రామ కాపరస్తురాలు శ్రీమతి కీ॥ శే॥ పావులూరు శేషమ్మ గారి జ్ఞాపకార్థం పత్రికాసన్మానం (సం) ౫—౦—౦

3 తుర్లపాడు గ్రామకాపర స్తవ్యులు శ్రీయుతులు పోగుల వీరభద్రయ్య గారి కుమార్తె రాఘవమ్మ జ్ఞాపకార్థం పత్రికాసన్మానం (చి॥ కు॥ ద్వారా ౨—౦—౦

౪ చముడుబాడు గ్రామ వాస్తవ్యులు శ్రీయుతులు చావలిసుబ్బయ్య దీక్షితులుగారు గృహప్రవేశ మహోత్సవ తరుణమున పత్రికా సన్మానం నిమిత్తం ౨—౦—౦

## దేవాలయ ప్రతిభ

ప్రస్తుత సందిగ్ధవిషయములు చర్చించుచూ, దేవాలయ పూర్వోత్కృష్టతల వెలువరించు మాసపత్రిక, సర్వులును పఠింపదగినటుల సర్వాంగ సుందరముగా నున్నది. సంవత్సర చందా 2-0-0 రు సంపాదకులు దేవాలయప్రతిభ, గాంధినగర్ బెజవాడ, అని వ్రాయవలెను.

## స్వీకృతి-ప్రకటనలు

మహాలక్ష్మీశతకము

తెనాలితాలూకా, పెరవలి వాస్తవ్యులు సుప్రసిద్ధకవితా శిరోమణులునగు శ్రీయుతులు గూడకృష్ణకవిగారిచే, చందలూరుపుర మహాలక్ష్మీదేవతపై వ్రాయబడిన శతకము మాకార్యాలయ మలంకరించినది.

భక్తులు పఠించితరించుటకు సులభశైలిని వ్రాయబడిన, గ్రంథకర్తగారి నభినందించుచున్నాము. వలయువారు గ్రంథకర్తగారికి వ్రాయవలెను.

---

# భక్తియోగము

(గతసంచిక తరువాయి)

కొందరు ప్రకృతి పురుషులకవినాభావ సంభంధమున్నచో ప్రకృతిముందా? పురుషుఁడుముందా? యని ప్రశ్నింతురు. అట్టివారలు, రాత్రిముందా? పగలుముందా? విత్తనముముందా? వృక్షముముందా? దేశముముందా? మనుజులుముందా? అని నేనుప్రశ్నించెదను. ఈ నా ప్రశ్నలకు సమాధానమిచ్చుచోఁ బైప్రకృతిముందా? పురుషుఁడుముందా? యను ప్రశ్నకుసమాధాన మివ్వఁగలను. ప్రకృతిలేని పురుషుఁడుండడు; పురుషుఁడులేనిది, ప్రకృతియునుండదు. విత్తనములేనిది వృక్షములేదు; వృక్షములేనిది విత్తనములేదు.—నిప్పులేనిది ధూమమొచ్చునా? ధూమము లేనిదియగ్నియగునా? ఈ రెంటికవినాభావసంబంధమెట్టిదియో, ప్రకృతిపురుషులకవినాభావసంబంధ మట్టిదయ. తక్కుంగలదేవత లెల్లను క్షుద్రదేవతలు, జరామరణములుం గలవారలే! కాని, అందుఁ ద్రిమూర్తులనంబడు బ్రహ్మవిష్ణుమహేశ్వరులు మాత్రముఁగొంతకాలమెక్కువగా వారివారి రాజ్యములఁ బరిపాలించుచుందురు. అట్టులైన ప్రకృతియుననాదిదైనపుఁడు పురుషునితోఁబాటు యారాధింపవలయునా? యన్న, ప్రకృతి పురుషులకవినాభావ సంబంధముంగలదని యెప్పుఁడు స్థిరమైనదో, నప్పుఁడు ప్రకృతియు పూజార్హురాలే! యనిచెప్పవలయును. విధిగా పూజింపవలయును. ప్రకృతికి పూజలేనిది పురుషునికి సంతసముంగలుగదు. మేము పూజింపమని కొందరనెదరు. సరే! ప్రకృతినిపూజింపవద్దు; పురుషులగు శివకేశవులనే, యారాధింతమని యొప్పుకొందము,—ఇప్పుఁడొకచిక్కు

వచ్చినదే?ఆచిక్కు_ మెట్లునివర్తి కావలెను? చిక్కే_మందురా! నారాయణుని యారాధించునప్పుడు 'లక్ష్మీనారాయణ' యనియు, కైలాసనాధుని యర్చించుపట్లఁ గౌరీశంకర, లేక పార్వతీపరమేశ్వర యనియు, నితర దేవతులయారాధించుపట్లఁ ఛాయాసగ్గమేత శ్రీసూర్యనారాయణానమః రోహిణీసమేత తారాధిపాయనమః. అలమేలుతుంగాసమేత, శ్రీవేంక టేశాయనమః, శ్రీరుక్మిణీసమేత, శ్రీకృష్ణాయనమః, శ్రీసీతారామ చంద్ర పరబ్రహ్మణేనమః, అనుచు యర్చింతురేల? అని—ఎన్నివిధముల దుర్వాదములనొనరించినను, ప్రకృతిపురుషుల కవినాభావసంబంధముం గలదనియు, పూజార్హులనియుఁ దేలెడిని. ఇంతియేగాదు—

"దైవీ హ్యేషాగుణమయీ మమమాయాదురత్యయా॥
మామేవయేప్రపద్యంతేమాయామేతాంతరంతి తే.॥"

(పరమేశ్వరుఁడనై యెల్లయెడలవ్యాపించియుండు పరాత్పరుఁడ నగు నాకుస్వభావభూతురాలై యీపూర్వోక్తగుణమయి యగు మాయవిశేషించి, సుఖముగాఁదరింపరానిదేయగు. ఎవ్వారునన్నే శరణొందెదరో, వారీమాయఁదాటెదరు.) అని శ్రీకృష్ణుఁడు గీతా శాస్త్రమునను—

"జగత్సూతేధాతాహరిరవతిరుద్రః క్షపయతే॥
తిరస్కుర్వన్నేతత్స్వమపి వపురీశస్తిరయతి॥
సదాపూర్వస్సర్వంతదిదమనుగృహ్ణాతిచశివ
స్తవాజ్ఞామాలంబ్యక్షణచలతిత యోర్భ్రూలతికయోః."

(బ్రహ్మజగమునుబుట్టించును. హరిపాలించును. హరుండు లయింపఁజేయును, ఈత్రిమూర్తులను మహేశ్వరతత్త్వ మంతర్హితముగా జేయును. ఈశ్వరుఁడీముప్పురను, దనయందు విలీనత, నందఁజేసుకొన్ని, తాను సదాశివునియందంతర్భూతుఁడగును. బ్రహ్మాండ ప్రళయమిదియే. ఆసదాశివతత్త్వముకూడ నోభగవతీ! క్షణకాలము త్రిప్పఁబడిన నీ

భ్రూలతికల, యానతింగొని ధాతృహరి రుద్రేశా నాత్మకమగు తత్వచతుష్టము, ననుగ్రహించును. (సశేషము) (అ॥ ను॥ శర్మ)

---

## వివేకతరంగిణి

(హిందీ "విశ్వమిత్ర" నుండి)

1. మరువగూడని నాల్గుమాటలు:— వృద్ధుల నాదరించుట, బాలురకు సలహానిచ్చుట, బుద్ధిమంతుల సలహాల నంగీకరించుట, మూర్ఖులతో జేరకుండుట.

2. ముఖ్యమైన మూడుమాటలు:—కోపము వచ్చినప్పుడు ఓర్పు వహించుట, దీనులయెడ దయజూపుట, అధికారము గల్గినప్పుడు అదరిపడకుండుట.

3. మహిమగల మూడు వస్తువులు:— యవ్వనపు మహిమ, ముసలివాడును, కనులగలశక్తి గ్రుడ్డివాడును, ధనముయొక్క ప్రభావము దరిద్రుడును, తెలుసుకొనగలరు. (యితరులకు తెలియనేరదు.)

4. మెప్పు పొందగల మేటిసలహాలు మూడు:— ఇతరుల నెప్పుడును యాచింపకుండుట, ఎవరికిని చెరుపు చేయకుండుట, పిలువని పేరంటమునకు బోకుండుట.

5. నరులు నాలుగువిధములు:—తాను తినక యితరులకు పెట్టనివాడు పిసినిగొట్టు, తానుమాత్రమే తినుచు యితరులకు పెట్టనివాడు లోభి, తనతోపాటు యితరులను పోషించువాడు ఉదారుడు, తనకు లేకున్నను యితరులకు పెట్టువాడు దాత.

6. పరీక్ష తరుణములు నాలుగు:— కష్టములు గల్గినప్పుడు మిత్రుని, అప్పు పెరిగినప్పుడు ఋణదాతను, రోగము వచ్చినపుడు బంధువులను, శక్తి యుడిగినప్పుడు భార్యను, పరీక్షించవచ్చును.

7. సంసారము—స్వప్నము:—మెలకువరాగానే స్వప్నము నశించును. ఆత్మజ్ఞానము కలుగగానే సంసారభ్రాంతి పోవును.

8 మహాపాతకులు:— ధర్మము పేరుబెట్టుకొని ధనము హరించు వాడును, బూటకముతో మతప్రచారముచేసి బుద్ధిమంతులను సంకరము చేయువాడును. పాతకులలోకెల్ల పెద్దలు.

9. మహావీరుడు:— ఇతరులను జంపువాడు వీరుడుగానేరడు. ఇతరుల కొరకై తనప్రాణమును సమర్పించువాడే మహావీడు.

(స క్షేమము)

శ్రీ గురుకులాశ్రమము.

---

# భగవంతుడు-ప్రజలు

ఇప్పటి ప్రజల్లో దేవుడంటే భయంఎక్కువగానే వుంటుంది. కాని చెడ్డపనులు చేయటానికి ఎంతమాత్రం భయపడరు. ప్రస్తుత ప్రజల్లో నాస్తికులు నాల్గవ వంతైనా వుండుట దుర్లభము. వాళ్ళకి భయంలేదు, భక్తిలేదు. తక్కిన మూడువంతులలో రకాలువారీగా నుందురు. ఒక రకంవారు మూఢభక్తిగలవారు. వారు చెడ్డపనులు చేయటానికి సాహసించరు. యింకోరకంవారికి భక్తి వుంటుందిగాని బద్ధకంజాస్తి. ఒకప్రక్క భయం పీక్కుతింటుంది, భగవంతుడు శపిస్తాడని ప్రజలకు బోధచేస్తారు. గాని ఆచరణమాత్రం శూన్యం. వీరు చెడ్డపనులుచేయటానికి భగవంతునికి జడియడమేగాకుండా యితరులెవరైనా చూస్తారేమోయని జంకుతారు. మరొకరకంవారున్నారు; భగవంతుడే చేయిస్తున్నాడని అన్ని పనులు నిరభ్యంతరముగా చేస్తారు. నేనేభగవంతుణ్ణంటూ ప్రచారం చేస్తారు. వీరికి మంచి చెడుగులతో నిమిత్తంలేదు. యిక నాస్తికుల విషయం సర్వంనాస్తి. వారికి యేవిషయములలోను నమ్మకము లేదు.

గనుక ప్రజలయందుగల భావాలు విమర్శించాలంటే గొప్ప గ్రంథం అవుతుంది. యింగ్లీషు పరీక్షలయం దారితేరిన మహానుభావులు, యిక సాల్వేస్సీయం దుత్తీర్ణులయిన ఘటికులు రాడీలని విఖ్యాతకీర్తిని గణించిన ధీరులు లోకవంచకులు మున్నగు పండితప్రకాండుల చరిత్రలు పరిశీలించువారికే గోచరముగావున, ప్రపంచనిర్మాణుని విచిత్రస్వరూపము వేనోళ్ళబొగడెడి వేదములు పరిశీలించి విజ్ఞానవంతులగుట శ్రేయస్కరము. (యుగంధరనుండి)

---

# ఆగమ ప్రశంస

(శ్రీయుతులు, చింతలపాటి సుందరరామశాస్త్రిగారు)

విజ్ఞానవంతులగు నో సోదరులారా, నావిన్నపమును పూర్తిగా నాలకించి, యందలి సుగుణమును గ్రహించి, దోషములను పారద్రోలుదురుగాక. మరియు, నేదేనియొక ధర్మనిర్వాహణమున కధ్యక్షతవహించువారు, ఆయాశాస్త్రప్రమాణముల శిరసావహించుచూ, న్యూనాతిరిక్త దోషముల జేరనీయక, సర్వ జనాంగీకారముగా, లోకక్షేమమునకై ప్రయత్నించుట ధర్మమైయుండునే గాని స్వేచ్ఛావర్తనులై వర్తించుట శ్రేయస్కరముగాదని నిగమాగమములు వేనోళ్ల చాటుచున్నవి. స్థిరబుద్ధితో నిశ్చలతత్వముతో పరమేశ్వరుని యారాధించుట, మోక్షహేతువని దెలుసుకొనవలెను. అట్టివారికే సత్ఫలము లభించగలదు. భూమండలమునంగల దేవాలయములందలి సర్వవిధ కైంకర్యంబులు ఆగమ శాస్త్రముల ననుసరించియే జరుగవలెననియు, లేనియెడల రాజారాష్ట్రములకు నష్టదాయకమనియు, స్వప్నములందైనను, ఆగమశాస్త్రముల తిరస్కరింపరాదనియు, లోకసంరక్షణార్థము ఈశ్వరునిచే బలుకబడిన పరశ్రుతులనియు, వేదము లెంతటి యాస్తిక్యతను బోధించుచున్నవో అంతకు వేలురెట్లు జ్ఞానోపదేశము గావించుటచే, పరశ్రుతులని పిలువబడుచున్నవనియు, అట్టి ఆగమశాస్త్రముల నిరాకరించి దేవా

లయములలో ఏకార్యమును చేయరాదని యనేకపండితులు సత్యవాక్కులతో ఘోషిల్లుచున్నను, కొన్నికొన్నిచోట్ల దూషణకార్యములు గావించుట, శోచనీయమైయున్నది. దేవాలయ పరిపాలకులు సక్రమారాధన గావించుచున్నను, మూర్ఖులుకొందరు తమతమ బలమును పయోగపరచి శాస్త్ర తిరస్కారణగావించుచూ లోకవంచన జేయుచున్నారు. అట్టి మహనీయులు దేవాలయముల దరికిరాకున్నను, కొంతవరకు మేలు కలుగగలదు. ఆర్య దివ్యజ్ఞాన బ్రహ్మసామాజికులు తమతమ ఆత్మబలములతో మనస్సును స్వాధీనపరచుకొని నిశ్చితజ్ఞానులై వర్తించుట కన్నులారా గాంచుచూ ఏమతమునకు జెందక మూర్ఖులై రెట్టమతమునకు దిగుచూ సంస్కారులుగాకయు, సనాతనులలో జేరకయు, దేవాలయ ధర్మములు మీరుచూ శాస్త్రదూషణ గావించుచూ, ఆగమ ధర్మముల సంకరము గావించుచుండుటవలన లోకములో ననేక కష్టములు గల్గుచున్నవని భక్తులు పరితపించుచున్నారు. గావున దేవాలయాభిమానులు పరిపాలకులు ఆగమశాస్త్రముల పరిశీలించుచూ సర్వాధికారులైన ఆదిశైవ వైఖానస పాంచరాత్రులనే అర్చకశాఖీయులరావించి తత్కైంకర్యముల కావించుట లోకసంరక్షణకు మార్గమై లోకశ్రేయస్కరమగునని విన్నవించుచున్నాను. అర్చకేతర శాఖీయులు దేవాలయములందే మాత్రం జోక్యము గల్గించుకొనరాదనియు అట్లొనరించుట దేశోపద్రవ హేతువగుననియు శాస్త్రాతిక్రమదోషము కేవలము నరకమార్గమునకు జేర్చుననియు, దెలుసుకొనుటవశ్యకర్తవ్యమని దెలుపుచున్నాను. మరియు సాంప్రదాయము నెఱుంగని యితరశాఖీయులు దేవాలయములలో జోక్యము కలుగజేసికొనుట శాస్త్రవిరుద్ధమైనను క్రియాకలాపములందు అనేక లోపములు గన్పట్టుచుండును. దీక్షాహీనులు అన్యశాఖీయులు పరార్థఆలయములలో ప్రవేశించుట ఘోరము, అధర్మము, అక్రమము అన్యాయమని యనేకులు ఘంటాపథముగా వక్కాణించుచున్నారు. అట్టి దూషితకార్యములకు పాయశ్చిత్తాదులతో సంప్రోక్షణలు జరుగవలసియుండును. తెలిసి తెలియని యాజ్ఞీకులతో ఉత్సవాదికైంకర్యము

లోనరింపజేయుట కేవలము దూషితకార్యమని దెలుసుకొనగోరు చున్నాను. సందియములు గలవారుగాని యిందులకు సంజాయిషీ గోరు వారుగాని మాకు దెలియపరచినచో సప్రమాణముగా జబాబు యిచ్చు టకు సిద్ధముగానున్నాము. ఆగమశాస్త్రవిధులు అందలి భేదములు సమగ్రమముగా పరిశీలించినచో సర్వసందేహములు నివర్తికాగల వని హెచ్చరించుచున్నాను. ఓం శ్శాంతి శ్శాంతి శ్శాంతిః.

చిః సుః రామశాస్త్రి

కుండినసీమ జ్యోతిర్విద్యాలయము (నర్సరావుపేట)

శ్రీయుతులు రామశాస్త్రి సిద్ధాంతిగారి యుపదేశము ప్రతివారును తిలకించి విజ్ఞానవంతులగుటకు గోరుచున్నాము. కొన్ని చోట్ల దేవాలయములందు యాజ్ఞికులమని బయలుదేరిన కొందరు అగమ శాస్త్రముల దూషించుచూ తుదకు రక్షాబంధనమైనను జేయక తక్కిరిబిక్కిరిగా కల్యాణోత్సవముల నెరవేర్చి సంకర మొనరించు చున్నారు. అట్టివారికి అనేకులకు రిజష్టరీనోటీసులు సైతమియిచ్చి జబాబులులేక విఫల మనోరధులమైతిమి. గావున సందియములు గల వారు, ఆగమాధికారముల విషయములో వాదించువారు మాకు వ్రాసి నచో సప్రమాణముగా జబాబు లొసంగబడును. (సంపాదకుడు)

---

# శ్రీకంఠాచార్య కృత భగవద్గీతా భాష్యము

యీ విషయములో గొప్ప గ్రంథముగానున్నందున సదరు గ్రంథ మేవిధముగా వినియోగ పర్చబడునది యింకను నిర్ణయముగానందున

కోరినవార్కి జబాబులు యివ్వలేకున్నాము. త్వరలో వినియోగ మార్గము స్థిరపడినపిమ్మటనే ఉచితముగా నిచ్చుటయో విక్రయించుటయో దెలుపబడును. శ్రీ చంద్రమౌళీశ్వర పీఠాధిపతులును శ్రీశ్రీ కంఠమతాధ్యక్షులునగు శ్రీస్వాములువారు కాశ్మీరాదిదేశ పర్యటనము లందుండుట వలన యీ విషయముస్థిరపడియుండలేదు గావున త్వరలో గ్రాహకులకు దెలుపగలవారము. (శ్రీ ఆదిశైవ సభవారు)

## శేషమాంబా స్మృతి

గీ॥ కాశిరామేశ్వరాది జగత్ప్రసిద్ధ। తీర్థయాత్రలు సద్భక్తి తేట
పడగ। పూర్తిగావించి మించిన పుణ్యవీవు। పోషితాశ్రిత
నికురంబ శేషమాంబ॥ ధరణి వ్రతరాజములబెక్కు నెరపి
నట్టి। తామ్రరజిత సువర్ణ గోధరణినాగ। దివ్యదానంబు
లిచ్చిన భవ్యమతివి। శ్రీగళజ్ఞాన విలశిత శేషమాంబ॥
పెద్దలనుగౌరవించెడి వినయశీల। పిన్నలను ప్రేమజూచెడి
ప్రేమభావ। యనుచు నినుమెచ్చుకొందురు నార్యజనము।
ద్వేషభావవివర్జిత శేషమాంబ॥ వసుధదాదాపు యెనుబది
వత్సరములు। పాడిపంటయు,సిరియు,సంపదలజెలగి। మంచి
పేరుగణించిన మాన్యవీవు। సేవకజనానుమోదిత శేష
మాంబ॥ బరగ యువవత్సరాషాఢ బహుళవిదియ। సౌమ్య
వాసరమున బంధుసముదయముల। కైలాసమేగిన విమల
వీవు। శిష్టజనమాననీయ యో శేషమాంబ॥

(పొన్నూరుబాపయ్య)

## విషాదవార్త

యువసంవత్సర శ్రావణ బహుళఅష్టమీ బుధవారం రాత్రి ప్రథమయామమున శ్రీ గురుకులాశ్రమనివాసియు వేదసంస్కృత ఆగమాది విద్యలయందారితేరి ప్రఖ్యాతి గణించిన శ్రీయుతులు చిలుమూరు వెంకటరామశాస్త్రిగారు ఇహలోకసౌఖ్యముల పరిత్యజించి పరమేశ్వరాజ్ఞానుసారముగా వృద్ధురాలగు తల్లిని సోదర సోదరీమణులను పుత్రపుత్రికాది సకల బంధువులను దుఃఖాబ్ధిని గూలద్రోసి ముప్పదియెనిమిదవ సంవత్సరముననే శివలోక మలంకరించిరని దెల్పుటకు చింతిల్లుచున్నాము. పరమేశ్వరుడీ మహామహుని యాత్మశాంతిని ప్రసాదించుగాక-మాకృతజ్ఞతను వెలువరించుచున్నాము.

(పత్రికాధిపతి)

సుగుణమణులని పేర్గాంచియు చిన్నతనముననే యకాల మరణములకు గురియై మాతాపితల నత్తమామల స్వబంధువుల విడనాడి భర్తను విపత్సముద్రనకుద్రోసి, బాలింతవ్యాధులచే గతించిన డాక్టర్ స్వర్ణ సుబ్బారావుగారి కళత్ర వియోగమునకును, వల్లూరు వెంకటేశ్వర్లు (పుసులూరు)గారి ప్రయత్న వియోగమునకును, మేము మిక్కిలి విచారించుచూ మా సానుభూతిని దెలుపుకొనుచున్నాము. (సంపాదకుడు)

## భక్తి

"విష్ణుభక్తిలేని విబుధుండు విబుధుడే
పాదయుగముతోడి పశువుగాక"

అని వైష్ణవభక్తుడగు ప్రహ్లాదుడు, భక్తిలేని మానవులను పశువులని

దూషించినాడు. నిజమే,ముమ్మాటికిని మానవజన్మమెత్తిన పిమ్మట భగవంతునియెడ భక్తితో బరగనివాడు పశువా లేకున్న వింతపశువా?

ఔను. భక్తియనునది ప్రతిమనుజునకును తప్పక యుండవలసినదే దాని మూలమున మర్త్యుడు బొందగల్గు లాభమేమి? అని యన్నచో సులభముగనే దానికి సదుత్తరము గల్గుచున్నది- భక్తివలన గల్గునది ముక్తి. ముక్తియను శాశ్వతానందముకొరకే ఎన్నియో విధములగు మతములు, వేదాంతములు బోధకులు భక్తులును పెనగులాడుచున్నారు. పశు పక్షి క్రిమికీటక మృగమానవులయందు ప్రతిజీవియు ఎల్లప్పుడును పొందగోరునది యేదియో కొంచెమాలోచింతము- సౌఖ్యము- దానివలన ఆనందము. మానవులయందు పసిబిడ్డలు మొదలుకొని పెద్దలవరకు గూడ నిట్టి సౌఖ్యమునే ప్రతియొక్కరు నాసించుచున్నారు. పాలకై పసిబిడ్డ డేడ్చుచున్నాడు-ఏల? ఆకలి; ఆకలి దీరలేదే యన్న దుఃఖము తో వాడేడ్చుచున్నాడు. తల్లిపాలిచ్చినది-వాని కాకలి తీరినది- నవ్వుచున్నాడు, కేకలు బెట్టుచున్నాడు- చిందులుద్రొక్కుచున్నాడు. ఏల-ఇంతవరకు లేకుండిన యాహారము (పాలు) వల్ల దుఃఖము గలిగించుచుండిన యాకలిబాధ మాయమైనది-సుఖము గలిగినది.సుఖములో యానందరూపమును వాడిప్పుడనుభవించుచున్నాడు.మానవతత్త్వముపసిబిడ్డలయందే స్పష్టముగగానుపించును- కావున మనము నిర్ధారణచేయు నంశమేమన ప్రతిప్రాణియు నానందమును కోరుచుండుననుటయే- అట్టి యానందస్వపమే భగవంతుడు భగవంతుని సాయుజ్యమును బొందగలిగి వానికెట్టి దుఃఖభాజనములగు కొరంతలును యుండవు- కొరతలేనప్పుడు కోరికయు కోరికలేనప్పుడు దుఃఖము తాపమును యుండజాలవు. భగవంతుని సాయుజ్యమును జెందుటయేముక్తి. అట్టి ముక్తినిసంపాదించుటకు ప్రతియొక్కరును జేయవలసినది భక్తి.

భక్తియందు మూడుముఖ్యములైన విధములుగలవు. 1 నిర్మలమైన భక్తి 2 మూఢభక్తి 3 దొంగభక్తి. మొదటి రెండురకములును జనసా

మాన్యము లేగాని, మూడవదిగూడ భక్తిగా పరిగణింపబడునా యను నది యోచనీయాంశము.

సర్వేశ్వరుని సృష్టిజాలమునందున్న మామిడి, వేప, చింత, యిత్యాది మహా వృక్షజాతులుండగా వానకాలమునందు గోడలకు బట్టుపాచి పచ్చళ్ళు యూరుగాయలపై బట్టు బూజుకూడ వృక్షజాతిలో జేరినదేయ నుట యెంతటిహాశ్యాస్పదమో అట్లే దొంగభక్తినిగూడ ప్రశంసార్హ మనుట హాశ్యముగా నుండగలదు. అయినను దొంగభక్తివలన మానవుడు ముక్తిని సంపాదించ జాలకపోయినను నయ్యది ఎట్లో, ఎప్పుడో, సక్రమమై నిర్మల స్నిగ్ధమైయొప్పు నిశ్చలభక్తికి మాత్రము దారిచూపగలదనుట నిర్వివాదాంశము- దీనింజూడగల్గు నొక చిన్న గాథ (కల్పితమో లేక సత్యమో) యొకటిగలదు:-

మిక్కిలి ధనవంతుడైన షాహుకారొక్కడుండెను. అతనికి వయసువచ్చిన కొమార్తె యొక్కతెగలదు. వివాహమునకు యుక్తవయ స్కురాలైయుండి నప్పటికిని ఎవ్వరును యామె నడుగుటకై వచ్చిన వారుకారు. తల్లితండ్రులెంతో ప్రయత్నించి విసుగుజెందిరి. వివాహము గాని కన్య నింటనుంచుకొని యాభారము నే తల్లితండ్రులు సైచగలరు? ఒకానొక రాత్రి సరిగా పండ్రెండు గంటలప్పుడొక దొంగ వారియిం టికి కన్నమువైచి లోనప్రవేసించెను. అప్పుడే ఏకశయ్యాగతులై షాహుకారును యాతని భార్యయును కుమార్తె వివాహవిషయమై వివాదపడజొచ్చిరి. దొంగ కన్నమునందేయుండి వారి సంభాషణమును పూర్తిగ వినుచుండెను.

షాహుకారు:- అబ్బా నన్నింకెంతయని ప్రయత్నములు జేయు మనుచున్నావు- ప్రాణము విసిగిపోయినది నేనొక్కటి సంకల్పించుకొ న్నాను- రాగల యమవాశ్య యుదయమగుసరికి మనయింటివాకిటి కెవ్వడైన నొక హరిభక్తుడు వచ్చెనా కులగోత్రాదు లేమియు విచా రింపక యాతనికిచ్చి పెండ్లిజేచెద.

కన్నములోని దొంగ యీమాటలను విని మెల్లగా నాచోటును బాసి తనలో నిట్లని తలపోసెను. ఇక నాకీ దొంగవృత్తి యెందుకు, అమావాశ్యనాటి కొక హరిభక్తుని వేషముతో నీ చోటికి వచ్చితినేని, నేనతి ధనాఢ్యుడగు నీవణిజునకే యల్లుడ కాగలనుగదా యని దలంచి యీమరుదినము మొదలు హరిభక్తులెట్లుందురో వారివేషములను నియమముల నేర్చుకొనజొచ్చెను. ప్రతిదినమును భజనమందిరముల కేగుచు కష్టపడి

"రఘుపతిరాఘవ రాజారాం
పతితపావనా సీతారాం"

అని పాడుటకుగూడ నేర్చికొనెను.

అమావాశ్య యరుగుదెంచెను. తెల్లవారి యేడుగంట లగుసరికి దొంగ ద్వాదశయూర్ధ్వపుండములతోటి రామనామము బాడుకొనుచు షాహుకారునింటికి వచ్చెను. షాహుకారును తాను సంకల్పించుకొన్న చొప్పున నీహరిదాసుడు భగవంతునిచే పంపబడియుండ నొప్పునని యీతని కఖండమర్యాదసల్పి తన కుమార్తె నిచ్చుట కుద్యుక్తుడయ్యెను. దొంగ ఇట్లనియాలోచించెను. కేవలము కపటపువేసమూని భక్తినభిన యించినప్పుడే నాకింతటి మహాలాభము చేకూరనున్నది. నేనే నిజమైన భక్తుడయగుచో నింకెంత లాభముండగలదో" అని తన నిజవృత్తాంత మాషాహుకారునకు విన్నవించి క్షమాపణగోరి యది మొదలు నిజ మైన భక్తుడై మోక్షమును బొందెను.

కావున దొంగభక్తుడైనను వానికెప్పుడో, ఏట్లో మార్పు Turning Point వచ్చి తుదకువాడును మోక్షమునకు రాగలడు అ నుటదీనిచే బోధపడుచున్నదిగదా!" ఈశ్వరునిలీలలు వాఙ్మానసగోచర ములు"

(భక్తిప్రబోధిని.)

---

సం॥ చందా రు 1-8-0 లు. Regd. No. M. 2073.

# శ్రీ ఆదిశైవపత్రిక.

శ్రీ శ్రీకంఠ మఠాధిపతుల యాజ్ఞానుసారముగా శైవ
సమభ్యుదయమునకై శ్రీ గురుకులాశ్రమమునుండి
ప్రతిమాసము ప్రకటింపఁబడును

సర్వదేవాత్మకో రుద్రస్సర్వే దేవాశ్శివాత్మకాః ।
రుద్రస్య దక్షిణేపార్శ్వే రవిర్బ్రహ్మ త్రయోఽగ్నయః ।
వామపార్శ్వే ఉమాదేవి విష్ణుస్సోమే పితేత్రయః ॥
(రుద్రహృదయోపనిషత్)

సంపాదకుడు:—చిలుమూరు పురుషోత్తమ గురుక్కళ్.

సంపుట ౧౧ } చిలుమూరు యువనామ సం॥ర ఆశ్వయుజ-కార్తికమాసములు. { సంచిక ౭-౮

[విలేఖకుల వ్యాసములకు సంపాదకులు ఉత్తరవాదులు కానేరరు.]



—◆ విషయ సూచిక ◆—



భారతీ ముద్రాక్షరశాల, తెనాలి.

# ఉద్ధారకులు

౧ శ్రీ॥ శ్రీ॥ చిలుమూరు తీర్థేశ్వరులవారి జ్ఞాపకార్థం కుమాళ్లు ఉమామహేశ్వరం
వగైరాలు, చిలుమూరు.

౨ కర్ణాటక రాష్ట్రీయ ఆదిశైవ మహాసంఘమువారు, బెంగుళూరు.

౩ శ్రీమాన్ నడింపల్లి నాగేశ్వరశివాచార్యులవారు, ఇంటూరు.

౪ ... గూడూరు రాఘవరావుగారు, పోతునూరు.

౫ ... గూడూరు శితయ్యగారు, శనివారపుపేట.

౬ ... అయలూరు వెంకటసుబ్బయ్యగారు, ఆర్తమూరు.

౭ ... పావులూరు రామచంద్రయ్యగారు, మునికోటిపురం.

౮ ... పావులూరు హనుమంతయ్యగారు, మునికోటిపురం.

౯ ... పెనుమూడి సత్యనారాయణగారు, తూర్పుకూచిపూడి.

౧౦ ... స్వర్గ వెంకటశివావధానులుగారు, బూతుమిల్లి.

౧౧ ... పావులూరు నాగేశ్వరశర్మగారు, అనంతపురం.

౧౨ ... పెనుమూడి హనుమంతరావుగారు, తెనాలి.

౧౩ ... మామిళ్లపల్లి శంకరమ్మగారి జ్ఞాపకార్థం భర్త
శివరామదీక్షితులుగారు, చుండూరు.

౧౪ ... మామిళ్లపల్లి సాంబయ్యగారు, చుండూరు.

౧౫ ... పొన్నూరు సుబ్రహ్మణ్య పాకయాజిగారు, దండమూడి.

౧౬ ... వేమూరి శివయ్యగారు, తేలప్రోలు.

౧౭ ... కుందుర్తి ఆనందరావుగారు, బి. ఏ., దుగ్గిరాల.

౧౮ ... పార్వతమ్మగారి జ్ఞాపకార్థం సత్తెనపల్లి వెంకటరామయ్యగారు,
ఓవర్ సీయరు, దుగ్గిరాల

౧౯ ... చావలి గంగయ్యగారి జ్ఞాపకార్థం కుమాళ్లు సుబ్బయ్య వగైరాలు,
చముడుపాడు.

౨౦ ... సంగాపు పానకాలయ్యగారి జ్ఞాపకార్థం కుమాళ్లు వీరయ్య గురుకులు
వగైరాలు, నవులూరు.

౨౧ ... సంగాపు కోటీశ్వర గురుకులుగారు, మంగళగిరి.

౨౨ ... చిలుమూరు వెంకటసుబ్బయ్యగారు, చిలుమూరు.

౨౩ ... చిలుమూరు కుటుంబయ్యగారు, చిలుమూరు.

౨౪ ... శేకూరు రాఘవశర్మగారు, గుడివాడ.

౨౫ ... చాపలి సుబ్బయ్య పంతయ్యగార్లు, పినపాడు.

౨౬ ... చావలి లక్ష్మీకాంతయ్యగారు, బాపట్ల.

౨౭ ... కొల్లిపర రామయ్య, పిచ్చయ్యగార్లు, పెనుమూలి.

౨౮ ... స్వర్గ చినమల్లయ్యగారి జ్ఞాపకార్థం ధర్మపత్ని బుచ్చమ్మగారు, చీరాల

౨౯ ... పెనుమూడి సీతమ్మగారు, జొన్నలగడ్డ.

౩౦ ... పసుమర్తి పార్వతమ్మగారు, కూచిపూడి.

# శ్రీ ఆదిశైవ పత్రిక.

సపకోరుద్రస్స ఈశానస్స భగవాన్ సమహేశ్వరస్స మహాదేవః॥
"అధర్వశిరసి."

సంపుట ౧౧ } చిలుమూరు యువనామ సం॥ర ఆశ్వయుజ-కార్తీకమాసములు. { సంచిక ౭-౮

## ప్రార్థన

శంభుః పితాశంకర ఏవమాతా శర్వోహి బంధుశ్చ సఖాసఖీవా
శంభో గురుర్మేపరమంచదైవంశంభుంవినానాన్యమహంస్మరామి॥
(శ్రీకంఠమఠం)

## దుష్టకలి

కుడువను కూడు కట్టుటకు గుడ్డ యథావిధిలేక దుఃఖపుం
జడనిధిలోన మున్గి తనుసత్వము మాయ గృశించి ప్రాణముల్
విడిచెడు భారతీయుల కలిప్రభు యీ యుగమందుగాక మున్
గడచిన సత్యకాలముల గంటిమె మాభరతావనీస్థలిః—(స్వతంత్ర)

కైలాసవాసులగు డాక్టర్ కొల్లిపర వీరయ్యగారి సంస్మరణము.

గీ॥ ఆదిశైవకులోత్తంసు నచ్యుతాత్మజ స్ఫురద్రూపు బంధువత్సలు సుదీర్ఘ । బాహుఁ కొల్లిపరాన్వయోద్భవుని వీరయాఖ్యుఁ గాలమాశ్రి మిర్ంగితే॥—అనుకంప ౧

సీ. కరుణాపరిపూర్ణవీక్షణ నవపుల్లసూనాంబువుల నభిషేకంబొనర్చి
పరిధితవర్ధిత వినిర్మలభావబోధిత దరహాసగంధ చందనమలంది

సరసహాస్యోక్తుల సంతత దుర్భరబాధ భారము శమింపంగఁ జేసి
విగళిత పీయూషవిభవసంభరిత హస్తాంభోరుహమున సంతాపమడఁచి

గీ॥ ఔషధంబొండు నిచ్చి యీాయకమున్న రోగులకు బహుళాయు
రారోగ్యభాగ్య । మిచ్చు మా కవిరాజు తా నేగె దివి కటన్న
దుర్వార్త హృదయంబు లవియఁజేసె॥ ౨

గీ॥ పాత్రయోగంబు లిత్తఱిఁ బట్టవనియె కొత్తయోగంబు లెన్నెన్నొ
గూర్చి యశము । గాంచినావు ఓమహాభిషజ్మణివరేణ్య తొల్లి ఋషి
పుంగవులు మీకుఁ దుల్యులగునె॥ 3

గీ॥ ఇహమునం దీయశస్వికి నిద్ధశాంతి బహుళముగఁ బ్రసాదించిన పార్వ
తీశుఁ । డిమ్మహాత్ముని ముక్తాత్మ కిడఁగలేఁడొ పరమునందనుపమ
గుపరమశాంతి॥— (శర్మశంకరులు) ౪

---

# కవిరాజ స్మృతి

సీ॥ అన్నవస్త్రములకు నల్లాడు బీదలనె న్నెందరెందరినో రక్షించినాడు
పలురోగముల చేతబహుకష్టములనొందువారల దయనుగాపాడినాడు
తీర్థయాత్రలటంచు దివ్యక్షేత్రములంచు వసుధయంతను జుట్టివచ్చినాడు
సప్తాహములయందు సంతసంబున సాధుజనులకు దానముల్ సలిపినాడు

గీ॥ అట్టి శ్రీవీరయాహ్వయు డనఘమూర్తి అక్కటా యాశునాజ్ఞ దివి
కరగినాడు । సౌఖ్యమందుచు నున్నాడు స్వర్గపురిని గాన మనమెంత
వగచిన గలదె ఫలము ? ౧

గీ॥ సలిలమంతయు నింకిన సరసిమాడ్కి । మంచుచే గూడుకొనిన
తామర విధాన । వన్నె బోగొట్టుకొన్న దీచిన్నిగృహము ఘనుడు
మా మామ లేనట్టి కారణమున॥ ౨

—యర్ర. వెంకటేశ్వరశర్మ (మైలవరం)

---

## సోదరా!

పిట్టపిడుగువంటి నీ మరణవార్తను పత్రికటింపవలసివచ్చి నందుల కెంతయో చింతిల్లుచూ విధిలేక ధైర్య మవలంబించి శ్రీకైలాసవాసు చరణారవిందసేవా నిమగ్నుడవగు నీ యాత్మ శాంతికై ప్రార్థింపుచూ పూర్వజన్మసుకృత విశేషఫల సముదాయకమగు నీ యశశ్చంద్రికలం దోలలాడుచూ సాంఘిక దురదృష్టమునకు వగచుచూ దుఃఖాబ్ధి నిమగ్నులై దరిగానక చింతిల్లెడి నీ కుటుంబమును బంధుమిత్రాదుల నోదార్చుచూ మా సానుభూతి నందజేయుచున్నాము.

తండ్రీ! నీవు జన్మరాహిత్యుఁడవై శాశ్వతానంద భమనువింపుము.

ఇట్లు సేవకుడు,
పత్రికాధిపతి.

## మహాభాగ్యము

జగద్గురు శ్రీకంఠశివాచార్య (బోధానందమహర్షుల) స్వాములవారికి వీపున నొక రణము లేచి నెలరోజులు బాధించి ఈశ్వరానుగ్రహమున నిమ్మళించినదని తెలుపుటకు ఆనందించుచున్నాము. (సంపాదకులు)

# సంపాదకీయములు.

## స్వవిషయము

చందా తగ్గించినను సాంఘికు లేమాత్రమైనను పత్రికాదరణ చేయక యిన్నకుండుట కడుంగడు శోచనీయమైయున్నది. సంఘసేవకు పత్రికయే ప్రధమసాధనమని గుర్తెరింగి శక్త్యానుసారముగా సహాయ మొనరింపుడని మేము పలువిధముల బ్రతిమాలి నిరర్థకుల మైతిమి. షుమారు పదునారు వత్సరములనుండి సంఘసేవ నొనరింపుచూ పాఠశాల పత్రికను జంటగా నడుపుచున్నను తుదకిట్టి నిరర్థకసంఘముగా పరిణమించినందులకు మిక్కిలి వగచుచున్నాము. ప్రస్తుతమున మనకు సంఘటించిన మహా విపత్తునకు గత్యంతరము లాలోచించుటకైనను, సాంఘికులు నిద్రాముద్రితులై చైతన్యము లేనివారైయున్న కారణమున వ్యవహారములు పాడైపోవుచున్నవి. గావున సాంఘికులు మేల్కొని సంఘాభివృద్ధి సూచన లరయుటయు ప్రబోధించుటయు ఆచరించుటయు గావించుట శ్రేయస్కరమైయుండును. ... ... ...

## స్వాములవారి పర్యటనము.

గుంటూరు మండలమునుండి బెంగుళూరు మున్నగు స్థలములకు పర్యటనము గావించుచుండ శరీరమునందు వ్రణబాధ సంభవించుటచే పుంగనూరునందే నిలచి శస్త్రచికిత్సలనొంది ఆరోగ్యమును బడయుచుండిరి. అనతికాలములో గోదావరీమండలమునకు విజయంచేసి "ఉపనిషద్భాష్యమును ముద్రించు ప్రయత్నము లొనరింపగలరని తెలియుచున్నది. శ్రీవారి సంఘోద్ధరణదీక్షను, వ్రయప్రయాసలను వర్ణింపనేరము "సంభవామి యుగేయుగే" యను వచనము శ్రీవారియందే సార్థకమైయున్నది. "భాష్యోద్ధరణ విషయము మహా ఘనకార్యము. సామాన్య గృహస్థు లొనరించుట కష్టసాధ్యము. గావున పరమేశ్వరాంశ సంభూతులై, ఆదిశైవ సంఘశ్రేయమునకై పలుపాట్లు బడుచున్న విషయములు సాంఘికులు గమనించుట శ్రేయస్కరము.

---

# కలిప్రభావము

(శ్రీమాన్ పి. వి. శాస్త్రిగారు    కోటిఫలి)

ఇహాఖలు సంసారసాగరే పరివర్తమానానాం సర్వేషామాస్తిక జనానాం దురాశాపిశాచోఽధికతరఏవవర్తతే. అహమేవ పండిత సర్వజ్ఞ ఇతి నిగర్వచూడామణయో బహవత్సంతత్స్యస్మిన్ లోకే కాలవశాన్మన్య మానాః లోకేయత్కించిత్కర్మ క్రియతే యది మద్వినానకార్యమితి కలి ప్రభావాత్. "అనాహూతోఽధ్వరంగచ్ఛేత్" ఇతిపూర్వార్షికోక్తైర్వ పర్యాసోసంభవతీతి తదాపూర్యమాణాః పండితమ్మన్యాః స్వాగతకార్య విముఖాఅపరకార్యా సక్తాఆత్మస్తుతి పరనిందాకరణపరాః కాలం నీయ మానా ఆత్మలాభపరాయణాః" "దుర్జ్ఞేయా శాంభవీమాయాతయా సమ్మోహ్యతే జగత్ ఇతిగీతా వచనస్యావిరుద్ధ ప్రవర్తకాశ్చలోకే సంత్యహో కించ. "నగృహ్ణాతివచః పథ్యం కామక్రోధాది పీడితః హితం నరోచతేతస్య ముమూర్షోరివభేషజమ్" ఇతి గీతాప్రామాణ్యాత్. 'అబద్ధంవా సుబద్ధంవా మయోక్తరీత్యా కర్తవ్యమేవేత్యభిమాన పరాశ్చ తదాకిం భవతి ఆత్మస్య సహనమేవ సర్వేషా మపిజాయతే. కింతు. యథానిర్దిష్టం భగవతాశంకరేణ తథైవభవతి 'ఓంశాంతిః. ఇతి సుధీజన విధేయః' (శ్రీకంఠమఠం)

## రాబోవు సంచికయందు

అర్చకులకు దేవుని పేరుతోడనే భూములొసంగవలె ననియు, దేవుని భూములే అర్చకుల ఆదాయమనియు, వాటిని ధ్వంస మొనరించుట శాస్త్ర విరుద్ధమనియు గల ప్రమాణములతో గొప్ప వ్యాసము రానున్నది. పాఠకులు వేచియుండుడు.

(సంపాదకులు)

యీనెలలో చందాలు చెల్లించినవారు.

(౧) శ్రీమాన్ అయలూరు రామశాస్త్రులుగారు (భవ-యువ) అర్థవరం (గో)

(౨) ,, బాదంపూడి కామయ్యగారు (శ్రీముఖ-భవ) కోరుమిల్లి (గో)

(సన్మానములు)

(౧) శ్రీమాన్. కీర్తిశేషులయ్యిన కవిరాజేత్యాది బిరుదాంకితులును, సంఘశ్రేయోభిలాషులగు డాక్టర్. కొల్లిపర వీరయ్యగారి జ్ఞాపకార్థం. పత్రికాసన్మానం— రు. ౨—౦—౦లు.

## గృహలక్ష్మి.

సర్వాంగసుందరమై యలరారు దసరాసంచికను వందనములతో స్వీకరించితిమి. స్త్రీలపాలిటి కల్పతరువుగా పరిణమించిన గృహలక్ష్మి చిరంజీవియై వర్ధిల్లుగాత యని మా విశ్వాసము. సంపాదకుడు.

## వివేక తరంగిణి.

( గతసంచిక తరువాయి )

10. చెప్పకొనరాని విషయాలు—ధనమును, మనస్తాపమును, కుటుంబకలహమును, పరాభవమును, ఆయువును, మంత్రమును, ఔషధము మొదలైనవి.

11. నరులు చెడిపోవుమార్గములు—అజ్ఞానము, మూర్ఖత్వము, గర్వము ప్రమాదను.

12. కూర్చుండరాని చోట్లు—తల్లివద్దను, అక్కచెల్లెండ్రవద్దను, కొమా ర్తెవద్దను, ఏకాంతముగా కూర్చుండరాదు- (ఇంద్రియాదులను నమ్మరాదు)

13. అన్నిటికి సాధనము—ప్రియవాక్యములాడుటవలన శ్రమయు వ్రయ ము లేదు. దానివలన సర్వులు వశీకరమౌదురు. దీనివలన అపా యము లేదు.

14. వశీకరణము—లోభివానికి ధనమిచ్చుటవల్లను, కోపిష్ఠిని వినయ విధేయతలచేతను, మూర్ఖుని వాని యిష్టానుసారముగా ప్రవర్తిం చియు, పండితుని తత్వార్థముచేతను జయించవచ్చును.

15. యిరువురు లేరు—అడిగినదెల్ల నిచ్చువాడును, యితరులతో పని లేనివారును ప్రపంచకములో లేరు.

16. జీవన్మృతులు— దరిద్రులు, రోగులు, మూర్ఖులు, నిరంతరము యాచనచే జీవించువారు, ద్వీపాంతరవాసి మున్నగువారు.

17. స్వతంత్రులు నల్గురు—త్యాగియగువాడు ధనమును, శూరుడు దేహమును, విరక్తుడు భార్యను, నిస్పృహుడు(ఏకోరిక లేనివాడు) ప్రపంచమును విడచుటకు స్వతంత్రులై యుందురు.

18. దాయాదులు నల్గురు—ధనమునకు, ధర్మము, అగ్ని, రాజు, దొంగ యీ నలుగురిలో పెద్దవాడైన ధర్మమును అవమానపరచినచో, తక్కినముప్పురు హరించివేయుదురు. గనుక ధర్మమును కాపాడ వలెను.

19. అపాయములు మూడు—వియ్యము, కయ్యము, నెయ్యము. యీ మూటిని తనకు మించిన వారితోగాని, తగ్గినవారితోగాని గావించి నచో తప్పక అపాయము గల్గును. (హిందీ. విశ్వామిత్ర)

---

# దైవభక్తి

బాలకవి:—ధరణీప్రగడ వేంకట శ్రీరామమూర్తిగారు.

మన భారతవర్షము వేదాంతమునకు పుట్టినిల్లు. హిందూమతమునలేని విశుద్ధాచారములుగాని యుత్కృష్టధర్మములుఁగాని తదితర మతముల యందెచ్చటను గానరావు. వేదాంతము సర్వజనులయెడ సోదరభావము గల్గించి చక్కని సద్గుణముల వెలయించును. అట్టి సద్భావమును గుర్తించి చరించునాతడు పరమ పవిత్రుడు. సర్వమును భగవత్స్వరూపమను తలంపున నున్నవాని కందఱియెడలను పవిత్రమగు ప్రేమగల్గును. అజ్ఞుల కయ్యది దురూహ్యమును గగనకుసుమము నగును. శూద్రత్వమగు నా యజ్ఞానమును విడచిన నేగాని, మనుజుఁడు బ్రహ్మపదవి నందజాలఁడు. "తత్త్వమసి" యను భావమును వేదము నొక్కి వక్కాణించుచున్నది. శంకరుఁడు మొదలగు మతస్థాపకులీయర్థమునే బోధించిరి. ఆ మహావాక్యముల ననుసరించి మనదేహము దేవదేవునకు నిలయమని ఘంటాపథముగ వచింపవచ్చును. భగవంతుఁడు సకలకల్యాణగుణసాగరుఁడు. భక్తిసులభుఁడు. భక్తియోగమైనను, కర్మయోగమైనను, జ్ఞానయోగమైనను, భగవంతుని తెలుసుకొనుటకే. అతని ప్రేమకు పాత్రుడగుటకే వినియోగము. అతఁడు శక్తిసంపన్నుడు. అతఁడే పరమాత్మ. జ్ఞానలభ్యమగు మోక్షమాతఁడే. భగవంతుని యతీతమగు శక్తియే మాయయని చెప్పబడును. మూఢులనుకొనునట్టిప్పట్ల, మాయకు మోసమని, కపటమని, శూన్యమని, యర్థములేదు. అదియే జగత్పరిణామకారణమగు, సత్యమగు, అనంతశక్తి. అద్దాని సహాయముననే దేవుడు జగములను సృజించుచున్నాడు. కుండగా నేర్పుగుశక్తి మృత్తికయందున్న రీతిని, జగత్సృష్టి కారణభూతమగు మాయ యను మహచ్ఛక్తి యీశ్వరుని యందడగియున్నది. జగత్తు మాయాకల్పిత మనగా భగవంతుని శక్తివలన కల్పింపబడినదని యర్థము, కాని కపటమని యర్థముకాదు. అనలమునందుష్ణత యిమిడియున్నట్లు యీశ్వరునియందు శక్తి యిమిడియున్నది.

శిశువువలె దేవుడు పరిశుద్ధుడు. నిష్కళంకుడు. పాపరహితుడు. అతడే సర్వశక్తిసంపన్నమగు పరమాత్మ. ఎల్లెడల నాతడు నిండి యున్నాడు. నారదుఁడు, ప్రహ్లాదుఁడు, మొదలగు మహాభక్తుల తాత్పర్య మీతత్త్వజ్ఞానమే. భక్తివిహీనుడగుటకంటె మూఢభక్తియుతుడగుట కొంత మేలు. మూఢభక్తికంటె తాత్పర్య సంయుక్తమగు భక్తి మిన్నయగును. విగ్రహారాధన మొదలగు ఆత్మారాధన వఱకును అన్నియు పరాత్పరుని తెలిసికొనుటకు సోపానములు. మనోవికారమును, అజ్ఞానమును మొదలంట రూపుమాపుకొని వినిర్మల జ్ఞానపరులై భక్తి పారవశ్యంబున మునిఁగి మనోనేత్రమున భగవంతుని చూడగల్గు మహిమాసంపన్నులకు, విగ్రహారాధన మవసరము లేదు. వార లనుష్ఠించు ధర్మము లజ్ఞులకు బోధపడవు. భక్తిమార్గమునకు విగ్రహారాధన మొదటి సోపానము. సామాన్యజనుల కయ్యది ముఖ్యావసరము. అట్టిసాధనము ననుసరించియే వారు క్రమక్రమముగ "తత్త్వమసి, నెఱింగికొనగలరు. భక్తి కాధారము సదాచారము. దురాచారములచే బంధింపబడిన నరునియందు భక్తిభావము కలుగనేరదు. అంతకు ముందొకింత యున్నను నశించిపోవును. (సుదర్శిని)

---

# ఆగమ ధర్మములు

## (1) దేవాలయము, అర్చకులు.

ఉత్తరకామికం. 30 ప్రాయశ్చిత్తపటలం. పుట 113

"దేవస్వం దేవతాద్రవ్యం నైవేద్యంచ నివేదితం. (551 శ్లో)

చండద్రవ్యంచ నిర్మాల్యం నిర్మాల్యంషడ్విధం స్మృతం" (551½ శ్లో)

దేవస్వమనియు, దేవతా ద్రవ్యమనియు. నైవేద్యమనియు, నివేదితమనియు, చండద్రవ్యమనియు, నిర్మాల్యమనియు, భగవన్నిర్మాల్య మారు విధములు.

"గ్రామాదీశస్య దేవస్వం దేవద్రవ్యం పటాదికం
నైవేద్యం కల్పితం తస్మై దేవోచ్ఛిష్టం నివేదితం (552½)
చండద్రవ్యంతు తద్దత్తం నిర్మాల్యం పేరితంబహిః"

దేవునియొక్క గ్రామము, భూమి మొదలైనది (స్థిరరూపమైనది) దేవస్వమను నిర్మాల్యము, దేవునియొక్క వస్త్రములు, ధనము మొదలయినది (చరరూపమైనది) దేవద్రవ్యమను నిర్మాల్యము దేవుని నివేదకకొఱకు సిద్ధముచేయబడిన అన్నము, పండ్లు మొదలయినవి, నైవేద్యమను నిర్మాల్యము. నివేదించబడినదానినుండి చండేశ్వరున కర్పించబడినది చండద్రవ్యమను నిర్మాల్యము. స్వామినుండి విసర్జనచేయబడిన పుష్పాదికము (నిర్మాల్యము, లేక) బహిఃక్షిప్తము అను నిర్మాల్యము.

"దేవదేవాయతత్రాద్యం దేవగ్రామాదిసంభవం (557)
వ్రీహ్యాదియేవకేనైవోపాధినాఽఽదాయభక్షణం.
కరోతియస్సమూఢోమద్ధనస్తేయకృన్నరః" (558)

దేవునికొఱకైన ఆ ఆరు నిర్మాల్యములలో, మొదటి నిర్మాల్యమగు దేవునియొక్క గ్రామము, భూమి మొదలయినదానియందు పుట్టిన వరి మొదలయినవాటిని, యేమిషచేనైనను తీసుకొని అనుభవించుచున్నాడో ఆమూఢుడు నాధనమును దొంగలించినవాడు. అని భగవద్వాక్యము.

"నివేద్యమహ్యాం తచ్ఛిష్టం భుంక్తే ప్రత్యహమాదరాత్ (561)
సోయం మత్సదృశః ప్రోక్తశ్చరుభుగ్యస్తథాభవేత్"

(దేవునియొక్క మొదటినిర్మాల్యమగు భూమియందు పుట్టిన వరి మొదలయిన దానిని అనుభవించుటకు అర్చకుడు అర్హతగలవాడని నిరూపించుటకు భగవద్వాక్యము) ప్రతిదినమునను నాకొఱకు నివేదనచేసి, ఆనివేదితమును మిగిలినదాని నెవడు(యేఅర్చకుడు) అనుభవించుచున్నాడో ? అతను నాసదృశుడు, యజ్ఞములో చరభోక్త యెట్టి పుణ్యశాలియో అట్టివాడని భగవద్వాక్యము.

"మద్దేహధారిణో లోకేదేశి కామత్పరాయణాః।
మదేక శరణాస్తేషు యోగ్యం నైవాన్యజంతుషు" (565½)

లోకమందు దేశికులు (అర్చకులు) నాశరీరమును (మంత్రశరీరమును) ధరించినవారు. నాయందు ఆసక్తికలవారు. నన్నే ముఖ్యముగా నమ్మియున్నవారలు. వారు నా యీ మొదటి నిర్మాల్యమైన భూమియందు పుట్టిన సస్యాదులను అనుభవించుటకు తగినవారు. ఇతరు లెవ్వరును, యేవిధముగాను అర్హులుకారు.

(2) దేశికులనగా అర్చకులనుటకు ప్రమాణములు.

... ... ... ... ...

పూర్వకారణం 30 నిత్యార్చనపటలం, పుట 210

"శివాగ్రేస్థండిలం కృత్వాహస్తమాత్రంతు దేశికః" (141½)

దేశికుడు (అర్చకుడు) శివునియెదుట హస్తమాత్ర విస్తారమైన స్థండిలమునుచేసి నిత్యార్చన పటలమునందే, 236 పుట.

"ఘంటాంతు వామహస్తేన దేశికస్తాడయేత్క్రమాత్" (434½)

దేశికుడు (అర్చకుడు) వామహస్తముచే ఘంటను ప్రయోగించవలయును.

233 పుట.

"నైవేద్యం పురుషేచైవభావయేద్దేశికోత్తమః" (383½)

దేశికుడు (అర్చకుడు) నైవేద్యమును తత్పురుషముఖమందు భావించవలయును. 234 పుట.

"ఆచార్యోహస్త ముద్ధృత్య గౌరీహస్తే నివేదయేత్" (396)

ఆచార్యుడు (అర్చకుడు) తనహస్తమును యెత్తి గౌరీహస్తమందు నివేదన చేయవలయును.

పూర్వకారణం నైవేద్యవిధిపటలం పుట 254.

"రసానాచార్య జిహ్వాఽగ్రాద్భుక్షయామి ప్రజాపతే"

ఓ బ్రహ్మ, రసములను అర్చకునియొక్క జిహ్వాగ్రమువలన అనుభవించుచున్నాను అని భగవద్వాక్యము.

☞ ఇట్లనే, ఆగమములయందంతటను, అర్చకునికి, ఆచార్యుడు, దేశికుడు, గురువు, యీమొదలగు పదములు ఉపయోగించబడినవి.

☞ నిర్మాల్యరత్నాకరం (బాబూవేచుసింహకృతము, కలకత్తా తులాపతీవీధి. నె 75 రు నారాయణయంత్రశాలయందు, రసికలాల్‌పాన్ అను వారిచే 1898 సం॥నందు ముద్రితము.)

3. ఇతర గ్రంథములు—నిర్మాల్యవిచారము

... ... ... ...

నిర్మాల్యరత్నాకరం, ఉత్తరార్థం, చతుర్థతరంగం పుట 108.

"దేవస్వం దేవతాద్రవ్యం నైవేద్యంచ నివేదితం
చండద్రవ్యం బహిః క్షిప్తం నిర్మాల్యం షడ్విధం స్మృతం"
"దేవస్వం దేవతాద్రవ్యం చండద్రవ్యం బహిః
క్షిప్తమితి చతుష్టయం శాద్రైరేవ గ్రాహ్యం, నాన్యేషాం'

దేవునియొక్క భూమి మొదలయినది, దేవునియొక్క ధనము మొదలయినది, చండద్రవ్యము, విసర్జన చేయబడిన పుష్పాదికము, యీ నాలుగు నిర్మాల్యములు. అర్చకులు అనుభవించుటకే తగినవి. ఇతరులు ఏ విధముగాను తీసుకొనుటకు అవకాశము లేదు.

ఇందే 113 పుట

'నైవేద్యాతిరిక్త నివేదితాది పంచవిధ చండాదిద్రవ్యస్య అగ్రాహ్యతాచ। ఏతత్సర్వం, అశైవవిషయం, శైవానాంతు, తత్తద్విధి బలాత్ సర్వం గ్రాహ్యమేవ'

నైవేద్యముకంటే మిగిలిన అయిదు నిర్మాల్యములను గ్రహించుటకు అధికారము లేకపోవుట. శైవేతరులకే (అర్చకేతరులకే)

శైవులకు (అర్చకులకు) ఆయా విధులయొక్క బలమువలన యీఅయిదు నిర్మాల్యములును, అనుభవయోగ్యము లయినవే.

ఇందే 109 పుట

"ఏవంచ భక్తానాం నైవేద్యమేవ త్యాజ్యం
నివేదితాది పంచకంతు గ్రాహ్యామేవ"

భక్తులకు (అర్చకులకు) నైవేద్యమను నిర్మాల్యము (నివేదనకు సిద్ధపరుపబడిన అన్నాదికము) మాత్రమే ముందుగా అనుభవించరాదుగాని, దేవస్వము (భూములు) దేవతాద్రవ్యము, నివేదితము, చండద్రవ్యము, బహిఃక్షిప్తము, యీ అయిదు నిర్మాల్యములును అనుభవయోగ్యములే.

అభక్తానాంతు కేవలనివేదితమేవ
గ్రాహ్యాం, అన్యత్పంచవిధం త్యాజ్యం॥

అర్చకేతరులకు కేవలము నివేదితము (నివేదన చేయబడినది) అను నిర్మాల్యము మాత్రమే అనుభవించ దగియున్నది. దేవస్వము (భూమి) మొదలయిన ఆయిదు నిర్మాల్యములున్ను విడవదగినవని పైగ్రంథము వలన స్పష్టముగా దెలియుచున్నది.

## 4. అర్చకులు, ఉపనామములు.

భవిష్యత్పురాణం 117 అధ్యాయం. పుట 103. బ్రాహ్మపర్వం.

యఏతేమత్సుతారాజ సఘ్యార్బాహ్మణ సత్తమాః
కారయిత్వా ప్రతిష్ఠాంమే సర్వైరే భిర్మహీపతే॥ 31

కారయిత్వా ప్రతిష్ఠాంతు మమార్చాయాం నరాధిప
పశ్చాదాయతనం సర్వమేషామర్పయపూజనే॥ 32

ఏతే మత్పూజనేయోగ్యాః ప్రతిష్ఠాసుచ సర్వశః
సమర్ప్యన్రపహర్తవ్యం భోజకేభ్యః కదాచన॥ 33

---

సర్వమాయతనార్థంతు గృహక్షేత్రాదికంచయత్
ధనధాన్యాదికం రాజన్ యన్మమాయతనే భవేత్॥ 34

తత్సర్వం భోజకేభ్యస్తు దాతవ్యం నాత్రసంశయః
ధనధాన్య సువర్ణాది గృహక్షేత్రాదికంచయత్॥ 35

యన్మదీయం భవేత్కించిద్గ్రామేవా నగరేక్వచిత్
తస్యసర్వరాజేంద్ర మదీయస్యసమంతతః
అధిపా భోజకాస్సర్వేనాన్యే విప్రాదయోనృప॥ 36

యథాధికారీ పుత్రస్తు పితృద్రవ్యస్య వై భవేత్
తథామదీయవిత్తస్య భోజకాస్యుర్న సంశయః॥ 37

( ప్రియవ్రతుడను ప్రభువుయొక్క పుత్రుడు సూర్యోపాసకుడై సూర్యసాక్షాత్కారమునుపొంది "ఓసూర్యభగవానుడా! నీ మూర్తి ప్రతిష్ఠచేయవలయుననుకోరిక, నాకుగలిగెను. గాన నీయనుగ్రహపూర్వకముగా అట్టు ప్రతిష్ఠాకృత్యాదులను నెఱవేర్చగలవారిని యొసగీయవలయు"నని కోరగా, సూర్యదేవుడు కొంచెముసేపు ధ్యాన నిమగ్నుడై; వేదవేదాంగవేత్తలయిన యెనమండుగురు మహానుభావులను తన శరీరమునుండి ఆవిర్భవింపజేసి, వారల నా రాజునకు కనుపఱచుచూ, యొసగిచ్చిన సూర్యభగవానునియొక్క వాక్యము. )

రాజా! వీరు నాపుత్రులు. పూజనీయులు బ్రాహ్మణశ్రేష్టులు. వీరలచే నామూర్తి ప్రతిష్ఠను చేయించి నిత్య పూజనిమిత్తమై నాయాలయమును వీరలకర్పింపుము. నామూర్తి ప్రతిష్ఠలయందు నాకు చేయదగిన నిత్యపూజయందు వీరు అర్హులు. భోజకులు (అర్చకులు) అయిన యీ బ్రాహ్మణశ్రేష్టులకొఱకు కర్పించబడిన దానిని ఒకప్పుడును భంగపరుపకూడదు. అట్లొనరించిన మహా పాతకులు నాచే గొప్ప శిక్షల నొందగలరు.

'రాజా! నాసంబంధమగు గ్రామము, భూమి, ధనము, ధాన్యము, గృహము మొదలగు సర్వస్వమునకు, భోజకులు (అర్చకులు) అగు యీ బ్రాహ్మణశ్రేష్ఠులే అధికారము గలవారు. ఇతర బ్రాహ్మణ క్షత్రియాదులు ఏవిధముగాను అర్హులుకారు. తండ్రియొక్క సర్వస్వమునకు, కుమారుడు యెట్లు అధికారము గలవాడో? అట్లనే,

నాయొక్క భూమి మొదలగు సర్వస్వమునకు, భోజకులే అధికారము గలవారు.'

"తస్మాద్గ్రామాదికం ద్రవ్యం యత్కించిన్మమవిద్యతే
తత్సర్వం భోజకస్వంహి పితృపర్యాగతం మమ' 42

గనుక నాసంబంధమగు, గ్రామము, భూమి, ధనము, ధాన్యము, మొదలగునదేదిగలదో, నాయొక్క ఆసర్వస్వమును, వంశపారంపర్యముగా భోజకుల (అర్చకుల) యొక్క సొత్తేగాని వేరు కాదు.

'భోజయంతి చమాంనిత్యం తేనతేభోజ భోజకాస్స్మృతాః' 54

నిత్యమును నన్ను భుజింపజేయుదురు గాన వీరికి భోజకులని పేరు.

137 అధ్యాయం 122 పుట.

'విష్ణోర్భాగవతా మగాశ్చసవితు శ్శంభోస్సభస్మద్విజాః
మాతౄణామపి మాతృమండల విదోవిప్రా విదుర్బ్రాహ్మణాః
సర్వేయస్య విముక్త శుక్లవసనాబుద్ధస్య రక్తాంబరా
యేయందేవ ముపాసతే సువిధి నాతైస్తస్య కార్యాక్రియా' 5

"సామాన్యమిదం దేవా నామధివాసనం భవతి మయాకథితం'

విష్ణువుకు, భక్తులగు వైఖానస పాంచరాత్రులు సూర్యునికి మగవంశజులైన బ్రాహ్మణులు—శివునికి, భస్మధారులైన ఆదిశైవ బ్రాహ్మణులు—భక్తులకు శక్తిమండల వేత్తలగు బ్రాహ్మణులు—యెవరు, యేదేవుని, యేవిధితో పూజించు చున్నారో, వారు ఆ దేవుని గురించిన ప్రతిష్ఠాపూజాదిక్రియ ఆ విధితోనే చేయవలయును. ఆయా దేవప్రతిష్ఠాపూజాదికమును గురించి నాచే జెప్పబడిన, ఇది,—(యీ భూమి, ధనము, ధాన్యము మొదలగు ఆదాయము) సమానధర్మము గలదై (నాయొక్క సొత్తు నా అర్చకులకెట్లో ? విష్ణు శివాది దేవాదాయము, ఆయా అర్చకుల కట్లనే) అగుచున్నది—గనుక ప్రతిష్ఠాపూజాది విధులుమాత్రి మాయా యాగమవిధుల ప్రకారము జరిగించవలయునని పై శ్లోకమువలన తెలియుచున్నది.

చిరకాలమునుండి ఆలయధర్మములకు ప్రధానాధారములగు శైవాద్యాగమములు, పురాణములు మొదలయినవి యీ మొదలగు అనేక ధర్మములను చెప్పుచున్నది. "భగవంతుడు కలడు" అనే వాక్యము నిజమై ఆ వున్నవాని వలన' భగవచ్ఛాస్త్రములని పేర్కొన బడుచున్న యీ గ్రంథము లావిర్భవించి, ఆశాస్త్రానుగుణ్యముగా అర్చకకుటుంబము, దేవుడు, ప్రతిష్ఠ, ఆలయము, అర్చన ఆదాయము ఏర్పడి, యున్నవని దలంచినచో భుక్తి, ముక్తి, తిష్ఠ, నిష్ఠలలో, ముక్తి నిష్ఠలకు చేయూత నొసగు, భుక్తి తిష్ఠలకు భంగము కలుగకుండా, యింతదనుక, శాస్త్రానుగుణ్యముగా, చిరకాలానుభవముగా, అర్చక కుటుంబ పోషణకై వినియోగింపబడుచున్న యీ దేవాదాయమనునది ప్రాచీన పద్ధతినుండి, తొలగకుండుగాక, ఏనాటికిని ధర్మమే కనుపండుగ సేయుగాక, సత్యమే తలయెత్తుగాక.

(ఓం నమశ్శివాయ)

అర్ధవరం  అయిలూరి నీలకంఠశాస్త్రి.

శ్రీ శాస్త్రిగారు వ్రాసినటుల పై శాస్త్రప్రమాణములు గమనించి, యీ కల్లోలము నణచివేయుట కవకాశము గలదు. శ్రీగవర్నమెంటువారు సైతము తమ న్యాయశాస్త్రములం దీవిషయమును పరిశీలించి, తీర్పులిచ్చుట సమంజసమై యున్నది. అర్చకుల కేమాత్రం హక్కులు లేవని దెలుపుచున్న బూటకపుమాటలకులోనై హిందూమతసాంప్రదాయ చిహ్నములగు దేవాలయముల నాశన మొనరించుచున్నారు. ఆగమశాస్త్రముల తిరస్కరించు చున్నారు. పండితులు మౌనము వహించి తమ గౌరవముల నిలుపుకొనుచున్నారు. ధర్మసంరక్షణమే, భగవత్సేవ యనియు సాంప్రదాయముల మీరరాదనియు, పలువురు బోధించుచున్నారు.

"సత్యమేవ జయతి నానృతమ్"

పత్రికాధిపతి.

# సాంఘిక లేఖలు

పత్రికవలన గలుగు ప్రయోజనము గుర్తింపక సాంఘికులు మోసము చేయుచున్నారనియు, సదరు పత్రికలు మందుపొట్లాలకై వుపయోగించుచున్నారనియు పలువురు బుద్ధిమంతులు చింతిల్లుచు మాకు లేఖలు వ్రాయుచున్నారు. అందరికి మనవిచేయునదేమనగా—ఇతర శాఖీయులు మనపై దండెత్తివచ్చి మన కులాచారధర్మముల రూపు మాపి, కులగోత్రముల నశింపుచేసి మనకు మహాపకారము గావించు టచే, నామరూపక్రియా రహితమైన సంఘమునకు మరల శక్తి గల్గించి, దుర్వాదముల జయించి సాటికులములకన్న మిన్నయని ప్రమాణములు వెలువరించుచూ, ఇతరుల కొరకే ప్రకటించుచున్నాము గనుక సాంఘికు లెంతటి యనాదరణ జూపినను మేము కినియమని దెలుపు చున్నాము.

(సంపాదకులు)

---

# వార్తలు.

ఖండ ఖండాంతరముల నల్లకల్లోలము చేయుచున్న (ఇటలీ—అబిసీనియా)యుద్ధము ఇంకను చల్లారలేదు. పరిసరదేశములు రాజీ కుదుర్చుటకై యత్నించినను, నిరర్థకమాయెను. పోరాటమువలన యనేకులు మృతిజెందుచుండిరి. యీ యుద్ధము ప్రపంచయుద్ధముగా పరిణమించునేమోయని చాలామంది భీతిని జెందుచున్నారు. ఈశ్వరాజ్ఞ యెట్లు జరుగనున్నదో తెలియదు. గాని దేశమందార్థికపరిస్థితులతో బాధపడుచున్న ప్రజలు, యీ విపత్తునకు తహతహలాడుచున్నారు. ధర్మమే జయించగల దనుసూక్తి నిరర్థకము గాజాలదు.

* * * * *

యీమధ్య చెన్నపురియందు అఖిలభారతకాంగ్రెసు, స్థాయిసంఘసభ, వర్కింగుకమిటీ మున్నగు సభలు జరుగబడెను. కాంగ్రెసు మహా

సభాధ్యక్షుండగు, శ్రీ బాబు రాజేంద్రప్రసాదుగారికి అఖండ స్వాగత మొసంగి చెన్నపురి ఆంధ్రమహాసభ కీర్తి గాంచినది. యీ నెలలో ఆంధ్రదేశ పర్యటన మొనరించుచున్నారు. నిధిని వసూలుపరచి ఆయా రాష్ట్రములకు సహాయ మొనరింపగలరు.

* * * * *

భారత కాంగ్రెస్సువారు మంత్రి పదవీ స్వీకరణసమస్యను లక్నో మహా సభ జరుగువరకు చర్చను తేల్చక వాద ప్రతివాదములు మాత్రము జరుపుకొనవచ్చునని తీర్మానించి యున్నారు. కొందరి కది యసమ్మతిగను మరికొందరికి యానందముగను నున్నదట. యీలోపు గనే జిల్లాబోర్డులయొక్క ఫలితములు తేలగలవు. పిమ్మట యోచించి తీర్మానింపుదురట.

* * * * * *

దేవాదాయపు బోర్డువారి కంట్రిబ్యూషన్ సొమ్ము కొరకు జిల్లా కలెక్టర్లందరు యభిమానించి రివిన్యూ డిపార్టుమెంటు ద్వారా అర్చక భూములపై గల పైరులను జప్తులు చేయించుచున్నారు. యిదెట్టి న్యాయమో దెలియుటలేదు. ఒకవైపున కోర్టులలో దావాలు విచారించుచుండ, మరియొకవైపున పరిష్కరించుచుండ యిట్లు త్వరపడుట వలన బోర్డునకెంతటి బలమున్నదియు ప్రజలకు తేట తెల్లమగుచున్నది. అర్చకభూములన్నియు రివిన్యూవారు స్వాధీనపరచుకొని బోర్డువారికి పట్టాభిషేక మొనరించినను, బదులుమాట్లాడువా రుండనేరరు. "కంచె యే చేనుమేసిన గలదెదిక్కు" యనురీతిని కొనసాగగలదు. యిక న్యాయ స్థానములతో బనియుండనేరదు. అర్చకులు మాత్రము గత్యంతరము చిక్కక తహ తహలాడుచూ, గవర్నమెంటువారిని శరణజొచ్చుచూ తమ విధికృతమునకు చింతిల్లుచున్నారు. భగవానుని యనుగ్రహమెట్లు గానున్నదో నిరీక్షించుచున్నారు.

* * * * *

# కృతజ్ఞత

గుంటూరుజిల్లా పెదనందిపాడు వాస్తవ్యులును సుప్రసిద్ధ సంఘాభిమానులును నగు శ్రీమాన్ పొన్నూరు కుటుంబయ్యగారు తాము చెల్లించవలసిన ఆంగీరస శ్రీముఖ భావ యువ సంవత్సరముల బాపతు చందా తొమ్మిది రూపాయిలు మా కార్యస్థానమునకు జేర్చియున్నారు. ఆర్థిక చిక్కులలో దగుల్కొని దిక్కులేక యల్లాడుచున్న పత్రికారాజమునకు యీ సహాయమే గొప్పగా దలంచి మా కృతజ్ఞతను వెలువరించుచున్నాము.

ఇట్లే ప్రతి సోదరుడును తాము చెల్లించవలసిన చందా బాకీలు తమతమ శక్త్యానుసారముగా నైనను మాకు జేర్పించి సహాయ మొనరించినచో పత్రిక కేవిధమైన అంతరాయము గలుగక ప్రతిమాసము సక్రమముగా వెలువడ గలదని దెలుపుచున్నాము. (షుమారు రెండువేల రూపాయిలకు పైగా దిగుబాటు గలదు.

(పత్రికాధిపతి.)

సం॥ చందా రు 1-8-0 లు. Regd. No. M. 2073.

# శ్రీ ఆదిశైవపత్రిక.

శ్రీ శ్రీకంఠ మఠాధిపతుల యాజ్ఞానుసారముగా శైవ
సంఘాభ్యుదయమునకై శ్రీ గురుకులాశ్రమమునుండి
ప్రతిమాసము ప్రకటింపఁబడును.

సర్వదేవాత్మకో రుద్ర స్సర్వే దేవా శ్శివాత్మకాః ।
రుద్రస్య దక్షిణే పార్శ్వే రవిర్బ్రహ్మా త్రయోగ్నయః ।
వామపార్శ్వే ఉమా దేవీ విష్ణు స్సోమో పి తే త్రయః॥
(రుద్రహృదయోపనిషత్)

సంపాదకుడు:—చిలుమూరు పురుషోత్తమ గురుక్కల్.

| సంపుట ౧౧ | చిలుమూరు యువనామ సం॥ర మార్గశిర-పుష్యమాసములు. | సంచిక ౯-౧౦ |
|---|---|---|

[విలేఖకుల వ్యాసములకు సంపాదకులు ఉత్తరవాదులు కానేరరు]



—♦ విషయసూచిక ♦—



భారతీ ముద్రాక్షరశాల, తెనాలి.

# ఉద్ధారకులు

౧ కీ॥ శే॥ చిలుమూరు తీర్థేశ్వరులవారి జ్ఞాపకార్థం కుమాళ్లు ఉమామహేశ్వరం వగైరాలు, చిలుమూరు

౨ కర్ణాటక రాష్ట్రీయ ఆదిశైవ మహాసంఘమువారు, బెంగుళూరు.

౩ శ్రీమాన్ నడింపల్లి నాగేశ్వరశివాచార్యులవారు, ఇంటూరు.

౪ ... గూడూరు రాఘవరావుగారు, పోతునూరు.

౫ ... గూడూరు సీతయ్యగారు, శనివారపుపేట.

౬ ... అయలూరు వెంకటసుబ్బయ్యగారు, ఆర్తమూరు.

౭ ... పావులూరు రామచంద్రయ్యగారు, మునికోటిపురం.

౮ ... పావులూరు హనుమంతయ్యగారు, మునికోటిపురం.

౯ ... పెనుమూడి సత్యనారాయణగారు, తూర్పుతూచిపూడి.

౧౦ ... స్వర్ణ వెంకటశివావధానులుగారు, బూరుమిల్లి.

౧౧ ... పావులూరు నాగేశ్వరశర్మగారు, అనంతపురం.

౧౨ ... పెనుమూడి హనుమంతరావుగారు, తెనాలి.

౧౩ ... మామిళ్లపల్లి శంకరమ్మగారి జ్ఞాపకార్థం భర్త శివరామదీక్షితులుగారు, చుండూరు.

౧౪ ... మామిళ్లపల్లి సాంబయ్యగారు, చుండూరు

౧౫ ... పొన్నూరు సుబ్రహ్మణ్య పాకయాజిగారు. దండమూడి

౧౬ ... మేడూరి శివయ్యగారు, తేలప్రోలు.

౧౭ ... కుందుర్తి ఆనందరావుగారు, బి. ఏ, దుగ్గిరాల.

౧౮ ... పార్వతమ్మగారి జ్ఞాపకార్థం సత్తెనపల్లి వెంకటరామయ్యగారు ఓవర్ శీయరు, దుగ్గిరాల

౧౯ ... చావలి గంగయ్యగారి జ్ఞాపకార్థం కుమాళ్లు సుబ్బయ్య వగైరాలు, చముడుపాడు

౨౦ ... సంగాపు పానకాలయ్యగారి జ్ఞాపకార్థం కుమాళ్లు వీరయ్యగురుకులు వగైరాలు, నవులూరు

౨౧ ... సంగాపు కోటీశ్వర గురుకులుగారు, మంగళగిరి.

౨౨ ... చిలుమూరు వెంకటసుబ్బయ్యగారు, చిలుమూరు.

౨౩ ... చిలుమూరు కుటుంబయ్యగారు, చిలుమూరు.

౨౪ ... శేకూరు రాఘవశర్మగారు, గుడివాడ.

౨౫ ... చావలి సుబ్బయ్య పంతయ్యగార్లు, పినపాడు.

౨౬ ... చావలి లక్ష్మీకాంతయ్యగారు. బాపట్ల.

౨౭ ... కొల్లిపర రామయ్య, పిచ్చయ్యగార్లు, పెనుమాలి.

౨౮ ... స్వర్ణ చినమల్లయ్యగారి జ్ఞాపకార్థం ధర్మపత్ని బుచ్చమ్మగారు, చీరా

౨౯ ... పెనుమూడి సీతమ్మగారు, జొన్నలగడ్డ.

౩౦ ... పసుమర్తి పార్వతమ్మగారు, కూచిపూడి.

# శ్రీ ఆదిశైవపత్రిక.

సర్వోరుద్ర స్స ఈశాన స్స భగవాన్ స మహేశ్వర స్స మహాదేవః॥
"అధర్వశిరసి."


| సంపుట | చిలుమూరు | సంచిక |
|---|---|---|
| ౧౧ | యువనామ సం॥ర మార్గశిర-పుష్యమాసములు. | ౯-౧౦ |


శ్రీమతేహయగ్రీవాయనమః

౧ బోధానంద విరక్తిభక్తి విమలాచారాది రత్నాకరః
సంసారార్ణవ మజ్జదాశ్రితజనోత్తారక్రియానావికః।
భోగవ్యాళనశేంద్రరీతి రతులశ్రద్ధావిశుద్ధాశయః
బోధానందమహర్షి రుల్లసతు నిస్తంద్రో యతీంద్రోన్వహం ॥

౨ ధామానాదివచశ్శిరఃప్రవిలసద్గూఢార్థరత్నావళేః
బ్రహ్మానందఘనః ప్రసన్నహృదయః కామాదిభీమాకృతిః ।
విద్యావీచిసహస్రసంభ్రమసుధాసింధు ర్వజేజీయతాం
శర్వాణీపతిచింతనామృతరసాస్వాదాత్తమోదాశయః ॥

3 నందద్రుద్రాఖ్యవిశ్వాధికఋషిపరమబ్రహ్మసర్వోత్తమత్వ
స్థేయ శ్రీకంఠగుర్వాకలితమతదృఢస్థాపనానైపుణాఢ్యః ।
శ్రీకంఠాచార్యభాష్యప్రవచనపరమాచార్యపీఠాభిషిక్తః
శ్రౌతస్మార్తాధ్వరక్షాకరణచణమతి స్సర్వతంత్రస్వతంత్రః ॥

౪ దక్షః శాస్త్రేషు దక్షాహితపదజలజద్వంద్వసేవాత్తమేధాః
విశ్వాచార్యోయ మంతేవసదనుచరహితకృ న్నీలకంఠద్వితీయః ।
శ్రీకంఠీయాగమాంతప్రథితవివరణాన్వేషణవ్యాజతో యః
కాశ్మీరాదిప్రదేశే ష్వఖిలబుధజనా న్వాదయుద్ధే విజిగ్యే ॥

౫ మందారస్సంశ్రితానాం జటిలకచభరో భస్మనాఽఽపాదమస్తం
లిప్తాంగ స్సర్వవేత్తా బుధకులపతి స్సద్విజేశావతంసః ।
సాక్షాదీశోపి నార్యాపతి రవిష మనయనః ప్రాప్త భూషాభుజంగః
కించాదగ్ధా పురాణాం న శిరసి జలధృక్ నార్ధదేహోఽవిషాదః॥

౬ హార్ద స్వాగత వత్సలత్వ కుశలప్రశ్నాదరా లోకనై
రాత్మానం సమయాసమాగతజనా నామోదయంతం శ్రమే।
పూర్వాభాషిణ మున్నతం పద మవాప్యాప్య స్తగర్వోదయం
సుస్మేరాననచంద్రికానతజనస్వాంతాంధకారాపహం॥

౭ షిద్ధాద్యాసురజన్మసుర్గమమహ దౌర్భాగ్యార్ధసమ్మేదురాన్
శైవాద్వైతపరాయణా నుపనిషత్సూత్రార్థభాష్యాత్మకాన్
విశ్వేషాం భవసింధుతారణకృతే మాహేశ్వరప్రీతయే
వ్యద్గ్రంథా న్సమచారయ ద్భువి జగత్క్షేమంకరప్రక్రియః॥

౮ జయతి పురుషవ్యాఘ్రో వ్యాఘ్రాజినాంబరసంవృతః
పరశివపదాసక్తో వ్యాఘ్రాంఘ్రివాన్నివ దన్వహం।
వితతవృజినారణ్యానీధావదాతు రమానుష
ప్రబలహృదయాభిఖ్యాన్ జంతూ న్వినేతుమివేహ యః॥

౯ యతిపరిబృఢో జీవన్ముక్తోఽఖిలానుజిఘృక్షయా
తనువిధరణార్థంచాన్నం బ్రహ్మేతివై స రసోపిచ।
మనసి కలయ న్ననం పానం పరార్థనయాఽఽదదా
త్యఖిలమపి య స్తం వందే బ్రహ్మేతిభావనయా స్థితం॥

౧౦ తుష్టస్సన్ సతతం జటానియమనవ్యాజా త్తమస్కాండమా
రుంధానోంతరమాంతమంగ మభిత స్సత్త్వం విభూతిచ్ఛలాత్।
బిభ్రాణో విరజాః పరోరజససుధ్యానా న్యధూన్వ న్రజః
సత్త్వైకాయతనో విరాజతి ముని ర్బోధప్రహర్షాభిధః॥

౧౧ సాంబ శ్చంద్రవతంస స్స్కందగణేశాదిపారిషదయుక్తః।
తత్పూజకగురుపఙ్క్తి ర్జయతు శ్రీకంఠమఠసమృద్ధిశ్చ॥

౧౨ శ్రీదేశికసంగ్రథితా మాలా
విమలా సుపద్యసుమలలితా।
గురుచరణకమలయుగళే
సమర్పితా సాదరం సదా లసతు॥

(ప్రథమాక్షరములు చదువుడు) (ఆదిశైవమహాజనసభా)

---

# శివభక్తుడగు దేవదత్తుని చరిత్ర

పూర్వకాలంబున భాగీరథీతీరంబున నవరత్నశిరోమణి యను పురంబున దేవదత్తశర్మ యనుబ్రాహ్మణోత్తముడు సకలశాస్త్ర పారంగతుడై పూర్వకర్మవశంబున కడుదరిద్రుడైయుండె. అయ్యో! ఈదారిద్ర్య మెంతకాలము భరింపగల ననిచింతిల్లి దేవాదిదేవుండును అష్టైశ్వర్య ప్రదాతయు నగుశంకరుని ప్రార్థించుటకు నిశ్చయించి సింహ శరభ శార్దూలాదులకు జంకకద్ఘనశైలములతో నిండిన యొక మహా రణ్యంబునత్రిలోకపూజ్యంబగు శతశృంగ యనుపర్వతమునకుచేరి సమాధి నిష్ఠుండై అతిఘోరంబగు తపస్సు చేయందొడంగె. ఎనిమిది రాళ్లచే నిర్మింపబడిన యొకగూటియందు మృణ్మయలింగంబును స్థాపించి మహా దేవు నావాహనంబొనరించి పంచాక్షరీమంత్రముచే సర్వోపచారములు సమర్పించి శివధ్యానరతుడై తపమాచరించుచున్న దేవదత్తుని భక్తికి సంతసించి సకలగుణ పరివృతుడై సర్వదేవతాధ్యక్షుండగు మహాదేవుడు అంబాసహితుడై దేవదత్తునిసమీపించి భక్తాగ్రేసరా! ఇక నీతపము చాలించి వలయుకోర్కెల దెల్పుమని యనుగ్రహింప దేవదత్తుడు పుల

కాంకిత శరీరుండై ప్రదక్షిణనమస్కారాదులొనరించుచూ స్తోత్రములతో ధ్యానించుచూ ఆనందమున నోలలాడుచూ సాష్టాంగ నమస్కారము లొనరింప దేవాదిదేవుడు స్వయముగా దేవదత్తుని చేరందిసి నాయనా నీమనస్సునందలి కోర్కెల నెరింగియుంటిని గావున అష్టైశ్వర్య యుక్తుడవై ఇహలోకంబున సమస్తసుఖము లనుభవించి అంత్యంబున మత్సాయుజ్య పదవి నొందగలవని యాశీర్వదించి దేవదత్తుని స్వగృహంబునకుంబోవ నాజ్ఞాపించి యంతర్హితుండయ్యె. పిమ్మట తనయదృష్టమునకు దేవదత్తుం డపరిమితానందమున స్వగృహమునకు జేరి మితిలేని సౌఖ్యములతో భగవదనుగ్రహపాత్రుండై యనేక ధర్మసంస్థాపనలు గావించి దివ్యదేహధారియై శివలోకమునకు జేరినవాడని స్కాంద పురాణమునందు గలదు.

ఈచరిత్రయొక్క పవిత్రతను శివానుగ్రహ విశేషమును గమనించి తరింపగలందులకు ప్రార్థించుచున్నాను

(యలమంచిలి సత్యనారాయణ కవి.)

పోలమూరు, గోదావరిజిల్లా

---

# శ్రీ శ్రీ కంఠమఠాధిపతుల పర్యటనము

జగద్గురు శ్రీ శ్రీకంఠశివాచార్య స్వాములవారు మదరాసు నుండి గుంటూరు మండలమున పర్యటన మొనరించి గోదావరిజిల్లాయందు సంచార మొనరించుచున్నారు. శ్రీ వారికి శరీరమున నుద్భవించిన వ్రణము పూర్తిగా నిర్మూలనముగాకున్నను సంఘోద్ధరణ దీక్షాతత్పరు లగుటవలన ఆబాధను లక్ష్యముజేయక పరిపూర్ణానందతత్వామృతమును గ్రోలుచూ ఉపనిషద్భాష్య ప్రచురణకై స్వంతముద్రణాలయ సంపాదనానిమగ్నులగుచూ ఆదిశైవమతసంరక్షణ ప్రబోధ మొనరించుచున్నారని దెలుపుట కానందించుచున్నారము. శ్రీవారియనుగ్రహ

పాత్రులగు సోదరు లీతరుణమును వ్యర్థపరుపక ప్రబోధ మాలకించి,దీక్షా పరులై సంఘసేవకు గడంగు టత్యావసరమని విన్నవించుచున్నాము.

(శ్రీగురుకులాశ్రమము)

---

# దేవాలయములు-పంచాయతీలు

లోకల్ బోర్డు పత్రిక-డిశంబరు (1935) సంచికనుండి యీ క్రింది సంగతులు సంగ్రహీతములు .........

ప్రతి మతమునందును జనసామాన్యము భగవంతుని స్మరించు కొనుటకై ఏర్పరచుకొన్నస్థలము చాల పవిత్రమైన దగుటచే మానవుకు ప్రతిదినము ఆస్థలమునకుబోయి భగవంతుని స్మరించుకొనుట శ్రేయస్కరమనియు, ఇస్లే మహమ్మదీయులు, క్రైస్తవులు గూడ దేవమందిరములు నిర్మించి ప్రతివారము తప్పక ఆమందిరములకు హాజరై ప్రార్థనలు జేయుచుందురనియు ఆలయమునకు మన పూర్వులు స్థిరవసతులు నెలకొల్పుట గొప్ప మహత్కార్యమనియు హిందూమతమున కీదేవాలయములు పవిత్ర స్థానములై ప్రధానములై యున్నవనియు దేవాలయము లేనిచోట ఉదకమైనను పుచ్చుకొనరాదని శాస్త్రములు బల్కుచున్నందున ప్రతిగ్రామమునందును శివాలయముగాని, విష్ణ్వాలయముగాని తప్పక నెలకొల్పియున్నారనియు సదరు ఆలయములకు స్థిరవసతులు గల్పించియున్నను నేటికాలమునకు ఆఆదాయము దుర్వినియోగపడుచూ దేవాలయములు చికిత్సలోనున్నవనియు, అర్చకులు సదరు భూములు అన్యాక్రాంతములు చేసియున్నారనియు, ఆలయధర్మకర్తలనేవారు సదా అర్చకులతో విరోధములు పెట్టుకొనుచూ స్వామిద్రవ్యమును దిగమ్రింగుచూగర్వముతోనున్నారనియు,హిందూధర్మాదాయపు బోర్డువారైనను యీదేవాలయ వ్యవహారములు చక్కబరచుట కశక్తులై, గొప్పగొప్ప జీతములుగైకొనుచూ పన్నులు విధించి, సదరు

కంట్రిబ్యూషను పన్నులువసూలు చేసుకొనుటకే వ్యవధిచాలని కార్య క్రమములో నిమగ్నులైయున్నారనియు, బోర్డుతరపున నేర్పాటుచేసిన కమిటీలలో కొందరికి విగ్రహారాధనయందిష్టములేని వారుగూడ గలరనియు, దేవాలయములలో దేవుడున్నాడని యొప్పుకొనరనియు, అట్టి బుద్ధులుగలవారు దేవాలయ పరిపాలనకు తగరనియు, బోర్డువారి పనులు తృప్తికరముగా లేవనియు, ఆలయలోపములు గమనించి చక్కబరచుట మనవిధియనియు, పూర్వులుగావించిన ఏర్పాటులన్నియు గమనించి శ్రద్ధగా ఆలయసంరక్షణ మొనరించుట ముఖ్యమనియు, సంవత్సరాని కొకపర్యాయమైనను దేవాలయముఖము గాంచని పెద్దలు మనలో గలరనియు, దేవాలయ ప్రాంగణములలో మనబాలురు చీట్లాటలు చుట్టలు బీడీలతో గల్లంతు చేయుచున్నారనియు, సాయంత్రమునకు తట్టెడు ఎంగిలిచుట్టలు ప్రోగు అగుచున్నవనియు, ఇట్లొనరించుట హిందూమత విరుద్ధమగుచున్నదనియు, యింక ననేకవిషయములతో గొప్పవ్యాసము ప్రకటించియున్నారు. మామనవి యేమనగా—

దేవాలయ వ్యవహారములన్నియు, గ్రామ ప్రజలయందే యుండవలెననియు, హిందూధర్మశాస్త్రములు చక్కగా దెలిసిన పెద్దలతో సదరు దేవాలయ పరిపాలన గావింపవలెననియు, ఆగమశాస్త్రధర్మములకు వ్యతిరేకముగా ప్రవర్తింపరాదనియు, భక్తిశ్రద్ధలు గలవారై దేవతా కైంకర్యముల గావించుచుండవలెననియు, దేవునకు అర్చకునకు గల సంబంధములు, దేవాలయములకు సంబంధించిన శాస్త్రములు, దాతల యుద్దేశ్యములు, ధర్మప్రతిష్ఠాపన వివరములు నిష్కళంక హృదయులై విశాలముగాచర్చించి హిందూధర్మముల నుద్ధరించుడనియే మేము చిరకాలమునుంచి ప్రార్థించుచున్నాము. ఇట్టి మహోపన్యాసము గావించిన లోకల్ బోర్డు పత్రికాసంపాదకుల నభినందించుచూ వారితో మేమేకీభవించుచున్నాము. (పత్రికాధిపతి)

---

# అగ్నౌకరణనిర్ణయః

ది 17-8-1935 సం॥రం తారీకున బూతుమిల్లి గ్రామవాస్తవ్యులు బ్రహ్మశ్రీ స్వర్ణవెంకటశివావధానులుగారు బ్రహ్మశ్రీలయపులూరి రామశాస్త్రిలు ప్రభృతులవారిపేర యీ "అగ్నౌకరణ నిర్ణయమును గురించిన్నీ ప్రత్యాబ్ది కాదులయందు త్రిపిండ విధానముకలదా, లేదా" అనువిషయమును గురించిన్నీ చాలాసందేహబుద్ధితో యున్నట్టు వ్రాసిన ఉత్తరమునుచూచుట సంభవించినది. ఈసందేహమును గురించి లోగడ మరికొందరు పెద్దలుకూడా ఆయా కాలములయందు విచారణ చేస్తూ (గతాను గతికోలోకః) అనునట్లు ఆచారమాత్రముతోనే సంతుష్టిపడి నిశ్చయధర్మమును తెలియుటకు ప్రయత్నించకుండుట ప్రాయశః చూచుచుంటిని. గనుక ఇట్టిమహత్తర ధర్మనిర్ణయములు నిర్ణయించుట కించిత్ప్రాజ్ఞులమగు అస్మదాదులకు శక్యముకాని దైనప్పటికినీ, ప్రస్తుతం సంఘమందు ప్రబలుచున్న ఆచారభేదములను చూచుటవల్లనున్నూ గ్రంథస్థధర్మములు వేరుగాయుండుటవల్లనున్నూ యీపై ధర్మనిర్ణయమును వ్రాయబూనుకొంటిని. సర్వ ఋషిసాంప్రదాయకములై విధివిహితములైన సప్తపాకయజ్ఞములలో మాసశ్రాద్ధ ప్రకరణమును విశేషముయిన ఆధారముచేసికొని పిండపితృయజ్ఞ పార్వణ శ్రాద్ధాదులతో సంపుటిచేసి ఆపస్తంబులు ప్రత్యాబ్దికాదిక్రియలను నెరపుచుండిరి. అనగా, సప్తపాక యజ్ఞహోమములు ఔపాసనాగ్నియందే జరుపవలసినదిగా నృసింహకారికావళియందు (స్మార్తాగ్నౌ పాకయజ్ఞేత్యాది) ప్రమాణములుండుటవల్ల పాక యజ్ఞాంతరములగు ప్రత్యాబ్దికాదులయందు అగ్నౌకరణహోమము ఔపాసనాగ్నియందే చేయుచుండు నాచారముగలదు. గాని సర్వాధానిపక్షములో నృసింహకారికావళియందే (యజ్ఞైస్సార్థం-లౌకికాగ్నౌచే) త్యాదిప్రమాణములచే లౌకికాగ్నియందుకూడా అగ్నౌకరణ విధిగానబడుచున్నది.—

యిదిగాక ఆశ్వలాయన ఋషిమతమందుకూడా విశేషవిధులన్నిటియందు అగ్నౌకరణహోమము పాణ్యగ్నియందు చేయవలసినదిగా చెప్పబడియున్నది. యిందుప్రమాణం "శృతిర్బ్రాహ్మణస్య దక్షిణే హస్తే హోతవ్యం" ఇతిస్మార్త ప్రదీపికాయాం (అన్వష్టక్యంచ=సమీపతః) అవిధానాదుత్తరేషు పాణావే వేతరే ష్వపితిచ, తత్త్రైవ సర్వాధానివిషయే (సర్వాదానీతు సర్వేషు శ్రాద్ధేతుషు కరేహునే) తీత్యాదిప్రమాణములవల్ల ఔపాసనాగ్నియందే అగ్నౌకరణ హోమసిద్ధికలదనెడి విధి కానుపించదు. కాత్యాయన ఋషిమతమందు

కాత్యాయనో బ్రవీదేవంలౌకికాగ్నౌహునే, దితి,, తత్త్రైవఉక్తం బోధాయన ఋషిమతమందుకూడా, "శ్రోత్రియాకారాదాహృతేగ్నౌ అనెడి యభిప్రాయమును బట్టి అగ్నౌకరణహోమము లౌకికాగ్నియందే చేయవలయునని బోధించుచున్నది. ఇదియుగాక యీబోధాయనగృహ్య సూత్రములయందే, తదితరస్థలములయందు ఔపాసనాదేకదేశం ప్రణవే నాహృత్య, వ్యాహృతిభిర్నియుష్య, అనిచెప్పినటులే, పిండపితృయజ్ఞాదులయందు కూడ ఔపాసనాగ్నియందే చేయవలెననెడి అభిప్రాయము సూచించియుండవలెను. అట్టి విధులేమియు కానుపించనందునన్నూ, తదితర ప్రయోగమణిమాలికాది గ్రంథములయందు కూడా యెట్టి విశేషవిధులున్న గనుపించక పోవుటవల్లనున్నూ, పైనవుదహరించిన ఋషిమతములయందు కూడా ఔపాసనాగ్నియందే అగ్నౌకరణ హోమం చేయవలెననెడి నిశ్చయవిధి లేకపోవుటచేతనున్నూ తదితర బహుప్రమాణగ్రంథముల వల్లనున్నూ అగ్నౌకరణహోమము ప్రత్యేక సంస్కారితాగ్నియందే చేయవలెను. ప్రత్యాబ్దికాదులయందు, ఔపాసనాగ్నియే అక్కరలేని సందర్భమున విచ్ఛిన్నౌపాసనాగ్నియందా? లేక అవిచ్ఛిన్నాగ్నియందా యనెడి సందేహమునొందుట సంగతము. కాని, తదితర స్తలములయందు విచ్ఛినాగ్నిసంధానము చేయవలసినయెడల తత్కర్త కెంతకాలమగ్నినష్టమైనదో ఆకాలపరిమితిని బట్టి బోధాయన గృహ్యశేషచతుర్థ ప్రశ్నలో అష్టమోధ్యాయమందు తత్త్రత్రా

యశ్చిత్తభేదములు చెప్పబడినవి. గనుక ఆవిషయములు గ్రంథవిస్తరభీతి చేతను ప్రస్తుత ప్రకరణానవసరాంశమగుటచే వ్రాయపిరమించితిని.

(2) ప్రత్యాబ్దికాదులయందు త్రిపిండవిధానము కలదా? లేదా? యని కూడ సందేహిస్తూ వైవాహికశ్రాద్ధమునకే త్రిపిండవిధానము బోధాయనోక్తముగాని తదితర కర్మలకు అట్టి విధిలేదని కొందరభిప్రాయపడుచున్నారు. యిట్టి సందేహమే శ్రీ శివావధాన్లుగారికి కూడ కలిగినట్లు వారు వ్రాసిన ఉత్తరంవల్ల ఊహించెదను. వారు చూచిన వైవాహికశ్రాద్ధమందేగాక బోధాయన గృహ్యశేష పంచమ ప్రశ్నయందు షష్ఠాధ్యాయములో పంచమీ శ్రాద్ధమను పేరుతో పిండపితృయజ్ఞము త్రిపిండవిధానముగా వ్రాయబడినది. యిదియునుగాక బోధాయన గృహ్యపరిభాషయందు ప్రథమ ప్రశ్నలో తొమ్మిదవ అధ్యాయముకూడా త్రిపిండవిధానమునే బోధించుచున్నది. గనుక తదితరశ్రాద్ధాది పిండవిధానములు ఆయా యీ ప్రకరణములయందు ప్రాయశః వివరింపబడినవి. గనుక ప్రత్యాబ్దికాదులయందు త్రిపిండవిధానమే శాస్త్రసిద్ధమైన ఆచారముగాని తదితరములుకావు. గన్క యీ పైవిషయములు ప్రాజ్ఞులు గ్రహించి విమర్శించి విశేషాంశములు తెలిపిన యడల ముందు వ్యాసములో సవరణచేసెదను.

(ఇట్లువిధేయ్డు ఆయలూరి కామేశ్వరి గురుకులు)

---

# విచిత్రదేవాలయము

రెడ్డిరాణిపత్రిక ౧౯౩౫ డిశంబరు సంచికలో కే. సుబ్రహ్మణ్యారెడ్డి బి. ఏ. గారిట్లువ్రాసిరి యిదివరకువున్న దేవాలయములు రూపుమాపి, గ్రామమున కొక్కటే దేవాలయ ముండవలెననియు, అందు మహమ్మదీయులు క్రైస్తవులు హిందువులు నిర్గుణోపాసకులు సగుణో

పాసకులు వారివారి యిష్టానుసారముగా ధ్యానించుటకు తగిన మూర్తులతో గదులు నేర్పరచవలెననియు, మరియు నాటకములు హరికథలు బడిచదువులు సంగీతములు జరుగుటకు దానియందు మంచి వసతులు గల్పించవలెననియు, ఉపన్యాసములు సభలు జరుపుటకు మంచి విశాలముగా కల్పించిన హాలులున్నూ గ్రంథాలయము నెలకొల్పి సర్వజనులు ధారాళముగా వచ్చునటుల తగిన వసతులు ఏర్పాటు చేయువలెననియు, సర్వవ్యవహారాలు దేవాలయములందే పరిష్కారము జేయుచుండవలెననియు, శివ, విష్ణు, బ్రహ్మాది దేవతలన్నిటిని అందే ప్రతిష్ఠించవలెననియు, అందువలన గ్రామమధ్యనే ఇట్టి దేవాలయము నిర్మించుటావశ్యకమనియు, ఎక్కువ దేవాలయాలుంటే తగవులు గలిగి ఐకమత్యతకు భంగము గల్గుననియు, ఒకే దేవాలయములో అన్నిమతములవారు చేరుచుండుట శ్రేయస్కరమనియు, ఆస్పత్రి, బ్యాంకులు, గుడ్డలకొట్లు, చిల్లరదుకాణముల సంతలు వగైరాలుకూడా నుండులాగున ఊరికొకదేవాలయ మేర్పడుట మంచిదని సలహా నొసంగుచున్నారు. ప్రజల కోర్కెలిట్లున్నవి. భగవంతు డేమిచేయగలడో నిరీక్షింపక తప్పదు.

(స్వామిసద్యోజాత శివాచార్య)

---

## స్వీకృతి

(౧) ప్రాథమికవిద్య కాకినాడనుండి శ్రీయుతులు జి. సూర్యనారాయణ గారి యాజమాన్యమున వెలువడుచున్న విద్యాసంబంధమైన మాసపత్రిక మాకార్యాలయ మలంకరించినది. ఉపాధ్యాయులకు రైతులకు నుపయోగపడుచున్న యనేక సద్విషయములు గలవు. సంవత్సరచందా 1-0-0 మాత్రము.

(౨) కౌముది తెనాలినుండి నూతనముగా శ్రీయుతులు జి. వి. కృష్ణారావుగారి సంపాదకత్వమున సారస్వత రాజకీయ సాంఘికవిషయాదుల

చర్చించు మాసపత్రిక. ప్రథమద్వితీయ సంచికల నందుకొని పరిశీలించితిమి. నూతన పద్ధతితో నడచుటచే బహు ముచ్చటగానున్నది. చందా 1-4-0. వలయువారు గాంధిచౌక్ తెనాలి అని వ్రాయవలెను.

(3) ఉదయలక్ష్మి కాకినాడనుండి శ్రీయుతులు మోచర్ల హనుమంతరావు పంతులువారి యాజమాన్యమున సమస్త విషయములతో లోకమునందుగల పోలికలవిమర్శించు కథలతో నెలకొల్పిన మాసపత్రిక. చాలా అందముగానున్నది. విడిసంచిక 0-2-0లు మాత్రము.

(౪) సుందరీ క్యాలండరు నెల్లూరుజిల్లా పెరిదేపినందుగల ఆయుర్వేద సమాజమువారిచే 1936 సంవత్సరమునకు తయారుచేసిన క్యాలండరు మాకార్యాలయ మలంకరించినది. చాలా సౌందర్యముగా నున్నది. వెల 0-2-0 లు మాత్రము చక్కని సుందరిగలదు.

(౫) భాగవత తత్వార్థమంజరి గుంటూరుజిల్లా వల్లభాపురం గ్రామ వాస్తవ్యులును, పండిత శిఖామణులును, విజ్ఞానదురంధరులునగు శ్రీయుతులు నైషధం చంద్రమౌళిశాస్త్రిగారిచే శ్రీమద్భాగవతమునందలి దశావతార తత్వములన్నింటిని కేంద్రీకరించి చక్కని భాషతో అద్వైతానుసంధాన మొనర్పబడినది. యీ మహద్గ్రంథమును పరిశీలించువారు వితండవాదముల వదలి భక్తిజ్ఞానమార్గములకు పరువులెత్తగలరు. విజ్ఞానమును పెంపొందించుకొని జన్మరాహిత్యులై తరింపగలరు. శ్రీ శాస్త్రిలవారు గావించిన లోకోపకారమునకు మేమభినందించుచున్నాము. శ్రీవారు దీర్ఘాయుష్మంతులై యిట్టి మహద్గ్రంథములను నుద్ధరింపగలరని మాయెందు విశ్వాసము. వెల 2-0-0 లు. వలయువారు గ్రంథకర్తగారికి వ్రాయవలెను.

౬) స్తోత్రరత్నము శ్రీవాసుదాసుగారి శిష్యరేణువులలో నొకరగు శ్రీయుతులు యామర్తి సుబ్బదాసుగారిచే ఆంధ్రానువాద మొనర్పబడిన ఆళ్వందారులస్తోత్రరత్నము వైష్ణవవిశిష్టాద్వైతపరులు దీనిని నామూ

లాగ్రముగా పఠించి తరింపగలరని గ్రంథకర్తగారు విన్నవించు చున్నారు. భక్తిసంజీవని చందాదారులకుమాత్రమే ఉచితముగానొసంగ గలరు.

---

యీనెలలో చందాలుచెల్లించినవారు

(౧) శ్రీమాన్ కంఠంరాజు వెంకటసుబ్బయ్య (శ్రోత్రియందారు) భట్లపల్లిఅగ్రహారం (గుంటూరుజిల్లా) ౧౦-౦-౦

(౨) శ్రీమాన్ వెలవలపల్లి వెంకటేశ్వర దీక్షితులుగారు సాలూరు యువసంవత్సర మహారాజ పోషక చందా(విశాఖపట్నం) ౪-౦-౦

(3) శ్రీమాన్ చావలి శేషయ్య గురుకులుగారు వీరవల్లి కృష్ణాజిల్లా యువసంవత్సరచందా ౧-౮-౦

(౪) శ్రీమాన్ యలమంచిలి సత్యనారాయణ కవిగారు పాలమూరు యువచందా (గోదావరి) ౧—౮—౦

(౫) శ్రీమాన్ మడనూరు సుందరయ్యగురుకులు ఈతముక్కల (భవ- యువ- ధాత పోషకచందా) ౫—౦—౦

(౬) శ్రీమాన్ రుద్రపాక రాజయ్యడాక్టరుగారు భీమడోలు (ఆంగీరస- శ్రీముఖ- భవ- యువ) ౬—౦—౦

సంఘ సన్మానములు

(౧) శ్రీమాన్ స్వర్ణ పార్వతీశంగారు చీరాల ౧—౦—౦

(౨) శ్రీమాన్ కారంచేడు లింగయ్యగారు దేవరపల్లి. ౧—౦—౦

(3) శ్రీమాన్ సంగాపు వీరయ్యగురుకులుగారు (తన కుమారుని నామకరణ మహోత్సవతరుణమున (దుగ్గిరాల) ౧—౦—౦

---

సోదరులారా!

పదునొకండు సంవత్సరములనుంచి పత్రికను వెలువరించు చున్నను సాంఘికులకు సంఘాభిమానము గలుగనందులకు మిక్కలి విచారించుచున్నాము. పత్రికా ప్రచారమునకంటె సులభమగుమార్గము మరొకటిలేదని పెద్దలు దెలుపుచున్నారు గావున సంవత్సరమునకు 1-8-0లు చెల్లించి పత్రికనురక్షించుట కష్టములోనిది గానేరదు. గావున అన్ని పత్రికలతోబాటు పత్రిక చందాగూడ విధిగాచెల్లించి జాతి మతసంరక్షణ గావించగలరని ప్రార్థించుచున్నాము. (సం)

# దేవాలయములు

దేవతలు నివసించు స్థలమునకు దేవాలయ మనిపేరు గలదు. దేవతలయందు లయించుటయే దేవాలయ మనుచుందరు. భక్తి పార వశ్యముచే భగవంతుని యందైక్యమగుటకు ప్రయత్నించువారే భక్తులు. యోగులు దీనినే జీవబ్రహ్మైక్యసంధానమందురు. భగవంతుడు సర్వ వ్యాపి. ఆయన లేనిచోటు సూదిమొనయంతైనను లేదు. అందుల కుదాహరణము గమనించుడు. అగ్ని అన్నిటియందును తుదకు మంచు గడ్డయందును గూడ నిండియున్నను ప్రత్యేకముగా అగ్గిపెట్టె, నిప్పు పుల్లలని మనము వాడుచుందుము. అల్లే సర్వవ్యాపకుడగు భగవంతుని గూర్చి విచారించితిమేని దేవాలయములందే ముఖ్యముగా గన్పట్టు చుండును. మరియు భగవత్తేజము నెచ్చట గన్పించుచుండునో అదియే దేవాలయమగు చున్నదని కొందరు దెలుపుచున్నారు. అష్టాంగ యోగులు యీశరీరమే దేవాలయమని నిర్ణయించుచున్నారు. యీ దేవాలయములలో శివాలయములనియు విష్ణ్వాలయములనియు శక్త్యా

లయములనియు వివిధ రకములుగా సగుణమూర్తులను నిర్ణయించి ఆలయముల నేర్పరచిరి. యీఆలయ వ్యవస్థకు ముఖ్యశాస్త్రము ఆగ మములని దెలుసుకొనవలెను. ఆగమ వ్యతిరిక్తమైన విధులాచరించినచో దేవద్రోహమునకు జెందగలరు. భక్తులు యీదేవాలయముల సేవించు చుందురు. రామదాసు, ప్రహ్లాదుడు, మార్కండేయుడు మున్నగు మహాభక్తులే తార్కాణము. హృదయమునందు గల భగవంతుని సాక్షాత్కరించుటకొరకెట్టిసాధనము నవలబింపవలెనో దేవాలయము లందలి దేవతలు సాక్షాత్కరించుటకు గూడ నట్టిసాధనమే చేయవలసి వుండును. భగవంతునియందు ప్రేమజూపుటయే భక్తి యనబడును. తైలధారవలె భగవంతుని యందెడతెగని ప్రేమజూపుటయే భక్తి సాధనము. దేవాలయ నిర్మాణము పుష్పోద్యానవననిర్మాణము దేవాల యములలో అలుకుట ముగ్గుపెట్టుట భగవంతుని సేవించుట మ్రోయుట నృత్యముచేయుట మున్నగునవియే మోక్షసాధనములని శృతులు బల్కుచున్నవి. భక్తియే మోక్షమునకు ప్రథమసోపానమై యున్నది. ఒక పదార్థమందు ప్రేమ గలుగుటకు కారణము నేత్రదృష్టియే. దాని వలన హృదయమునకు ప్రీతి గలుగుచున్నది. ప్రీతివలన భక్తి యల వడును. పాలయందు పెరుగు నెయ్యి యిమిడినట్లు పరమేశ్వరుడే ప్రపంచములోని జీవరాసులయందు నివసించుచున్నాడు. ఒకమ్రాను మొద్దుగా నున్నపుడెవ్వరిని నాకర్షింపజాలక అవయవ నిర్మాణముతో అలంకరించిన సందరినెట్లు నాకర్షించునో అట్లే భగవన్మూర్తులవలన భక్తి యభివృద్ధి నొందగలదు. దేవాలయమునకు బోవువారు దేవతా దర్శనమైనదని యనుచుందురేగాని రాతిబొమ్మను కొయ్య విగ్రహము లను జూచినామనిగాని ఓరాయీ, ఓలోహమా, యని ధ్యానించితిమని గాని చెప్పుదురా? చెప్పజాలరు. అచ్చట భగవంతుని దర్శనమైనదని నమ్ముచుందురు. అట్టి మహాభక్తశిఖామణులే జన్మరాహిత్యులై, నేటి వరకు ప్రకాశించుచున్నారు. శ్రీరాముని కాలమందే అయోధ్యలో దేవాలయములున్నవని దెలియుచున్నది. కృష్ణునికాలమున దేవాలయము

లెన్ని యోగలవని భాగవతము జెప్పుచున్నది. మార్కండేయుని కాలము విచారించినచో యీదేవాలయములు సృష్టినుండియు గలవని దెలియ గలదు. శాస్త్రవిధులతో పూజించుమూర్తులు అత్యంత తేజస్సుతో ప్రకాశింపగలవు. రాజును గాంచినచో సేవకుడెంతటి భయ వినయములతో వర్తింపవలెనో దేవాలయములకుజనువారంతటిభయభక్తులతోనుండుట పరమధర్మమైయున్నది. నిప్పునకు బొగ్గునకు ఎంతటితారతమ్యముండునో ఆగమ శాస్త్రములచే ప్రతిష్ఠించి పూజించు మూర్తివంతములకును మిగతా రాతిబొమ్మలకును నంతటి వ్యత్యాసముగలదు. మంత్ర యంత్రాదులవలన తేజస్సువృద్ధియై భక్తుల నానందసాగరమున నోలలాడింపగలవు. పూర్వపురుషులు దేవాలయములేని గ్రామమునందు తుదకు మంచినీళ్లైనను త్రాగెడివారుగారట. ముఖమునందు తిలకములేని వారితో సంభాషించెడివారుగారట. సర్వేశ్వరుండగు భగవానుడు లోకోద్ధరణ నిమిత్తమై యనేక యవతారములెత్తి కాలానుగుణ్యములగుధర్మముల నుద్ధరించుచుండునని యనేక ప్రమాణములుగలవు. ఆరంభమున నదీతీరములయందును, పర్వతాగ్రములయందును నెలకొల్పిన యీ దేవాలయములు ప్రతిపల్లెయందును స్థాపించుట, వృద్ధిలోనికిదెచ్చుట హిందూ మహారాజులయొక్క ముఖ్యవ్రతమై యుండెను. హిందూమతమున కీదేవాలయములు శిరస్సువంటివి. మతవిశ్వాసము నేటికిని దేవాలయములందే ప్రకాశించుచున్నదనుట సత్యము. దేవాలయములయందు ఆనందమునకు గొప్పస్థానముగలదు. మంగళ వాద్యములు, తీర్థప్రసాదాదులు, భజనసంకీర్తనములు మున్నగువాట్లతో భక్తుల హృదయము లుప్పొంగుచుండును. శ్రీకాశీరామేశ్వరాది దివ్యస్థలములు నేటికిని చెక్కుచెదరక నిలచియుండుటయు, భక్తులు తరించుచుండుటయు గమనించువారికి గోచరమగుచున్నది. ఇట్టి దేవాలయముల నెవ్వరును చెదరగొట్టుటకు సాధ్యులుకానేరరు. పూర్వపు మహారాజులు యీ ఆలయవ్యవస్థ చిరకాలము నెరవేరుటకై యనేక అగ్రహారములు, భూములు దానమొనరించి భగవత్ప్రీతిగా సర్వసమర్పణము గావించి

యున్నారు. భగవన్నామనసపుత్రులగు ఆదిశైవ వైఖానస పాంచరాత్ర బ్రాహ్మణుల కీయాలయాధికారము నొసంగి తత్పరిపాలనము జేయించు చుండిరి. రానురాను కలికాలమహాత్మ్యముచే ఆలయములం దశ్రద్ధవహిం చుటయు, దుర్మతములు వృద్ధియై సనాతనములగు నీయాలయముల నగౌరవపరచి తత్ స్థానాచార్యుల నవమానపరచుటకు ప్రబల ప్రయత్న ములు గావింపబడెను. హృదయములందు భగవంతుడున్నాడు గనుక ఆలయములకు బోవలసిన యవసరము లేదనియు, అదంతయు వట్టిమోస మనియు బోధించుచున్న మతాచార్యులు వేనకువేలు ప్రబలినారు. అచలగురువుల మతములు నెలకొల్పబడి విశిష్టాద్వైతమునకు వ్యతిరేక ప్రచారముగావించుచూ ప్రబలాందోళనము జేయబడుచుండెను. ఇంతలో దేవాదాయపు ఆక్టుకూడ యుద్భవించి ఆగమ ఆలయ ఆచార్య ధర్మముల రూపుమాపుటకు సిద్ధమయ్యెను. ఆలయములం దర్చకస్వాములకు హక్కు లేదనియు, అర్చకులే చాలామోసము చేయుచున్నారనియు, ఆదాయ మంతయు ధ్వంసమై పోవుచున్నదనియు నొకవిచిత్ర సిద్ధాంతముతో గ్రామ ములు పల్లెలు పట్టణములం దాందోళనయగునట్లు షుమారు రు 7 లక్షల రూపాయలు గవర్నమెంటువారివద్ద అప్పుగైకొని యొక బోర్డునేర్పరచి పర్య టనము గావించుచూ నూతనధర్మముల నెలకొల్పుచూ దాతలయుద్దేశ్య ములు భంగపరచుచున్నారు. పరమేశ్వరుడీవిచిత్ర మంతయు దిలకించి కలియుగ ప్రజలకోరికలన్నిటిని పరిశీలించుచున్నాడు. త్వరలో శాంతిని నెలకొల్పి లోకకల్యాణ మొనరింపగలడు. ఓం శాంతిః

(శ్రీగురుకులాశ్రమము)

---

## వార్తలు

ఇటలీవారు అబిసీనియా యను రాజ్యము నాక్రమించుకొను టకై చాలా కాలమునుంచి యుద్ధముగావించు చున్నారు. యతోధర్మ స్తతోజయః యనునట్లు అబిసీనియారాజునకు అపజయము గలుగక

తన రాజ్యమునందలి ప్రజల సహాయము ఎక్కువగా గలుగుచున్నం దున శత్రురాజులను వెనుకకు తరిమివైచుచున్నారట.

* * * * * *

రోజునకు మూడున్నరలక్షల రూపాయిలు వ్యయపరచుచూ బాంబులు, విషవాయువులు, మర ఫిరంగులు మొదలగు సాధనము లన్నియు అబిసీనియాపై ప్రయోగించి నోరులేని ప్రజలను నాశనము చేయుచున్నను అబిసీనియనులు చలింపక దేశాభిమానము త్యాగము ధైర్యము సడలింపక ఇటలీవారి నెదిరించుచూ జయముగావించుట శ్రేయోదాయకమే

* * * *

ఇటలీవారియందు బహిష్కరణ ఆంక్షను ప్రయోగించిన నానారాజ్య సంఘమువారు సంధి నాలోచించి విఫలులైరి. ప్రస్తుత మున యీ యుద్ధము చల్లారదనియు ప్రపంచయుద్ధముగా పరిణమించు సూచనలు గలవనియు పలువురు భయపడుచున్నారు

* * * * * *

దేశీయమహాజన సభ యనంబడు కాంగ్రెస్సు జన్మించి యేబది వత్సరము లైనందున (డిశంబరు 28 1935 తేదీన) దేశమందంతటను ప్రజలు సువర్ణోత్సవ మత్యంతవైభవముగా జరిపి దేశాభిమానమును వెల్లడించిరి యీ సభను ఆరంభమున "ఆలన్ ఆక్టేవియస్ హ్యూం" అను క్రైస్తవదొరగారు స్థాపించి దేశాభిమానమును వృద్ధిపరచియుండిరి. నేటివరకు నిర్విఘ్నముగా సభలు జరుగుచున్నవి. ఆ మహానుభావుని సత్సంకల్పమే హిందూదేశీయుల పునీతులగావించి దివ్యజ్ఞానము మున్నగు సన్మార్గముల నడిపించుచున్నది. అందువలన కాంగ్రెస్సు జనకుడని శ్రీహ్యూం దొరగారిని స్మరించినారట. దేశమునందీ స్వర్ణోత్స

వము దీపావళి పండుగవలె సర్వజనులచే నాచరింపబడినందున భారత మాత ధన్యమైనదని పలువురు మహానుభావులు ఆనందించుచున్నారు.

* * * * * *

ఢిల్లీయందు శాంతాదేవి యను తొమ్మిదివత్సరములుగల బాలిక తనపూర్వ జన్మవృత్తాంతములు దెలుపుచున్నందున చాలామంది ఆమెను పరీక్షించి యథార్థమైన సంగతులు దెలుసుకొని ఆమెను పూజించుచున్నారట. తనభర్త మున్నగువారిని పూర్వజన్మ సంబంధముగా గుర్తించి యనేక దృష్టాంతములు దెలుపుచున్నందున శాస్త్రములు సత్యములనియు జన్మలు లేవనుట సాహసమనియు దలంచుచున్నారు. యీవిషయము 1935 నవంబరు 25 తేదీగల హిందూపత్రికలో వివరముగా పరిశీలింపగలరు.

* * * * * *

దేవాదాయపుబోర్డు వలన దేశములో అనేక కల్లోలములు బయలుదేరి అర్చక, ట్రస్టీలకు ప్రజలకు వృథాకలహములు పెచ్చుపెరగుచూ, ద్రవ్యము నష్టమగుచున్నదనియు, దేవాలయములు అల్లరియగుచున్నవనియు, ధర్మములు నశించుచున్నవనియు, హిందూమతము పాడైపోవుచున్నదనియు, ప్రజల హృదయములు మార్పు జెంది అన్యమతములకు జేరుచున్నారనియు అనేకులు వ్యసనపడుచూ, ఆయాగ్రామ ప్రజలు తమదేవాలయ వ్యవహారము చక్కబరచుకొనుట శ్రేయస్కరమని యాందోళన గావించుట ముఖ్యమని హెచ్చరించుచున్నారు.

# సంపాదకీయములు

## స్వవిషయము

ఇకరొక్క సంచికతో పదునొకండవ సంపుటం ముగింప దలంచి తిమి. సాంఘికుల యాశీః ప్రభావమువలన ఎల్లెట్లో పదునొకండు సంపుటములు పూర్తిచేయ గలిగినందులకు సంతోషించుచున్నాము. షుమారు రెండుమూడు వేలవరకు దిగుబాటుచేసి సంపాదకులను నష్టపరచుటకై యత్నించువారియందు మిక్కిలి కృతజ్ఞతతో పత్రికమాత్రము బాపుచూ వారి యనుగ్రహమును గోరుచున్నాము. మా కెవ్వరియందును ద్వేషము లేదు. స్వయంకృతాపరాధమని దలంచితిమేగాని వేరుకాదు. సంఘమాత ఇంతటి దురదృష్టవంతురాలని దెలియలేదు. యెన్నియుగముల క్రిందనో స్వరూపనాశనమై నామ మాత్రమైనను నిలువక పాతాళమున కంకను చాలా యధోగతమైయుండ ఈశ్వరాజ్ఞాను వర్తులమై మాయోపిక కొలందిని సంఘసేవజేసి ధన్యులమైతిమి. గాని మాశ్రమ యెప్పటి కైనను సార్థకముగాక తప్పదని నిశ్చయముతో నున్నాము. ద్వాదశ వత్సరముల వయస్సుగల నీపత్రికాలలామను ఆదరించి సంరక్షించి ఫలితార్థముల నొందుడని మా ప్రార్థన.

## మహాభాగ్యము

జగద్గురు శ్రీ శ్రీకంఠ శివాచార్యస్వాములవారు పూర్వాశ్రమమందును సన్యాసాశ్రమమందును గూడ సంఘశ్రేయమును గోరి యనేకవిధముల సంఘసేవ గావించినందులకు శ్రీ వారియందు ఆది శైవ సాంఘికులు జన్మ జన్మాంతరములయందుగూడ కృతజ్ఞులైయుండక తప్పదు. ప్రస్థానత్రయ భాష్యోద్ధరణ సామాన్యమైన కార్యముగాదని సర్వు లెరింగియేయుందురు. శ్రీవారికి శరీరమునం దస్వస్థతఏర్పడి చాలా ప్రమాదావస్థలో నుండియు శ్రీవారు గావించుచున్న సంఘోద్ధరణ

ప్రశంసింప దగియున్నది. పరమేశ్వరుడీ మహాత్ముని సర్వదా ఆరోగ్య వంతుని చేయుటకై నిరంతరము ప్రార్థనలు చేయుట మనవిధియై యున్నదని హెచ్చరించుచున్నాము.

## శ్రీ శ్రీకంఠజయంతి

శైవమతాచార్యులును ఆదిశైవ కులాలంకారు లును జగద్గురువులును నగు శ్రీ శ్రీకంఠ శివాచార్యులవారి జయంతి ఫాల్గుణ శుద్ధ పంచమీలరోజున ఆదిశైవులు తమతమశక్త్యాను సారముగా గురుపూజా మహోత్సవమును నెరవేర్చవలెనని మనవి చేయుచున్నాము. గోదావరి జిల్లా అమలాపురంతాలూకా బోడసకుర్రు గ్రామ వాస్తవ్యులును నిగమాగమ పారావారపారీణులునగు శ్రీ కేదారేశ్వరశివాచార్యులవారిచే నిర్మాణమొనరించిన కోటిఫలి క్షేత్రమునందుగల శ్రీఆదిశైవ సత్రమునందు శ్రీ శ్రీకంఠమఠాధిపతుల యాజ్ఞానుసారముగా జయంతి మహోత్సవము బ్రహ్మానందముగా అయిదురోజులు జరుగగలదు. గావున విశ్రాంతిగల సోదరులు అచ్చటికేగి తమవ్రతమును పూర్తిగావించుకొనగలరు. ప్రతిగృహమందును గురుపూజా మహోత్సవము గావించి తరింప గోరుచున్నాము.

## సవరణ

క్రిందటి సంచికలో ప్రకటించిన "దేవుని పేరుతోడనే అర్చకులకు జీవనమివ్వవలెనని ప్రమాణములుగల" మహోపన్యాసము సకాలమునకు మాకు చేరనందున ఆలస్యమునకు క్షమింప ప్రార్థితులు.

## సూచన

మున్ముందు బోధాయనసూత్రప్రయోగములున్నూ ఆగమప్రయోగములున్నూ మొదలగునవి ముద్రించుటకు వలయుసాధనములు సమకూరగలవనియు, పత్రికచందా ఒక్కరూపాయిచొప్పున తగ్గించుటకు అవకాశము యోచింపబడుచున్నదనియు, ఈశ్వరానుగ్రహము కొరకు నిరీక్షించుచూ యీసూచన దెలుపుచున్నాము.

---

నం॥ చందా రు 1-8-0 లు. Regd. No. M. 2073.

# శ్రీ ఆదిశైవపత్రిక.

శ్రీ శ్రీకంఠ మఠాధిపతుల యాజ్ఞానుసారముగా శైవ
సంఘాభ్యుదయమునకై శ్రీ గురుకులాశ్రమమునుండి
ప్రతిమాసము ప్రకటింపఁబడును.

సర్వదేవాత్మకో రుద్ర స్సర్వే దేవా శ్శివాత్మకాః ।
రుద్రస్య దక్షిణే పార్శ్వే రవిబ్రహ్మాత్రయోగ్నయః ।
వామపార్శ్వే ఉమా దేవీ విష్ణు స్సోమో పి తే త్రయః॥
(రుద్రహృదయోపనిషత్)

సంపాదకుడు:—చిలుమూరు పురుషోత్తమ గురుక్కళ్.

సంపుట ౧౧ } చిలుమూరు యువనామ సం॥ర మాఘ ఫాల్గుణమాసములు. { సంచిక ౧౧-౧౨

[విలేఖకుల వ్యాసములకు సంపాదకులు ఉత్తరవాదులు కానేరరు]



—♦ విషయసూచిక ♦—



భారతీ ముద్రాక్షరశాల, తెనాలి.

# ఉద్ధారకులు

౧ కీ॥ శే॥ చిలుమూరు తీర్థేశ్వరులవారి జ్ఞాపకార్థం కుమాళ్లు ఉమామహేశ్వరం వగైరాలు, చిలుమూరు

౨ కర్ణాటక రాష్ట్రీయ ఆదిశైవ మహాసంఘమువారు, బెంగుళూరు

౩ శ్రీమాన్ నడింపల్లి నాగేశ్వరశివాచార్యులవారు, ఇంటూరు

౪ ... గూడూరు రాఘవరావుగారు, పోతునూరు

౫ ... గూడూరు సీతయ్యగారు, శనివారపుపేట

౬ ... అయలూరు వెంకటసుబ్బయ్యగారు, ఆర్తమూరు

౭ ... పావులూరు రామచంద్రయ్యగారు, మునికోటిపురం

౮ ... పావులూరు హనుమంతయ్యగారు, మునికోటిపురం

౯ ... పెనుమూడి సత్యనారాయణగారు, తూర్పుకూచిపూడి

౧౦ ... స్వర్ణ వెంకటశివావధానులుగారు, బూరుమిల్లి

౧౧ ... పావులూరు నాగేశ్వరశర్మగారు, అనంతపురం

౧౨ ... పెనుమూడి హనుమంతరావుగారు, తెనాలి

౧౩ ... మామిళ్లపల్లి శంకరమ్మగారి జ్ఞాపకార్థం భర్త శివరామదీక్షితులుగారు, చుండూరు

౧౪ ... మామిళ్లపల్లి సాంబయ్యగారు, చుండూరు

౧౫ ... పొన్నూరు సుబ్రహ్మణ్య సోమయాజిగారు, దండమూడి

౧౬ ... మేడూరి శివయ్యగారు, తేలప్రోలు

౧౭ ... కుందుర్తి ఆనందరావుగారు, బి. ఏ, దుగ్గిరాల

౧౮ ... పార్వతమ్మగారి జ్ఞాపకార్థం సత్తెనపల్లి వెంకట్రామయ్యగారు ఓవర్ సీయరు, దుగ్గిరాల

౧౯ ... చావలి గంగయ్యగారిజ్ఞాపకార్థం కుమాళ్లు సుబ్బయ్య వగైరాలు, చముడుపాడు

౨౦ ... సంగాపు పానకాలయ్యగారి జ్ఞాపకార్థం కుమాళ్లు వీరయ్యగురుకులు వగైరాలు, నవులూరు

౨౧ ... సంగాపు కోటీశ్వర గురుకులుగారు, మంగళగిరి

౨౨ ... చిలుమూరు వెంకటసుబ్బయ్యగారు, చిలుమూరు

౨౩ ... చిలుమూరు కుటుంబయ్యగారు, చిలుమూరు

౨౪ ... శేకూరు రాఘవశర్మగారు, గుడివాడ

౨౫ ... చావలి సుబ్బయ్య పంతయ్యగార్లు, పినపాడు

౨౬ ... చావలి లక్ష్మీకాంతయ్యగారు, బాపట్ల

౨౭ ... కొల్లిపర రామయ్య, పిచ్చయ్యగార్లు పెనుమూలి

౨౮ ... స్వర్ణ చినమల్లయ్యగారిజ్ఞాపకార్థం ధర్మపత్ని బుచ్చమ్మగారు, చీరాల

౨౯ ... పెనుమూడి సీతమ్మగారు, జొన్నలగడ్డ

౩౦ ... పసుపర్తి పార్వతమ్మగారు, కూచిపూడి

# శ్రీ ఆదిశైవపత్రిక

సహకోరుద్ర స్స ఈశాన స్స భగవాన్ స మహేశ్వర స్స మహాదేవః॥
"అధర్వశిరసి"


| సంపుట | చిలుమూరు | సంచిక |
| --- | --- | --- |
| ౧౧ | యువనామ సం॥ర మాఘ-ఫాల్గుణమాసములు | ౧౧-౧౨ |


## ప్రార్థన.

[శ్రీమాన్ నందివెలుగు వేంకటేశ్వరశర్మగారు]

శా॥ శ్రీమచ్ఛైల శిఖాధివాస కరుణాసింధూ మహాదేవ శం
భూ ముక్తీశ మహేశ నీలగళ ఘోరాభూరిప్రభావా శివా
నీమంబొప్పఁగ మమ్ముఁగావు హృదినిన్నేస్వామిగానిల్పితిన్
శ్రీమల్లేశ దయంగనుంగొనుము నిన్ సేవించెదన్ నిత్యమున్.

---

## పత్రికాప్రబోధము.

[పి. సి. హెచ్. రావుగారు]

కం॥ మాచందామాచందా, మాచందాయనుచునెపుడుమిముగూరిచియో
జూచితిప్రతిపత్రికలో, నీచందంబందమగునె యేరికినైనన్॥
గీ॥ కరుణలేదాయె యెంతటికఠినమైన । హృదయమోగాని మీయది
యూహజేయ, రాలుగరగెడి మాడ్కి నిరంతరంబు । వేడుచుండెను
మిమ్ముల విసువుగొనక॥ ౨
ఆ॥ వె॥ పెద్దలూరుకొనిన పేర్మితోవారికి । నచ్చజెప్పి వారియనుమత
మున, సాయపడుట మంచి సాంఘికధర్మంబు । శైవయువకు
లార సరసులార॥ 3

క॥ మీసాయమ పేక్షించియు
జేసితి, మరి జేయుచుంటి జేయుదునిక నే
నీ సంఘసేవ శ్రద్ధతొ,
ఓసాంఘికులార మీరలుత్సాహింపగ॥

(సంపాదకుడు)

# సాంఘిక ప్రబోధము

సీ॥ వ్యాసంబులెన్ని యో వ్రాసియుంటివిగాని, చదివియానందించుజనుడు లేడు
పత్రికలెన్నియో ప్రకటించితివిగాని యవిచెత్తపోవులయందు జేరె
సంఘంబులెన్నియో స్థాపించితివిగాని వానిలోనిపుడొక్కటయిన లేదు
సభలను నెన్నియో జరిపియుంటివిగాని శివశివాయవిడబ్బు చేటులయ్యె

గీ॥ అన్నియు నిరర్థకములయ్యెనంచు మది నిరాశబొందంగబోక యట్లగుట కేమి, హేతువోదాని నెరిగి వర్తింపవలయు మేలుకొనుమోయి సోదరా మేలుకొనుము॥

సీ॥ ఒకనైన "నమలులోనికిరాకయున్నచో మర్యాదగలదె తీర్మానములకు। చెప్పినట్లొకనైన జేయనియెడల మన్ననయుండునే యుపన్యాసములకు । ఉత్తరక్షణములో నూడిపోయెడునట్టి కట్టుబాటుల కేమి గౌరవంబు। కార్యరూపకము దాల్పకయె నాశనముబొందు నాలోచనల కేమియగును పరువు॥

గీ॥ అనయమును నీవుగావించునట్టిపనుల నరయగానిట్లు వ్యర్థంబులయ్యెగాన । సార్థకములయ్యు కార్యముల్ సలుపవలయు మేలుకొనుమోయి సోదరా మేలుకొనుము॥

సీ॥ నీకున్న తనువుతోనే కొంచమైనను స్వీయసాంఘిక సేవజేయకున్న
నీకున్న మనసుతో నేకొంచమైన నీ కులగౌరవంబును దలపకున్న
నీకున్న ధనములో నేకొంచమైన నీ వంశశ్రేయమునకై వదలకున్న
నీకున్న విద్యలో నేకొంచమైన నీ బీదసోదరులకర్పింపకున్న

గీ॥ ఎన్నగా మేక మెడనుండు చన్నులవలె సర్వవిధముల నిష్ప్రయోజన
ములగును, ఇట్టిచో, సంఘబుణమది యెట్లుతీరు మేలుకొనుమోయి
సోదరా మేలుకొనుము॥

(సశేషము)

## అభినందనము

గుంటూరుజిల్లా నిజాంపట్టణ నివాసులును, సుప్రసిద్ధ ఆదిశైవ వంశోద్భవులును, శైవాగమాది సర్వశాస్త్ర ప్రవీణులును, దేశసేవాదురంధరులును, నగు శ్రీమాన్ చావలి బాలసుందరంగారు గుంటూరుజిల్లా బోర్డుసభ్యులుగా దిగ్విజయ మొందగల్గినందుల కెంతయో యభినందించుచున్నాము. శ్రీవారు దేశోపకారపరాయణులనుటకు కాంగ్రెస్సు యనెడు పవిత్రనామమే సాక్షియని విన్నవించుచున్నాము. పరమేశ్వరుడీ మహాశయుని కాయురారోగ్యభాగ్యముల నొసంగి రక్షించుగాతయని మానిండు విశ్వాసము.

(పత్రికాధిపతి)

## అగ్నికరణనిర్ణయః

యీ విషయమును గురించి, గోదావరిజిల్లా నివాసులును, ఆదిశైవకులరత్నాలంకారులును, "శతప్రతిష్ఠాచార్యేత్యాది" బిరుదాంకితు

లును, సుప్రసిద్ధ సంఘాభిమానులునగు, శ్రీమాన్ అయలూరు కామే శ్వరి (ముంజవరపుకొట్టు) గురుకులుగారు ఆదిశైవపత్రిక యువసంవత్సర మార్గశిర పుష్యసంచికయందు నా సందేహమునకు సమాధానరూపక ముగా నొక వ్యాసమును ప్రచురపరచియుండుట లోకవిదితము. దానిని గాంచినవారు సంతృప్తినొందకపోగా, కొందరు హేళనగావించుచున్నట్లు వినుచున్నాము. ఆదిశైవులకు బోధాయనగృహ్యసూత్రము పరమ ప్రమాణగ్రంథమైయున్నది. అటుపైని స్మృతికర్తల గ్రంథములన్నియు గౌణముగా అంగీకరింపబడును. ప్రస్తుతము విచారణయందున్న యంశము లేవియనగా, (1) అగ్నౌకరణము ఔపాసనాగ్నియందే చేయవలెనా లేదా, (2) ప్రత్యాబ్దికాదులయందు చతుర్వింశతి పిండ ప్రదానమేనా, త్రిపిండవిధానమున్నదా, అని లోగడ (శ్రీయుతులు అయలూరి రామశాస్త్రులుగారి పేర) నేను వ్రాసిన వుత్తరము పురస్క-రించుకొని సదరు విషయమును తృణీకారరూపమున ధర్మశాస్త్రవచ నము లొకటి రెండు వ్రాసి విషయనిర్ణయ మొనరించినటుల సంత సించుట హాస్యాస్పదమేమోయని శంకించుచున్నాము. మాబోంట్ల "గతానుగతికోలోకః" యను నార్యోక్తి ననుసరించి, ఆచారమే ప్రధానముగా దలంచుచూ, ధర్మశాస్త్రగ్రంథముల జూడక విషయ ములు ప్రశ్నించుచుందురనియు, ఈ మహత్తరవిషయ నిర్ణయము గ్రంథస్థధర్మములతో గావించుట కుపక్రమించితినని వ్యాసకర్తగారు దెలుపుచున్నారు. "యజ్ఞైస్సార్థం లౌకికాగ్నౌ చేత్" అని నృసింహకారి కావళియందుండుట వలన అగ్నౌకరణము లౌకికాగ్నియందే చేయవలె ననియు, ఔపాసనాగ్నియందు చేయవలెనని విధులు గన్పట్టుటలేద నియు, ప్రత్యాబ్దికాదులయందు ఔపాసనాగ్నితో నిమిత్తములేదనియు, ప్రత్యేక సంస్కారిత లౌకికాగ్నియందే అగ్నౌకరణము చేయవలెనని నిర్ధారణచేయుటవలన మాబోంట్లకు సందేహనివృత్తి యగుటలేదు. మరియు, ప్రత్యాబ్దికాదులయందు త్రిపిండవిధానమే శాస్త్రసిద్ధమైన ఆచారమనియు, చతుర్వింశతి పిండవిధానము శాస్త్రదూష్యమనియు,

తెలుపుట వలన దాక్షిణాత్యులును, సుప్రసిద్ధబోధాయన సూత్రాచరణ పరాయణులునగు ఆదిశైవులును, దురాచారపరులని, ప్రత్యేకముగా తిట్టనక్కరలేదు. ప్రాచీనకాలమునుండియు బోధాయనోక్త చతుర్వింశతి పిండవిధాన మనుసరించుచున్న, చోళ, పాండ్య, కర్ణాటాది దేశీయులగు ఆదిశైవులందరు నిరర్థకులగుటయేగాక, బోధాయనగృహ్య సూత్ర మంతయు ఒక్కదెబ్బతో స్వరూపనాశనమగుటకు సందేహములేదు. యిట్టి ధర్మనిర్ణయము గావించెడి మహానుభావులు లేకపోవుటవల్లనే యింతవరకైనను లోకము యీ తీరున నిలచియున్నదని పలువురు దలంచుట కవకాశము గలదు. ఇట్లనిన శ్రీ కామేశ్వరిగురుకులుగారిని మేము తూలనాడినట్లు దలంచబోకుడు. శ్రీవారియందు మా కెంతయో గౌరవము గలదు. వారసమర్థులని మేమెప్పుడును దలంచము. గాని గృహ్యసూత్రమంతయు పరిశీలనచేసి విషయనిర్ణయము గావించినచో మాతోబాటు లోకమంతయు సంతసించియుండెడిదే. గావున, యీ విషయమును గురించి మా యభిప్రాయము వ్రాయుచున్నాము. విశాల హృదయముతో పరిశీలించి యదార్థమును గమనించి మా సందేహ నివర్తికి సహాయపడగలందులకు గోరుచున్నాము. శ్రీ కామేశ్వరిగురు కులుగారు దెలిపినటుల బోధాయనగృహ్యశేష పంచమ ప్రశ్నయందలి షష్ఠాధ్యాయములోని పంచమీశ్రాద్ధ ప్రకరణమును గమనింపగా (దేవనాగరలిపి 351 పేజియందు) "తస్యమాసిశ్రాద్ధఉక్త ఏతావదేవ నానా" యని యుండుటచే మా సిశ్రాద్ధవిధాన మనుసరింపక తప్పదని దెలియుచున్నది మరియు ఆగ్రంథమునందే ద్వితీయాధ్యాయ ప్రథమ ప్రశ్న 219 పుటలో మాసిశ్రాద్ధవిధానముతోడనే పంచమీశ్రాద్ధము చేయవలెనని స్పష్టముగా వ్రాసియున్నది. శ్రీవారు గమనింపక పోవు టకు కారణము దురూహ్యము. ద్రావిడ గ్రంథలిపిగల గృహ్యసూత్ర మునుండి యీ క్రింది ప్రమాణములు దెలుపుచున్నాను.

(1) బోధాయనగృహ్యే ద్వితీయప్రశ్నే ఏకాదశోధ్యాయే (53 పుట)

"అష్టకాహోమేవ్యాఖ్యాతః ఏవమేవమాసిశ్రాద్ధమ్"

(2) తచ్ఛేషే సప్తమప్రశ్నే ద్వితీయాధ్యాయే (155-పుట)
"మాసిశ్రాద్ధవద్ధోమంకృత్వా పృథక్పృథక్ హూమపిండాంచ కుర్యాత్"

(3) తచ్ఛేషే నవమప్రశ్నే తురీయాధ్యాయే (225 పుట)
"మాసిశ్శ్రాద్ధవదుత్తరతః పితృభ్యస్స్వధానమ ఇత్యాది తత్పుర స్తాద్వ్యాఖ్యాతమ్॥"

(4) బోధాయన గృహ్యేతృతీయప్రశ్నే (73 పుట)
"అష్టకానుకృతిమాసికంచ తత్పురస్తాద్వ్యాఖ్యాతమ్"

(5) ధర్మప్రశ్నే (పంచదశప్రశ్నే) ద్వితీయాధ్యాయే (356 పుట)
"అథనైభవతి శేషముక్త మష్టకాహోమే"

(6) "అగ్నిముఖాత్కృత్వా" (354 పుట)

పైగన్న వచనములవలన అష్టకాహోమప్రకరణ మనుసరించి మాసిశ్రాద్ధము ఏర్పడుచున్నదనియు, మాసిశ్రాద్ధవిధాన మనుసరించి పంచమీశ్రాద్ధము చేయవలెనని ధృవపడుచున్నది. మరియు మాసిశ్రాద్ధవిధానముతోడనే సపిండీకరణాదులు జరుపవలెనని బోధాయన గృహ్యసూత్ర నవమప్రశ్న ద్వావింశోధ్యాయమునందు స్పష్టముగా చెప్పియున్నది, గావున అష్టకానుకృతి ననుసరించి మాసిశ్రాద్ధమును తద్విధి ననుసరించి పంచమీశ్రాద్ధసపిండీకరణాదులు చేయవలెననియు చతుర్వింశతిపిండ విధానమే ప్రధానమగుటవలన ప్రత్యాబ్దికాదుల యందు ముఖ్యముగా మాసిశ్రాద్ధ విధానమనుసరించుట ప్రాచీనాచారము శాస్త్రసమ్మతములైయున్నదని స్పష్టముగా తెలుపుచున్నాము. ఇక అగ్నౌకరణవిషయమునుగురించి స్వల్పముగావ్రాయుచున్నాము

(1) బోధాయన గృహ్యే పంచమప్రశ్నే (95 మొదలు 112పుటవరకు
"యస్మిన్నగ్నావుపనయతి ప్రసిద్ధః పిండపితృయజ్ఞః ఇత్యాది"

(2) షష్ఠప్రశ్నే ప్రథమాధ్యాయే [122-123 పుట]
"ఉపనయనాది రగ్నిః తమౌపాసనఇత్యాచక్షతే"

(3) తచ్ఛేషే నవమప్రశ్నే తురీయాధ్యాయే [223-224 పుట]
"అథగృహస్థస్య ద్వేభార్యేవిందతే ప్రసిద్ధమౌపాసనే పార్వణాని కుర్యాత్ ..."

(4) పంచమప్రశ్నే దశమాధ్యాయే [99 పుట]
"యోనిత్యోపాసనేశ్రాద్ధానిచ హవీంషిచ"ఇత్యాది

పై ప్రమాణములవలన ఔపాసనాగ్నియందే అగ్నౌకరణము చేయవలెననియు జాతాదికర్మలు సప్తపాకయజ్ఞములు దైవకర్మలు మున్నగునవి ఔపాసనాగ్నియందే చేయనగుననియు విధులు తేటతెల్లముగా దెలుపుచున్నందున అగ్నౌకరణ హోమము ఔపాసనాగ్నియందు గావించుట ప్రశస్తాచారమని దెలుపుచున్నాము. శ్రీవారు వ్రాస్ని పంచమీశ్రాద్ధప్రకరణమునందును వైవాహికశ్రాద్ధమునందును "అగ్నిముఖాది సిద్ధమాధేను వరప్రదానాంతం చేయవలెనని దెలుపబడినది. చతుర్వింశతి పిండవిధానమే సర్వజనాచరణీయమని మాయభిప్రాయమైయున్నది. గ్రంథవిస్తరభీతిచే యింతట విరమింపబడెను.

బూతుమల్లి. (తెనాలితాలూకా) } ఇట్లువిబుధవిధేయుడు
స్వర్ణ వెంకటశివావధానులు.

☛ శ్రీకామేశ్వరిగురుకులుగారునూ, వెంకటశివావధానులుగారునూ యీవిషయములో చర్చించుచుండుటవలన బోధాయనగృహ్యసూత్రమంతయు ధన్యతమమగుచున్నదని మా తలంపు. చర్చ జరుగక

విషయము తేలదు. దేశాంతరగతమై, నామమాత్రావశిష్టమైయున్న బోధాయనగృహ్యసూత్రము నేటికి చర్చలోనికి వచ్చినందుల కెంతయు సంతసించుచున్నాము. ఇందులో వ్యక్తివిమర్శచేయక విషయవిమర్శలే ప్రధానముగా నుభయులు దలంచి, ధర్మనిర్ణయ మొనరించుట శ్రేయస్కరమని విన్నవించుచున్నాము. వీరుభయులు శైవసంఘమునకు నేత్రములై విరాజిల్లుచున్నారు. పండితులు, నైష్ఠికులు అయిన వీరుభయుల చర్చవల్ల వెలువడు సారాంశమును దిలకింప సాంఘికు లుద్యుక్తులై యున్నారు. వివిధదేశీయ సాంప్రదాయాచారముల మాత్రము ముఖ్యముగా గ్రహించి బహుజనాచరణీయమైన ధర్మనిర్ణయ మొనరింప గలరని మా యాశయము.

(సంపాదకుడు)

మహాశయులారా !

సంఘాభివృద్ధికి పత్రికాప్రచారమునకంటె ముఖ్యమార్గము లేదని పలువురు దెలుపుచున్నారు. గావున ద్వాదశసంపుటం మొదలు ప్రతిమాసము సక్రమముగా ప్రకటనయగులాగున సాంఘికులు సహాయమొనరించి సంఘశ్రేయమును గోరుటకు ప్రార్థించుచున్నాము. సంవత్సరమునకు రు 1—8—0 లు త్యాగమొనరించి ఉత్సాహముగా పత్రిక వెలువరింపజేయగలరని పూర్ణమైన విశ్వాసముతో నున్నాము.

(పత్రికాధిపతి)

ఏకాదశ (యువసంవత్సరం) సంపుటము.

## ఆదాయ వ్యయ పట్టిక.

| జ మ లు. | | ఖ ర్చు లు. | |
|---|---|---|---|
| 3-0-0 | రాజపోషకులు | ప్రెస్సువారికి | 98-14-0 |
| 6-0-0 | పోషకులు | పోస్టుఖర్చు | 33-1-0 |
| 25-8-0 | సన్మానములు | ప్రయాణం | 6-12-0 |
| 7-0-0 | ధర్మములు | సాదరు | 4-2-6 |
| 51-8 0 | చందాదార్లు | స్టేషనరీ | 1-7-0 |
| 93-0-0 | జమ మొత్తం. | పత్రికలు | 19-2-0 |
| | | గ్రంథములు | 2-0-0 |
| | | ధర్మం | 1-0-0 |
| | | ఖర్చు మొత్తం | 166-6-6 |
| | | జమలు | 93-0-0 |
| | | యీసంపుటముకు పెట్టుబడి | 73-6-6 |
| | | లోగడ పెట్టుబడి | 798-15-3 |
| | | సంపాదకునకు నష్టం | 872-5-9 |

☞ పత్రిక ఆరంభించినదిమొదలు పదునొకండు సంవత్సరములుకు పత్రికాధిపతికి గల్గిన నష్టం యెనిమిది వందల డెబ్బదిరెండు రూపాయిల అయిదు అణాల తొమ్మిది పైసలు మాత్రమే.

సోదర మహాశయులారా !

సాంఘికులయొక్క సంఘాభిమానము పై లెక్కలవలన దెలుసుకొని పత్రికా పరిస్థితిని గమనించి ముందు జరుగవలసిన విధానమును నిర్ణయింప ప్రార్థితులు. యిట్టి పరిస్థితిలో సక్రమముగా ప్రతిమాసము పత్రిక వెలువరించుట కవకాశము గలుగలేదని మనవిచేయుచున్నాను. రాబోవు ద్వాదశ సంపుటము వెలువడజేయగల భారము మీపై నున్నది. యింత నీరసస్థితిని గన్పరచుట అవమానకరమని నేను వ్రాయుట తప్పు. మీరే ఆలోచించుకొనుడు.

(పత్రికాధిపతి)

# సంపాదకీయములు

## స్వవిషయము

పరమేశ్వరుని సంపూర్ణానుగ్రహముతో పదునొకండవసంపుటము పూర్తిచేయగల్గితిమి. సాంఘికులనాదరణ జూపినను, పండితులు నిరసించినను, యువకులు నిరుత్సాహముగానున్నను, మా వోపికకొలదిని సంఘాభిమానులతో యీపత్రికను నిర్వహింపగల్గితిమి. చందాదారులు వాగ్దానభంగము లొనరించుటచే మనస్సునకు విసువు జనించి ప్రమాదవశమున తూలనాడిన యెడల మా తప్పులు మన్నించి మమ్ములను సంతోషపరచగలరని ప్రార్థించుచున్నాము. వ్యాసము లెన్నియో మిగిలియున్నందున వ్యాసకర్తలు మాయందాగ్రహముంచరని నమ్మకము. కంటికి రెప్పవలె మమ్ముల నాదరించి మా యుత్సాహమును ద్విగుణీకృతమొనరించి సహాయమొనరించిన సోదర సోదరీమణులను హృదయ

పూర్వకముగా నభినందించుచూ మాకృతజ్ఞతను ప్రకటించుచున్నాము. ప్రారంభమునుండి నేటివరకు యీ పత్రికవలన సంఘమున కేదేని మేలుగల్గినచో ఆనందింప ప్రార్థితులు. అపకారమేమియు గలుగనట్లు మాత్రము మేము దలంచుచున్నాము. షుమారు మూడువేలరూపాయీలవరకు పత్రికచందాలు వగైరాలుతో సాంఘికులు వాగ్దానభంగ మొనరించి సంపాదకుని నష్టపరచిరను యపవాదుమాత్రము భరింప శక్యముగాకున్నను, వారిమోసములు సువర్ణాక్షరములతో లిఖింపబడు నని దెలియవలెను. సహాయముచేయు నిరాకరించుటకంటె వాగ్దానభంగ మెక్కువ యపకారమని దలంచువారు అరుదుగానుందురు. ఏది ఎట్లయినను పదునోకండవ సంపుటం పూర్తిచేయగల్గినందుల కపరిమితానంద మొందుచున్నాము. పరమేశ్వరుని యనుగ్రహమునునమ్మి పదిరెండవ సంపుట మారంభింపనున్న మా విన్నపమాలకించి మాకు చేయూతనొసంగి ద్రవ్యసహాయ మొనరింప ప్రార్థించుచున్నాము.

## శ్రీ శ్రీకంఠశివాచార్య జయంతి

స్వస్తిశ్రీ, పాల్గుణశుద్ధ పంచమీనాలరోజున్న ఆంధ్రదేశమందంతటను ఆదిశైవశాఖీయులు శక్త్యానుసారముగా ఆచార్యజయంతిని జరిపి కృతార్థులైయుండిరని దెలుపుటకు బ్రహ్మానంద మొందుచున్నారము. ప్రతిసంవత్సర మీపర్వదివసంబున గురుపూజా మహోత్సవముగావించి ధన్యులై శైవాచారవిధులు లోకంబున శాశ్వతముగా స్థాపింపగలందులకు హెచ్చరించుచున్నాము. శైవమతప్రధానస్థానమగు కోటిపల్లి శ్రీకంఠమఠమునందెక్కువగా గురుపూజ జరుగుచుండును. ఏతన్మహోత్సవమునేత్రోత్సవముగా దిలకించువారు ధన్యులగుదురు.

## శ్రీ శ్రీకంఠ గురువుల పర్యటనము

శ్రీవారు గోదావరీమండల పర్యటనానంతరము మదరాసునకు విజయంచేసి ముద్రాక్షరశాలా స్థాపనవిషయమై యత్నించి జయంతి మహోత్సవము నెరవేర్పించి కృష్ణాగుంటూరు మండలములందు

ప్రచార మొనరించుచున్నారని దెలుపుటకు ఆనందించు చున్నాము. శ్రీవారు ఉపనిషద్భాష్యమును ఆంధ్రాక్షర తాత్పర్యములతో పూర్తి చేయసంకల్పించి శ్రీకాశీక్షేత్రస్థమణి కర్ణికామఠనివాసులై శ్రీవిశ్వే శ్వరుని ధ్యానించుచూ సంకల్పమాత్రముననే గ్రంధము నిర్విఘ్నముగా పూర్తియగునటుల గావింపగల సమర్థతను ప్రకాశింప జేయుచున్నందు లకు ఆదిశైవసాంఘికులు ధన్యతములు మహాత్ములగు శ్రీ గురువర్యు లకు ధన్యవాదములు సమర్పించుటయే మన విధియని హెచ్చరించు చున్నాము. త్వరలో స్వంతముద్రాక్షరశాలను శ్రీకోటిఫలియందే స్థాపించి భాష్యగ్రంధములు బోధాయనసూత్ర ప్రయోగములు మున్న గునవి ముద్రింపగలరని వినుచున్నాము. కార్యక్రమమంతయు మున్ముందు తెలుపగలవారము.

## యోగ్యతానామము

శ్రీమాన్. అయలూరిశాస్త్రీ, యీకామేశ్వరిగురు క్కళ్, మంచిలి జగన్నాథంగార్లు, బహుస్థలములందు నొనరింప బడిన సపరివార శివప్రతిష్ఠాదులు, విధివిహితములు, సుప్ర యోగములు, అనేకములు బహువారములు మాచే శృతదృష్ట ములు గాన, మాకు గలిగిన యానందముకతమున, ది ౧-౨-౧౯౩౭ తేదీన తణుకుతాలూకా ఖండవిల్లిగ్రామ మున జరిగిన ధ్వజప్రతిష్ఠాతరుణమున పండితసమక్షమున వీరిమువ్వురకు "శతప్రతిష్ఠాచార్య" అను బిరుదము మాచే నొసంగ బడెను.

మకాం ఖండవిల్లి, } ఓం శ్రీ. అవధూతబ్రహ్మానందతీర్థ స్వాములవారు.

## శ్రీ చిత్సభేశాయ మంగళమ్.

శ్రీమన్నిగమాగమపారావారపారీణ పరమహంస పరివ్రాజకాచార్యేత్యాద్యాది బిరుదాంకితానాం, శ్రీ శ్రీకంఠశివాచార్యాపరనామధేయక శ్రీ బోధానందమహర్షిపాదానాం సవిధే సప్రణామం శ్రీదండపాణిస్వామి దీక్షిత విరచితా విజ్ఞప్తిః.

తత్రభవత్ప్రసాదసూచకం శ్రీముఖముపలబ్ధం తేనచధన్యతమోఽహమమందమానందమను భవామి యథాసమీహిత మత్రాఽఽగమ్యతాం కతిపయదివసనివాసయోగ్యం సమీచీనం నివేశనమపిస్వాఽఽయత్తం విద్యతే శ్రీమత్సకాశ సంభాషణవిషయే మమాపిమహానుత్సాహోవర్తతే అతశ్శ్రీమదాగమనం ప్రతిపాలయామి. ద్వి. త్రి. దివసేభ్యః పూర్వమేవ శ్రీ మదాగమననివేదయిత్రీ పత్రికాప్రేషితా చేత్ అతీవసౌకర్యం భవేదితిమన్యే సర్వథా శ్రీమద్భిరనుగృహీతో భవేయమితివిశ్వసిమి.

చిదంబరం ౪-౧౧-3౫ } ఇత్థం శివదండపాణిస్వామిదీక్షితః

---

## ఈనెలలో చందాలు చెల్లించినవారు.

(౧) శ్రీమాన్. చావలి శివరామపాకయాజిగారు (భవయువచందా) చావలి (గుం)

(౨) ,, నాగలింగం పార్వతీశంగురుకులుగారు (యువ) నూతక్కి ,,

(3) ,, నందివెల్లు వెంకటప్పయ్యగారు (యువ) అత్తోట ,,

(౪) మురికిపూడి వెంకటేశ్వర్లుగారు (యువపోషక) వల్లభాపురం ,,

(౫) తుమ్మలపూడి లక్ష్మీనారాయణగురుకులుగారు (వోలేరు) (శ్రీముఖ భావ యువ) (గుం)

---

# పత్రికాసన్మానములు

(౧) శ్రీమాన్ సంగాపు కోటయ్య హనుమంతరావుగార్లు (మంగళగిరి) ఉమామహేశ్వరపూజామహోత్సవతరుణమున పత్రికాసన్మానం ౧-౦-౦

(౨) శ్రీమాన్ చావలి సింగయ్యగారు (పెదరావూరు) తనకుమారుని దత్తత ఉపనయనమహోత్సవతరుణమున పత్రికాసన్మానం ౨-౦-౦

---

# స్వీకృతి.

(౧) గుణానుపానపథ్యబోధినీ (వెల రు ౧-౮-౦ లు.

గోదావరిజిల్లా జగ్గన్నపేట వాస్తవ్యులును సుప్రసిద్ధ వైద్య శిఖామణులు నగు శ్రీమాన్ కె. కె. ఎం, ఏ. రామాచార్యులవారిచే వ్రాయబడిన మహద్గ్రంధము. దీనియందు సర్వవిషయములు తేటతెల్లముగా వ్రాయబడి పైనామమును సార్థకపరచుచున్నది. జ్యోతిషతత్వ సిద్ధాంతమునుగూడ ఆరోగ్యమున కనుకూలించునటుల వ్రాసిన గ్రంధకర్తగారి సామర్ధ్యమును గొనియాడుచున్నాము. 256 పేజీలు గలవు. అనేకమందులు అనుపానములు మున్నగునవి వ్రాసియున్నారు. వలయువారు శ్రీమద్వాణీవిలాస ఆయుర్వేదవైద్యశాల, జగ్గన్నపేట, రాజోలు పోష్టు అని గ్రంధకర్తగారిపేర వ్రాసిన బడయగలరు.

(౨) 1 పుట్టుమచ్చలు 2 చేయి, 3 హస్తనిర్మాణము.

యీ మూడుగ్రంధముల సెట్టుఖరీదు 3—0—0. పుస్తకములు చిన్నసైజున ముద్దులమూటగట్టినట్లున్నవి. గ్రంధకర్తగారగు శ్రీయుతులు పూడిపెద్ది వెంకటరావుగారు కడుంగడు సమర్ధులనియు పరిశుద్ధసనాతన శాస్త్రానుకూలుడనియు గ్రంధములపేర్లవల్లనే గ్రహింపవచ్చును. ఇందలి విషయములు అతిరహస్యములై సాముద్రిక శాస్త్రసారమై విరాజిల్లుచూ సర్వజనపఠనీయమై యున్నటుల చక్కని తెలుగుభాషలో వ్రాయబడి

యున్నవి. అనేక వ్రయప్రయాసలకులోనై లోకోపకారముగా అత్యు త్సాహముతో యీప్రయత్నము లొనరించి ప్రాచీనమహర్షుల గౌరవ మునుగాపాడి శాస్త్రముల నుద్ధరించుచున్నటుల గ్రంథములవలన దెలియుచున్నది. రాబోవుగ్రంథము (జననకాలవిశేషములు) గూడ మహ త్తర విషయాదులతో స్నేహితునివలెను, మంత్రివలెను, ఆచార్యుని వలెను, సహాయపడగలదని గ్రంథ కర్తగారు దెలుపుచున్నారు. వలయువారు, విజయనగరములో గ్రంథకర్తగారికి వ్రాసిన బడయగలరు (3) బాలసరస్వతి. సంవత్సరచందా 1–8–0.

దివితాలూకా గ్రంథాలయ సంఘపక్షమున శ్రీయుతులు మాజేటి రామచంద్రరావుగారి సంపాదకత్వమున వెలువడు సచిత్రమాసపత్రిక. ప్రథమసంచికను వందన పురస్సరముగా నందుకొని యందలి యమోఘ మగు నుపన్యాసముల వీక్షించి యానందించితిమి. అచిరకాలమున నే నీబాలసరస్వతివర్ధిల్లి ప్రౌఢయగునని మానిండువిశ్వాసము. వలయువారు మాజేరు, చల్లాపల్లిపోష్టు అని సంపాదకులకు వ్రాసిన బడయగలరు. (౪) శ్రీశివరామశతకము.

శ్రీగురుకులాశ్రమ నివాసియగు చిరంజీవి, గురులింగశాస్త్రి ప్రణీతమై భగవధ్ధ్యాన స్తోత్రరూపకమగు నీచిన్నిశతకమును పరిశీలించి యానందిచితిమి. చదివినకొలది నత్యధికమాధుర్య ముప్పొంగుచూ భక్తుల నుత్సాహపర్చుచుండును. నీకవి లోగడ "గురుకులసుందరచరిత్ర" యను నొక వచనగ్రంథమును వెలువరించియున్నాడు. ఇట్లే శైవచరి త్రలనెల్ల పద్యగద్య రూపములతో ప్రకటింబగలడని మావిశ్వాసము. వలయువారు, 0-1-3 చీటిని మాఆశ్రమమునకు పంపినచో ఉచితముగా. బడయగలరు.

---

# దేవాదాయపుబోర్డువారి చర్యలు.

షుమారేడెనిమిది లక్షల రూప్యములను సర్కారువారివలన సహాయమునొంది దేదీప్యమానముగా వెలుగుచున్న మన బోర్డువారి చర్య లెంతేని వర్ణనాతీతములు. చరిత్రప్రసిద్ధములని దెలుసుకొన వచ్చును. తుదకు రివిన్యూవారి సహాయమే శరణ్యమయ్యె. యీ పది వత్సరములనుండి వారనుభవించిన ముందనుభవింపనున్న ఫలితమే ప్రస్తుతచర్చనీయాంశము దేవాలయ పరిపాలనకొరకు చట్టమును సంస్కరించి పల్లెపల్లెలలోనున్న ఆలయ జమాఖర్చుల జాబితాలను తయారు చేయించి రాజధానికెంతయో మేలుకొలుపుల గావించినందులకు పలువురు సంతసించుచున్నారేగాని అర్చకజీవనములు భంగపరచి అర్చకుల భూములనే దేవునిభూములుగా స్థిరపరచుకొని అర్చకుల భరతంపట్టుచున్నందుల కొక్కడైనా మాట్లాడకపోవుట కేమిహేతువోయని వగచువారుగూడ గొందరుగలరు. న్యాయస్థానములీ రహస్యమును గమనించి అర్చకభూములయందలి న్యాయానుభవముల విచారించి బోర్డువారివలన ఖర్చుల నిప్పించుచూ పూర్వపుటుద్దేశములను మార్చ నవకాశములేదని తీర్పులనిచ్చుట శ్రేయోదాయకమైయున్నది. యీబోర్డు పరిపాలన అవసరములేదనియుమామూలుగా గ్రామములోగల పెద్దల పరిపాలనతో నుండవలెనని యనేకులు ఘోషించుచున్నారు. మేము దేవాదాయ పరిపాలనచేసి లోకము తల్లక్రిందు చేస్తామనిచెప్పిన బోర్డువారు రెవిన్యూవారికి బాకీలజాబితాలనిచ్చి, వచ్చినంతవరకు బాకీలు జమచేయించుచున్నారు. అర్చకభూములలోని పైరుపంటలకు జప్తులు బంపుచున్నారు గ్రామాధికారులు ఏమిచేయుటకు గత్యంతరములేక జప్తులను అంగీకరించి సొమ్ము వసూలాపరచుటయో, లేక పైరులు వేలంపాడించుటయో చేయుచున్నారు. యీబాకీ సరియైనదా కాదా యను విచారణచేయుటకు జిల్లాయధికారులను మిక్కిలిగా ప్రార్థన చేయుచున్నారము. అర్చకులకు యితరవృత్తులులేక ఈ దేవాలయ

పూజలే నమ్ముకొని తమభూములను బలపరచుకొనుటకైనా అవకాశము లేనందున్న రయితుల దయదాక్షిణ్యములపై ఆధారపడి సంవత్సరానికివచ్చే యేకొంచం ధాన్యమునో బోర్డువారి పద్మవ్యూహములపురికొల్పి నాశనము గావించుచున్నారు. యిక అర్చకు లెట్లు జీవింపవలెనో ఏఆధారముతో దేవాలయపూజలు జరుగవలెనో యనెడి ఆలోచన చేయువారు లేరు. దేవునిపేరుతోనున్నవి గనుక దేవాదాయమని నిర్వచనముచేసి "ఉరుపుగల్లంతు" చేయ దలపెట్టుట న్యాయము గాదని మనవిచేయుచున్నాము. జిల్లాయధికారులు బోర్డువారిని అర్చక సంఘమును ఆయాజిల్లాల వారీగా విచారించి న్యాయమును పరిశీలించి కొంత కంట్రిబ్యూషన్ సొమ్ము అవసరమయ్యేయెడల రివిన్యూశిస్తుతో కలిపి చెల్లించులాగున చేయుటత్యవసరమై యున్నది. రివిన్యూవిధానముగా కంట్రిబ్యూషన్ చెల్లించుటకు అర్చకసంఘము సిద్ధముగానుండక తప్పదు. గావున నట్లొనరించుట శ్రేయస్కరమని మనవి చేయుచున్నాము.

(సంపాదకుడు)

---

# వార్తలు

రాజాధిరాజ సార్వభౌముడును ఆదర్శచక్రవర్తియు మహైశ్వర్యయుక్తుండును సద్గుణనిధియు నగు శ్రీజార్జిసార్వభౌముడు భౌతిక దేహమును అనాయాసముగాత్యజించి పరలోకమునకు జేరియున్నాడు. శ్రీవారి జన్మసార్థకమైనది. మహాపురుషుల సందర్శించి రవియస్తమింపని బ్రిటీషుసామ్రాజ్యమును వేనోళ్ల కీర్తించునట్లు పరిపాలించిన ధీమంతుడు. శ్రీవారి ఆత్మశాంతికై ప్రార్థనలు జర్గుచున్నవి.

*　　*　　*

శ్రీవారి జ్యేష్ఠపుత్రుండగు అష్టమఎడ్వర్డు చక్రవర్తిగారి రాజ్యభారమును వహించియుండుట ముదావహము పరమేశ్వరుని యను

గ్రహమున దీర్ఘాయురారోగ్యైశ్వర్యములనంది సుఖించుగాతయని మా పూర్ణవిశ్వాసము.

*　　*　　*

మదరాసు హైకోర్టునందు మార్చి మొదటివారమున షుమారు పదునాల్గుదావాలు అర్చకులపక్షమున తీర్పుజెప్పుచూ బోర్డువారివలన మూడువందల యేబదిరూపాయిలచొప్పున అర్చకులకు ఖర్చులు నిప్పించుచూ ఏవిధమగు మార్పులుచేయుటకు బోర్డువారికి అధికారములేదని తీర్పుజెప్పి దీనాతిదీనులై దిక్కులేక యల్లాడుచున్న అర్చకకుటుంబముల నుద్ధరించిరని దెలుపుటకు ఆనందించుచున్నాము. బోర్డువారి దురంతములు గల్లంతులను న్యాయస్థానములు గుర్తించి దాతల యుద్దేశ్యములను సఫలీకృత మొనరించినందులకు న్యాయమూర్తులను పలువురు నాయకులు అభినందించుచున్నారు.

*　　*　　*

గుంటూరు, వంగవోలు, జిల్లాబోర్డులందు కాంగ్రెస్సుపార్టీవారే ఎక్కువ సభ్యులయినట్లును, ప్రెసిడెంట్లుకూడా కాంగ్రెస్సువారే అయినట్లు దెలుపుట సంతోషదాయకము వీరిహయాములోనైననూ మత విచక్షణ పార్టీలులేకుండా పరిపాలనగావించుచూ బీదసాదలను రక్షింపగలరని పలువురు నమ్ముచున్నారు. కాంగ్రెస్సుయొక్క పలుకుబడి నానాటికి వృద్ధియగుటవలన ప్రజలు జాతీయతత్వమును బాగుగా నెరుగగల్గిరని దెలుపుటకు జిల్లాబోర్డు ఎన్నికలే దెలుపుచున్నటుల బల్కుచున్నారు. త్వరలో మంత్రిపదవులుకూడా కాంగ్రెస్సువారు బడయుటకు తీవ్రప్రయత్నములు జర్గుచున్నవట.

*　　*　　*

నలుబది తొమ్మిదవ జాతీయమహాసభ లక్నోలో ఏప్రిలుమాసమున జరుగనున్నది. నాల్గుమాసములనుంచి సభాభవనము ప్రదర్శనశాలలు మున్నగునవి నిర్మించుచున్నారు. విశేషముగా ప్రజలురాగలరని

దెలియుచున్నది. అధ్యక్షులయిన జవహరిలాల్ నెహ్రూగారు సమర్థులు వక్తలగుటవలన చాలా శోభస్కరముగా నుండునట.

*　　*　　*

పండిత జవహర్‌లాల్‌గారిభార్యా కమలాదేవిగారు ఊపిరితిత్తుల వ్యాధివలన బహుకాలమునుంచి బాధనొందుచూ ఇటీవల లండనుదేశములో మరణించుటచే దేశమున నొక మహావ్యక్తి నశించుటవల్ల మితిలేని విచారమున ప్రజలు అల్లాడుచూ పండితునకు పరామర్శలేఖలు సభలుమున్నగువాటితో తమకృతజ్ఞతను ప్రకటించుచున్నారు. మహోదారపురుషుండును సాటిలేని ఐశ్వర్యవంతుడును నగు పండితునకింతటి యాపదగల్గినందులకు మేము మిక్కిలి విచారించుచూ మాసానుభూతి నందచేయుచున్నాము.

*　　*　　*

తెనాలితాలూకా శృంగాపురమునంగల శ్రీఉమామహేశ్వర భక్తసమాజమువారు ధనుర్మాసమునందు పవిత్ర హృదయములతో నగరసంకీర్తన గావించుచూ వ్రతదీక్షానంతరం స్వామివారి వుత్సవము లొనరించి సమారాధనలతో అన్నప్రదానము నొనరించి ఉపన్యాసములతో ప్రజల నానందతరంగముల నోలలాడించిరనియు ప్రతి వత్సర మిట్లొనరింప దలంచిరనియు యీసమాజమును వేయి కన్నులతో పోషించుచూ అభివృద్ధి పరచుచున్న గ్రామపెద్దలును విశేషించి భక్తాగ్రగణ్యులునగు, శ్రీమాన్. నాగలింగం, సుందరశర్మ, పుచ్చా సత్యనారాయణ, కొల్లిపర కోటయ్యా, సంగాపు వీరయ్యా, కొలకలూరు శేషయ్యా, మున్నగు ప్రముఖులచే పలువిధములైన ఉపన్యాసములు గావింపబడుచూ ప్రోత్సాహమొనరించుచున్న ఇతర పెద్దలతో జయప్రదముగా నిర్వహింపబడినటుల హెచ్చరించుచూ వందనములతో సభ ముగింపబడెనని దెలుపుచున్న పుచ్చా వెంకటసుబ్బా

రావుగారి నభినందించుచున్నాము. ఈశ్వరానుగ్రహమున నీసమాజ సభ్యులు దీర్ఘాయుష్మంతులై వెలయునటుల ప్రార్థించుచున్నాము.

* * * *

లండన్ నగరమున గొప్ప హిందూదేవాలయమొక్కటి నిర్మింపబడి చాలాభాగము పూర్తియైనట్లు దెలియుచున్నది. హిందూదేశము నంగల దేవాలయములు నాశనముజేయ సంకల్పించు నీ మహత్తరుణమున పాశ్చాత్యదేశమున క్రైస్తవమతావలంబులచే సేవింపదగినటుల హిందూదేవాలయము నిర్మించుట గొప్పశుభసూచక మనదగియున్నది యీ దేవాలయము కొన్నిలక్షల ద్రవ్యముతో నూతన పద్ధతితో ఏర్పాటు చేయబడుచున్నదట.

* * * *

ఇటలీ అబిసీనియా యుద్ధము అతితీవ్రముగా జర్గుచున్నదనియు సంధిపరిష్కారము కుదురలేదనియు దెలియుచున్నది.

* * * *

భగవదంశసంభూతుండగు శ్రీరామకృష్ణపరమహంసుని జయంతి దేశమందెల్లెడలను జయప్రదముగా నిర్వహింపబడినదని ఆనందముగా దెలుపు చున్నాము.

* * * *

పొగాకుబిల్లు ఈనాములబిల్లు ప్రస్తుతం ఆపుదలచేసినారట దేవాదాయపు బిల్లు ఎందులకు ఆపుదలచేయరాదో తెలియకున్నది.

---

# ప్రకటనలు

## విప్రకుల దర్పణము

ఇదియొక మహాగ్రంధము. దీనిని సంచికలుగా పక్షమున కొకతూరి 40 పేజీలకు తక్కువగాకుండా ప్రకటింపబడును. ఆసేతు హిమాచలపర్యంతముగల బ్రాహ్మణ శాఖలు అందలి సూత్ర గోత్రములు

మున్నగు విశేషములు అకారాది ఇంటిపేర్లుతో బహుప్రియాసలుతో నలుబదివత్సరములనుండి సంగ్రహించియున్నందున సర్వులకు ప్రధానమైయుండును. వెంటనే ప్రతివారును తమపేరును లీష్టులోచేర్చి గ్రంధకర్తగారికి సహాయమొనరింప ప్రార్థించుచున్నాము. సంవత్సరచందా అయిదురూపాయిలు వలయువారు సత్తిరాజు సీతారామయ్యపంతులు

కంతేరు పెనుగొండపోష్టు పశ్చిమగోదావరిజిల్లా.

---

# ఆయుర్వేద వైద్యసంఘము

రేపల్లెనగరమునందీ సంఘమును శ్రీమాన్ తుమ్మపూడి లక్ష్మీకాంతయ్యగారి ప్రోత్సాహమున ది 1-2-1936 తేదీన నెలకొల్పబడి జయప్రదముగా కార్యక్రమము జరుపబడుచుండెను. ఉపసంఘములుగూడ నచ్చటచ్చట స్థాపింపబడినట్లు తెలియుచున్నది. ప్రస్తుతము 9-2-36 తేదీన భూళిపూడిగ్రామమున పదునెనిమిదిమంది సభ్యులతో "భూళిపూడిఫిర్కా వైద్యసంఘ" మనుపేరస్థాపింపబడి ప్రథమ సమావేశము శ్రీయుతవర్యులు వెంకటేశ్వరరావుగారధ్యక్షులుగను శ్రీమాన్ చావలి చంద్రశేఖరశర్మగారు కార్యదర్శిగను ఎన్నుకొనబడి జయప్రదముగా సభ ముగింపబడెను మరల ది 23-2-36 తేదీన ద్వితీయ సమావేశము మాయూరి బోర్డు ప్రాథమిక పాఠశాలయందు పురప్రముఖులతో సక్రమముగా నిర్వహింపబడెనని దెలుపుటకు సంతసించుచున్నాము.

భూళిపూడి
౨౮-౨-౩౬

ఇట్లు వైద్యాభిలాషి
మామిళ్లపల్లి సివయ్య.

---



# అంతా విన్నారా?

మనకు పత్రికెందుకయ్యా వద్దని నేనెన్ని చెప్పినా విన్నాడా? అయిందబ్బాయిపనని అందరూ గుసగుసాలాడ్తోంటే పత్రికని పడ్కోపెట్టాల్నని పందెమేస్తుంటే వీర్లేక నాచెవులు గింగురుమంటున్నాయి. అయితే సంఘం మీదొక మాసపత్రికని పోషించుకోలేక పొయ్యామంటే ఎవరిదీ అవమానమని గుండెమీద చెయిపెట్టి పరీక్షించుకుంటే తెలుస్తుంది. ఈసంవత్సరం పత్రికెలా నడిచిందో మీరే చూడండి. రెండునెల్లకొకసారైనా వుసూరుమంటూ వచ్చేప్రాణం పొయ్యేప్రాణంతో శవాకారంలాగవుందిగాని సంతోషమెక్కడైనా కంచుకాగడాల్తో వెతికినా కనపడుతుందేమో చూడండి. ఏంజేస్తాం. అయిదుజిల్లాలమొత్తంలో యింతటి అభిమానం వెలిగిందంటే మనకేంతక్కువ. యింకెంతపనైనా చిటికెలో చేసొయ్యచ్చని అందరికి తోచకపోదులే. మనమేం ప్రోగ్రాంవేసినా మొంతపని తలపెట్టినా మఖలోపుట్టి పుబ్బలోపోయేటట్లుమాత్రం చేయరాదని పెద్దలు చెపుతారు. "ఆంధ్రరాష్ట్ర ఆదిశైవసంఘం అడుగంటించాం. మండలసంఘాలు మాపేశాం. తాలూకాసంఘాల్ని తప్పగొట్టాం, యువజనసంఘాన్ని ఉద్ధరించాం. ఇంకేమేమోచేశాం' యివన్నీ మళ్లీతల్లెత్తాలంటే మొంతశ్రమో ఆలోచించండి. ప్రస్తుతంలో ఆయుర్వేద వైద్యసంఘాల్ని, సర్టిఫికెట్లనీ యభివృద్ధి చెయ్యాల్నని ప్రబోధాలువస్తున్నై. వాటినైనా పూర్తిచేయుటం మంచిదే. కొన్నాళ్లకు అవికూడా యధాప్రకారం అవటంలో ఆశ్చర్యం వుండదులే. మనసంఘాన్నినమ్మి మఠనిర్మాణము, ఆచార్యప్రతిష్ఠ, వేదపాఠశాల, మొదలయినవి స్థాపించి యింకా ముందుముందు అచ్చుఆఫీసు యేర్పరచి మతగ్రంథాలు, సూత్రగ్రంథాలు, అచ్చువేయ్యాలని "పెద్దలంతా సంకల్పిస్తున్నారే. యిటువంటి ప్రయత్నాలన్ని యెవరికోసం. మీబాక్కోసం. మీకీర్తి

కోసం అని యెందుకనుకోరాదు. అంతమాత్రంతో చదూ, యితనూ నేచెప్పేదేమిటంటే మీశక్తికొద్దీ సంఘానికి సహాయపడి కులాభిమానం చూపి మంచిపేరు తెచ్చుకోండి. నామీదకోప్పడి నన్ను తిట్టకండి. నేను గట్టిగా మాట్లాడుతానని మీకంతా విసుగ్గావుండొచ్చు. నిము షాని కొకరకంగా ప్యాషన్‌గా మారుతోన్న మనసంఘానికి ముందేం గతులురానున్నవో తెలుసుకోవాలి. బోర్డువారొచ్చి చిన్నప్పుడుదాగిన దొండాకుపసరుతోసహా కక్కిస్తూంటే రివిన్యూవారు ఫలసాయమంతా జప్తుల్చేస్తూంటే పోగా మిగిలిందికాస్తా కోర్టులపాలవుతున్నప్పటికీ చలించని మనసంఘం యీకెంతపనైనా చేయకపోదు. మోసం నశించాలి. హృదయాలు బాగుపడాలి. ఐకమత్యం కుదరాలి, కపటం పోగొట్టుకోవాలి. డాంబికంవిడవాలి. దైవానికి వెరవాలి. అప్పుడేమైనా నూత్నకళలతో శోభాయమాన మగుతుందేమో చూడాలి. మామూలు వికారాలతో నున్నంతకాలం యేంజేసినా బూడిదలోపోసిన ఆజ్యం మాదిరిగానే వుంటుందనేసంగతిఅంతా వింటున్నారా. తరువాత మీ దయ. ఓం శాంతి శ్శాంతి శ్శాంతిః.

(లోకసంచారి)

---

## హరిజనవిలాపము.

సీ॥ అంగళ్ళవస్తువులమ్మి బ్రతుకుటకైన♦నంటరానితనంబె యడ్డుదగులు
గొప్పవారల యొద్ద గొలువుసేయుటకైన♦నంటరానితనంబెయడ్డుతగులు
బంటౌతుపనిచేసి బ్రతుకుదమనుకొన్న♦నంటరానితనంబె యడ్డుతగులు
గృహకృత్యములొనర్చి మహి బ్రతుకుదమన్న ♦ నంటరానితనంబె యడ్డుదగులు
ఇచ్చవచ్చినచోటి కేగుదమనుకొన్న♦నంటరానితనంబె యడ్డుదగులు
గీ॥ వసుధనెట్లైన జీవనోపాధిసేయ♦నంటరానితనంబె మాకడ్డుదగులు
ఎందుబోదుము గతియేమి యెవరుబ్రోతు♦రకట మాకర్మమిటులయ్యె నవనియందు.

సీ॥ ఊరికి దవ్వననుంచిన మాత్రాన • బోయెనే? మీదుయసూయకొంత
ముట్టరాదని పట్టుబట్టినమాత్రాన • సమసెనే మీదుద్వేషంబుకొంత
పెద్దకులాలని పీకులాడినయంత • జనియెనే మీదగు కినుకకొంత
అంటరాదనిచాలయార్భాటమొనరింప • క్రమందెనే మీదుక్రోధంబుకొంత

గీ॥ తగ్గెనని మీర లోకవేళదలచియున్న • హెచ్చుదేమాకు మీపైని నెన్నొరెట్లు
ద్వేషబుద్ధి ద్వేషంబునే పెంచుగాని • యైకమత్యంబుగూర్ప సహాయ పడునె ॥౨॥

శృగారపురము,

ఇట్లు హితాభిలాషి.
నాగేశ్వరం శివప్రసాదశర్మ.

---

## హితచింతకులు

౧ శ్రీజగద్గురు శ్రీకంఠ శివాచార్య స్వాములవారు
శ్రీ శ్రీకంఠ మఠాధిపతులు (కోటిపల్లిక్షేత్రం)

౨ ఇజ్జతాసాన్ శ్రీరాజా కంసుకూరు బాలసూర్యప్రసాదరావు
బహద్దర్ జమిందారువారు (శ్రీ దేవిడీ సంస్థానం)

### మహారాజపోషకులు. (సం॥కు రు 4లు)

౧ శ్రీమాన్ వడ్లమూడి కోటయ్య గురుకులుగారు, వడ్లమూడి.

౨ వెలవలపల్లి వేంకటేశ్వరదీక్షితులుగారు, సాలూరు.

### రాజపోషకులు. (సం॥కు రు 3లు)

౧ శ్రీమాన్ నాగేశ్వరం సుందరశర్మగారు, శృంగారపురం,

౨ ... యలమంచిలి సుబ్రహ్మణ్యంగారు, వెనురుపాక.

3 ... వలివేటి విశ్వనాథంగారు, కర్లపూడి.

౪ ... చావలి పిచ్చయ్యశర్మగారు, చాటపర్రు

౫ ... ఆగమిక నంజుండదీక్షితులుగారు, రామసముద్రం.

### పోషకులు. (సం॥కు రు 2లు)

౧ శ్రీమాన్ పొత్తూరు పానకాలయ్యగారు, పెనుమాక.

౨ ... చుండి ఆనందరాయుడుగారు, రూపెనగుంట్ల.

3 ... సాలపర్తి శంకరయ్యగారు, ఎరుకపాడు.

౪ ... సత్తెనపల్లి హనుమంతరావుగారు, గుండిమెడ

౫ ... పణతుల రాఘవయ్యగారు, రామతీర్థం.

౬ ... వెలవలపల్లి రామయ్యగారు, తెరువుపల్లి.

౭ ... మురికిపూడి వెంకటేశ్వర్లుగారు, వల్లభాపురం.

౮ ... గూడూరు కుటుంబయ్య గురుకులుగారు, మండపల్లి.

౯ ... నాదెండ్ల రామేశ్వర గురుకులుగారు, నాదెండ్ల.

౧౦ ... మడనూరు సుబ్బారాయ గురుకులుగారు, మడనూరు

౧౧ ... కొండపేటి సుబ్బయ్యగారు, కొండపల్లి.

౧౨ ... మడనూరు సుందరయ్య గురుకులుగారు, ఊతముక్కల.

# శ్రీ ఆదిశైవ పత్రిక

శైవసంఘాభివృద్ధికై శైవాగమ ధర్మములును దేవాలయ వ్యవహారములును, మత చర్చలు, భక్తచరిత్రలు మున్నగు సర్వవిషయములు ప్రకటించు మాసపత్రిక. క్రోధన సంవత్సరమునుండి వెలువడిన సంచికలు గలవు. సంవత్సరమునకు ఒక్కరూపాయి చొప్పున బంపినచో బడయగలరు. చందా ప్రస్తుతము తగ్గింపబడినందున సంవత్సరమునకు రు 1—8—0 లు మాత్రమే.

వలయువారు:— ఎడిటర్ .. ఆదిశైవ, శ్రీ గురుకులాశ్రమము,

P. O. చిలుమూరు (VIA కొల్లూరు) గుంటూరుజిల్లా

# మా ఆఫీసునకు వచ్చెడి పత్రికలు.

౧. భారతి
౨. గృహలక్ష్మి
౩. కృష్ణాపత్రిక
౪. దీనబంధు
౫. పంచానన
౬. భక్తిసంజీవని
౭. త్రిలింగ
౮. రెడ్డిరాణి
౯. దివ్యజ్ఞాన దీపిక
౧౦. యథార్థభారతి
౧౧. ప్రకృతి
౧౨. దేవాంగ
౧౩. అగ్నికుల ప్రబోధిని
౧౪. ఆంధ్రభూమి
౧౫. సుదర్శిని
౧౬. దేవాలయ ప్రతిభ
౧౭. శ్రీవైష్ణవ
౧౮. అభినవ సరస్వతి
౧౯. భక్తిప్రబోధిని
౨౦. లోకల్ బోర్డు
౨౧ చంద్రిక
౨౨. వైద్యప్రదీపిక
౨౩. హరిజన
౨౪. జమీన్ రైతు
౨౫. ఫూలదండ
౨౬. పాంచజన్యము
౨౭. శ్రీవైఖానస
౨౮. ప్రాథమిక పాఠశాల
౨౯. ప్రబుద్ధాంధ్ర
౩౦. ఆంధ్రవిద్యార్థి
౩౧. ఆయుర్వేద చంద్రిక
౩౨. కౌముది
౩౩. విజయ
౩౪. పట్టుశాలి
౩౫. బాలసరస్వతి
౩౬. ఉదయలక్ష్మి
౩౭ సత్యవాణి
౩౮. యుగంధర
౩౯. మాధురి
౪౦. రామబాణం

పైపత్రికలయొక్క చిరునామా చందాల వివరము మాకు వ్రాసిన తెలియపరచ గలము.

(సంపాదకులు)

